# నడిచే దేవుడు



జగద్గురు శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీశంకరాచార్య స్వామి

రచన, సేకరణ

**శ్రీ నీలంరాజు వెంకట శేషయ్య**


ప్రకాశకులు

జనచైతన్య ఆధ్యాత్మిక కేంద్ర

హైదరాబాదు

# కృతి సమర్పణ

జన్మజన్మాంతరాల సుకృతం పండి, నాకీ పుట్టువులో కామకోటి జగద్గురు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి శ్రీ చరణుల చరణసేవ లభ్యమైంది.

అట్టి జన్మను అనుగ్రహించిన నా జననీ జనకులు నీలంరాజు లక్ష్మమ్మ, వెంకట సుబ్బయ్య పుణ్యదంపతులకు సభక్తికంగా ఈ నాకృతిని అంకితం చేస్తున్నాను.

మాతృదేవో భవ,
పితృదేవో భవ,
ఆచార్య దేవో భవ !

- నీలంరాజు వెంకట శేషయ్య



# కృతాంజలి

ఇది శ్రీకంచి కామకోటి 68వ పీఠాధిపతి శ్రీచంద్రశేఖరేంద్రసరస్వతి శ్రీచరణుల జీవిత చరిత్ర కాదు.

1959 నుండి 1969 వరకు పది సంవత్సరాలు విజయవాడలో నేను 'ఆంధ్ర ప్రభ' సంపాదక స్థానంలో ఉన్నప్పుడు శ్రీ కల్లూరి వెంకటసుబ్రహ్మణ్య దీక్షితులుగారు రచించిన శ్రీ చంద్రశేఖరేంద్రుల జీవితచరిత్ర ప్రభలో ప్రకటించినాము.

'విశాఖ' నామాంతరంతో శ్రీ యం.వి.బి.యస్. శర్మగారు అరవం నుంచి తెనిగించిన శ్రీచరణుల ఉపన్యాసపరంపరనూ, కవిపుంగవులు శ్రీ కాటూరి వెంకటేశ్వర రావుగారు ఆంగ్లం నుంచి అనువదించిన స్వామి ప్రవచనాలనూ, 'ప్రభ'లో వారం వారం ధారావాహికంగా ప్రచురించాము.

'ఆంధ్రప్రభ' లో వెలువడిన ఉపన్యాసా లన్నింటినీ 'జగద్గురు బోధలు' అనే శీర్షికతో 'సాధన గ్రంథమండలి' పక్షాన శ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రి గారు పుస్తక రూపంలో పది సంపుటాలు ముద్రించి ఆంధ్రులకు అందజేశారు.

అయితే మరి, ఈ పుస్తకం విశేష మేమిటి?

ఏ నా పురాకృత పుణ్యఫలమో, మూడు దశాబ్దాలకు పైగా పరతత్వ స్వరూపులు శ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతి శ్రీచరణుల సేవాభాగ్యం నాకు లభ్యమైంది. శ్రీ వారి చరణసన్నిధిలో సంప్రాప్తమైన నా అనుభవాలకూ, స్వామిని సందర్శించి, స్వామితో మాటలాడే అవకాశమబ్బినప్పుడు నా హృదయంలో పదిలపరచుకున్న మధుర స్మృతులకు ఈ పుస్తకం ద్వారా అక్షరరూపం కల్పించడానికి యత్నించాను. ఆ విధంగా ఋషిరుణం తీర్చుకోగలనని భావిస్తున్నాను.

నా వలెనే స్వామిభక్తులైన మరికొందరు పెద్దల, మిత్రుల అనుభూతులను కూడా సేకరించి, వాటిని ఈ పుస్తకంలో చేర్చాను.

ఇది గాక, స్వామిని గురించి నాకు తెలిసినంతలో, తెలుగులో మరెక్కడా వెలుగు చూడని నూతన విషయాలు కొన్ని ఈ పుస్తకంలో చోటుచేసుకున్నవి.

ఉదాహరణకు, 1947లో భారతరాజ్యాంగరచన జరిగిన సందర్భంలో, హిందూ మతానికి మన రాజ్యాంగంలో రక్షణ కల్పించే సంకల్పంతో శ్రీ చంద్రశేఖరేంద్ర సంయమీంద్రులు సల్పిన చరిత్రాత్మక కృషిని గురించి దేశంలో తెలిసిన వారెందరో లేరు. ఆ విషయమై ప్రఖ్యాత వేదపండితుడు శ్రీ అగ్నిహోత్రం రామానుజ తాతాచారిగారి లేఖిని నుండి వెలువడిన ఇందలి వ్యాసం విజ్ఞప్రపంచానికి కనువిప్పు.

పూర్వ ఒకప్పుడు యావత్ప్రపంచంలో వేదమతమే వ్యాపించి ఉండేది అనడానికి అపూర్వమైన అనేక ఆధారాలు నెలకొల్పుతూ 1931లో స్వామి వారు చేసిన మహోపన్యాసం స్వామి పరిశోధనాపారీణతకు నిదర్శనం.

వీటన్నింటిని మించి, రమారమి 60 సంవత్సరాలకు పూర్వం 1927లో మహాత్మగాంధి, కామకోటిశంకరాచార్యుల మధ్య జరిగిన రహస్య సంభాషణ వివరాలూ, స్వామిని గురించి గాంధిజీ తన ఆశ్రమవాసులకు తెలియజేసిన అభిప్రాయాలూ, ప్రప్రథమంగా ఈ పుస్తకంద్వారానే లోకానికి వెల్లడి కావడం ఒక విశేషం.

స్వామిని గురించి :

ఇక, ఇంచుమించు ఈ పుస్తకం పుట లన్నిటిలో సర్వధర్మస్వరూపులుగా, ఆర్తరక్షకులుగా, విజ్ఞానభాస్కరులుగా మనకు సాక్షాత్కరించే స్వామిని గురించి, వారి లోక సంగ్రహచర్యలను గురించి నాలుగు మాటలు.

ఆదిశంకరభగవత్పాదులు నెలకొల్పిన కామకోటిపీఠపరంపరలో 68వ ఆచార్య పురుషులుగా జగత్ప్రసిద్ధి గాంచిన శ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతి శ్రీచరణులు విద్యార్థి దశలోనే సన్య

సించి, అచిరకాలంలో వేద శాస్త్ర పురాణాదులను పుక్కిటబట్టారు. దేశ విదేశాలకు చెందిన పదిహేడు భాషలనభ్యసించారు. ప్రాచీన విద్యలు, నవీన కళలు పెక్కింటిలో సర్వంకష ప్రతిభను సాధించారు.

దేశమంతటా వేద పాఠశాలలు నెలకొల్పి వేదాధ్యయనాన్ని ప్రోత్సహించారు. ఆలయ మంటపాల నెన్నిటినో నిర్మించారు. ధర్మ సంవర్ధనమే లక్ష్యంగా, ఇరవై సంవత్సరాలు పాదచారం చేస్తూ యావద్భారతం పర్యటించారు. హిందూమతసంరక్షణకు, వివిధ శాఖలకు చెందిన హిందూ మతావలంబుల సమైక్యతకు అద్వితీయమైన కృషి చేశారు.ఎల్లెడల ధర్మ సంస్థలనూ, సేవాసంఘాలను వెలయింపజేశారు.

వీటన్నింటితో పాటు, మఠం పరిపాలన చేపట్టింది మొదలు నేటివరకు జాతి, కుల, మత వివక్షత లేకుండా అనవరతం ఎందరి కష్టసుఖాలను విచారిస్తున్నారో, ఎందరు భక్తులను అనుగ్రహిస్తున్నారో, ఉపదేశాలు ఎందరికి చేస్తున్నారో, ఎందరికి జ్ఞానభిక్ష పెడుతున్నారో వారి సంఖ్య అంచనా కట్టలేము.

స్వామి జీవిత చరిత్ర తెలిసిన వారికి, రెండువేల సంవత్సరాల కిందట దక్షిణ భారతంలో జన్మించి, అవైదిక మతాలను ఖండించి, అనేక దివ్యశక్తులను ప్రదర్శించిన ఆదిశంకరులే తిరిగి నేడు శ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతులుగా అవతరించారని పండిట్ మదన్‌మోహన్‌మాలవ్యా వంటి ప్రముఖు లనేకులు చేసిన ప్రశంసలు అతిశయోక్తులు కావని రూఢికాగలదు.

ఒక విమర్శ:

పోతే, స్వామిని సందర్శించే భక్తుల విషయమై విద్యాధికులనబడు వారిలో కొందరు చేసే విమర్శ ఒక టున్నది. "నిత్యం స్వామిని సందర్శించే ప్రజలు ఇహసంబంధమైన కోరికలతో, సంసారబాధలతో స్వామిని ఆశ్రయిస్తారేగాని, పారమార్థిక చింతతో ఆయనను సందర్శించేవా రెందరని" వారి శంక.

నిర్ధాక్షిణ్యమైన ఈ విమర్శ వెలిబుచ్చే బుద్ధిమంతులు భగవద్గీతలో కృష్ణభగవానుడు "ఆర్తో, జిజ్ఞాసు, రర్థార్థీ జ్ఞానీచ" అంటూ, ఆర్తులూ జిజ్ఞాసువులూ, అర్థార్థులూ, జ్ఞానులూ, ఈ నాలుగు తరగతులకు చెందిన వారంతా నా భక్తులేనని చెప్పిన మాటలు విస్మరిస్తున్నారు.

ఇహజీవితంలో వాటిల్లే కష్టాలను ఎదుర్కొన లేక, ఈశ్వర విభూతి స్వామిలో సంపన్నమై ఉన్నదనీ, స్వామికి నివేదించుకుంటే తమ కష్టాలు గట్టెక్కుతాయనే విశ్వాసంతో, ఆయనను దర్శించడం దోషమా?. స్వామిని ఆశ్రయించడం వల్ల  వారి బాధలు నివారణ అయితే, అంత కంటె కోరదగినదేమున్నది?.

ఇంకో విశేషం. ఐహికవాంఛలతో స్వామిని ఆశ్రయించి, స్వామి అనుగ్రహమనే ఆధ్యాత్మికవ్యూహంలో ఒక్కసారి చిక్కుకున్న వ్యక్తి, పవిత్రతానిదానమైన స్వామి తపః ప్రభావం నుంచి సులభంగా తప్పించుకోలేడు. ఆతని గురుభక్తి దైవభక్తిగా పరిణమిస్తుంది. అతని హృదయం భగవద్వాసనా వాసితమవుతుంది. అటుపిమ్మట భక్తుడు వదలినా, భగవంతుడు అతనిని వదలడు - "భక్తు డెందుజనిన బరతెంతు వెనువెంట...".

స్వామిచే ప్రభావితులైన ఎందరో నాస్తికులు ఆస్తికులైనారు. భ్రష్టాచారులు శిష్టాచారులుగా, ధనికులు దానశీలురుగా, విద్యావంతులు వినయసంపన్నులుగా లుబ్ధులు గుణలుబ్ధులుగా, భక్తులు పరమభక్తులుగా మారిన  వారున్నారు. అట్టి భక్తుల చరిత్రలను దిఙ్మాత్రంగా ఈ పుస్తకంలో చూడవచ్చు. స్వామి ఆర్తత్రాణపరాయణమూ, అకారణ కారుణికత్వమూ ప్రసాదించే మహత్తర ఫలితమిది.

భక్తుల ననుగ్రహించడంలో స్వామి అవలంబించే మార్గాలు పలు విధాలు. అవి ఆయా వ్యక్తుల తరతమ భేదం పైనా, వారి సంస్కారబలంపైనా ఆధారపడి ఉంటాయి. కొందరికి అనుష్ఠానం, కొందరికి మంత్రోపదేశం, కొందరికి సాక్షాద్దర్శనం, మరికొందరికి దర్శనంతో సైతం పని లేకుండా స్వప్నంలోనే అనుగ్రహం.

విభూతులు, సిద్ధులు :

తనదివ్యవిభూతుల ద్వారా స్వామి ఆశ్రితుల భక్తినీ, విశ్వాసాన్ని బలపరుస్తారు. వారు మరింత భగవదున్ముఖులౌతారు. ఈ మహిమలూ, ఈ విభూతులూ స్వార్థానికి కావు, స్వాతిశయ ప్రకటనకు కావు. లోకసంగ్రహమే వాటి ముఖ్యోద్దేశం.

ఈ అతీంద్రియ, అప్రాకృతిక శక్తులను గురించి ప్రజలలో కొన్ని అపోహలున్నవి. మతం పేరుతో ప్రజలను మోసగించి, క్షుద్రశక్తులను కొన్నిటిని ప్రదర్శించి అమాయక ప్రజను మభ్య పెట్టే వేషధారులు సంఘంలో కొందరుండడమే అందుకు ముఖ్యహేతువు. అయితే, అట్టి వంచకులూ, వేషధారులూ ఏరంగంలో లేరు? వైద్యమా, వాణిజ్యమా, రాజకీయమా, ప్రభుత్వరంగమా? కలుషితం కానిదేది?

దురదృష్టవశాత్తు, ఆధ్యాత్మికరంగంలో కూడా నేడు సద్వర్తనమూ, అసద్వర్తనమూ రెంటికీ తావున్నది. విభూతి పెట్టుకున్న వారంతా వేదవిదులు కానట్టే, గురువు లందరూ గుణవంతులు కారు. గురువు లనబడే వారిలో 'శిష్య చిత్తాపహారులు' కొందరైతే 'శిష్య విత్తాపహారులు' మరి కొందరుండవచ్చు. అంతమాత్రాన మతాన్ని వెలివెయ్యగలమా? ఆధ్యాత్మిక విద్యలనూ, అణిమాది సిద్ధులనూ గర్హించ దగునా?

ఆధునిక నాగరికతా, పాశ్చాత్యవిద్యా ప్రభావం చేత నేటి యువతరం హృదయంలో అవిశ్వాస మొక్కటే రాజ్య మేలుతున్నది. ప్రాచీనమూ, భారతీయమూ వారికి పరిత్యాజ్యం. విజాతీయమూ, వైజ్ఞానికమూ పరమప్రమాణం. విజ్ఞానశాస్త్ర పరిశోధనలు ఆధునికమానవసుఖ జీవనానికి తోడ్పడిన మాట కాదనలేము. అయినా, అదే జీవిత పరమావధి కాదుకదా?

విజ్ఞాన శాస్త్రం:

విజ్ఞాన శాస్త్రమే జీవిత సర్వస్వమనుకునే యువజనులు పంచేంద్రియాల పరిమిత శక్తిని గుర్తించరు. విజ్ఞానశాస్త్రంలో విప్లవకరమైన మార్పులనేకం వచ్చాయనీ, విజ్ఞానశాస్త్రానికి అం

దని, అంతుబట్టని క్షేత్రాలు ఎన్నో వున్నాయనీ, న్యూటన్ నుంచి నేటి వరకూ ఎన్నో వైజ్ఞానిక సిద్ధాంతాలు తలకిందులైనాయనీ వీరు గమనించలేరు.

"భారతదేశపు అమూల్య వారసత్వం" అనే ఆంగ్ల వ్యాసమాలలో సుప్రసిద్ధ న్యాయ శాస్త్రపారంగతుడు శ్రీ యన్.ఎ.ఫాల్కివాలా వ్రాసిన మాటలు చూడండి. "జీవితమంతా ఒక పరిశోధనాలయంలో చేసిన కృషి కంటే, యావజ్జీవితం ఒక గ్రంథాలయంలో చేసిన పఠనంకంటే, ఒక్క యోగివర్యుని అనుభవం ఎక్కువ ఫలితం ఇస్తుంది."

"ఈ విశ్వరహస్యాన్ని ఇంతవరకు వైజ్ఞానికు లెవ్వరూ కనిపెట్టలేదు. బహుశా ఇకముందు కూడా కనుగొనబోరు" అన్నది, వైజ్ఞానిక ప్రపంచం ఏకగ్రీవంగా అంగీకరించిన సత్యం.

ప్రగతిపూర్వకంగా ఇంతవరకు సాధించిన విజ్ఞానం యావత్తూ ఐన్‌స్టీన్ మాటలలో "ఒక దుర్గ్రాహ్యపరిస్థితి నుంచి వేరొక దుర్గ్రాహ్యపరిస్థితికి పయనించడమే". ఇందుకు విజ్ఞానలోకం దిగ్భ్రమ చెందింది. హతాశుడైన ఎడిసన్ మహాశయుడు "దేనిని గురించి గానీ, నూటికి ఒక్కవంతు కాదు, కోటికి ఒక్కవంతు కూడా మనకు తెలియదు బాబో" అని ఆక్రోశించాడు.

క్వాంటం ఫిజిక్సులో మహావిజ్ఞాని వెర్నర్ హీసన్‌బర్గ్ తన స్వీయచరిత్రలో ఇలా అంటాడు. "అణుక్షేత్రంలో మనం అడుగు పెట్టినప్పుడు దేశకాలావధులకు లోనైన ప్రపంచం అక్కడ శూన్యం."

"చూడగా, చూడగా, ఈ విశ్వమంతా ఒక మహోన్నత 'భావన'గా తోస్తుందే గాని, బ్రహ్మాండమైన 'యంత్రం'గా గోచరించదు" అని విస్తుపోతాడు సర్ జేమ్స్ జీన్సు.

"బ్రహ్మం సత్యం, జగన్మిథ్య" అనే సూత్రానికి దగ్గరగా వస్తున్నారా వైజ్ఞానికులు!

"వైజ్ఞానిక విద్యల నభ్యసించి, తమకు మతంతో పని లేదని మతాన్ని తృణప్రాయంగా పరిగణించే భారతయువకులు పాశ్చాత్యదేశాలనుంచి గుణపాఠం నేర్చుకోవాలి. పాశ్చాత్యులు ఇది వరకే ఇట్టి అనుభవాలకు లోనై, ఇప్పుడు వాటి నుంచి తిరోగమిస్తున్నారు.".

పై వ్యాక్యాలు వ్రాసింది ఏ భారతీయుడో కాదు. పాల్ బ్రంటన్ అనే ప్రసిద్ధ ఆంగ్ల పత్రికా రచయిత. తత్వాన్వేషి 'శంఖున పోసిననేగాని తీర్థం కాదన్న'ట్టు పాశ్చాత్యు లెవరైనా చెప్పినగాని మన వారి దృష్టి నాకర్షించదు!

ఆధ్యాత్మిక శక్తులపైనా, అణిమాది సిద్ధులపైనా విశ్వాసంలేని భౌతికవాదులకు కనువిప్పు కావచ్చుననే నమ్మకంతో అతీంద్రియశక్తులకు సంబంధించిన కొన్ని సంఘటనలను ఈ పుస్తకంలో ఉదహరించాను. ఇవి ప్రాజ్ఞులైన వారు ప్రత్యక్షంగా కళ్లతో చూచినవిగాని, కట్టుకథలు కావు.

## అరవింద, వివేకానందులు:

అప్పటికీ సంశయాత్ములు ఎవరైనా ఉంటే వారి ఉపయోగం కోసం ఆధునికులలో ఆధునికులూ, ప్రాచ్య పాశ్చాత్య విజ్ఞాన వారాశిని ఆపోశనం పట్టిన ఇరువురు మహనీయులు శ్రీ అరవింద యోగి, స్వామి వివేకానందుల అభిప్రాయాలను ఇక్కడ పొందుపరుస్తున్నాను.

విభూతులను గురించి శ్రీ అరవిందయోగి తన శిష్యుడు దిలీప్‌కుమారరాయ్‌కి ఇలా వ్రాశారు:

"సిద్ధులు, విభూతులు మొదలగు అప్రాకృతికశక్తులు ముమ్మాటికి సత్యమే. అందుకు తిరుగులేని ఆధారాలున్నవి.ఆ మహిమలను ప్రదర్శించడం సర్వత్రా హానికరం కాదు.అయితే, వాటిని ప్రదర్శించే వ్యక్తిపైనా, అతడు సాధించదలచిన ప్రయోజనం పైనా, వాటి మంచిచెడ్డలు ఆధారపడి ఉంటాయి.

"పరమయోగులు ఇట్టి అలౌకిక శక్తులను ప్రదర్శించరా దనేది ఒక విధమైనఛాందసం. బ్రహ్మనిష్ఠుడైన యోగికి సిద్ధించే శక్తులు సాధారణమైనవి కావు. కవిత్వం చెప్పవద్దనీ, కావ్యాలు వ్రాయవద్దనీ, కాళిదాసు, షేక్స్పియర్లను వారించడం ఎంత అవిచారితమో, స్వాభావికమైన తమ దివ్యశక్తులను ప్రదర్శించరాదని  మహాయోగులపై ఆంక్షలు విధించడం కూడా అంత అవివేకమే.

అతీంద్రియశక్తులు సామాన్యులకు అతీతమైనవిగా తోచవచ్చు, కాని, యోగిసత్తములకూ, మహాభక్తులకు మాత్రం అలాకాదు.''

ఒకప్పుడు కేవల హేతువాదిగా ఉండి, శ్రీరామకృష్ణపరమహంసచే ప్రభావితుడైన పిమ్మట మహాజ్ఞానియై, తన వాగ్విభవంతో యావత్ప్రపంచాన్ని ఉర్రూత లూగించిన స్వామివివేకానందుడు భారతదేశంలో యోగులను గురించీ, వారి మహిమలను గురించీ ఇలా అన్నాడు:

''యోగిపుంగవులు మానవులను ఉద్ధరించే మహనీయమూర్తులు. మహత్తరమైన వారి శక్తులు భౌతికవాదులకు మింగుడు పడవు. సామాన్యుల బాహ్యదృష్టికి కనిపించని అనేక లోకాలను గోచరింపజేసి, ఈశ్వర సాక్షాత్కారానికి అవి దారి చూపుతాయి.''

స్వామిని గురించి నా అనుభవాలను వ్రాయడంలో అక్కడక్కడ నా రచన ఆత్మకథధోరణిలో సాగినమాట కాదనను. మూడు దశాబ్దాలకు విస్తరించిన నా అనుభవ వైశాల్యాన్ని చిత్రీకరించడానికి యత్నించేటప్పుడు, ఆయా సందర్భాలకు సముచిత నేపథ్యాన్ని సమకూర్చడంలో అనివార్యంగా కొన్ని అతివ్యాప్తి, అవ్యాప్తిదోషాలు దొరలి ఉండవచ్చు. సహృదయులు మన్నింతురుగాక!

''నడిచే దేవుడు'' తెలుగు భక్తుల తలుపులు తట్టే వేళకు కంచి పరమాచార్యులు శ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతి శ్రీచరణులు 96 వసంతాలు పూర్తిచేసి 97లో ప్రవేశించారు. ఈ స్వామి ఇలాగే లోక సంగ్రహం చేస్తూ రెండో షష్టి పూర్తి కూడా చూడాలని కాంక్షిద్దాము.

ఈ పుస్తక ముద్రణకు శుద్ధప్రతిని తయారుచెయ్యడంలో నాకు చేదోడువాదోడై, సర్వవిధాలా నాతో సహకరించిన 'ఆంధ్రప్రభ' ఉపసంపాదకులు, భాషావిశారదులు శ్రీ కల్లూరి భాస్కరంగారికీ, ముద్రణా వ్యాసంగంలో తనకున్న అనుభవమంతా వినియోగించి ఈ గ్రంథం అందంగా అచ్చుకావడానికి సాయపడిన ఆయన సోదరుడు చిరంజీవి రామకృష్ణకూ ఆయురారోగ్య భాగ్యాలు ప్రసాదించవలసిందిగా నా ఇలవేలుపు భద్రాద్రి సీతారామచంద్రుని ప్రార్థిస్తున్నాను.

నీలంరాజు వెంకటశేషయ్య

# నా ప్రథమ సందర్శనం

నాకు నలభై సంవత్సరాలు వచ్చేవరకు అధ్యాత్మికంగా ఒక గురువును ఆశ్రయిద్దామన్న అభిలాష నాలో తలయెత్తలేదు. అయినా, జీవితంలో ఎవరినో ఒకరిని గురువుగా ఎన్నుకోవడం అవసరమని నాకు సలహా చెప్పినవారు లేక పోలేదు. ఒకరిద్దరు గురువులు తమకు తామే, నన్ను శిష్యుడిగా స్వీకరించే ప్రయత్నం కూడా జరిగింది. అయినా, నేను అందుకు మొగ్గలేదు. ఆ 'గురువుల'పై అంతటి లక్ష్యభావం నాకు కలగలేదు సరికదా, వారిని పరివేష్ఠించి వున్న శిష్యబృందాన్ని చూచిన తర్వాత నా అభిప్రాయం మరింత బలపడింది.

ఇక నన్ను వదిలిపెట్టి, 'ఎవరివద్ద నైనా ఉపదేశం పొంది, జీవితం కడతేర్చుకోండి' అంటూ కొందరు నా భార్యను ప్రోత్సహించారు.

అదీ ఫలించలేదు. ''మనం గురువును ఆశ్రయించవలసిన రోజు వస్తే, అప్రయత్నంగానే అలాంటి గురువు లభిస్తాడులే'' అని ఆమెను సమాధానపరిచాను.

జజజజజజ

నేటికి ముప్ఫయ్యేండ్ల కిందటి మాట. అప్పటికి నేనింకా మద్రాసులోనే వున్నాను. ఒక వైకుంఠ ఏకాదశి నాడు నా సోదరుడు కంచి వరదరాజస్వామి దర్శనానికి బయలుదేరుతూ, మా దంపతులిద్దరినీ ఆహ్వానించాడు. పర్వదినం కావడం వల్ల నా తమ్ముడూ, మరదలూ, మేమిద్దరమూ, అందరం కలిసి కంచికి వెళ్లాము. కంచి వరదుని సేవించుకున్నాము. అంతటితో తిరిగి చెన్నపట్నం రావలసిందే కాని, అలా జరగలేదు.

వరదరాజస్వామి దేవాలయ ప్రాంతాన్ని విష్ణు కంచి అంటారు. ఆ స్వామికోవిలకు సమీపంలోనే కామకోటి పీఠానికి చెందిన చిన్నమఠం ఒకటున్నది. పెద్దమఠం శివకంచిలో శ్రీ కామాక్షీ, ఏకాంబరేశ్వర ఆలయాలకు మధ్య వున్నది.

ఆనాడు కామకోటి పీఠాధిపతి శ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతి విష్ణుకంచి లోని చిన్న మఠంలో పూజ చేస్తున్నారని విన్నాము. దగ్గరగా ఉంది కాబట్టి మఠానికి వెళ్లి, ఆ పూజకూడా చూసి, ఇంటికి చేరుకుందామనుకున్నాము.

కామకోటి పీఠం శ్రీ శంకరాచార్య స్వామిని గురించి వినడమే తప్ప అంతకు ముందెన్నడూ ఆయనను నేను చూడలేదు. మద్రాసు నుంచి వెలువడే ఆంగ్ల 'హిందూ' పత్రికలో అప్పుడప్పుడు ఆ స్వామి ఉపన్యాసాలు కొన్ని చదివాను. అవి నన్నాకర్షించాయి. అవి అందరు స్వాముల చేసే ప్రసంగాలులాలేవు. వేదాంతపరిభాషలో ఏవో కొన్ని పడికట్టురాళ్ళు వేసినట్టు గాక, అతి గహనమైన ఆధ్యాత్మిక విషయాలను మామూలు మాటల్లో, సహజంగా, సహేతుకంగా వివరిస్తూ ఆధునికులనూ, విద్యాధికులనూ ఆకట్టుకునేట్టు కనిపించాయి.

ఈ విలక్షణత నా మనస్సులో మెదులుతూ ఉండటంబట్టి, అలా సంభాషించిన ఆ స్వామిని ఓసారి చూద్దామనే కోరిక కలిగింది.

మేము మఠానికి వెళ్లేసరికి పూజ దాదాపు సగపడ్డది. వేదిక మీద జ్యోతులు వెలుగుతున్నవి. మఠం పరిచారకులు తెచ్చి అందజేస్తూన్న ధూప దీప నైవేద్యాలను శ్రీ త్రిపురసుందరీ, చంద్రమౌళీశ్వరులకు స్వామివారు సభక్తికంగా సమర్పిస్తున్నారు. మంగళవాద్యాలు మ్రోగుతున్నవి. వేదపఠనం సాగుతున్నది. ఘంటానాదం వినిపిస్తున్నది.

ప్రేక్షకులు నిశ్శబ్దంగా వేదిక మీద జరుగుతూ ఉన్న పూజాకలాపంలో ప్రతి చిన్న విషయాన్నీ, భక్తి శ్రద్ధలతో, వేయికళ్లతో తిలకిస్తున్నారు. హారతులిచ్చినప్పుడు 'హర హరా, శివ శివా' అంటూ చేతులెత్తి నమస్కారం చేస్తున్నారు. పూలమాలలతో, దీపకాంతులతో, సుమంగళుల రత్నాభరణ ధగధగలతో ఆ ప్రదేశమంతా మెరిసిపోతున్నది.

ఆధ్యాత్మిక పరిమళభరితమైన ఆ వాతావరణంలో భక్తుల మనస్సులు లీనమైనప్పుడు పూజామందిరం అంతా జగన్మాతృ స్వరూపంగా కానవచ్చింది. ప్రకృతి పరవశమైంది. దిక్కులు దివ్యగానంతో నిండినవి.

భక్తులందరి దృష్టి వేదికపై నున్న ఒకేఒక వ్యక్తి మీద కేంద్రీకృతమై ఉంది. ఆయనే కామకోటి పీఠాధిపతి, శ్రీ చంద్ర శేఖరేంద్ర సరస్వతి.

మఠానికి మేము ఆలస్యంగా రావడం, అందరికంటె వెనుక దూరంగా నిలబడడం, వీటి వల్ల భక్తులందరి చూపులనూ ఆకట్టుకున్న ఆయనమూర్తి స్పష్టంగా మాకు గోచరించకపో యెనే అన్న విచారం కాస్తవేసింది.

జజజజజజ

శ్రీ ఆదిశంకర భగవత్పాదులు తాము రచించిన "సౌందర్యలహరి" అమ్మవారిని స్తుతి స్తూ సరిగ్గా ఇలాంటి స్థితినే వర్ణించారు.

ధృశాద్రాఘీయస్యాదరదళిత నీలోత్పలరుచా!

దవీయాంసందీనం స్నపయకృపయా మామపి శివే!

అనే నాయం ధన్యో భవతి నచతే హానిరియతా!

వనేవా హర్మ్యేవా సమకర నిపాతో హిమకరః ॥

జగదీశ్వరి అయిన అంబికా సమక్షంలో శ్రీ శంకరులు ఎడంగా, దూరంగా నిలబడి వున్నారట. దూరమైతే నేమి?

"ఎక్కడో దూరదూరాన దీనంగా నిలిచి ఉన్న నన్ను, అరవిడిచిన నీలోత్పలాల వంటి సుదీర్ఘమైన నీ కడగంటి చూపులతో స్నానం చేయించు తల్లీ!

అన్నిటిపైనా చంద్రుడు తన చల్లని కిరణాలతో కాంతివర్షం కురిపిస్తాడు కదా" అం టారు ఆది శంకరులు!

జజజజజజ

ఇలా తలపోస్తూ ఉండగా హఠాత్తుగా స్వామి, భక్తుల వైపు తిరిగి, ఈ చివరనుండి ఆ చివరకు సభామండపమంతా ఒక్కసారి కలయ చూశారు. ఆ చూపు సామాన్యులు చూచిన చూపుగా లేదు.అంతమంది ప్రేక్షకులలో ఒక్కొక్కరి మీదా ఏదో విద్యుత్కాంతి ప్రసారమైనట్టూ, ఉన్నట్టుండి మెరుపు మెరిసి నట్టూ అవుపించింది. అయినా, ఆ వీక్షణం తీక్షణంగా లేదు. ప్రస న్నాతిప్రసన్నంగా, చంద్రుడి నుంచి వెడలివచ్చిన పండు వెన్నెలలా భక్తుల హృదయాలను చూర గొన్నది.

స్వకర్మను వదలరాదు

జ్ఞానోదయమై కర్మావసరం లేకున్నా, స్వకర్మను వదలి పెట్టరాదని అర్జునుడికి కృష్ణభగవానుడు బోధించాడు.

అసంగ కర్మాచరణం లోక సంగ్రహానికి అవసరం.

*****

## జోస్యం నిజమైంది!

కుమారుడు చాలా చురుకైన వాడు. ఈడుకు మించిన తెలివి తేటలు కనబరుస్తున్నాడు. స్కూల్లో ఉపాధ్యాయులు కూడా కుశాగ్రబుద్ధి అంటున్నారు.

బాలుడి జాతకం ఎవరికైనా చూపించుదామన్న కోరిక కలిగింది తండ్రికి.

తన మిత్రుడొక న్యాయవాది. ఆయనకు జ్యోతిషం తెలుసు. ఒకరోజు ఆయనను తన ఇంటికి పిలిచాడు. కుమారుడి జాతకం ఆయన చేతికిచ్చాడు.

పిల్లవాడి జాతకం పరిశీలించాడో లేదో, బాలుడి తల్లి వైపు చూసి ''ఒక చెంబుతో నీళ్లు పట్టుకురామ్మా'' అన్నాడు ఆ న్యాయవాది మిత్రుడు.

'నీళ్లెందుకు తెమ్మంటున్నాడా?' అని యోచిస్తున్నాడు పిల్లవాని తండ్రి.

తల్లి నీళ్లు తెచ్చింది. చెంబు అందుకుని ఆ చెంబెడు నీళ్లూ బాలుని పాదాలపై పోశాడు జాతకం చూసిన న్యాయవాది. అంతటితో వూరుకోక, ఆ బాలుని పాదాలకు సాగిల పడ్డాడు!

బాలుని తండ్రి నిర్ఘాంతపోయాడు. మిత్రుని ప్రవర్తన ఆయనకు అర్థం కాలేదు. తికమకపడుతూ ''ఇదేమిటి మీ చర్యలు మాకు బోధపట్టం లేదు'' అన్నాడు.

''వినూ మిత్రమా, విను. ఒకానొకప్పుడు అశేష ప్రపంచం నాలాగే ఈ చిన్న వాని పాదాలకు ప్రణమిల్లుతుంది. అప్పటికి నేను బ్రతికి వుండను కదా!'' అన్నాడు జాతకం చూసిన న్యాయవాది.

జజజజజజ

పిల్లవాని తండ్రి శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రి. తమిళనాడులో స్కూళ్ల సూపర్‌వైజర్. స్వగ్రామం విళ్లుపురం. హొయసకర్ణాటకశాఖ బ్రాహ్మణులు. పూర్వీకులెన్నడో కన్నడ దేశం నుంచి తమిళ దేశానికి వచ్చి, అక్కడే స్థిరపడ్డారు.

శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రి ముగ్గురు కుమారులలో ఈ పిల్లవాడు రెండోవాడు. తల్లిదండ్రులు పెట్టిన పేరు స్వామినాథ. తండ్రికి గారాబు పట్టి.

ఈ మహాపురుషుడే మన కథా నాయకుడు!

# స్వామితో సంభాషణ

వైకుంఠ ఏకాదశికి కంచి వెళ్లాలని నేను సంకల్పించుకున్నది కంచి వరదుని సేవించు కోవడం కొరకే. కామకోటి శంకరాచార్య దర్శనం తలవని తలంపుగా తటస్థించింది. అయినా దాని ప్రభావం నామీద చెరగని ముద్రవేసింది.

ఆ స్వామి పూజావిధానం, ఆ పూజలో ఆయన తన్మయత్వం, తన్మయతలో సైతం ప్రతి చిన్న విషయంపై ఆయన చూపిన శ్రద్ధా, మెలకువా, శ్రీ చంద్రమౌళీశ్వరుని పూలతో పూజించే టప్పుడు, హారతు లిచ్చేటప్పుడు, వింజామరలు వీచేప్పుడు, శ్రీ త్రిపురసుందరీ, చంద్రమౌళీ శ్వరులను ఊయలలో ఊపేటప్పుడు, చేత దండం పుచ్చుకుని స్వామి ప్రదక్షిణ చేసేప్పుడు, చివరకు, తన తలపై నుంచి కిందికి జారుతున్న కాషాయాన్ని సవరించుకునేప్పుడు సైతం, కళా శోభితమైన ఆ సౌకుమార్యం, అతిలోక సౌందర్యం, నన్ను పూర్తిగా లోగొన్నవి. రోజులు గడిచిన కొద్దీ వారి ప్రభావం పదింతలూ, నూరింతలూ అయింది.

మరోసారి కంచికి ప్రయాణం కట్టి, ఆచార్య స్వామిని చూచి రావాలనిపించింది. దూర దూరంనుంచి గాక, దగ్గిరకు వెళ్లి స్వామిని చూడాలని, స్వామితో మాట్లాడాలనీ, స్వామి మాట లు ఆలకించాలనే అభిలాష రేకెత్తింది.

ఈ స్వామి అందరు పీఠాధిపతులవంటి స్వామికారనీ, అపురూపమైన అసాధారణమైన ఒక వ్యక్తిత్వం ఏదో ఈయనలో ఉన్నదనీ, అంతకు ముందు నాకు ఏర్పడిన అభిప్రాయం వైకుంఠ ఏకాదశి నాడు ఆయనను సందర్శించిన తరువాత మరింత దృఢపడింది. మహాపురుష సంశ్రయం కోసం మనస్సు ఉవ్విళ్లూరింది.

అయినప్పటికీ, ఆధ్యాత్మికంగా ఒక గురువును అన్వేషిద్దామనో, ఆయన వల్ల ఉపదేశం పొందుదామనో అభిలాష మాత్రం అప్పటికి నాకు లేదు.

చెన్నపురి ఆంధ్రమహాసభలో నాతోపాటు గౌరవ కార్య నిర్వాహకుడుగా ఉంటున్న ఒక న్యాయవాది మిత్రుని తోడు చేసుకుని, ఇద్దరం కలిసి, ఒక ఆదివారం మధ్యాజజహ్నాం కంచి చేరాము. స్వామి వారింకా విష్ణుకంచిలో ఉన్న మఠంలోనే ఉన్నారు. మా అదృష్టమేమో, మేమ

క్కడికి చేరినవేళకు స్వామి వెంట, వారి శిష్యులు తప్ప ఇతరులెవరూ లేరు. మా ఇరువురి పేర్లు ఒక చీటిమీద వ్రాసి, స్వామి దర్శనానికి వచ్చినట్టు శిష్యులతో చెప్పాము.

"ఇప్పుడే భిక్ష ముగించారు. విశ్రాంతి తీసుకుంటున్నారు.కాసేపటికి వెలుపలికి వస్తారు. కూచోండి" అని శిష్యులు చెప్పారు.

వారి మాటలు విని మేము కూర్చున్నామో లేదో, మరొక శిష్యుడు వచ్చి, "స్వామి ఇప్పుడే వస్తున్నారు" అంటూ, వారు కూచోడానికి ఒక పీట వేశారు.

ఇంతలో చేత్తో దండం పుచ్చుకుని స్వామి రానే వచ్చారు. మేమిద్దరం స్వామికి సాష్టాంగం చేశాము, మా మా ప్రవర, గోత్రనామాలూ చెప్పుకుంటూ. స్వామి మమ్మల్ని తమకు అభిముఖంగా కూచోమన్నారు. ప్రశాంతగంభీరంగా ఉంది స్వామి వదనం.ప్రసన్నతను కుమ్మరిస్తున్నవి ఆయన నేత్రాలు. శరీరకాంతి చెప్పశక్యం కాదు. అప్పటికి స్వామి వయస్సు అరవై డెభ్భయి ఏళ్ల మధ్యలో ఉండవచ్చు. వయస్సుచే కాకున్నా, నిరంతర జపతపాల వల్లా, ఉపవాసవ్రతాల మూలంగానేమో శరీరం శుష్కించి, కాస్తముడతలు పడినట్టు కనిపిస్తున్నది. లోకసేవాచరణంలో ఎవని శరీరం శుష్కించుతుందో వాడే నిజంగా ధన్యాత్ముడంటాడు స్వామి వివేకానందుడు.

శరీరం ఒకింత సడలినా దేహకాంతి మాత్రం దర్శనీయంగా ఉంది. లావణ్యమంటే అదే కాబోలు!

ముక్తాఫలేషు ఛాయాయాః

తరలత్వమివాంతరా

ప్రతిభాతి యదంగేషు

లావణ్యం తదిహోచ్యతే.

ముత్తెపు గోళాల్లో లోలోన చలిస్తూన్న కాంతివలె దేహంపై ప్రకాశించే కాంతి 'లావణ్య' మట.

ఇక ఆ స్వామి నయన సౌందర్యం, అహో! అది వర్ణనాతీతం. నేనేమిటి, దేశదేశాల ప్రముఖు లెందరెందరో దివ్య సౌందర్యం వెలిగక్కే ఆ నేత్రకమలాలకు నీరాజనా లర్పించారు.

లోకంలో సాధారణ సౌందర్య ప్రమాణాల ప్రకారం, అంగప్రత్యంగసౌష్ఠవం దృష్ట్యా, స్వామి సౌందర్య వంతుడు కాకపోవచ్చు. కాని, అనిర్వచనీయమైన అఖిలజనానందకరమైన ఏదో ఒక తేజస్సూ, ఒక వర్చస్సూ, ఆయనలో ఉన్నవి. అదేనేమో బ్రహ్మతేజస్సు!

"గురుకృపాలహరి" అనే సంస్క ృత పద్య కావ్యంలో సుప్రసిద్ధకవులు శ్రీ కల్లూరి వెంకట సుబ్రహ్మణ్య దీక్షితులు స్వామి సౌందర్యం ఇలా వర్ణించారు.

రక్తాంతస్పృహణీయ దీర్ఘనయనం

స్వాకుంచిత భ్రూలతం!

హాసస్మేరముదార పాలఫలకం

స్ఫూర్జత్కపోలారుణం!

శ్రీ కర్ణం సునయనం సుచారు రదనం

పూర్ణేందు బింబాననం

వందే శ్రీగురుమూర్తి మిందుమకుటం

శ్రీ కామపీఠాధిపమ్"

(కొనలయందు ఎర్రని జీరలతో సొంపునింపు చారడేసి కన్నులు, కొంచెం వాలిన కనుబొమలు, చిరునవ్వుదులకించే వెడల్పయిన లలాటం, లేత ఎరుపురంగు చెక్కిళ్లు, శ్రీకారములవంటి చెవులు, చక్కని ముక్కు, ఇంపైన పలువరస, పున్నమి చందురునికి సాటివచ్చే నెమ్మోమూ కలిగిన కామకోటి పీఠాధిపతి శ్రీచంద్రశేఖర గురుమూర్తి నమస్కారం)

ఇంటి పేరుతో సహా నాపేరూ, ప్రవరా విని, మందహాసం చేస్తూ,

"మీరైతే బ్రాహ్మణులా? మీ ఇంటిపేరులోనూ, మీ ఋషుల పేర్లలోనూ క్షత్రియులా!" అని స్వామి చమత్కరించారు.

(మా ఇంటి పేరు "నీలంరాజు". మా గోత్ర ఋషులు, "హరిత, అంబరీష, యవనాస్య")

స్వామి విసరిన చలోక్తివల్ల మా కొత్తదనం కొంత సడలింది. స్వామికి మేము మరింతవొ సన్నిహితుల మైనాము.

జజజజజజ

నేను నా విద్యార్థి దశలోనే మహాత్మగాంధి ప్రారంభించిన సహాయ నిరాకరణోద్య మంలో ప్రవేశించి రాజకీయాల్లో పాల్గొన్నాననీ, టంగుటూరు ప్రకాశంగారు స్థాపించిన ఆంగ్ల "స్వరాజ్య" పత్రికలో, కాశీనాథుని నాగేశ్వరరావు నడిపిన 'ఆంధ్రపత్రిక'లో పనిచేశాననీ, రాజ కీయాల్లో గాంధి అనుయాయుణ్ణి అనీ స్వామికి విన్నవించాను.

ఆ తరువాత స్వామి నాలుగున్నర గంటలు సావకాశంగా, తెరిపి లేకుండా వివిధ విష యాలను గురించి సంభాషించారు. మన సంస్కృతి, మన చరిత్రా,ఆనాటి మన రాజకీయాలూ, మన దేశనాయకుల వైఖరులూ, మన సంఘసంస్కర్తల నడవడులూ, ఒకటేమిటి - ప్రసక్తాను ప్రసక్తంగా సమస్త విషయాలూ చర్చనీయాంశాలు అయినాయి.

దేశవిభజన విషయంలో గాంధి - జిన్నాల మధ్య జరిగిన వాదప్రతివాదాలను, ఉత్తర ప్రత్యుత్తరాలను పూర్వాపరాలతో పూసగుచ్చినట్టు విశ్లేషించి చెప్పారు. కాంగ్రెసు నాయకులు జిన్నాసాహెబ్ వ్యూహంలో చిక్కుకున్న పరిస్థితులు ఎలా కల్పించబడ్డాయో, తత్ఫలితంగా అఖం డభారత స్వరూపం ఏవిధంగా అంతరించిందో సహేతుకంగా నిరూపణ చేశారు. ( ఈ సంద ర్భంలో ఇటీవల వెలుగు చూసిన మౌలానా అబుల్ కలాం అజాద్ వ్రాతలు స్వామి అభిప్రా యాలను బలపరుస్తున్నాయి.)

నాలుగున్నర గంటలు స్వామి ముచ్చటైన తెలుగులో, నేటి మన ఉపన్యాసకుల ధోర ణిలో గాక, మన పూర్వీకులు మాట్లాడుకునే సరళమైన వాడుకభాషలో మాట్లాడారు. కాకపోతే, అరవదేశంలో స్థిరపడ్డ తెలుగు ప్రజల యాసమాత్రం అక్కడక్కడా కాస్త తొంగిచూసింది. పండి తుల పదాడంబరం మాటవరసకైనా కానరాలేదు. పదంకోసం వెతుక్కోవడం లేదు. తరంగం లేని సముద్రంలో పడవ నడిచినట్టు ప్రసంగం యావత్తు ఆశుకవిత్వంలా సాగింది. యావద్భార

తజాతిని కలవరపరచిన ప్రధాన సమస్యలను గురించి అంత తర్కసహంగా, యుక్తియుక్తంగా అనుద్వేగంగా ప్రసంగించడం అందరికీ సాధ్యం కాదు.

అంతసేపు నేనూ,నా మిత్రుడూ శ్రోతలంగా చెవులప్పగించి స్వామి ప్రసంగం విన్నాము. ఆ స్వామి మాట్లాడిన వైఖరి చూస్తే 'శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి స్వామి తెలుగువాడే, ఆయన మాతృభాష తెలుగేనన్న అభిప్రాయం కలిగింది. కాదు, కన్నడమన్నమాట అటు తరువాతనే.

కాగా, గాంధి - జిన్నాలమధ్య జరిగిన వాద ప్రతివాదాలను, పూర్వాపరసందర్భాలను ఇంచుమించు తేదీల క్రమంగా స్వామి వివరించిన తీరు చూస్తే, ఆయన ధారణాశక్తి ఎంతటి వారికైనా దుర్లభమని తోచింది.అసాధారణమైన ఉపాసనాబలమేదో ఆశక్తికి కారణమై ఉండాలి. లేదా, ఆ మేధాసంపద జన్మసిద్ధమైనా కావాలి.

ఆ విషయం అలాఉంచి, మరో ముఖ్యాంశం గమనించుదాం. నాటి దేశపరిస్థితులను స్వామి చర్చించిన తీరునుబట్టి, దేశ రాజకీయ సమస్యల పట్ల స్వామికి గల అవగాజజహన గానీ, రాజ్యాంగ పరిజ్ఞానం గానీ కలవారు, అగ్రశ్రేణికి చెందిన రాజకీయ నాయకులలో సైతం ఎందరో ఉండరు.

1894 సంవత్సరం మే నెల 20 తేది, దక్షిణదేశంలోని విళ్లుపురంలో శ్రీ సుబ్రహ్మణ్య శాస్త్రి, శ్రీమతి మహాలక్ష్మి పుణ్యదంపతులకు జన్మించిన 'స్వామినాథ' అనే బాలుడు తన 13 ఏట సన్యాసదీక్ష పుచ్చుకుని, చంద్రశేఖరేంద్ర సరస్వతి పేరుతో  కామకోటిపీఠం అధిష్ఠించ కుండా, అందరితోపాటు ఆంగ్ల విద్య నభ్యసించి రాజకీయ రంగంలో ప్రవేశించినట్లయితే, గాంధి, నెహ్రూల సరసన ఏ మహానాయకుడుగానో, ఏ ప్రముఖ రాజ్యాంగవేత్తగానో, ప్రపంచ ఖ్యాతికాంచేవాడని చెప్పడానికి జ్యోతిశ్శాస్త్రవేత్త కానక్కరలేదు.

మత విషయాలకు మాత్రమే పరిమితమైన పీఠాధిపతులుగా ఉంటూ, అహర్నిశలు జపహోమతపాదులతో, పూజాపునస్కారాలతో, శాస్త్రపురాణ చర్చలతో, అనుదినం తమ్ము సం దర్శించే అశేషభక్తజనుల సమస్యల పరిష్కారంలో నిమగ్నులైన కాషాయధారులకు వర్తమాన రాజకీయాలను గురించి అంతటి సదవగాహనం ఎలా సాధ్యమన్నది ఊహించడానికే వీలుకాని

విషయం. ఒక్క రాజకీయమా? చారిత్రకమా? శాస్త్ర విషయమా? ధర్మవిషయమా? ఇంతటి వివిధ విషయాభిజ్ఞత ఎంతటి ప్రజ్ఞావంతుడైనా ఒకేఒక వ్యక్తిలో నిక్షిప్తం కావడం ఎలా సంభవం?... అసదృశం! అపూర్వం!

అయినా, ఇలా ఆశ్చర్యం చెందవలసిన పనిలేదట. వేదానికి భాష్యం రాయడమేగాక, విజయనగరమహా సామ్రాజ్యస్థాపనకు కారణభూతులైన శ్రీ విద్యారణ్యులు ఇలా అంటారు:

తదిత్థం తత్వవిజ్ఞానే
సాధనాను సమర్దనాత్
జ్ఞానినా చరితుం శక్యం
సమ్యక్‌రాజ్యాది లౌకికమ్॥

"తపస్సువల్ల తత్వజ్ఞానాన్ని బడసి పరిణతులైన మహాజ్ఞానులు, రాజ్యపాలనా సమర్థులు కూడా కాగలరు"

లోకక్షేమం

మన లోపాలను మనం సంస్కరించుకోనిపక్షంలో లోక క్షేమం కోసం యత్నించే అధికారం మనకు లేదు.

మానసిక దౌర్బల్యాన్ని అణచి, దుఃఖాతీతుడై ఆత్మోపలబ్ధి నందు కొన్న వాడి ఉనికి ప్రపంచ సౌఖ్యానికి కారణ మవుతుంది. అతడు ప్రపంచసంస్కరణకు పాటుబడ నవసరం లేదు. లోకక్షేమం తానుగా సిద్ధిస్తుంది.

***

# "వశిష్ఠాది మహర్షుల వంటివారు"

"బాబూ! అది నడయాడుతున్న బ్రహ్మపదార్థం. దానిని గూర్చి ఎలా పలకడం?" అంటారు తపస్స్వాధ్యాయనిరతులూ, పండితకవులూ శ్రీ తాడేపల్లి రాఘవనారాయణ శాస్త్రిగారు శ్రీ కామకోటిపరమాచార్యులను గురించి. అయినా, నాలుగు మాటలు చెప్పండి అని వెంటబడితే అమూల్యమైన ఈ క్రింది అనుభవవిశేషాలను వినిపించారు.

ఒకసారి నేను శ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతిస్వామివారిని సందర్శించినప్పుడు, మా తండ్రి గారు వ్రాసిన పుస్తకాల సెట్టు ఒకటి తన కివ్వమని అడిగారు.

"తమకు నాగర లిపివచ్చు. అరవ లిపి వచ్చు. మరి తెలుగు లిపి పరిచయమేనా?" అని నేను అడిగాను.

"నాకు అక్షరాలు వస్తే నేమి, రాకపోతేనేమి? పుస్తకాలు పెట్టి పూజ చేస్తాను. ఒక సెట్టు ఇవ్వు" అన్నారు శ్రీవారు.

తరువాత కొంత కాలానికి నేను హైదరాబాద్ వచ్చాను. అప్పుడు స్వామివారు హైదరాబాద్‌లో కౌతా లలితామనోహర్ ఇంట్లో ఉన్నారు. నేను శ్రీవారి దర్శనానికి వెళ్లాను. అక్కడి పరిచారకుడు నేను వచ్చినట్టు స్వామికి తెలిపాడు. దొడ్లో ఒక పాడుపడ్డ కొంపలో కూర్చొని నాకు కబురు పెట్టారు శ్రీవారు.

అదే సమయానికి రాష్ట్ర కేంద్రప్రభుత్వాల్లో మంత్రిపదవులు నిర్వహించిన శ్రీ పి.వి.నరసింహారావుగారు కూడా శ్రీవారి దర్శనానికి వచ్చారు. ఆయన శ్రీవారిపై కొన్ని సంస్కృతశ్లోకాలు వ్రాసుకొచ్చారు. శ్రీవారి ఎదట కూర్చొని ఆయన తన శ్లోకాలు వినిపించారు.

శ్రీవారు ఆ శ్లోకాలలో తప్పులు దిద్దే కొన్ని సూచనలు చేశారు.

అప్పుడు, నేను ఆశువుగా శ్రీవారిని గురించి నాలుగు శ్లోకాలు చదివాను. నా శ్లోకాలలో తప్పు లేవీ శ్రీవారు ఎత్తిచూపలేదు.

కాని, నా కవిత్వంలో రెండుచోట్ల తప్పులు దొర్లినవని శ్రీ నరసింహారావుగారు అన్నారు.

"కవిత్వంలో, జన్మలో, నడవడిలో ఆయనకు తప్పు అనేది ఉండదు" అని శ్రీవార న్నారు.

ఆ పిమ్మట శ్రీవారిపై నేను ఆశువుగా చెప్పిన శ్లోకాలు మళ్లా చదవమని చెప్పి, ఒకగం టసేపు పురాణం చేశారు శ్రీవారు. తరువాత స్వామివారు ఈ క్రింది పద్యం చదివారు.

మ॥ కనుమీ నీ నగుమోము మేల్సిరికి లక్ష్యం బౌటకున్‌ల
జ్జనెట్టగ మున్మున్న మునింగి కొండచరిబాటం జారె రేరేడటం
చనుమోదించుట బద్మినీపతి నిజాస్య స్మేరదృష్టి ప్రసా
ర నవోల్లాసిత ప్రీణయై తెలిపెడిన్, రామా! జగన్మోహనా!!

ఇది మా తండ్రిగారు వ్రాసిన 'రామ కథామృతము'లో బాలకాండ, నవమాశ్వానములో నిది. విశ్వామిత్రుడు శ్రీరాముని నిద్రలేపు సందర్భం.

శ్రీవారు పై పద్యం చదివి, "మీ నాన్నగారు దోవనపోతూ ఎప్పుడూ ఈ పద్యం చదువు తూ ఉండేవారు కదా?" అని నన్ను అడిగారు.

ఏనాడో గతించిన మా తండ్రిగారు తన పద్యాన్ని ఎంత ఆర్తిగా చదివేవారో అలాగే స్వామి వారు ఎట్లా తిరిగి చదవగలిగారు!

శ్రీవారు ఇప్పటి వారు కారు. వెనుక ఆర్షయుగంలో వశిష్ఠాదుల కోవకు చెందినవారు.

అనాచారం - ఆత్మహత్య

నేడు లోకంలో చూస్తున్న అనాచారాన్ని గురించి ఆలోచిస్తూ ఉంటే, కృష్ణలోనో, గోదా వరిలోనో దూకి చచ్చిపోదామనే తలపు ఇటీవల అనేక పర్యాయాలు కలిగింది నాకు.

ఒకసారి అరుగు మీద కూర్చొని ఇదే ఆలోచిస్తూ ఉంటే తలుపు కెదురుగా శ్రీవారి రూపం నవ్వుతూ నాకు కనిపించింది. అయితే, శ్రీవారు నేలమీద పాదాలు మోపకుండా కాస్తం త పైన ఉన్నట్టున్నది ఆ రూపం.

చచ్చిపోదామనే ఆలోచన వచ్చినప్పుడల్లా వరసగా రెండు రోజులు శ్రీవారి దర్శనం ఇలా జరిగేది - అప్పుడు నాకు విసుగు పుట్టింది.

నేను చచ్చిపోవడం బహుశ శ్రీవారికి ఇష్టంలేదు కాబోలు అనుకుని, నా ఆత్మహత్య ఆలోచనకు స్వస్తి చెప్పుకున్నాను. ఆ పిమ్మట శ్రీవారి రూపం కనబడడం మానేసింది.

ఐదారు నెలల తరువాత, ఒకసారి మళ్లా హైదరాబాద్ వచ్చాను. తీర్థ యాత్రలకు వెళ్లా లంటేనే ఇక్కడకు వస్తాను. లేకపోతే రాను. శ్రీ వేంకటేశ్వరస్వామి దగ్గరకు వెళ్లినా శ్రీవారి వద్దకు వెళ్లినా తీర్థయాత్ర నాకు.

ఒకరోజు శ్రీ పి.వెంకటేశ్వర్లుతో కలిసి శ్రీవారి దర్శనానికి వెళ్లాను. 'చందోలు శాస్త్రిగారు వచ్చా'రని ఆయన శ్రీవారితో చెప్పారు.

నన్నుద్దేశించి శ్రీవారు "నీ సమస్య ఏమయింది?" అన్నారు.

నేను: ఏం సమస్య?

శ్రీవారు: అనాచారం కోసం చావడం

నేను: 'వద్దు' అని మీరన్నారు కదా, అందుకని చాలించుకున్నాను.

జజజజజజ

అటు తరువాత ప్రాయశ్చిత్తాన్ని గురించి ముచ్చటించుకున్నాము శ్రీవారూ, నేనూ. ప్రాయశ్చిత్త గ్రంథం ఎందుకు పుట్టింది అనేది ఒక ప్రశ్న. తప్పు చేస్తే దిద్దుకునేందుకుగాను ప్రాయశ్చిత్తం ఉద్దేశించారు, తప్పు ఒకసారి చేస్తే ప్రాయశ్చిత్తం చేసుకోవచ్చు.

స్వామివారు: 'అహం బ్రహ్మాస్మి' అనుకోరాదా, అనాచార భావం బాధించకుండా ఉండేందుకుగాను.

నేను : ఆ స్థితి ఇంకా రాలేదు కదా నాకు!

స్వామివారు : క్షణికసమాధి సంగతో?

నేను : మీ అనుగ్రహం ఉంటే వస్తుంది.

ఆ తరువాత పక్కన ఒకాయన శ్రీవారికి వింజామర వీస్తుంటే దాన్ని నేను తీసుకుని కొద్దిసేపు వీచాను. ఒక పరిచారకుని ద్వారా శ్రీవారు ఒక శాల్వ తెప్పించి, స్వయంగా వారే నాకు దాన్ని కప్పారు.

నేను : మీరు ఎవరినీ తాకరు. మీరే ఒక కొత్త ఆవరణ నాకు కప్పుతున్నారు!

స్వామివారు : నీకు గాదు కప్పేది. నీ మీదకు వచ్చే అనాచారానికి కప్పుతున్నాను.

శ్రీవారికి నాతో పనిలేదు. నాకు శ్రీవారితో పనిలేదు. కాని కాస్సేపు వారితో ఉంటే సంగంలో నిస్సంగత్వం అలవాటు చేస్తారు శ్రీవారు. ఆయన మహానుభావులు!

జజజజజజ

*"ఆయన ఋషి"*

ప్రసంగవశాత్తు శ్రీ రాఘవనారాయణశాస్త్రిగారు తన తండ్రి కీర్తిశేషులు తాడేపల్లి వెంకటప్పయ్యశాస్త్రులుగారిని గురించి ఒక చిన్న ఉదంతం ఇలా చెప్పారు.

"మా నాన్న గారు "త్రిశంకుస్వర్గం" అనే పేరు గల ఏడంకాల నాటకం రాశారు. దానిని నూజివీడు జమీందారుగారికి చదివి వివిపించారు. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు తాను రాసిన 'విశ్వామిత్ర' - మేనక' అనే మూడంకాల నాటకం చదివారు. కవిత్వం గురించి చర్చ జరిగింది.

"ప్రపంచంలో మొదటితరగతి కవిత్వం ఎవరిది?" అని అడిగారు జమీందారు గారు.

"నా గొంతులో ప్రాణం ఉండగా మరొకరి కవిత్వం గొప్పదని నేను ఎలా ఒప్పుకోను?" అన్నారు చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు.

"మరి చందవోలు శాస్త్రిగారో?" అని అడిగారు జమీందారు గారు.

'ఆయన ఋషి' అన్నారు చెళ్ళపిళ్లవారు.

# జగద్గురు ప్రశస్తి

- ఆర్షవిద్యాభూషణ శ్రీ జటావల్లభుల పురుషోత్తం

శ్రీచంద్రశేఖ రాఖ్యేంద్ర సరస్వ త్యాగ మాద్భువి,

దృశ్యతే శుభ్ర తేజశ్చ శ్రూయతే శ్రుతినిక్వణః.

శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి రాకచే భూలోకంలో శుభ్రతేజస్సు గోచరిస్తున్నది, శ్రుతి ధ్వని వినబడుతున్నది.

శ్రీ శంకరో జ్ఞాన పథ ప్రచారే కుమారిలో ధర్మవిధి ప్రబోధే,

శ్రీమాధవో వేద సురక్షణేచ సాక్షాచ్చుకో భక్త్యుపదేశ ఏషః.

స్వామి జ్ఞాన ప్రచారమున శంకరులు. కర్మోపదేశంలో కుమారిల భట్టు. వేద రక్షణకు విద్యారణ్యులు. భక్తి ప్రబోధంలో శ్రీశుకులు.

వాల్మీకినాఽవర్ణ్యత రామచంద్రో లోకజ్ఞ ఇత్యత్ర విశిష్టతాఽద్య,

బ్రహ్మజ్ఞ లోకజ్ఞ మిమం మహాస్తం సంపశ్యతా జ్ఞాయత ఏవనూనం.

బ్రహ్మజ్ఞానానికి లోకజ్ఞానం తోడైతే ఎట్లా శోభిస్తుందో ఈ స్వామియందే చూడగలం.

# మతరక్షణకు మహత్తర కృషి

భారతదేశంలో మతం మనుగడకు రాజ్యాంగరక్షణ చేకూరింది. మన రాజ్యాంగంలో మతం ప్రజల ప్రాథమిక హక్కుగా పరిగణన పొందింది. అయితే, ఇందుకు ప్రధాన బాధ్యు లెవ్వరో దేశం మొత్తం మీద తెలిసినవారు ఎందరో లేరు.

1947లో కామకోటి శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి తపోబలంతో ఆ లక్ష్యం ఎలా సాధించ బడిందో, వేదరహస్య సంవేదీ, మహాపండితుడూ శ్రీమాన్ అగ్నిహోత్రం రామానుజ తాతాచారి గారు ఈ వ్యాసంలో వెల్లడించిన విషయాలు అద్భుతావహాలు.

హిందూమతసంరక్షణకు శ్రీ కంచికామకోటి పీఠపరమాచార్యులు, జగద్గురు శ్రీ చంద్ర శేఖరసరస్వతిస్వామివారు చేసిన మహత్తర సేవలను తెలుసుకోవాలంటే భారత స్వాతంత్ర్యోద్య మం నాటి దేశపరిస్థితులను జ్ఞాపకం చేసుకోవాలి.

చిన్నతనంలోనే సన్యసించి కంచికామకోటిమఠాధిపత్యం వహించడం వల్ల స్వామివారు ప్రత్యక్షంగా దేశ రాజకీయాలలో పాల్గొనలేదు. అయినా భారతస్వాతంత్ర్యాన్ని వారు మనః పూర్వకంగా వాంఛించారు. దానిని బలపరిచారు.

స్వామివారు ఆశించింది ఇండియాలో విదేశీపాలన అంతరించడం మాత్రం కాదు. మన దేశీయుల హృదయంలో పాదుకున్న విదేశీయ, విజాతీయ వ్యామోహం కూడా అంతమొందా లని వారు గాఢంగా వాంఛించారు.

గాంధీగారు విదేశీవస్త్ర బహిష్కరణను ప్రారంభించిన నాటినుండి స్వామి స్వయంగా ఖద్దరునే ధరిస్తున్నారు. దురదృష్టవశాన జాతీయోద్యమ నాయకులు రాజకీయాలకే సర్వప్రాధా న్యమిచ్చి, మతంపట్ల ఉపేక్ష వహించారు. అందువల్ల మనకు స్వాతంత్ర్యం సిద్ధించిన నాడు మన మతానికీ, ఆధ్యాత్మిక ప్రయోజనాలకూ హాని వాటిల్లవచ్చునని స్వామివారు అనుమానిం చారు. ఈ విషయమై శ్రీ కామకోటి స్వామి పలువురు రాజకీయనాయకులను హెచ్చరించారు. కాని వారి హెచ్చరికలను నాయకులంతగా పాటించలేదు. రాజకీయాలు మినహా ఇతర సమ స్యలకు ప్రాధాన్యం లేని నాటి క్లిష్టపరిస్థితులనుంచి మన మతసంరక్షణకై కంచిస్వామి వారొ

క్కరే అవిశ్రాంతంగా పాటుబడక తప్పలేదు.

భారతరాజ్యాంగ నిర్మాణదశలో కంచిపీఠాధిపతి ప్రదర్శించిన అసదృశ రాజకీయ పరిజ్ఞానం వల్లనే నేడు మన రాజ్యంగ చట్టంలో మనస్వాతంత్ర్యానికీ, మతసంస్థల సంరక్షణకూ నియమ నిబంధనలు స్థిరంగా నెలకొన్నవి. ఈ సందర్భంగా శ్రీ స్వామివారు సల్పిన నిరాడంబర కృషిని విజ్ఞప్రపంచానికి వెల్లడించడం నా కర్తవ్యంగా భావిస్తున్నాను.

## స్వామి భవిష్యద్వాణి

మతస్వాతంత్ర్యానికీ, మతసంస్థల సంరక్షణకూ రాజ్యాంగ ప్రామాణికతను సమకూర్చాలన్న లక్ష్యసాధనలో అయిదేళ్ళు స్వామి వారెంత నిర్విరామంగా పాటుపడినారో నేనెరుగుదును. కుంభకోణం సమీపాన వేలూరు అనే పల్లెటూళ్లో ఒక అర్ధరాత్రివేళ తమ సాన్నిధ్యంలో ఉన్న మమ్ము ఉద్దేశించి స్వామివారు చేసిన ఈ హెచ్చరిక నేటికీ నా చెవులలో మారుమ్రోగుతున్నది. "భారత రాజ్యాంగం ద్వారా మనమతాన్ని కాపాడుకొనడం మన తక్షణ కర్తవ్యం. ఇది ఎంతమాత్రం ఉపేక్షించవలసిన విషయం కాదు."

ఈ హెచ్చరిక ప్రాముఖ్యాన్ని ఆనాడు మే మంతగా గుర్తించలేదు. కాని తరువాత కొద్ది రోజులలోనే జరిగిన సంఘటనలు స్వామి భవిష్యద్వాణిని అక్షరాల ధృవీకరించినవి. భారత స్వాతంత్ర్యాన్ని గురించి, ప్రత్యేకించి భారత దేశానికి నూతన రాజ్యాంగ నిర్మాణాన్ని గురించి చర్చించడానికి బ్రిటిష్ ప్రభుత్వం మన దేశానికి ఒక రాయబారవర్గాన్ని పంపింది.

ఆ సందర్భంలో తమ కర్తవ్య మేమిటో కామకోటిశంకరాచార్యులవారు తప్ప, తక్కిన మఠాధిపతు లెవ్వరూ గుర్తించలేదు. బ్రిటిషు రాయబారవర్గ సభ్యులను కలుసుకొని మనదేశంలో గల మతసంస్థల పరిస్థితులను గురించి, భవిష్యత్తులో వాటి ప్రతిపత్తిని గురించీ రాయబారవర్గ సభ్యులకు నచ్చ చెప్పవలసిందిగా స్వామి వారు మమ్ము ఆదేశించారు.

కాని, బ్రిటిషు రాయబారవర్గం మా విజ్ఞప్తిని ఆలకించడానికైనా అవకాశం ఇస్తుందా అని మేము సందేహించాము. ఏమైనప్పటికీ జరగవలసినదేదో జరగనిమ్మని, స్వామివారి ఆదే

శం మేరకు రాయబార వర్గానికి టెలిగ్రాములు పంపాము. మేము ఊహించినట్టే జరిగింది! మాటెలిగ్రాములకు వారు సమాధానం కూడా ఇవ్వలేదు. అయినా, స్వామివారు మా వలె నిరాశచెందలేదు. ఆయన ఆత్మవిశ్వాసం మాకు ఆశ్చర్యం కలిగించింది. అది మా అల్పజ్ఞతకు నిదర్శనం. స్వామి సంకల్పం అమోఘం. అది వారికే విదితం.

## అద్భుత సన్నివేశం

ఇంతలో తలవని తలంపుగా "తక్షణం మద్రాసుకు బయలుదేరి రావలసింది" అని "హిందూ" పత్రిక కార్యాలయం నుంచి నాకు టెలిగ్రాం వచ్చింది. నేను మద్రాసు చేరి "హిందూ" పత్రిక కార్యాలయంలో అడుగు పెట్టినానో లేదో అప్పటి "హిందూ" సంపాదకులు శ్రీ కస్తూరి శ్రీనివాసన్ నాకు ఎదురుపడి, బ్రిటిష్ పార్లమెంటరీ రాయబారవర్గం మరికొన్ని నిముషాలలో తమ కార్యాలయం దర్శించబోతున్న వార్త నా చెవిన వేశారు. ఆనాడు రాయబారవర్గ సభ్యుల గౌరవార్థం "హిందూ" కార్యాలయంలో ఒక తేనీటి విందు ఏర్పాటు చేశారు. ఏ రాయబారవర్గం వారు మేము పంపిన టెలిగ్రాముకు సమాధానమైనా పంపకుండా తటస్థంగా ఉన్నారో, వారే మరికొన్ని క్షణాల్లో అక్కడ నాకు ప్రత్యక్షమయ్యే అద్భుత సన్నివేశం అప్పటికప్పుడు ప్రత్యక్షమైంది. రాయబారవర్గం కార్యదర్శికి కస్తూరి శ్రీనివాసన్ నన్ను పరిచయం చేశారు. "మా టెలిగ్రాములు ఒక్కదానికైన మీరు జవాబివ్వలేదు అని వారితో నే నన్నాను. రాయబారవర్గ సభ్యులందరిలో ప్రముఖుడైన బ్రిటిష్ పార్లమెంటు సభ్యుడు శ్రీ సోరెన్‌సెన్‌కు స్వయంగా మా విజ్ఞప్తిని వినిపించవచ్చని ఆయన నాకు సలజహా ఇచ్చారు. ఈ వ్యవహారమంతా శరవేగంగా జరిగిపోవడం వల్ల మా విజ్ఞాపనను వ్రాతమూలకంగా వారికి సమర్పించడానికి వీలుపడలేదు. భారతదేశంలో మతసంస్థల నిస్సహాయస్థితిని గురించి నోటిమాటలతోనే శ్రీ సోరెన్‌సెన్‌కు సంగ్రహంగా చెప్పి మనసంస్థలకు రాజ్యాంగరక్షణ అవసరమన్న శ్రీ కంచికామకోటిపీఠాధిపతుల ఆశయాన్ని వారికి విశదపరిచాను. మరొకసారి తనను ఢిల్లీలో కలుసుకొనవలసిందని ఆయన నాతో అన్నారు.

మతం ప్రాథమిక హక్కు!

ఆశ్చర్యకరంగా జరిగిన ఈ కథ యావత్తూ స్వామివారికి వినిపించాలని నేను హుటాహుటి కంచికి తిరిగివచ్చాను. నేను చెప్పినదంతా స్వామి విన్నారు. ఒక్క క్షణం ధ్యానంలో ఉన్నారు.

అటు తరువాత 'మతాన్ని ప్రాథమిక హక్కు'గా పరిగణించవలసిందని కోరుతూ ఒక విజ్ఞాపన తయారు చేయవలసిందని మమ్మాదేశించారు.

మతమా! ప్రాథమిక హక్కా! ప్రాథమిక హక్కులను గురించి దేశంలో అప్పటికి మేధావి వర్గాలలో సైతం ఆలోచనలు బయలుదేరలేదు. కాగా మతాన్ని 'ప్రాథమిక హక్కు'గా పరిగణించడం గురించి యోచించిన వారు అసలే లేరు. ఆ మాటకొస్తే భారత రాజ్యాంగంలో ప్రాథమిక హక్కుల అవతరణకు ఇదే నాందివాక్య మనడం కూడా అతిశయోక్తి కాదు.

*సొరెన్‌సెన్ ఆనందం*

నేను ఢిల్లీ వెళ్ళి శ్రీ సొరెన్‌సెన్‌ను కలుసుకొని, మా విజ్ఞాపనపత్రాన్ని ఆయనకు అందజేశాను. భారతప్రజానీకంపట్ల శ్రీ కంచిశంకరాచార్యస్వామికి  గల ప్రేమానురాగాలను గురించీ, అసాధారణమైన వారి లౌకికపరిజ్ఞానాన్ని గురించీ సొరెన్‌సెన్ ఆశ్చర్యం వెలిబుచ్చి, ఆనందభరితుడైనాడు.

బ్రిటిష్ రాయబారవర్గంవారు ఏ ప్రయత్నంతో వచ్చారో, ఆ ప్రయత్నం ఫలించలేదు. కాని, మతవిశ్వాసాన్ని ప్రాథమికహక్కుగా పరిగణించాలన్న సూత్రం మాత్రం సుస్థిరంగా , అసందిగ్ధంగా నాయకుల హృదయాల్లో నాటుకుపోయింది. జగద్గురు శ్రీ కామకోటిశంకరాచార్యుల అమోఘసంకల్పమే అందుకు మూలం.  అంతట, రథం ముందుకు సాగింది.

స్వామి తపోబలం

మరి కొంతకాలం గడిచింది.  ఈసారి బ్రిటిష్ మంత్రివర్గ రాయబారసభ్యులు మనదేశానికి అరుదెంచారు.  ఆ రాయబారవర్గానికి అధ్యక్షుడైన సర్‌స్టాఫర్డ్ క్రిప్సును సందర్శించి, మరల మా విజ్ఞాపన పత్రం అందజేశాము. ఏనాటికైనా, భారత రాజ్యాంగాన్ని తయారుచేయవల

సిన వారు భారత ప్రజాప్రతినిధులే కాబట్టి, మీ వాదనను వారికి విన్నవించవలసిందని శ్రీ క్రిప్సు మాకు సలజజహా చెప్పారు. ఆనాటి అనుభవాలను నెమరువేసుకున్నప్పుడు, దక్షిణభారతదేశం లో ఎక్కడో ఒక కుగ్రామంలో ఏకాంతంగా కాలం గడుపుతూ ఉన్న యోగిపుంగవుని దివ్యప్రభో దం మమ్మెలా నడిపించింది తలుచుకుని నేను పొంగిపోతూ ఉంటాను. మే మందరం నిమిత్త మాత్రులం, ఆ మహనీయుని తపోబలమే మా బలం. అదే మాకు అండ!

జజజజజజ

*మరొక ఘట్టం*

అది స్వాతంత్ర్య మహోద్యమానికి ఆయువుపట్టు. నాయకుల మనసులన్నీ నూటికి నూరుపాళ్ళు రాజకీయాలపై లగ్నమైన రోజులు అవి. అయినా మతస్వాతంత్ర్యాన్ని గురించి సర్దార్ వల్లభభాయిపటేల్‌తో సంప్రతించడానికి సాహసించాము. ఆయనతో మత ప్రసక్తి తేగానే అగ్గిపై గుగ్గిలం పోసినట్లయింది. 'హిందువులలో ఏనాడైనా ఒకరి కొకరికి తలలు కూడడం సాధ్యమేనా? అట్టి హిందూ మతం అసలు మనడానికే అర్హత లేదు.' అంటూ గర్జించాడు శ్రీ పటేల్.

అంతట నేను ధైర్యం కూడగట్టుకుని, వివిధ వర్గాలకు చెందిన హిందువులలో సమైక్య తాసాధనకు కంచిపీఠాధిపతులు కొనసాగిస్తున్న కృషిని పటేల్‌గారికి నివేదించాను. ఆ మాటలు విని పటేల్ ప్రసన్నుడైనాడు. అంతేకాదు, మన దేశంలో ఒక మఠాధిపతి తన సొంత సిద్ధాంతాల ప్రచారంతో తృప్తి చెందక, సమస్త హిందూమతసంరక్షణకై నడుముకట్టి కృషి చేస్తున్నారన్న మా టలను నమ్మలేకపోతున్నానని ఆశ్చర్యం వెలిబుచ్చాడు‹ 'మొదట హిందూమతంలోని వేర్వేరు శాఖలను ఏకముఖం చేయగలిగితే, అటు తరువాత, మీ కోరిక నెరవేరగల ప్రయత్నం ఏదైనా చేయవచ్చు' అని సర్దారు హామీ ఇచ్చారు.

తదాది భారతదేశంలోని వివిధ సిద్ధాంతాలకు చెందిన మఠాధిపతులనందరినీ సంద ర్శించి, ఏకాభిప్రాయ సేకరణకై తీవ్ర ప్రయత్నం చేశాము. వివిధ మత సంస్థలకు చెందిన పెద్ద లందరను సందర్శించినాము. మన దేశ చరిత్రలో ప్రప్రథమంగా 'అఖిల' భారతమఠాధిపతుల

మహాసభ' పేరుతో మఠాధిపతులందరి సహకారాన్ని సమకూర్చడం సాధ్యమైంది. అన్ని శాఖల కు, అన్ని సిద్ధాంతాలకు సంబంధించిన మతాచార్యులవల్ల మతాన్ని ప్రాథమికహక్కుగా పరిగణించాలన్న మా వాదనకు బలం చేకూరింది.

జజజజజజ

భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించింది. భారత రాజ్యాంగ నిర్మాణానికి రాజ్యాంగ పరిషత్ (కానిస్టిట్యుయంట్ అసెంబ్లీ) ఏర్పాటైంది. అయినా, స్వాతంత్ర్యసంపాదన మహోత్సవంలో మతానికి రాజ్యాంగరక్షణ కల్పించాలన్న యోచనగానీ, ఆసక్తిగానీ, ఎవరిలోనూ కనిపించలేదు. ఆ పరిస్థితుల్లో కంచితపస్వి శ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతి కంచికి సమీపంలో అంబి అనే చిన్న పల్లెటూర్లో ఉన్నారు. మద్రాసులో ఉన్న ప్రముఖ న్యాయవేత్తలను తమ సమక్షానికి పిలిపించుకున్నారు. రాజ్యాంగశాసనం ద్వారా మత స్వాతంత్ర్యాన్ని పరిరక్షించే ప్రతిపాదనలను సూచించవలసిందిగా స్వామి, వారిని కోరారు. న్యాయశాస్త్రంలో ప్రవీణులైన ఆ మేధావులంతా చేరి, దీర్ఘంగా చర్చించి, సుదీర్ఘమైన కొన్ని సూత్రాలను తయారుచేశారు.

## స్వామి న్యాయశాస్త్ర అవగాహన

కానీ కానిస్టిట్యుయంట్ అసెంబ్లీ సలహాదారు వాటి నన్నింటిని నిరాకరించి, సంగ్రహంగా తానొక ప్రత్యామ్నాయ ప్రతిపాదనను సూచించాడు. అయితే, ఆశ్చర్యమేమంటే, కామకోటి స్వామి సూక్ష్మగ్రహణశక్తిముందు కాన్స్టిట్యుయంట్ అసెంబ్లీ సలహాదారుని న్యాయశాస్త్ర పాండిత్యం కూడా పనికిరాలేదు. ఆ సలహాదారుని ప్రతిపాదనలోనే కొన్ని ప్రధానలోపాలను స్వామివారు చూపించి, చివరకు తామే దానిని స్వయంగా సవరణ చేశారు! కాన్స్టిట్యుయంట్ అసెంబ్లీలోని పలువురు రాజ్యాంగవేత్తలు స్వామివారి న్యాయశాస్త్ర పరిగ్రహణశక్తిని ప్రశంసించారు.

## *మరొక మెలిక*

ఇంత తతంగం జరిగినా, మతానికీ, మతసంస్థలకూ నిర్నిరోధమైన స్వాతంత్ర్యాన్ని రాజ్యంగంలో కల్పించడానికి రాజకీయనాయకులు సిద్ధంగా లేరు. అందుచేత, మేము సూచించిన 'మత స్వాతంత్ర్యం' అనే పదానికి ముందు 'చట్ట సమ్మతమైన' అను మాటలను చేర్చవల

సిందిగా వారు సలహా ఇచ్చారు. ఆ మాటలను చేర్చినట్లయితే ప్రభుత్వం తన ఇష్టానుసారంగా మత విషయాలలో, మతసంస్థల వ్యవహారాలలో జోక్యం కలిగించుకోవచ్చు. ప్రభుత్వం ఏ కొత్త చట్టాన్ని ప్రవేశపెట్టినా, మత సంస్థలు దానికి అడ్డు చెప్పడానికి వీలుండదు. అంత మాత్రమే కాదు. భవిష్యత్తులో రాబోయే కొన్ని కొన్ని ప్రభుత్వాలు అసలు మతంలోనే విశ్వాసం లేనివిగా ఉండవచ్చు. అందుచేత, బిల్లు రెండవమారు చర్చకు వచ్చినప్పుడైనా ఆ నిబంధనను తగు విధంగా సవరించవలసిందని స్వామివారు మాకు చెప్పారు. ఆ ప్రకారమే పరిషత్సభ్యులకు మేము విజ్ఞాపన చేశాము.

*డా. అంబేద్కర్ మతాభిమానం*

ఈ సందర్భంలో ఒక విషయం ప్రత్యేకంగా చెప్పక తప్పదు. సాంఘిక సమస్యలపై డాక్టర్ అంబేద్కర్‌గారికి గల తీవ్రమైన అభిప్రాయాలను బట్టి మేము వారిని సందర్శించినప్పుడు మా సూచనలకు వారు సుముఖంగా ఉంటారని ఊహించలేదు. కాని, అక్కడ కూడా స్వామివారి ప్రభావమే మాకు సాయపడింది. మాకు గల అనుమానము పటాపంచలైనవి. మతం అన్నా, మత సంస్థలన్నా తన కెంతో అభిమానమన్నాడు అంబేద్కర్ మహాశయుడు. ప్రభుత్వం ఏ మాత్రం జోక్యం చేసుకోకుండా మతసంస్థలు స్వచ్ఛందంగా మనవలసినదేనని తమ అభిప్రాయం అన్నారు.

అప్పటి నుంచి మా వ్యవహారం నల్లేరుపై బండిలా నడిచింది. మత సంస్థలకు సంబంధించిన క్లాజును నాలుగుభాగాలుగా విభజించారు. "చట్ట సమ్మతమైన" అనే మాటలను నాల్గవ భాగానికి మాతమ్రే వర్తింపజేశారు.

మత సంస్థల స్వతంత్రనిర్వహణకు రాజ్యాంగ రక్షణ సమకూరిందంటే శ్రీ కామకోటి పీఠపరమాచార్యుల కృషే అందుకు ప్రధాన కారణం. "ప్రతి మతమూ ఈ హక్కులు కలిగి ఉంటుంది..." అని మాత్రమే ఆదిలో ఉండేది. మహామేధావులైన రాజ్యాంగ నిర్మాతలు సైతం ఆ వాక్య రచనలో గల లోపాన్ని గ్రహించలేదు. స్వామి వారొక్కరే దాని అసమగ్రతను గ్రహించారు!

హిందూమతానికి చెందిన ఏ వ్యక్తి అయినా, తాను వైష్ణవుడననో, శైవుడననో భావిస్తాడే తప్ప, ఓంప్రథమంగా, తాను హిందువునని పరిగణించుకోడు. అదే విధంగా, మన దేశంలోని ఏ మతసంస్థ అయినా, హిందూమతం పేరుతో వ్యవహరించదు. ఎక్కడ చూచినా, వైష్ణవ, స్మార్త, శైవ సిద్ధాంతాది వేర్వేరు సంస్థలుగానే, ఆ పేర్లతోనే నడుస్తూ ఉంటాయి. అందుచేత 'మతసంస్థలు' అన్నప్పుడు అనేక శాఖల పేర్లతో నడిచే సంస్థలు పెక్కింటికి రాజ్యాంగ రక్షణ సూత్రం వర్తించకపోవచ్చు. ఆ హేతువుచేత, "అన్ని మతాలూ, ఆ మతాలకు చెందిన అన్ని శాఖలూ ఈ క్రింది హక్కులు కలిగి ఉంటవి" అనే మాటలను చేర్చవలసిందిగా శ్రీ స్వామి వారు సూచించారు. స్వామి సూచన ప్రకారమే ఆ నిబంధన కాన్‌స్టిట్యుయంట్ అసెంబ్లీ ఆమోదం పొందింది!

*పరమ రహస్యం*

ఇంత వ్యవహారం నడిచినా, ఈ సందర్భంగా స్వామివారు వహించిన పాత్ర పరమ రహస్యంగానే ఉండిపోయింది. తాము తెరమరుగునే ఉండి, మన మతానికీ, మత సంస్థలకూ స్వాతంత్ర్యాన్నీ, రాజ్యంగరక్షణనూ ప్రతిపాదించిన మహానుభావుడాయన, రాజ్యంగవేత్తలు, న్యాయశాస్త్ర విశారదులు, న్యాయమూర్తులు అందరూ స్వామివారి ఉపజ్ఞాపూర్వక సూచనలను అనుసరించిన వారే అయినారు.

ఇంతవరకు లోకానికి వెల్లడికాని ఈ మహత్తర విషయాలు మన మతచరిత్రలోనే కాదు, మన రాజ్యాంగ నిర్మాణేతిహాసంలో సైతం సువర్ణాక్షరాలతో చిత్రించదగ్గ అంశాలు.

*శృంగేరి స్వామి ప్రశంస*

ఇదే సందర్భంలో మరువరాని మరొక విషయాన్ని తెలుసుకోవాలి. అది శ్రీ శృంగేరి పీఠాధిపతుల సందర్శనం. హిందూమత సంస్థలకు భారత రాజ్యాంగంలో రక్షణ కల్పించే నిమిత్తం శ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతిస్వామివారు సల్పుతున్న కృషి సందర్భంగా నేనూ, నా సహచరులూ దేశంలోని వివిధ మతాధిపతులను సందర్శించాము. ఆ సందర్భంలోనే అప్పటి శృంగేరిపీఠాధిప

తులు పూజ్యశ్రీ చంద్రశేఖర భారతిస్వామి సమక్షంలో మే మనుభవించిన దివ్యానుభూతి ఎన్న టికీ మరువరానిది.

ఆ మహనీయుడు మఠాధిపతి అయినా, తపస్సంపన్నుడూ, నిరంతర ధ్యాననిమగ్నుడై, ఎప్పుడో ఒకప్పుడు మాత్రమే బాహ్యస్మృతి కలిగి ఉండే మహావ్యక్తి.

మేము శృంగేరికి వెళ్లిన రోజున, అదేమి భాగ్యవిశేషమో గాని, అంతకుముందే దీర్ఘస మాధినిష్ఠులై ఉండిన స్వామివారు, ఆనాడే బాహ్యస్మృతిలోకి వచ్చి తేజోమయులుగా, జ్ఞానస్వ రూపులుగా మాకు దర్శనమిచ్చారు.

చూడడంతోనే స్వామివారు మమ్మడిగిన మొట్టమొదటి ప్రశ్న "కామ కోటిపీఠాచార్యులు ఈ మారు వ్యాసపూజ ఎక్కడ చేశారు?"

"మధ్యార్జునంలో" అని మేము సమాధానం చెప్పాము.

అటు తరువాత, హిందూమతసంస్థలకు రాజ్యాంగరక్షణకై కామకోటి ఆచార్య స్వాము లు సల్పుతున్న కృషినీ, దేశంలోని మత సంస్థలన్నింటి సమైక్యతకు వారు కావిస్తున్న ప్రయత్నా లనూ శృంగేరిస్వామికి నివేదించాము.

ప్రసన్నవదనంతో స్వామివారు ఇలా అన్నారు."దేశపరిస్థితులను సుసూక్ష్మంగా గ్రహించి, ప్రస్తుతస్థితిలో మన కర్తవ్యమేమో గుర్తించజాలిన వారు కంచిస్వామి వారొక్కరు మాత్రమే.
ఈ విషయంలో మేమందరమూ వారి కృషిపైనే ఆధారపడతాము. ఇందుకు మేము వారికెంతో కృతజ్ఞులము.

వర్తమానకాలంలో మనదేశంలోని హిందూమతస్థులు ఈ మాత్రమైనా స్వధర్మావలం బకులై ఉన్నారంటే అందుకు ప్రధానంగా శ్రీ కంచిశంకరాచార్యులే ప్రేరకులు."

పై మాటలు చెప్పి, శ్రీ సంగమేశ్వరశాస్త్రిగారనే ఒక మఠాధికారిని పిలిచి, శృంగేరి పీఠం తో సంబంధంగల తీర్థముక్తపురి, హరిహరూర్ పీఠాధిపతులను కలుసుకుని, కంచిస్వామివారు సంకల్పించిన ప్రయత్నంలో అన్ని విధాలా మాకు తోడుపడవలసిందని చెప్పి, వారిని మావెంట పంపారు.

ఆ మఠాధిపతులతో మాట్లాడి, తిరిగి శృంగేరికి వచ్చి, శ్రీ చంద్రశేఖరభారతి స్వాములకు మా కృతజ్ఞతను తెలుపుకున్నాము.

హిందూమతోద్ధరణకు కంచిస్వామి చేస్తున్న సేవలకు తామెంతో కృతజ్ఞులమంటూ మరోమారు ప్రశంసించి శృంగేరిస్వామి మాకు సెలవిచ్చారు.

*('శంకర-షణ్మత' గ్రంథంలోని ఆంగ్లవ్యాసం నుంచి)*

సత్కర్మఫలం

మూఢభక్తితో ఆచరించినా సత్కర్మలు ఫలాన్నిస్తాయి.

# స్వామి వినోద ప్రియులు

స్వామి వినోదప్రియులు. వారి హాస్యం సులలితం. వాక్కు చమత్కారమహితం.

స్వామి మాట ఎదుటి వారిని నవ్విస్తుందే కాని, ఏ ప్రాణినీ నొప్పించదు. అదీ స్వామి హాస్యంలో ఉన్న విశిష్టత.

పరేంగిత జ్ఞానంతోపాటు, స్వామి వినోదప్రియత్వానికి చక్కని ఉదాహరణ ఇది :

జజజజజజ

దక్షిణాదిని కుంభకోణంలో పన్నెండు సంవత్సరాల కొకసారి 'మహామాఖం' మహోత్స వం జరుగుతుంది. 1956 లో ఆ ఉత్సవం ఫిబ్రవరి 25 తేదీన తటస్థించింది. ఆనాడు కుంభ కోణంలోని మహామాఖ తటాకంలో స్నానాలు చెయ్యడం పాపాపనోదకమనీ, మహాపుణ్యప్రద మనీ హిందువులంతా విశ్వసిస్తారు.

కంచి నుంచి కాలినడకను కుంభకోణం వెళ్లి, ఆనా డా పవిత్రోదకంలో మునిగి, కంచికి తిరిగి రావాలని స్వామి అభిలషించారు. కాని, అప్పటికి కొన్ని నెలల కిందటి నుంచి స్వామి ఆరోగ్యం అంత బాగుండటం లేదు. ఆ స్థితిలో కంచినుండి కుంభకోణానికి 165 మైళ్లు కాలిన డకను ప్రయాణం చెయ్యడం ఆయన  ఆరోగ్యానికి మంచిది కాదని శిష్యులు ఆందోళన చెం దారు.

ఏమి చేదామా అని యోచించి యోచించి, తుదకొక పథకం నిర్ణయించారు. మద్రాసు నుంచి ఒక ఘన వైద్యుణ్ణి కంచికి పిలిపించాలనీ, ఆయనచేత స్వామి దేహస్థితి పరీక్ష చేయిం చాలనీ నిశ్చయించారు.

1956 జనవరి నెలలో ఒక ఆదివారంనాడు ఆ భిషగ్వరుడు ఆధునిక పరికరాలన్నిటితో కంచికి బయలుదేరి వచ్చాడు. మద్రాసునుంచి మరికొందరు స్వామి శిష్యులు కూడా ఆయన వెంటవచ్చారు. అత్యంత అధునాతన పరికరాల సహాయంతో దాదాపు అరగంటసేపు స్వామి దేహస్థితిని ఆమూలాగ్రంగా డాక్టరు పరీక్ష చేశాడు.

పరీక్ష ఫలితంగా తాను కనుగొన్న విషయాలను గురించీ, ఆరోగ్యం బాగయ్యేందుకు గాను ఇకమీదట స్వామి అనుసరించవలసిన అనుదిన కార్యక్రమం గురించీ వివరించడానికి డాక్టరు సంసిద్ధుడైనాడు.

ఇంతలో, డాక్టరు చెప్పబోయే మాటలకు స్వామి అడ్డువచ్చి, నిదానంగా మంద స్వరం తో ఇలా అన్నారు.

"నా దేహస్థితిని గురించి ఇప్పుడు మీరు ఏమి చెప్పబోతున్నారో, దానిని మీకు నేను వినిపిస్తాను, వింటారా ?"

స్వామి మాటలు విని చుట్టూ మూగిన వారంతా ఆశ్చర్యంతో స్వామి ఏమి చెప్పబోతు న్నారో అని చెవులు నిక్కపొడుచుకున్నారు.

స్వామి చెప్పడం మొదలు పెట్టారు : "స్వామికి పయోరియా అనే పండ్ల జబ్బు ఉన్నది. అందుకుగాను కొన్ని దంతాలను పీకించవలసి ఉంటుంది." ఇదీ మీ రివ్వదలచిన మొదటి సలహా. ఒక వేళ, అది నిజమే కావచ్చు. కాని ఆ దంతాలను లాగివేస్తే ఇక నేను మంత్రాలను సక్రమంగా ఉచ్చరించలేను.

పోతే ఇక నా ఊపిరితిత్తులు రెంటిలో ఒకటి సరిగా పని చెయ్యడంలేదని మీరు చెప్ప దలచుకున్నారు. ఇప్పుడు కాదు, 1930 నుండే అది ఆ స్థితిలో ఉన్నది.

దానికో కథ ఉంది. ఒక రోజున నేను చాలా వేగంగా నడిచాను. ఆనాడు నేనొక నదీ తీరాన నడుస్తూ ఉండగా వానా, సుడిగాలీ వచ్చాయి. వాటిని తప్పించుకోవాలనే ఉద్దేశంతో వడిగా నడవడమే గాక, కాస్తదూరం పరుగెత్తాను కూడా. ఇది 1930 సంవత్సరం మాట.

తరవాత నా పొత్తి కడుపు పేగు విషయం మీరిలా చెప్పదలచుకున్నారు : తరచుగా నేను చేసే ఉపవాసాలవల్లా, వేళాపాళా లేకుండా అకాల భోజనాలు చెయ్యడం చేతా, నా పొత్తి కడుపులో ఒక పేగు సరిగా పనిచెయ్యడంలేదని మీరు కనిపెట్టారు.

ఇంతేగాక, నా ఎదురు రొమ్ములో రక్తం గడ్డకట్టుకు పోయింది.

మీరు చెప్పదలచిన దంతా మీకు నేను సరిగ్గా వినిపించానా? ఏమైనా పొరబడినానా?'' అడిగారు స్వామి.

మద్రాసు నుంచి ప్రత్యేకంగా రప్పించబడిన ఆ వైద్య ప్రవీణుడూ, ఆయనను వెంటబెట్టుకు వచ్చిన పెద్దలూ, అక్కడే ఉండి స్వామి మాటలు విన్న తదితరులూ, అంతా దిగ్భ్రమ చెందారు. ఒక్కరికీ నోటమాటరాలేదు. ఏమి చెప్పాలో ఎవ్వరికీ తెలియలేదు.

డాక్టరు మహాశయుడు మాత్రం మఠం ఉద్యోగుల నుద్దేశించి ''స్వామికి మంచి ఆహారం, వేళకు భోజనం, పూర్తి విశ్రాంతి ఈ మూడూ చాలా అవసరం'' అంటూ సలహా ఇచ్చి, స్వామికి నమస్కరించి, తన సామానంతా సర్దుకుని, తిరిగి మద్రాసుకు బయలుదేరాడు.

ఏమైతేనేం, ఆ సంవత్సరం మాత్రం స్వామి కుంభకోణం ప్రయాణం చెయ్యడానికి వీలులేదని శిష్యులంతా పట్టుబట్టారు. వారి మాటను కాదనలేక, ఆ యేడు స్వామి కుంభకోణం ప్రయాణం రద్దుచేసుకుని కంచిలోనే ఉండిపోయారు.

మహామాఖంనాడు కుంభకోణం నుంచి కారులో పవిత్రోదకాలు తెప్పించి స్వామిని ఆ నీటితో స్నానం చేయించారు.

కొన్ని వారాలు గడిచిన పిమ్మట, ఏ వైద్య సహాయమూ లేకుండా, స్వామికి ఎప్పటి వలె మామూలు ఆరోగ్యం చేకూరింది.

ప్రాచీనమైనదంతా పరిగ్రాహ్యం కాదు

ప్రాచీన, పాశ్చాత్య సంస్కృతుల సమన్వయం నేడు మన ముందున్న ప్రశ్న. ఆధునిక జగత్తులోని మంచికి ప్రాచీన సంస్కృతి ఏనాటికీ వ్యతిరేకి కాదు. 'పురాణమిత్యేవన సాధుసర్వం,'ప్రాచీనమైనంత మాత్రాన దానినే సంపూర్ణంగా గ్రహించ నక్కరలేదు. ప్రాచీనతతోబాటు ,ఉత్తమమైన నవీనత్వాన్ని కూడా స్వీకరించాలి. ప్రతి యువకుడూ ఈ రెంటి సమన్వయాన్ని సాధించడం కళ్యాణప్రదం.

# కంచిస్వామి - వినోబా భావే

ఇరువురు మహాపురుషులు సమావేశమై మాట్లాడుకున్నప్పుడు లోకానికి వారొక కొత్త వెలుగు చూపిస్తారు. ఒక నవీన సందేశాన్ని వినిపిస్తారు.

కామకోటి పీఠాధిపతి, ఆచార్య వినోబాభావేల మధ్య జరిగిన సంభాషణ అందుకు చక్కని ఉదాహరణ.

శ్రీ వినోబాభావే గాంధి అనుయాయులలో ప్రథమ శ్రేణిలోని వారు. భూదానోద్యమ నాయకులు. అయినా, కేవలం రాజకీయనాయకుడే కాడు. బహుశ్రుతుడు. బహుభాషాకోవిదుడు.

కాషాయం కట్టలేదు, కౌపీనం పెట్టలేదేగాని, ఆజన్మ బ్రహ్మచారి. సర్వసంగ పరిత్యాగి. కారాగృహంలో భగవద్గీతకు భాష్యం చెప్పిన తత్త్వజ్ఞుడు.

జజజజజజ

1956 జూన్ నెల 7వ తేదీన మూడురోజుల ఉపవాసానంతరం శ్రీవినోబాభావే దక్షిణ దేశంలో తన పర్యటన ప్రారంభించారు. కంచికి నాలుగున్నర మైళ్లదూరంలో కలకత్తూర్ అనే పల్లెటూరుకు బయలుదేరుతూ "ఇప్పుడు ఎన్ని గంటలు?" అని తన సహచరులను అడిగారు వినోబా. "ఏడున్నర అయింద"ని వారు సమాధానం చెప్పారు.

"చూశారా! ఇంచుమించు ఇదేవేళ ఇప్పటికి నలభై ఏళ్ల కిందట, మొట్టమొదటిసారి బాపుజీని (మహాత్మగాంధి) నేను సందర్శించాను" అన్నారు శ్రీ భావే.

నాలుగు దశాబ్దాల అనంతరం అదే జూన్ నెల7వ తేదీన, ఆనాటి సమావేశం శ్రీవినోభా స్ఫురణకు వచ్చింది.

అంతకంటే విశేషమేమంటే, 40 ఏళ్లక్రితం వినోబాజీ మహాత్మాగాంధిని ప్రథమంగా సందర్శించగా, సరిగ్గా అదేరోజు - జూన్ 7 తేదీన - మరొక మహా పురుషుని, కామకోటి పీఠాధిపతి శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతిని సందర్శించబోవడం!

జజజజజజ

మహనీయులిరువురూ ఒక చిన్న పూరిపాకలో సమావేశమైనారు. ఇద్దరి సంభాషణా కొన్ని నిమిషాల్లో ముగిసింది. సంభాషణ సంస్కృతంలో జరిగింది.

'నారాయణ నారాయణ' అంటూ, నారాయణ స్మరణతో స్వామి, వినోబాకు స్వాగతం పలికారు. తమ పక్కనే కూచోబెట్టుకున్నారు. వారి ఆరోగ్యం గురించి కుశల ప్రశ్న చేశారు.

స్వామి: ఇక్కడికి రావడంలో మీకేమీ శ్రమ కలగలేదు కదా? మీకు ఆటంకం లేకుంటే ఇక్కడ మఠంలోనే మీరు బస చెయ్యవచ్చు.

వినోబా: మీ దర్శనానికే నే నిక్కడికి వచ్చాను. మీ ఆశీస్సు కోరుతున్నాను.

స్వామి: నారాయణ, నారాయణ!

"పరుల సేవవల్ల ప్రపంచం అంతగా ఉద్ధరించబడుతున్నట్టు నాకు తోచదు. ఒక్కొక్క వ్యక్తీ తన ప్రవృత్తినిబట్టి, తన మనోభావాల ననుసరించి సమాజానికి సేవచేస్తాడు. అది ఆక్షేపణీయం కాదు. అయితే, లోకులకు తాను ఏ ఉపకారం చేసినా, అది కేవలం తన చిత్తశుద్ధికేననీ, ఆత్మోద్ధరణకేననీ అతడు భావించాలి. అదే తన లక్ష్యం కావాలి.

ఇతరుల వల్ల ఏవిధమైన ఉపకారం పొందని వాళ్లు లోకంలో ఎందరో ఉన్నారు. వారంతా తమ జీవితాలను యథోచితంగా కొనసాగిస్తూనే ఉన్నారు.

మాటవరసకు, అడవుల్లో మృగాలూ, పక్షులూ అసంఖ్యాకంగా జీవిస్తున్నవి. వాటన్నిటికి ఎవరు సహాయం అందిస్తున్నారు? వాటి జీవిత సరళిని క్రమబద్ధం చెయ్యడానికి ఒక సంఘం ఉన్నదా? ఒక ప్రభుత్వం ఉన్నదా? అయినా, ఆ ప్రాణులన్నీ మానవులకంటె సుఖంగానే బతుకుతున్నవి.

సమస్త జీవరాశిలో పరమాత్మ అంతర్యామిగా ఉంటూ లోకాన్ని నడుపుతున్నాడు. సంఘంలో ఉండే ప్రతివ్యక్తీ తన విధాయక ధర్మ మేదో తెలుసుకుని, స్వధర్మాన్ని నిర్వర్తించినట్లయితే, అదే పరమేశ్వరుడికి నిజమైన సేవ".

శ్రీ వినోబా: నేను కూడా అదే అభిప్రాయంతో ఉన్నాను.

స్వామి: నారాయణ, నారాయణ! నా కెంతో సంతోషం.

*మరి రెండు ఉపమానాలు :*

శ్రీస్వామి శ్రీవినోబాకు ఈ క్రింది రెండు ఉపమానాలు కూడా వినిపించారు.

చెట్టును పోషించాలంటే చెట్టుకుదుట్లో నీరు పోస్తే చాలు. చెట్టు తాలూకు వేళ్ల ఆ నీరు తాగి, కొమ్మలకూ రెమ్మలకూ, ఆకులకూ మొగ్గలకూ అన్నింటికీ ఆహారం అందజేస్తాయి. ప్రత్యేకం ఒక్కొక్క ఆకుకూ, ఒక్కొక మొగ్గకూ ఆహారం అందించ నక్కరలేదు.

నోటితో మనిషి భుజిస్తాడు. అయినా, అతని చెవి, ముక్కు, కళ్లు, కాళ్లు అన్నిటికీ ఆహారం అందినట్టే ! ఈ సృష్టి సమస్తం శ్రీ మన్నారాయణుని అవయవాలు మాత్రమే !

జీవు లంతా పరమాత్మ ప్రతిబింబాలు. పరమాత్మను అలంకరిస్తే జీవులందరినీ అలంకరించినట్టే. లోకసేవ చెయ్యడానికి భగవత్సేవ సులువైన మార్గం.

'సర్వేజనాః సుఖినోభవంతు' అని దేవుణ్ణి ప్రార్థిస్తాము" అన్నారు స్వామి.

"స్వామి నాకు భగవంతునితో సమానుడు , కాదు, భగవంతుడే" అంటూ ఆచార్య వినోబా స్వామివద్ద సెలవు పుచ్చుకున్నారు.

భక్తి ద్వారా ముక్తి

శాస్త్రచోదితకర్మలను మనం విధిగా చేయవలసి ఉంది. ఇది అవసరమా, అనవసరమా అన్న ప్రశ్నలకు తావులేదు. ఇలా కర్మానుష్ఠానం చేసిన తర్వాత క్రమంగా మనకున్న రాగద్వేషాలు క్షీణించి, చిత్తశుద్ధి ఏర్పడి, మనస్సు సమాహితమై ఈశ్వరానుసంధాన పటిష్ఠమవుతున్నది. ఇదే భక్తి. ఇది రెండవ స్థితి. భక్తి పెరిగితే జ్ఞానప్రాప్తి. అది చరమస్థితి.

అందుచేత భక్తిని వదలి ముక్తి కోసం ప్రత్యేకం పాకులాడవలసిన పనిలేదు. మనలోని భక్తే తుదకు ముక్తిని అందిస్తుంది. భక్తి కోసం భగవంతుణ్ణి ప్రార్థిస్తే చాలు. అందుకే మహానుభావులందరూ భక్తి ప్రాధాన్యాన్ని ఉద్ఘాటిస్తూ, 'భక్తి భిక్షను పెట్టవే' అని అమ్మవారిని ప్రార్థిస్తూ ఉంటారు. ఆ భక్తి మనకు లభించిందంటే ముక్తి కరతలామలకమే.

# "గ్రంథగ్రంధులు"

కవిగా, రచయితగా శ్రీగుంటూరు శేషేంద్రశర్మగారు సుప్రసిద్ధులు. ప్రాచీన, నవీన కవి తారీతులలో సిద్ధహస్తులు.

1959 నుంచి పదిసంవత్సరాలు విజయవాడలో 'ఆంధ్రప్రభ'కు నేను ఎడిటర్‌గా ఉన్న ప్పుడు శ్రీ శేషేంద్రశర్మగారు సాహిత్యపరమైన అనేక రచనలు గద్య పద్య రూపంలో వ్రాశారు. వాటిని నేను ప్రచురించాను. పాఠకులు ఆసక్తితో చదివారు.

సంస్కృతంలో శ్రీహర్షుడు రచించిన నైషధకావ్యాన్ని 'నైషధమ్ విద్వదౌషధమ్' అని ప్రసి ద్ధిగా చెప్పుకుంటారు. విద్వాంసులకు అది ఔషధం వంటిది. ఆ కావ్యంలో 'గ్రంథ గ్రంధులు' గా పేర్కొనబడిన కొన్ని భాగాలున్నవని పండితులకు తెలుసు.

నైషధాన్ని తెనిగించిన శ్రీనాథ మహాకవి వాటి జోలికి పోలేదు.

సంస్క ృత నైషధానికి వ్యాఖ్య వ్రాసిన మల్లినాధసూరి సైతం ఏ కారణం చేతనో వాటిని స్ప ృశించకుండా వదిలిపెట్టాడు. పిమ్మటనైనా, విద్వాంసులెవ్వరూ ఆ ముడులు విప్పడానికి ప్రయత్నంచలేదు. అంతంతమాత్రాన అవి కొరుకుడుపడేవి కావట!

'అట' ఏమిటి ? శ్రీహర్షుడే తన కావ్యంలో వాటిని గురించి ప్రతిజ్ఞా పూర్వకంగా ఇలా చెప్పుకున్నాడు.

గ్రంథగ్రంధి రిహ క్వచిత్ క్వచిదపిన్యాసి ప్రయత్నా న్మయా
ప్రాజ్ఞ మ్మన్యమనా హఠేన పఠనాత్ మాస్మిన్ ఖలః ఖేలతు
శ్రద్ధారాద్ధగురుః శ్లథీకృత దృఢగ్రంథిః సమాసాదయ
త్యేతత్ కావ్యరసోర్మి మజ్జన సుఖవ్యాసజ్జనం సజ్జనః ॥

"ఈ గ్రంథంలో నేను అక్కడక్కడ కొన్ని క్లిష్టమైన ముడులను ప్రయత్న పూర్వకంగా కావాలని ప్రయోగించాను. తానే పండితుడ నని భావించుకునే మూఢుడు ఈ కావ్యంలో ప్రవే శించి ఆటలాడడానికి యత్నించవద్దు. శ్రద్ధతో గురువును పూజించి, గురువు అనుగ్రహంతో

నేను ప్రయోగించిన ఆ ముళ్లను విప్పుకోగల సజ్జనుడు మాత్రమే ఈ కావ్యామృతంలో తానమాడి సుఖించుగాక!"

ఆత్మస్తుతి అయితే కావచ్చునేమోగాని, ఏ మహాకవి అనగలడు ఆ మాట !

ఒకనాడు శ్రీ శేషేంద్రశర్మగారు మా కార్యాలయానికి వచ్చారు. నాతో ఇలా ముచ్చటించారు.

శ్రీహర్షుడు నైషధం వ్రాసి ఎన్నో శతాబ్దాలు గడిచాయి. బహుశా 11వ శతాబ్ది. మల్లినాధ సూరి ప్రభృతులు దానికి వ్యాఖ్యలు వెలయించికూడా దీర్ఘకాల మయింది. శ్రీనాధుడు శృంగారనైషధం రచించే శతాబ్దాలు దాటాయి.

నైషధానికి వ్యాఖ్యానాలు వ్రాసిన మల్లినాధ, నారాయణ, శేషరామచంద్ర, విశ్వేశ్వర భట్టాదులలో ఏ ఒక్కరుగానీ అందులోని గ్రంథగ్రంధుల జోలికి పోలేదు.

శ్రీహర్షుడు 'చింతామణి' మహామంత్రోపాసకుడు కావడంచేత, ఆ ఉపాసనాబలంతో అన్యులెవ్వరూ అర్థం చేసుకోడానికి అలవిగాని గ్రంథులను తన కావ్యంలో నిబంధించాడు.

ఆశ్చర్యంతో నే నిలా అన్నాను, "అయితే, ఆ ముళ్లను విడదీయగల పండితులు ఇంతకు ముందు పుట్టలేదు, ఇక ముందు పుట్టబోరు అంటారా, శర్మగారూ"?

శ్రీ శర్మగారు : ఆ మాట నే ననను. కాని, ఇంతవరకు ఇతరులెవ్వరూ సాహసించని ఆ పని, నేను సాధించాను. మీరు ప్రచురిస్తానంటే వాటిని గురించిన నా వ్యాసాలు 'ప్రభ' కు ఇస్తాను.

నేను: అంతకన్నానా ! ఇంతవరకు కొమ్ములు తిరిగిన ఏ పండితుడూ చేయిచేసికోని ఆ కార్యం మీరు సాధించినప్పుడు, దాన్ని వెలుగులోకి తేవడంకంటె మించిన దేముంటుంది? తప్పక మీరు రాయండి. నేను ప్రచురిస్తాను.

శ్రీశేషేంద్రశర్మగారి వ్యాసాలు వరసగా 'ఆంధ్రప్రభ'లో వెలువడ్డవి. సాధారణ పత్రికా పాఠకులేగాక, పండితులు కూడా చదివారు. వాటిని గురించి కొందరు పండితుల అభిప్రాయా

లు అడిగాను. అంతకుపూర్వం ఎవ్వరూ ఆ గ్రంథుల చిక్కు విప్పడానికి యత్నించినట్టు తాము చూడలేదని వారంతా అంగీకరించారు.

1968లో శ్రీకామకోటి శంకరాచార్యస్వామి చంద్రశేఖరేంద్ర సరస్వతి హైదరాబాద్ విచ్చేసి, అక్కడే చాతుర్మాస్యం జరిపారు.

ఆ సందర్భంలో ఒక మిత్రుని వెంటబెట్టుకొని శ్రీశేషేంద్ర శర్మగారు స్వామిదర్శనం చేశారు.

స్వామివారికి తనను పరిచయం చేసికొని, శ్రీహర్షుని నైషధంలోని గ్రంథ గ్రంథులపై ఓంప్రథమంగా తాను వ్యాఖ్యానం వ్రాశానని శ్రీ శర్మగారు స్వామికి విన్నవించారు. అటు తరువాత తన అనుష్ఠానానికి సంబంధించిన కొన్ని సందేహాలను స్వామికి చెప్పి, వాటిని నివారణ చేసుకున్నారు.

సెలవు పుచ్చుకుని శ్రీ శర్మగారు బయటికి వచ్చే లోపల, స్వామి తాము కూర్చున్న చోటి నుంచి లేవకుండానే, ఒక పుస్తకం శ్రీ శర్మగారి చేతి కిచ్చి, ఆ పుస్తకంలో "ఫలానా పేజీ తిప్పండి, అందులో ఏ మున్నదో చదవండి" అన్నారు.

స్వామి చెప్పినట్టు చేశారు శర్మగారు.

నైషధంలోని గ్రంథ గ్రంథులను గురించిన వివరణే ఆ పుస్తకంలో, ఆ పుటలలో ఉన్నది!!!

విశేష మేమంటే, స్వామివారితో తాను జరిపిన ఈ సంభాషణ అంతా, మొట్టమొదటి సారిగా నాకు వినిపించింది శ్రీ శేషేంద్రశర్మగారే!

కొన్ని క్షణాలు నేనూ, శర్మగారూ మాట లుడిగి మౌనంలో, ఆశ్చర్యంలో మునిగిపోయాము!

"మౌనం ఎడతెగని సంభాషణ" అంటారు రమణమహర్షి.

జజజజజజ

గ్రంథగ్రంథులను గురించి పూర్వం ఎవరూ వ్యాఖ్యానించ లేదని శ్రీ శేషేంద్రులు మొద ట నాతో చెప్పినా, స్వామివారు తన కా పుస్తకం చూపించిన పిమ్మట, తనకు తానే స్వయంగా నా వద్దకు వచ్చి విషయమంతా సవిస్తరంగా నాకు తెలియజేశారు.

ఇది శ్రీ శర్మగారి సౌజన్యానికీ, నిరహంభావనకూ నిదర్శనం.

పోతే, అంతవరకు పండితలోకానికి అజ్ఞాతంగా ఉన్న ఈ కఠిన సమస్యను స్వామి ఉన్నపళంగా ఎలా పరిష్కరించగలిగారు?

ఆనాడు శేషేంద్ర శర్మగారు తమ దర్శనానికి రా నున్నారని స్వామికి ముందుగా తెలి యదు. శ్రీహర్షుని గ్రంథ గ్రంధులను గురించి ఆయన తమతో ప్రస్తావించబోతున్నారని అంత కంటే తెలియదు. ఆ పరిస్థితిలో గ్రంథ గ్రంధుల వివరణ ఉన్న పుస్తకం స్వామి వద్ద సిద్ధంగా ఉండడం ఎలా సంభవించింది.

ఎవరా గ్రంధుల ముడివిప్పిన మహా పండితుడు?

ఈ ప్రశ్నలకు సమాధానాలు స్వామికే తెలియాలి!

స్వామి సర్వజ్ఞతకూ, అలౌకిక ప్రజ్ఞకూ ఇంతకంటె ప్రబల సాక్ష్యం ఏ ముంటుంది?

జజజజజజ

*పోతన పద్యానికి మూలం?*

ఇలాంటిదే, పోతన భాగవతంలోని ఒక పద్యానికి సంస్కృతమూలశ్లోకాన్ని ఒకానొక ఆభాణకం నుంచి త్రవ్వితీసి, మహాకవి పుట్టపర్తి నారాయణాచార్యులగారికీ, పోతన భాగవ తాన్ని హిందీలోకి అనువదిస్తున్న శ్రీ వారణాసి రామమూర్తి (రేణు) గారికీ స్వామి వినిపించారు.

గజేంద్ర మోక్షం ఘట్టంలోని-

*“తన వెంటన్ సిరి లచ్చివెంట నవరోధ వ్రాతము న్దాని వె*

*న్కను పక్షీంద్రుడు వాని పొంతను ధనుఃకౌమోదకీ శంఖచ*

*క్రనికాయంబును నారదుండు ధ్వజినీకాంతుండు దావొచ్చిరొ*

*య్యన వైకుంఠ పురంబునం గలుగు వారాబాల గోపాలమున్"*

అనే పద్యాన్ని రామమూర్తిగారు చదవగానే, దానిని విని స్వామి, ఇదే మోస్తరుగా సంస్కృతంలో ఒక అభాణకం ఉన్నదనీ అది పోతన కాలానికి పూర్వపుదే అయితే, బహుశా పోతన దానిని చూచి ఉండవచ్చు నని అన్నారు.

ఆ అభాణకం గురించి తాము విననే లేదనీ, దానిని శ్రుతపరచండనీ పుట్టపర్తివారు అభ్యర్థించారు స్వామిని.

ఒకటిరెండు నిమిషాలు ఆగి, స్వామి ఇలా చదివారు:

*"లీలాలోలతమాం రమా మగణయన్ నీలా మనాలోకయన్*

*ముంచన్ కించ మహీం, అహీశ్వర మయం ముంచన్ హఠాద్వంచయన్*

*ఆకర్షన్ ద్విజరాజమప్యతిజవాత్ గ్రాహాచ్ఛ సంరక్షితుం*

*శ్రీగోవింద ఉది త్వరత్వర ఉదైత్ గ్రాహగ్రహార్తం గజమ్"*

ఈ శ్లోక మొకటి ఉన్నట్టు పుట్టపర్తివారికీ, 'రేణు'గారికీ తెలియదు. తెలియని వారింకెందరో!

జజజజజజ

**బౌద్ధులు పాషండులా?**

బౌద్ధులు మనం అనుకునే టంత పాషండులు కారు శ్రీహర్షుడనే రాజు రత్నావళి, నాగానందం, ప్రియదర్శిక అనుమూడు నాటకాలు రచించాడు. ఒక గ్రంథారంభంలో శివుని, మరొకదానిలో విష్ణుని, ఇంకోదానిలో  బుద్ధుని స్తోత్రం చేసినాడు. బుద్ధుడు కేవలం పాషండుడే అయినట్లయితే, ఆ రాజు శివకేశవులతోపాటు బుద్ధుని ఏల స్తుతిస్తాడు? బౌద్ధమతస్థులందరూ కేవలం మన మతధర్మాలకు విరుద్ధులని చెప్పరాదు.

# జగద్గురు ప్రశస్తి

అద్వైతినో ద్వైతిన ఏవమన్యే వై దేశికా అన్యమతానుగాశ్చ,

దీప్తిం లభన్తేయము పేత్య భక్త్యా జగద్గురుస్సోఽత్ర కుతోస్తి శంకా.

ద్వైతులూ, అద్వైతులూ, ఇతర మతస్థులు కూడా స్వామిచే ఉద్దీపితులవుతున్నారు. జగద్గురుత్వం వీరి యందు పూర్తిగా సార్థకం.

గ్రామే గ్రామే భక్తవర్యా స్తదీయా గేహేగేహే రూపచిత్రం తదీయం

కాంచీపీఠం మండ్యతే కేవలం నో ఏతేనాహో లోకహృత్పీఠికాఽపి.

ప్రతి గ్రామాన స్వామి భక్తులు. ఇంటింటా చిత్రపటం. కాంచీ పీఠాన్నే కాదు, మన హృదయ పీఠాన్ని కూడా స్వామి అలంకరిస్తున్నారు.

మయ్యేవ పూర్ణాఽస్తి గురోర్దయేతి సర్వస్య శిష్యస్య నిరూఢభావః,

తథా విభక్తాఽపి దయాఽవ్యయాఽస్య సర్వేశ్వరోఽమేయదయోహి నాఽన్య.

'నాయందే స్వామికి పూర్ణమైన దయ' అని ప్రతి శిష్యునికీ అనిపిస్తుంది! తరుగని దయ స్వామిది. అది సాక్షాత్తు పరమేశ్వరుని లక్షణమే కదా!

భక్తాళి వాంఛా, పరిపూర్తిదక్షాః సన్తేవ లోకే బహవో మహాన్తః,

భక్తాంస్తు పుణ్యే పథియోజయన్త ఏతాదృశాః పూజ్యతరాః కతీహ?

తమ మహిమచే శిష్యుల కోరికలు తీర్చగల గురువులు ఎందరో ఉన్నారు. కాని, ఈ స్వామి వలె శిష్యులను పుణ్యమార్గంలో ప్రవేశపెట్టగల వారు అరుదు.

* * * * * *

# దేవుడు చేసిన పెళ్ళి

"ఇవాళ మా అమ్మాయి పుట్టినరోజు, తమ ఆశీస్సులు అర్థిస్తున్నాము."

1967 మే మాసంలో విజయవాడ శ్రీ వెంకటేశ్వర ఆలయం వద్ద చాతుర్మాస్యం జరుపుతున్న కామకోటి పీఠాధిపతి శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి స్వామివారిని ప్రార్థించాము నేనూ, నా భార్యా, కుమార్తె లక్ష్మిని వెంటబెట్టుకు వెళ్ళి.

"అట్లా కూచోండి పిలుస్తా" అన్నారు స్వామి. భక్తులందరూ స్వామి దర్శనం చేసిన తరువాత స్వామి మమ్మల్ని రమ్మనారు. అది మామిడిపళ్ళ కాలం, బంగారంలా మెరిసిపోతున్న ఒక మామిడిపండూ, ఇన్ని అక్షింతలూ లక్ష్మి దోసిట్లో పోసి 'శుభం వెళ్ళిరాండి' అన్నారు.

సంతోషంతో ఇంటికి వచ్చాము. పిండివంటలతో పండగ చేసుకున్నాము.

మా లక్ష్మి విజయవాడ మేరిస్టెల్లా కాలేజీలో ఆ సంవత్సరం బీఏ పూర్తిచేస్తున్నది. కాలేజికి సెలవులు కావడం వల్ల రోజూ స్నేహితురాళ్ళతో కలిసి వెంకటేశ్వరస్వామి గుడికి వెళ్ళి స్వామివారు చేసే చంద్రమౌళీశ్వరుని పూజలు చూస్తుండేది. సాయంత్రం వారి ప్రవచనాలు వింటూ ఉండేది.

ఒకరోజు ఉయ్యూరు నుండి ఒక భక్తురాలు స్వామి దర్శనం కోసం ఆలయానికి వచ్చి మా లక్ష్మిని చూసింది. "ఎవరమ్మాయివి?" ఏం చదువుతున్నావు? నీకు వివాహమయిందా?" ఇలాంటివే కొన్ని ప్రశ్నలు లక్ష్మి నడిగింది. కొన్నిటికి లక్ష్మి సమాధానం చెప్పింది. కొన్నిటికి మౌనం వహించింది.

విదేశాల్లో ఇంజనీరింగ్ చదువుతున్న ఆ భక్తురాలి కుమారుడు సెలవుపై స్వదేశానికి తిరిగి వచ్చాడు. వివాహం చేసుకుని తిరిగి ఇంగ్లండుకు వెళదామనుకుంటున్నాడు. హైద్రాబాదులో అన్నదమ్ములంతా కలిసి, తగిన సంబంధాలు వెతుకుతున్నారు.

జగద్గురువును సందర్శించి ఇల్లు చేరిన ఆ భక్తురాలు హైద్రాబాదుకు ఫోనుచేసి, తన కుమారులతో మాట్లాడింది. "విజయవాడలో నిన్న శ్రీ శంకరాచార్యుల వారి దర్శనానికి వెళ్లి, అక్కడ ఒక అమ్మాయిని చూశాను. 'ఆంధ్రప్రభ' ఎడిటరుగారి కూతురట. బి.ఏ చదువుతున్నది.

మనవాడికి ఇంతవరకు చూచిన సంబంధాలలో ఏదీ ఖాయం చేసుకోకపోతే, ఈ అమ్మాయి సంగతి విచారించండి, నీలంరాజు వారట. మనశాఖే ననుకుంటా"

*****

ఆ మర్నాడు ఉదయం ఇంటివద్ద నేను పేపరు చూసుకుంటున్నాను. హైద్రాబాద్ నుంచి ముగ్గురు వ్యక్తులు వచ్చారు. "మాది ఉయ్యూరు. ఇతడు మా తమ్ముడు. ఇంగ్లండులో ఇంజనీరింగ్ చదువుతున్నాడు. వివాహం చేసుకుని తిరిగి వెళదామని సెలవుపెట్టి స్వదేశానికి వచ్చాడు"

"మిమ్మల్ని గురించి విన్నాము. మీతో వియ్యమందాలని కోరుతున్నాము" అంటూ తమను గురించీ, తమ వంశ గౌరవాన్ని గురించీ, తమ ఆస్తిపాస్తులను గురించీ వివరాలు చెప్పారు, కాస్త అట్టహాసంగానే.

అంతవరకు మా లక్ష్మి వివాహం సంగతి ఎన్నడూ మేము యోచించలేదు. అయిన వారిలో ఏవో కొన్ని సంబంధాల ప్రస్తావన వచ్చినా, అమ్మాయి చదువు ముగిసేవరకూ పెళ్ళి మాట తలపెట్టదలచలేదు.

కాని, ఇప్పుడు ఆలోచనలో పడ్డాను. ఇదేదో మామూలు ధోరణిగా లేదు. దైవికంగా నెట్టుకువస్తున్నట్టు అనిపించింది.

"నిదానంగా, సావకాశంగా మాట్లాడుదాము, మళ్ళా కలుద్దా"మన్నాను వారితో.

ఒకరిద్దరు ఆప్తమిత్రులతో ఆలోచించాను.

"ఉయ్యూరులో వారి కుటుంబం మేము ఎరిగి ఉన్నాం. యోగ్యతగల సంబంధం. ఎందుకు సందేహిస్తారు? ఈ రోజుల్లో ఆడబిడ్డలకు అనువైన మనువులు దొరకడం అంత సులభంగా లేదు. ఒకటి ఉంటే ఒకటి ఉండదు. అన్నీ అనుకూలంగా వున్నా, వేలకు వేలు కట్నాలు కుమ్మరించాలి."

"పైగా, మనం కాలికి బలపం కట్టుకుని ఊరూరా తిరగడానికి బదులు వారికివారే అమ్మాయి కోసం వెతుక్కుంటూ వచ్చారు. కాదనకండి! ఎంత చదువులు చదివినా, ఆడపిల్ల లకు మరీ అంత ఈడు మించడం కూడా మంచిది కాదు" అంటూ సలహా ఇచ్చారు.

కాస్త మెత్తపడ్డాను. ఉయ్యూరు వారితో ఇలా అన్నాను. "మీతో వియ్యమందడానికి మాకు ఇష్టమేగాని, వివాహం విషయంలో నాకు కొన్ని నియమాలున్నవి. వాటిని మీరు అంగీక రించవలసి ఉంటుంది.

"వధూవరుల జాతకాలు సరిపోవాలి. నేనివ్వదలచిన కట్నం మీరు పుచ్చుకోవాలి. అన్నింటినీ మించి, మా గురుదేవులు శ్రీ కామకోటి స్వామివారి అనుమతి నాకు లభించాలి."

కాస్త రాయబారం జరిగిన తరువాత ఉభయులకూ అన్నిటిపై సమాధానం కుదిరింది.

స్వామి వా రప్పుడు ఏలూరు మకాంలో ఉన్నారు. వెంటనే వెళ్ళి స్వామిని సందర్శించి, జరిగినదంతా సంగ్రహంగా విన్నవించాను. మౌనదీక్షలో ఉంటూనే మంత్రాక్షతలు ప్రసాదించి, వరదాభయహస్తంతో అనుమతించారు.

ఆనందంతో ఇంటికి తిరిగివచ్చాను.

పెద్దలు నిర్ణయించిన ముహూర్తానికి ఎంతో వ్యవధి లేదు. ఆదరాబాదరాగా అన్ని ఏర్పాట్లూ చేస్తున్నాము.

గబగబా శుభలేఖలు అచ్చువేయించాము. సన్నాహాలన్నీ త్వరత్వరగా జరుగుతున్నవి.

అయినా ఒక్క సందేహం నన్ను వదలకుండా పీడిస్తూనే ఉన్నది. తన పెళ్ళి విషయం మా అమ్మడితో స్వయంగా నేను ప్రస్తావించలేదు. ఏమైనా యుక్తవయస్సు వచ్చిన బిడ్డకదా! నేనేమి చేసినా, తన క్షేమం కోరి చేస్తానని ఎంత నమ్మకం నామీద ఉన్నా, ఈ విషయంలో ఆమె అంగీకారం లేకుండా స్వతంత్రించి చెయ్యడం భావ్యం కాదు. ఆమె అభిమతం తెలుసు కోకుండా వరుడి తరపు వారితో గంభీరంగా మాట్లాడాను. తీరా, ఆమెతో ముచ్చటిస్తే, "నాన్నా గారూ, నా చదువు పూర్తికాకుండా పెళ్ళి జరగడం నాకు ఇష్టం లేదు" అంటే?

మథనలో పడ్డాను.

ఆ రోజు రాత్రి. ఆలోచనతో చాలాసేపు నిద్రపేట్టలేదు. పన్నెండు దాటింది. కాస్త కును కుపట్టింది.

"నాన్నాగారూ, నాన్నగారూ" అంటూ మా లక్ష్మి వచ్చి నన్ను నిద్రలేపింది.

"ఏమమ్మా, ఈ అర్ధరాత్రి నిద్రపోకుండా ఎందుకిలా వచ్చావు తల్లీ?"

మాట తడబడుతూ ఇలా అన్నది. "నాకిప్పుడు వివాహం చెయ్యడమే మీ నిశ్చయమైతే, ఎవరైనా సరే, స్వామివారి భక్తుల కుటుంబంలో ఇచ్చి చెయ్యండి నన్ను" అన్నది.

అర్ధరాత్రి లక్ష్మి ఇలా వచ్చి, నన్ను నిద్రలేపి, తన అభిప్రాయం ఇలా తెలుపుతుందని ఎన్నడూ నేను ఊహించలేదు.

మనస్సు నొచ్చకుండా మా లక్ష్మికి ఎంత నచ్చజెప్పవలసి వస్తుందో, నా అంతర్యాన్ని ఎంత చిత్తశుద్ధితో ఆమెకు తెలియజేయలో అని ఆందోళన చెందుతున్న నాకు ఆమె మాటలు అమృతప్రాయమైనవి. నా గుండెలమీద బరువు తొలగింది.

"పిచ్చితల్లీ,ఈ విషయంలో నీ ఇష్టానికి విరుద్ధంగా ఎన్నడైనా, ఏ పనిగాని నేను చేస్తానా? వెళ్లి నిశ్చింతంగా నిద్రపో!" అంటూ మరేమీ చెప్పకుండా పంపించాను.

ఆ రాత్రి స్వామినీ, నా ఇష్టదైవం రామునీ తలచుకుంటూ సుఖంగా నిద్రించాను.

మా లక్ష్మి ఇలా వచ్చి ఎన్నడూ నాతో మాట్లాడి ఎరగదు. ఏ విషయమైనా తన తల్లిచేత చెప్పించేది. అలాంటిది, ఆనాడు అంత ధైర్యంగా నాతో అట్లా మాట్లాడిందంటే, ఆ మాట మా లక్ష్మి మాట కాదు. గురుదేవుని వాణి!

ముఖ్యబంధువు లందరూ ముందుగానే వచ్చారు. మిత్రులన్నిటా సహకరించారు. పెద్దలు పెట్టిన ముహూర్తానికి పెళ్ళి ముచ్చటగా జరిగింది. వేదవిదులూ, పండితులూ వధూవ రులను ఆశీర్వదించారు.

తలవని తలంపుగా జరిగిన ఈ కథంతా నెమరు వేసుకుంటే ఇది గురు కటాక్షమే తప్ప, మానవ ప్రయత్నం ఏమాత్రం కాదని నాకు రూఢి అయింది.

* * * * *

ఇదే ఒక లీలగా కనిపిస్తే, అంతకంటే అద్భుతావహం ఆ తరువాత జరిగిన ఘట్టం!

వివాహం పూర్తి కాగానే నూతన దంపతులకు స్వామి దర్శనం చేయించి, శ్రీవారి ఆశీస్సులు అందజెయ్యాలి అనుకున్నాను. స్వామి అప్పుడు పశ్చిమ గోదావరి జిల్లా క్షణముక్తే శ్వరంలో ఉన్నారని తెలిసింది. తక్షణం కారులో వధూవరులను వెంటబెట్టుకుని అక్కడికి బయలుదేరాను.

ముక్తేశ్వరం చేరేసరికి అప్పుడే గోదావరి దాటడానికి స్వామి సిద్ధంగా ఉన్నట్లు తెలిసింది. డ్రైవరు కారు వేగం హెచ్చించాడు. స్వామి పల్లకిలో కూర్చున్నారు. బోయిలు పల్లకిని బుజాల కెత్తుకుని బయలుదేరబోతున్నారు. గబగబా నేను పల్లకి వద్దకు నడిచాను. నమస్కారం చేసి, ‘‘అల్లుణ్ణీ, అమ్మాయినీ వెంటబెట్టుకువచ్చాను’’ అన్నాను.

మందహాసం చేశారు స్వామి. పల్లకి ఆపారు బోయిలు.

అల్లుడూ, కూతురూ స్వామికి ప్రణమిల్లారు. ఇన్ని అక్షతలు తీసి వరుడి ఉత్తరీయంలో పోశారు. పల్లకి బయలుదేరింది గోదావరి నదికేసి.

నా మనోరథం ఈడేరింది. అన్నీ సలక్షణంగా జరిగాయి. ఆనందంతో ఇంటికి తిరిగి వచ్చాము.

మంచిరోజు చూసి, వధూవరులిరువురూ ఇంగ్లండుకు పయనమైనారు. ఇంగ్లండు చేరినట్టు కేబుల్ కూడా వచ్చింది.

*****

ఆ తరువాత అల్లుడిగారిలో జరిగిన పరిణామమే ఆశ్చర్యజనకం. బాల్యంలో ఉపన యనమప్పుడు పురోహితుల వద్ద నేర్చుకుని, ఎన్ని రోజులు సంధ్యావార్చారో ఏమోగాని, ఇంగ్లీషు చదువులు చదివిన ఆధునిక బ్రహ్మచారు లనేకుల ధోరణిలో, ఈయనగారు కూడా అటు తరు వాత సంధ్యకు స్వస్తి చెప్పడం సంభవించింది.

అలాంటి యువకుడు వివాహానంతరం, స్వామిని సందర్శించిన తరువాత విదేశంలో రెండు వేళలా సంధ్యావార్చడం ప్రారంభించాడు!

కొంతకాలానికి చదువు ముగిసింది. బొంబైలో ఒక ప్రఖ్యాత ఇంజనీరింగ్ కంపెనీవారు, ఇంగ్లండ్‌లో చదివిన ఇంజినీరింగ్ పట్టభద్రులకు తమ కంపెనీలో ఉద్యోగాలిచ్చి, ఇండియాకు పిలిపించుకున్నారు. ఈ విధంగా సెలెక్టు అయిన వారిలో మా అల్లుడు ఒకరు.

స్వదేశానికి తిరిగి వచ్చింది మొదలుకొని, ఆయన త్రికాల సంధ్యావందనం, నిత్యాగ్ని హోత్రం చేస్తూ, ఉద్యోగంతో పాటే రోజుకు సుమారు ఆరుగంటలు అనుష్ఠానంలో ఉంటారు.

పలు సంవత్సరాలు విదేశాల్లో నివసించి, వేషభాషల్లో పాశ్చాత్యులను అనుకరిస్తూ వచ్చిన ఈ నవనాగరికునిలో ఈ పరిణామం రావడానికి కారణభూతులెవ్వరో ప్రత్యేకించి నేను చెప్పనక్కరలేదు.

స్వామి ప్రకృతి శక్తులను వశపరచుకుంటారు. సృష్టికి ప్రతిసృష్టి చేస్తారు. విశేషించి, మానవ ప్రకృతినే మార్చివేస్తారు. దానవుడు మానవుడవుతాడు. నరుడు నారాయణుడౌతాడు!

### మత ప్రాధాన్యం

మత మొక్కటే ప్రజాసమూహాన్నీ, దేశాన్నీ కూడగట్టగలదు. ఏకాత్మభావం, ఏకధర్మం - వీని నుండి శాశ్వతమైన ఐక్యత పుట్టి వర్ధిల్లుతుంది. మానవేతిహాసాన్ని పరిశీలిస్తే, మతం కంటె అధికమైన సంఘటన శక్తి మరొకటి లేదని తెలుస్తుంది.

# డాక్టర్లను ‘చిత్తు’ చేసిన స్వామి దివ్యశక్తి

1964లో నా రెండవ కుమారుడు మురళీధరకు ఊపిరి తిత్తులకు సంబంధించిన వ్యాధి కనిపించింది.

విజయవాడలో, గుంటూరులో పేరుగల వైద్యులను సంప్రదించాము. వారు ఎక్స్‌రే ఫోటోలు తీసి పరీక్ష చేశారు. శస్త్ర చికిత్స అవసరమన్నారు. రాయవెల్లూరు మిషన్ ఆస్పత్రిలో పనిచేస్తున్న డాక్టర్ గోపినాథ్ ఈ వ్యాధికి సంబంధించిన శస్త్ర చికిత్సలో చాలా నిపుణుడనీ, ఆయనచేత ఆపరేషన్ చేయించ వలసిందని కూడా సలహా ఇచ్చారు.

మురళిని మద్రాసుకు వెంటబెట్టుకు వెళ్లి అక్కడ డాక్టరులతో సంప్రతించాను. వారు కూడా ఆపరేషన్ అవసరమేనన్నారు. అదైనా, ఆరునెలలు దాటకుండా, ఆ గడువులోపల చేయించవలసిందని సలహా చెప్పారు.

నాకు ఆప్తమిత్రులైన ఒక రిద్దరు వైద్యులు ‘ఈ ఆపరేషన్ అంత ప్రమాదరహితం కాద నీ, ఇతరవిధాల నివారణోపాయం ఏదైనా సాధ్యమయ్యేట్టయితే దానిని అనుసరించడం మంచి ద’ని సూచించారు.

సందిగ్ధంలో పడ్డాను.

ఇన్నిచోట్ల, ఇంతమంది డాక్టరులు ఆపరేషన్ అవసరమని ఏకగ్రీవంగా అభిప్రాయం వెలిబుచ్చిన తరువాత, వారి సలహా త్రోసివేయడం సాధ్యమా? శ్రేయస్కరమా? అయితే, గత్యంతరం?

భగవంతుడి మీద భారం వేసి, రాయవెల్లూరు వెళ్లాము. డాక్టరు గోపినాథ్‌ను సంప్రదిం చాము. ఆయన జాగ్రత్తగా పరీక్షచేసి, ఆపరేషన్ అవసరమేననీ, మార్గాంతరం లేదనీ తేల్చి చెప్పారు.

కొద్దిరోజులలో డాక్టర్ గోపీనాథ్ రాయవెల్లూరు ఆస్పత్రి వదలిపెట్టి, ఢిల్లీ వెళ్లుతున్నాడు. వెంటనే కాకపోతే, ఆరునెలలు మించకుండా ఢిల్లీకి రావలసిందని కూడా సలహా ఇచ్చాడు.

తుదకు, ఆపరేషన్ వాయిదా వెయ్యకుండా రాయవెల్లూరులోనే, గోపీనాథ్ చేతనే ఆప రేషన్ చేయించుకోడానికి నిశ్చయం చేసుకున్నాము. అవసరమైన ఏర్పాట్లన్నీ చేశాము.

అయితే, ఆపరేషన్ చేయించుకునే ముందు కంచికి వెళ్లి, శ్రీచంద్రశేఖరేంద్ర సరస్వతిని దర్శించి, వారి ఆశీస్సును పొంది రావాలనుకున్నాను.

వెంటనే కారులో నేనూ, నా కుమారుడు రాయవెల్లూరు నుంచి కంచికి బయలు దేరాము. కంచి చేరేసరికి సాయంకాలమైంది.

స్వామి మఠంలో లేరు. సర్వతీర్థం సమీపాన ప్రత్యేకంగా ఒక పాకలో ఉంటున్నారు. మేము సర్వతీర్థం వెళ్లే సరికి మసకమసగ్గా ఉంది. అనుష్ఠానాదులు ముగించుకుని స్వామి అప్పుడే పాకలో ప్రవేశించబోతున్నారు. స్వామి వెంట ఇద్దరు శిష్యులున్నారు. శిష్యుల ద్వారా మా రాక స్వామికి ఎరిగించాను. ద్వారం తెరిచి లోపలికి వెళ్లబోతున్నవారల్లా ఆగి, మావైపు తిరగి''ఏమిటి విశేషం'' అన్నారు.

నా రెండవ కుమారుడు మురళీధరకు జబ్బు చేసిందనీ, శస్త్ర చికిత్సకై రాయవెల్లూరు ఆస్పత్రికి వచ్చామనీ, ఆపరేషన్‌కు ముందు తమ ఆశీర్వాదం కోసం కంచి వచ్చామనీ విన్నవిం చాను.

స్వామి: ఏమిటి జబ్బు?

నేను: ఊపిరి తిత్తులకు సంబంధించిన వ్యాధి. ''బ్రాంకియక్‌టాసిస్'' అంటారు. ఊపిరి తిత్తులలో ఎడమ వైపు మచ్చ కనిపించింది ఎక్స్‌రే తీస్తే.

నకనకలాడే లాంతరు వెలుతురులో, ఆ దూరాన్నించే మురళి వక్షస్థలం వైపు చూశారు స్వామి.

''జబ్బు ప్రమాదకరమైనదే అయినా, భయపడవలసిన అవసరం లేదు.ఆపరేషన్ వద్దు. మఠానికి వెళ్లి ప్రసాదం పుచ్చుకుని, ఇంటికి వెళ్లండి'' అన్నారు.

బ్రహ్మదేవుడు ఆయుర్దాయం పొడుగించాడు!

ఇద్దరం స్వామికి సాగిలపడి, సెలవు పుచ్చుకుని, మఠంలో ప్రసాదం స్వీకరించి, రాయ వెల్లూరు వెళ్లి గోపినాథ్‌తో, ఆపరేషన్ వాయిదా వేస్తున్నామని చెప్పి, మద్రాసు మీదుగా విజయ వాడ చేరాము.

ఇది జరిగి నేటికి 26 ఏండ్లు గడిచాయి. ప్రధాన ఆంగ్ల పత్రికలో ఈ చిరంజీవి పాత్రికే యుడిగా పేరుగడించాడు. అతని వయస్సు ఇప్పుడు 54 సంవత్సరాలు. నైష్ఠిక బ్రహ్మచారి. ఇంతవరకు మళ్లా, ఊపిరితిత్తులకు సంబంధించిన వ్యాధి ఏమిటో ఎరగడు.

# ఆ తల్లికి కలిగిన ఆనందం అడుగుతారూ!

కరుణా జలధి కామకోటి చంద్రశేఖరేంద్ర సరస్వతి దయకు పాత్రులైనవారు ఒక వింత అనుభవానికి లోనవుతారు. అది ఎంత ఆనందదాయకమో, అంత ఆశ్చర్యజనకం.

అందుకు చక్కని ఉదాహరణలు రెండు సంఘటనలను తాను కళ్లారాచూసి ఆనందించి, తన ఆనందాన్ని నాకు పంచి యిచ్చిన సహృదయులు, స్వామిభక్తులు 'ఇండియన్ ఎక్స్ప్రెస్' పత్రికావ్యవస్థకు మాజీ జనరల్ మేనేజర్ శ్రీ టి.కె.త్యాగరాజన్!

*****

తంజావూరుజిల్లా పేరాలం జంక్షనుకు మూడు మైళ్లదూరంలో కుడి అనే గ్రామం ఉంది. 1949లో శ్రీచంద్రశేఖరేంద్రసరస్వతిస్వామి ఆ ఊళ్లో నాలుగు రోజులు మకాం చేశారు.

ఆ ఊళ్లో మా అక్కగారున్నారు. పాదపూజ చెయ్యడానికి ఆమె స్వామిపాదులను తన ఇంటికి ఆహ్వానించి, ఆ రోజుకు నన్ను కూడా అక్కడికి రమ్మని కబురు చేసింది.

స్వామి దర్శనం కోసం ఆ ఊరి వాళ్లూ, చుట్టుపక్కల గ్రామస్థులూ, వందలాది ప్రజలు వచ్చారు.

పూజ ముగిసింది. భక్తు లందరికీ స్వామి తీర్థం ఇస్తున్నారు. తీర్థం పుచ్చుకుంటున్న వారిలో బొంబై నుంచి వచ్చిన భార్యా భర్తలు ఇద్దరున్నారు. ఆ రాత్రే వారు తిరిగి బొంబై పోవటానికి ఏర్పాట్లు చేసుకున్నారు. వారితోబాటు, వారి కుమారుడు కూడా ఉన్నాడు, సుమారు 25 ఏండ్ల యువకుడు.

దంపతులిరువురూ తీర్థం తీసుకున్నారు. కుమారుడు తీర్థం కోసం చెయ్యిజాపాడు.

''నీవూ, నీ భార్యా ఇద్దరూ వచ్చి తీర్థం పుచ్చుకోండి'' అన్నారు స్వామి.

ఆ మాట విని తెల్లబోయాడు ఆ యువకుడు. దేనికో తటపటాయిస్తున్నాడు. ఇంతలో పక్కగా నిలిచిన ఆడవాళ్లవైపు నుంచి ఇంచుమించు ఇరవై సంవత్సరాల ఒక యువతి గబగబా ముందుకు వచ్చి, ఆ యువకుడితోపాటు తానూ చేయిజాపింది. ఇద్దరూ కలిసి తీర్థం పుచ్చుకున్నారు.

తీర్థం తీసుకుని ఆ అమ్మాయి ఆ యువకుడి వెంట ఉండకుండా, దూరంగా వెళ్లి నిల బడ్డది.

స్వామి ఆ నలుగురినీ ఆశీర్వదించి, బొంబై వెళ్లండని అనుజ్ఞ ఇచ్చారు.

*****

ఈ తతంగమంతా చూస్తున్న మాకు ఆశ్చర్యం వేసింది.

బొంబై నుంచి వచ్చిన తల్లిదండ్రు లిద్దరికీ స్వామి తీర్థ మివ్వడమేమిటి, కుమారుడు రాగానే, 'భార్యాభర్తలు ఇద్దరూ వచ్చి తీర్థం పుచ్చుకోండి' అని ఆదేశించడం ఏమిటి, ఆ యువ కుడి భార్య, ఎక్కడినుంచో ఊడిపడినట్టువచ్చి, తీర్థం పుచ్చుకుని, తిరిగి దూరంగా వెళ్లి నిల బడడ మేమిటి, నలుగురూ కలిసి బొంబై వెళ్లండని స్వామి వారిని ఆజ్ఞాపించడమేమిటి? ఇదంతా ఏదో వింతగా తోచింది అందరికీ!

బొంబై నుంచి వచ్చిన ఆ పెద్దమనిషిని సమీపించి, ఆయనను అడిగాను "ఏమిటి ఈ వ్యవహారమంతా?" అని.

ఆయన కాస్త ముందు వెనకాడాడు తమ ఉదంతం చెప్పడానికి. తరవాత బయట పెట్టాడు కథ. కట్నం విషయంలో ఏదో కొంత పేచీ వచ్చిందనీ, ఆ కారణంగా మూడు సంవత్స రాల నుంచీ తన కొడుకూ కోడలూ కలిసి కాపురం చేయడం లేదనీ, తమ కోడలు అక్కడికి వచ్చే సంగతి తమకు ముందుగా తెలియదనీ, తాము స్వామి దర్శనం నిమిత్తం మాయూరం నుంచి కారులో వచ్చామనీ, స్వామి ఆజ్ఞ అనుసరించి, ఇప్పుడిక కోడలును కూడా వెంటబెట్టు కుని బొంబైకి వెళ్లదలిచామని కథంతా వెళ్లగక్కాడు.

అంతటితో నేను తృప్తి చెంది ఊరుకోలేదు. ఆ అమ్మాయిని అడిగాను - "ఏమిటమ్మా నీ పరిస్థితి?" అని. భరించలేని ఆవేదనతో ఆ అమ్మాయి మాట్లాడలేకపోయింది. అంతట, పక్కనే ఉన్న ఆ పిల్ల తల్లి ఇలా చెప్పింది.

"కట్నం విషయంలో వచ్చిన మనస్పర్థల వల్ల మూడేళ్లుగా నా కూతురు నా దగ్గరే ఉంటున్నది. స్వామితో మా అవస్థ చెప్పుకుంటే, స్వామి ఏదైనా దారి చూపిస్తారనే ఆశతో మేము

ఇక్కడికి వచ్చాము. అంతేగాని, మా వియ్యంకుడూ, వియ్యపురాలూ, అల్లుడూ, వీరంతా ఇక్కడికి వచ్చే సంగతి ముందుగా మాకు తెలియదు. ఈ మూడేళ్లనుంచీ మాకు వారికీ ఉత్తర ప్రత్యుత్తరాలేమీ లేవు. ఇదంతా మాకూ వింతగానే ఉంది. అంతా స్వామిదయ!"

బొంబై కుర్రవాడు తీర్థం పుచ్చుకోవడానికి చెయిజాపినప్పుడు, 'భార్యాభర్తలిద్దరూ కలిసితీర్థం పుచ్చుకోండి' అని స్వామి సూచించడానికి, ఆ యువకుని భార్య అక్కడే ఉన్నట్టు స్వామికి ఎట్లా తెలుసు?

ఈ ప్రశ్నకు సమాధానం ఎవ్వరూ చెప్పలేరు.

కోడలును కూడా వెంటబెట్టుకుని నలుగురూ బొంబైకి వెళ్లండని స్వామి ఆదేశించారు కాబట్టి, వెంటనే బయలుదేరి తమతో రమ్మని పిల్లవాని తండ్రి కోడలుతో చెప్పాడు.

"మేము ఇక్కడికి వచ్చేటప్పుడు బొంబై ప్రయాణం సంగతి మాకు తెలియకపోవడం చేత, అమ్మాయి తన బట్టలు తెచ్చుకోలేదు" అన్నది పిల్ల తల్లి.

"లేకపోతే పరవాలేదు.అమ్మాయికి కావలసిన బట్టలన్నీ మేము బొంబైలో కొంటాము." అంటూ కోడలును వెంటబెట్టుకుని బయలుదేరారు బొంబై ఆసాములు!

ఆ అమ్మాయి తల్లికి కలిగిన ఆనందం అడుగుతారూ!!!

## ఇతర ధర్మాలన్నీ వేదం నుంచే

ఇతర మతకర్తలు చెప్పిన ధర్మాలన్నీ పరిశీలించి చూస్తే, అవి వేదాలలోనే కనిపిస్తాయి. ఇతర ధర్మగ్రంథాలన్నీ వేదాలకు పిమ్మటనే పుట్టినట్టు చరిత్రవల్ల తెలుస్తున్నది. వేదాలు చెప్పని ధర్మమూ , సత్యమూ లేవు.  వేదము ఎప్పుడు పుట్టిందో  మనం నిర్ణయించలేము. వేద కాల నిర్ణయం  చేయబూనటం నష్టజాతకాన్ని గుణించటం వంటివి.

# 'అమ్మతో చెప్పుకో నీ గోడు'

స్వామి కంచి పొలిమేరల్లో ఉన్న శివస్థానం వద్ద మకాం చేస్తూ ఉన్నప్పుడు తమిళదేశం నుంచి ఒక పేద బ్రాహ్మణుడు స్వామిని సందర్శించాడు.

తన కుమార్తె వివాహం తలపెట్టుకున్నాననీ, అయితే వరుడు తరపువారు వరకట్నం కింద పదమూడు కాసుల బంగారం అడుగుతున్నారని , ఆ కట్నం యిచ్చుకునే శక్తి తనకు లేదని, ఏదైనా దారి చూపిస్తారనే ఆశతో అక్కడికి వచ్చాననీ దీనాతి దీనంగా విన్నవించుకున్నాడు.

"స్వామీ, వేరే దిక్కులేక మీ వద్దకు వచ్చాను. మీరు అనుగ్రహిస్తే తప్ప, నాకుమార్తెకు మెడలో మూడు ముళ్లు పడే అవకాశం లేదు" అని కంటనీరు పెట్టుకుంటూ చేతులు కట్టుకు నిలబడ్డాడు.

స్వామి : నేను సన్యాసిని. నీ కివ్వటానికి నా వద్ద బంగారం ఎక్కడ ఉంటుంది ? నా ఎదుట విలపిస్తే ఏం లాభం ? ఊళ్ళోకి పోయి , అమ్మ (కామాక్షీదేవి) దగ్గర కూచోని , ఆ తల్లికి నీ గోడు చెప్పుకో ! నీ ఘోష విని ఆమె ఏమైనా కటాక్షించవచ్చు.

' సరే , అట్లాగే చేస్తా' నంటూ ఆ బ్రాహ్మణుడు అంగోస్త్రం నడుముకు బిగించుకొని, కాంచీకామాక్షి అమ్మవారి ఆలయానికి వెళ్ళి ఆ దేవికి ఎదురుగా కూర్చొని ఆమెని ప్రార్థించాడు.

కొంతసేపు అయింది. ఉత్తరదేశం నుంచి ఎవరో ఒక షావుకారు స్వామిని దర్శించటానికి శివస్థానం వచ్చాడు. స్వామికి నమస్కరించాడు. స్వామి కుశలప్రశ్న చేశారు.

స్వామి వద్ద సెలవు పుచ్చుకుని వెళ్ళబోయే ముందు ఆ షావుకారు లోపలి జేబులోంచి ఒక పొట్లం తీసి, శిష్యుడి చేత ఒక పళ్లెం తెప్పించి ఆ పొట్లం ఆ పళ్లెంలో పెట్టి , స్వామికి సమర్పించాడు.

"ఏమిటి ఆ పొట్లం ?" అని అడిగారు స్వామి.

'అందులో కాస్త బంగారం ఉంది. దానిని తమకు సమర్పించుకుంటున్నాను' అన్నాడు షావుకారు.

స్వామి : "సన్యాసికి నాకెందుకు ఆ బంగారం ? నన్నేం చేసుకోమంటావు ?'

షావుకారు : స్వామీ, మీకుసమర్పించాలని ఎందుకో నాకనిపించింది. దానిని మీ చిత్తం వచ్చినట్టు వినియోగించండి. మీరు ఏంచేసినా నాకు సమ్మతమే.

"సరి. పరమేశ్వరి నిన్ను రక్షిస్తుంది. సుఖంగా వెళ్ళిరా" అని దీవించాడు స్వామి.

*****

షావుకారు బయలుదేరి వెళ్లిన కాసేపటికి , కుమార్తె పెళ్ళి నిమిత్తం వచ్చిన బ్రాహ్మణుడు అమ్మవారి గుడినుంచి తిరిగివచ్చాడు.

" స్వామీ, తాము సెలవిచ్చినట్లు అమ్మదగ్గరకి వెళ్ళి నాకథంతా వెళ్ళబోసుకున్నాను. ఎట్లాగయినా ఈ కష్టం నుంచి నన్ను గట్టెంకించాలి. " అంటూ స్వామి ముందు కూలబడ్డాడు.

పక్కన బల్లపైన ఉన్న పళ్లెం చూపించి, స్వామి ఇలా అన్నారు. "ఆ పళ్లెంలో పొట్లం ఉన్నది. ఆ పొట్లంలో ఏమున్నదో, దానిని విప్పి చూడు".

వణుకుతున్న చేతులతో బ్రాహ్మణుడు ఆ పొట్లం విప్పి చూసాడు.

స్వామి : "ఏం ఉన్నది పొట్లంలో?"

బ్రాహ్మణుడు భయంతో, సంభ్రమంతో "బంగారు కాసులున్నవి స్వామీ!"

స్వామి : "ఎన్ని ఉన్నవి? లెక్కపెట్టు"

బ్రాహ్మణుడు : (లెక్కవేసి) "13 కాసులు" అంటూ తడబడుతూ తడబడుతూ సమాధానం చెప్పాడు.

స్వామి : "నీవెన్ని కాసులు కావాలన్నావు ?"

బ్రాహ్మణుడు : పదమూడే స్వామీ !

స్వామి : సరె, సరె. అవి తీసుకువెళ్ళి నీ కుమార్తె వివాహం చేసుకో.

బ్రాహ్మణుడు ఆనంద బాష్పాలతో ‘‘అనుగ్రహం స్వామీ, పరమానుగ్రహం’’ అంటూ స్వామి పాదాలకు సాగిలపడ్డాడు.

--- టి. కె. త్యాగరాజన్

* * * * *

# సంస్కృతం చదివిన శాస్త్రిగారూ: నేనూ

దక్షిణదేశంలో మధురకు సమీపాన ఎలియత్తాన్‌గుడి ఒక చిన్న గ్రామం. అయినా అది అన్ని గ్రామాల వంటిది కాదు. ఆ ఊళ్ళో ఇళ్ళన్నీ దేవాలయాలు. ఆలయాల్లో అర్చన చేసే పూజారులూ, పరిచారకులూ తప్పితే, ఆ గ్రామ వాసులంటూ ఇతరు లెవ్వరూ లేరు.

ఆ గుళ్ళనూ, గోపురాలనూ కట్టించినవారు ద్రవిడదేశంలోని నాటుకోటి శెట్లు. కోట్లకు పడగలెత్తిన కుబేరులు.

ఊరు కాని ఊళ్ళో మహోన్నతాలైన ఆ ఆలయాలనూ, అలవిమాలిన ఆ లోగిళ్ళనూ, శెట్టియార్లు ఎందుకు నిర్మించారో, జనం లేకున్నా వాటినెందుకు పోషిస్తున్నారో - అది వారి భక్తి శ్రద్ధలకు నిదర్శనమే తప్ప - కారణం ఊహించలేము.

1960 సంవత్సరంలో స్వామి ఆ ఊళ్ళో సుమారు నెలరోజులు మకాం చేశారు. స్వామి దర్శనం చేద్దామని నేను మద్రాసు నుంచి బయలుదేరాను. ఎగ్మూరు స్టేషన్ నుండి రాత్రి రైల్లో నా ప్రయాణం.

ఆ రైల్లోనే నాకు సుపరిచితులైన శాస్త్రిగా రొకరు నాతోబాటు ప్రయాణం చేశారు. ఆ రాత్రి శ్రీ శాస్త్రిగారి సహవాసం నాకెంతో సంతోషం కలిగించింది.

ఆయన జగమెరిగిన పండితుడు. భారత, భాగవత, రామాయణాలు మొదలుకొని భగవద్గీతవరకూ అన్నిటిని గురించీ చక్కగా, శ్రావ్యంగా ఉపన్యసించగల విద్వాంసుడు. చమత్కారంగా కబుర్లు కూడా చెప్పగల డాయన. ఇహ, కాలక్షేపానికి కొరతేమిటి?

ఎగ్మూరు స్టేషన్‌లో బండి బయలుదేరింది. ఉభయులం పక్కపక్కనే కూచుని స్వామి వారిని గురించే గాక, సంగీతం, సాహిత్యం - అనేకవిషయాలను గురించి సరదాగా మాట్లాడుకున్నాము.

వేదాంత చర్చలోకి దిగినప్పుడు శాస్త్రిగారు ఆ పుస్తకంనించీ, ఈ పుస్తకంనించీ సంస్కృత శ్లోకాలు గుప్పించే వారు. అవన్నీ నాకు పూర్తిగా అర్థమయ్యేవి కావు. శాస్త్రిగారి వలె చిన్నతనంలో గీర్వాణం నేర్వని లోపం.

నే నిలా అన్నాను. ''శాస్త్రిగారూ, చిన్నప్పుడు సంస్కృతం అభ్యసించే అవకాశం నాకు లేకపోయింది, ఈ ఇంగ్లీషు చదువుమూలాన.''

''అది మీ కెట్లా అలవడుతుందిలెండి? దాన్ని మా బోంట్లకు వదిలిపెట్టండి'' అన్నారు శాస్త్రిగారు తడుముకోకుండా.

ఆయనగారి మాట పైకి సాధువుగా కనిపించినా, అందులో కొంత అవహేళన ధ్వనించకపోలేదు. నా మనస్సు చివుక్కుమన్నది. అయినా నేను బయటకి పొక్కలేదు.

పొద్దుపోయేవరకు ఆ మాటా, ఈ మాటా మాట్లాడుకుని, ఇద్దరం సుఖంగా నిద్రించాము.

తెల్లవారింది. రైలు దిగి ఎలియత్తాన్ గుడికి వెళ్ళే బస్సెక్కి ఏడుగంటలకల్లా ఆ ఊరు చేరాము. మూటాముల్లె సత్రంలో పెట్టి, త్వరత్వరగా స్నానసంధ్యలు ముగించుకుని, ఇద్దరం స్వామి దర్శనానికి బయలుదేరాం. పెద్దసత్రం ముందు కోనేటిగట్టుపైన అనుష్ఠానం పూర్తి చేసుకుని సత్రంలోకి ప్రవేశించబోతున్నారు స్వామి వారు.

వంటి నిండా భస్మంతో, రుద్రాక్షమాలలతో, ఉదకమండలాలతో, దివ్య తేజస్సుతో వెలిగిపోతూ సాక్షాత్కరించిన స్వామికి ఉభయులం సాష్టాంగ నమస్కారాలు చేసి, మా రాకను తెలియజేసుకున్నాం. ప్రసన్నవదనంతో స్వామి ఆశీర్వదించారు.

'సాయంత్రం చల్లబడ్డాక రండి' అని సెలవిచ్చి సత్రంలోకి నడిచారు. అది మే నెల. ఎండ తీక్షణం చెప్పనక్కరలేదు.

పొద్దెప్పుడు వాలుతుందా మళ్లా స్వామి దర్శనం ఎప్పుడా అని గడియలు లెక్కపెట్టుకుంటూ, ఎక్కువమంది చేరకముందే దర్శనం చేసుకుందామను కొని, కాస్త ఎండపొడ ఉండగానే స్వామివారున్న సత్రానికి బయలుదేరాము. లోపలికి ప్రవేశించాము. ''స్వామి ఎక్కడ?'' అని మఠం పరిచారకులను అడిగాము.

'పెరియవళ్' దొడ్డివైపు బయట చెట్టునీడను ఒంటరిగా కూర్చున్నారంటూ దారి చూపించారు. ఆరుబయట ఒకమూలను అలవిమాలిన పెద్దవృక్షమూలాన్ని ఆనుకుని, నేలమీద

కూచున్నారు. పిల్లవాళ్ళు రబ్బరు బంతితో ఆడుకుంటున్నట్లు ఒక చిన్నరాయిని చేత్తో ఎగరే స్తున్నారు.

సంపూర్ణజ్ఞానవైరాగ్యసంపన్నులూ, బ్రహ్మవేత్తలూ అయిన జగద్గురువు లేమిటి, ఒంట రిగా రాళ్లతో బంతులాడుకోవడ మేమిటి!

జీవన్ముక్తుని స్థితిని శంకరభగవత్పాదులు ఇలా వర్ణిస్తారు:

క్వచిత్ బాలై సార్థం కరతలగతాపై సహసితైః
క్వచి త్తారుణ్యాలంకృత నవవధూభిస్సహరమన్
క్వచిత్ వృద్ధైశ్చింతాకలిత హృదయైశ్చాపివిలసన్
మున్నిర్వ్యామోహం భజతి గురుదీక్షా క్షతతమాః

(ఒకప్పుడు చేతులతో తాళాలు పుచ్చుకుని వాటిని మోగిస్తూ చప్పట్లు కొట్టడం, కిలకిల నవ్వుతూ క్రీడాపరులైన బాలురతో ఆడడం,మరొకప్పుడు అలంకృతులైన స్త్రీలతో చరిస్తూ ఉండడం, ఇంకొకప్పుడు సాంసారిక చింతాజాలంతో కుంగపోయే ముసలివాళ్ళతో కలిసి విచా రించడం, ఇన్ని విధాల చరిస్తూ ఉన్నా జీవన్ముక్తుడైన యతివరుడు జ్ఞానయోగదీక్షామహిమవల్ల దేహతాదాత్మ్యభ్రాంతిని పొందడు.)

అడుగులో అడుగు వేసుకుంటూ మెల్లగా మేమిద్దరం స్వామి కనుచూపుమేరలోకి వెళ్లాము. మమ్మల్ని చూచారు స్వామి. దగ్గరకు రండని చేత్తో సంజ్ఞ చేశారు. ఉత్సాహంతో ముందుకు నడిచాము. పాదాభివందనం చేసి కూచున్నాము.

"ఎండగా ఉంది. అయినా పరవాలేదు. సాయంకాలపు టెండ"అంటూ "వృద్ధాతపః వృద్ధాతపః"అన్న పదాన్ని రెండుసార్లు అన్నారు, పాదపూరణం కోసం ప్రయత్నిస్తున్నారా అన్నట్లు.

ఆ క్షణంలో చిన్నప్పటి శ్లోకమొకటి నాకు గుర్తుకు వచ్చింది. ఆ శ్లోకాన్ని స్వామి సమ క్షంలో చదవవచ్చునా చదవరాదా అన్న యోచన ఏ మాత్రం లేకుండా, నేనేమిటి, సర్వజ్ఞులైన స్వామికి శ్లోకపాదం అందివ్వడమేమిటి అనే ఔచిత్యవిచారణ చెయ్యకుండా, ఈ కింది శ్లోకం చదివాను.

''వృద్ధార్కః, హోమధూమశ్చ

బాలస్త్రీ నిర్మలోదకం

రాత్రౌక్షీరాన్న భుక్తిశ్చ

ఆయుర్వృద్ధిః దినేదినే''

ఆఁ ఆఁ అంటూ స్వామి ఆ శ్లోకం మొదటిపాదం అందుకున్నారు.

ఇక అడుగుతారూ! అంతవరకు నావైపే చూస్తూ ఉన్న శాస్త్రిగారి ముఖం వివర్ణమైంది. ఆయనగారు అలా ఎందు కైనారో నాకు అర్థం కాలేదు.

స్వామి మాతో విడివిడిగానూ, ఉమ్మడిగానూ అనేకవిషయాలు ఆప్యాయంగా మాట్లా డారు. తండ్రి కొడుకుల నడిగినట్లు మామా యోగక్షేమాలు అడిగి తెలుసుకున్నారు.

అంత సులభంగా స్వామి దర్శనం లభించినందుకూ, అంత సావకాశంగా స్వామి మాతో మాట్లాడినందుకూ, మా అదృష్టాన్ని పొగుడుకుంటూ మళ్ళీ స్వామికి ప్రణమిల్లి, సెలవు పుచ్చుకుని బయలుదేరాము.

బసకు వస్తున్నప్పుడు శాస్త్రిగారు నాతో ''అవురా, ఎంత నాటకం ఆడారండి! నాకు సంస్కృతం రానేరాదంటూ రాత్రి నాతో అన్నారు కదా, ఇప్పుడు స్వామికే శ్లోకాన్ని అందించారే!'' అన్నారు విస్తుపోతూ.

''నేనేం నాటకం ఆడలేదు, మహాశయా! అప్పటి కప్పుడు నాకా శ్లోకం స్ఫురించింది. చప్పున చదివేశాను. ముందు వెనుకలు చూసుకోకుండా'' అన్నాను.

ఎంత చెప్పినా ఆయన నా మాట నమ్మరు. తనంత పండితుణ్ణి పక్కన పెట్టుకుని, కేవలం ఇంగ్లీషు ముక్కలు నేర్చిన నేను స్వామికి సంస్క ృతశ్లోకం అందివ్వడమా? తాను మౌనంగా ఉండిపోవడమా! ఇదీ ఆయనకు పట్టుకున్న బాధ.

పురాణాలన్నీ పుక్కిటబట్టిన శ్రీ శాస్త్రిగారికి అతి సాధారణమైన ఆ శ్లోకం ఎందుకు స్ఫురించింది కాదు? అది నాకు ఎలా తట్టింది? ఈ ప్రశ్నలకు సమాధానం చెబితేనే గాని, కథ కంచికి పోదు.

.*****

ఇంగ్లీషు బళ్ళో నేనేవో నాలుగు సంస్కృతం ముక్కలు నేర్చుకున్నమాట వాస్తవమే. అయినా శబ్దమంజరిలో కొన్ని శబ్దాలూ, హితోపదేశంలోని కొన్ని శ్లోకాలు వల్లించటంతో నా సంస్క ృతభాషావ్యాప్తికి స్వస్తి జరిగింది.

ఎన్నడో నా ఎనిమిదో ఏట మా మాతామహుల ఊళ్లో,వీధిబడిలో చదువుతూ ఉండగా, ఓ నాడు బడినుంచి ఇంటికి వస్తుంటే దారిలో ఒక అచ్చుకాగితం కనిపించింది. దానిలో కొన్ని శ్లోకాలున్నవి. అర్థంతో సహా. "నాకూ సంస్కృతం వచ్చు" అని మా వాళ్ళకు నా గొప్పలు చెప్పు కోవడానికి ఆ కాగితంలోని రెండు శ్లోకాలు బట్టీ పెట్టాను.

ఇవీ ఆ రెండూ:

బాలార్కః ప్రేత ధూమశ్చ వృద్ధస్త్రీ పల్వలోదకం

రాత్రౌ దధ్యన్న భుక్తిశ్చ ఆయుః క్షీణం దినే దినే॥

వృద్ధార్కః హోమధూమశ్చ బాలస్త్రీ నిర్మలోదకం

రాత్రౌ క్షీరాన్న భుక్తిశ్చ ఆయుర్వృద్ధిః దినే దినే॥

గోచీ పెట్టుకుని వీధిబళ్ళో చదువుకుంటున్న రోజుల్లో యధాలాపంగా నేర్చుకున్న పై శ్లోకం, ఏనాడో జీర్ణమైపోయిన ఆ నాలుగుపంక్తులూ, యాభై సంవత్సరాలు గడిచిన తరువాత నా కలా జ్ఞాపకం వచ్చాయో, ఊహకు అందని విషయం.

ఎక్కడో అంతరాంతరాల్లో దాగి ఉన్న ఆ శ్లోకాన్ని ఎన్ని పొరల్లోనించో పైకి లాగిందెవరు?

అంతేకాదు, అదే, నీతిశాస్త్రంలోని సాధారణశ్లోకం కాకుండా ఏ పంచకావ్యాల లోనిదో, ఏ భారతభాగవతాదుల్లోదో అయినట్లయితే - శాస్త్రిగారికి అవన్నీ కొట్టిన పిండి కావడం చేత - అది వారికి కరతలామలకం అయ్యేది. నేను మూగి నయ్యేవాణ్ణి. అందుకని, శ్రీ శాస్త్రిగారి సంస్కృతపాండిత్యానికి ఎక్కడా అందుబాటులోలేనిదీ, నా మిడిమిడి సంస్కృతజ్ఞానంతో నేను అందుకోజాలినదీ అయిన శ్లోకాన్ని విస్మ ృతిగర్భంలోనుంచి పైకి లాగాలి. దాన్ని నేను శాస్త్రిగారి ఎదుటనే చదివి, నా 'పాండిత్యా'న్ని ప్రదర్శించాలి!

'అబ్బో, సంస్కృతం మీ కెందుకు లెండి? అది మాకు వదిలెయ్యండి!' అన్న శాస్త్రిగారి ఎత్తిపొడుపు మాటకు స్వామి నా చేతనే సమాధానం చెప్పించాలి!

అద్భుత సృష్టి!

.*****

శ్రీ శంకరభగవత్పాదుల శిష్యులవిషయంలో ఇలాంటిదే ఒక కథ ప్రచారంలో ఉన్నది. పాత్రల తారతమ్యం మాట వదిలేస్తే, ఆ కథ ఇక్కడ చక్కగా అతుకుతుంది.

ఆది శంకరుల శిష్యులలో 'గిరి' అనే పేరు గల శిష్యుడు ఉండేవాడు. రోజూ దేవుని పూజకు పుష్పం, బిల్వం వగైరా పూజాద్రవ్యాన్ని సమకూర్చడం, గురువుగారి గుడ్డలు ఉతికి పెట్టి, గురువుకు శుశ్రూష చెయ్యడం ఇలాంటి పనులు అతడు నిర్వహిస్తూ ఉండేవాడు. ఆ పనులెంత చక్కగా చేసినా, చదువులో మొద్దబ్బాయిగా కనిపించేవాడు.

ఒకనాడు గురువుచేత పాఠం చెప్పించుకోవడానికి శిష్యులంతా సమావేశమైనారు. గురు వింకా పాఠం మొదలుపెట్టలేదు. గిరి రాలేదని గురువు ఎదురుచూస్తున్నట్లు కనిపించింది.

శిష్యులలో గుసగుసలు బయలుదేరాయి. గిరి కోసం కాచుకోవాలా? అతడు వచ్చినా ఒకటే, రాకపోయినా ఒకటే అంటూ శిష్యులు తమలో తాము ఏమనుకుంటున్నారో గురువు గారు కనిపెట్టారు. ఆనాడు వారికి కాస్త గుణపాఠం నేర్పాలని తోచింది గురువుగారికి.

ఇంతలో గిరి రానే వచ్చాడు. తోటక వృత్తాలలో గురువుపై తాను రచించిన శ్లోకాలు పాడుకుంటూ ఆనందంతో నర్తనం చేస్తూ వస్తున్నాడు.

శిష్యులు ఆ శ్లోకాలను విన్నారు. పరవశుడై అతడు చేసిన నృత్యాన్ని చూశారు. తాము అనుకున్నట్లు గిరి మొద్దబ్బాయి కాదని గ్రహించారు.

ఆశువుగా ఆనా డాయన చెప్పిన శ్లోకాలలో మచ్చుకు ఒకటి:

విదితాఖిల శాస్త్రసుధాజలధే

మహితోపనిషత్ కథితార్థ నిధే।

హృదయే కలయే విమలం చరణం

భవ శంకర దేశికమే శరణమ్ ॥

హరిహరాభేదం

తిరుపతి శ్రీ వేంకటేశ్వరుని మూర్తి స్వరూపంలో శివ, విష్ణు, శక్తి, సుబ్రమహ్మణ్యుల అంశలు నాలుగూ ఇమిడి ఉన్నాయి. 'బాలాజీ' అనే పేరు 'బాలసుబ్రహ్మణ్యము'నకు నిదర్శనం. స్వామి తలపై జడ, నాగాభరణాలు, బిల్వపత్రపూజ శివ స్వరూపానికి సాక్ష్యాలు. శంఖచక్రకిరీటాదులు శ్రీ మహావిష్ణువు చిహ్నాలు. వెలుపలి ప్రాకారంలో సింహశిల్పం శక్తి స్వరూపాన్ని ప్రకటించేది. ఈ విధంగా శ్రీ వేంకటేశ్వర స్వామి శివ, కేశవ, బాలసుబ్రహ్మణ్యముల సమన్వయమూర్తి. ఆ విధంగానే ఆ దేవుని భావించడం సమంజసం. శివ, కేశవాది భేదాలు ఆదిలో లేవు.

# జగద్గురు ప్రశస్తి

త చ్ఛిష్య భాగ్యం కథమత్ర వర్ణ్యం నైకం గురు ర్విస్మరతి ప్రదీర్ఘే,

కాలేప్రయాతే స్ఫుటమేవనామ గ్రామం కుటుంబం సకలం స్మరేత్సః.

స్వామి శిష్యుల భాగ్యమేమోగాని, వారిని, వారి ఊరిని, వారి కుటుంబాన్ని అంతనూ ఆ మహనీయుడు ఎన్నడూ మరువరు.

తత్సన్నిధి ప్రాప్తివశా దనేక ఉత్స్రృజ్య నాస్తిక్య మధర్మమార్గం,

సత్సంప్రదాయం పరిగృహ్య శిష్యాః స్వజన్మసాఫల్యం మవాపురీడ్యం.

ఈ స్వామి సాన్నిధ్యభాగ్యం వల్ల అనేకులు నాస్తిక్యం వదిలిపెట్టి ధన్యులైనారు.

నా త్యాదరం దర్శయతే ధనిభ్య ఉపేక్షతే నైవ ధనేన హీనాన్,

భావప్రధాన స్సజనార్దనోవా ప్రసారయే ద్భక్తజనే దయాం స్వాం.

ధనికులపై హెచ్చు ఆదరం కానీ, పేదవారిపై ఉదాసీనత కానీ స్వామి చూపరు. పరమేశ్వరుని వలె భక్తుల భావాన్నే ప్రధానంగా పాటిస్తారు.

యస్యగాఢ దిదృక్షాన, సన్నిధి ప్రా ప్త్యశక్తతా,

దూరస్థ ఏవతద్భక్త స్తదనుగ్రహ భాగ్భవేత్.

సన్నిధికి రాజాలక దూరము నుండి దర్శనానికై పరితపించే భక్తులు స్వామి అనుగ్రహాన్ని దూరం నుంచే పొందగలరు.

*****

# ''అభయం సర్వభూతేభ్యః'

స్వామికి మిత్రులూ, శత్రువులూ అంటూ లేరు. ''అభయం సర్వ భూతేభ్యః' అన్నదే స్వామి ఆశయం.

ఈ క్రింది సంఘటన అందుకు నిదర్శనం.

శ్రీమాన్ యస్.టి.జి. వరదాచార్యులుగారు బందరు సమీపంలో చిట్టి గూడూరు వాస్త వ్యులు ఎం.ఏ. పట్టభద్రులు. ప్రఖ్యాత సంస్కృత పండితులు, కవులు. 'మద్రాసులో కుప్పు స్వామి శాస్త్రిగారి శిష్యుణ్ణి' అని ఘనంగా చెప్పుకునేవారు.

గాంధిగారి సహాయ నిరాకరణోద్యమం ఫలితంగా స్కూళ్ల ఇన్‌స్పెక్టర్ ఉద్యోగానికి రాజీ నామా ఇచ్చి స్వగ్రామంలో తమ ఇంటి పక్కనే స్వయంగా సంస్కృత కళాశాల స్థాపించి, కుల మత విచక్షణ లేకుండా విద్యార్థు లందరికీ సంస్క ృతం బోధించిన గీర్వాణ భాషా పోషకుడు.

భద్రాద్రిరామాలయ పునరుద్ధరణ సంఘం ఉపాధ్యక్షులుగా, అప్పటి దేవాదాయశాఖ మంత్రి శ్రీకల్లూరి చంద్రమౌళి గారితో సహకరించి ఆలయోద్ధరణకు పాటుపడిన రామభక్తుడు.

ఆ సందర్భంలో గర్భగుడి పునర్నిర్మాణం గురించి అభిప్రాయభేదాలు తలయెత్తాయి. పూర్వమున్న గర్భగుడిని విశాలపరిచి పునర్నిర్మాణం చేయాలని ఉద్ధరణ సంఘం తీర్మానిం చింది. ప్రజల్లో మరో వర్గం దీనిని ప్రతిఘటించింది.

పత్రికలలో, శాసనసభలో కూడా వాదప్రతివాదాలు చెలరేగాయి. తంజావూరు నుంచి ఆగమశాస్త్ర పండితులను రప్పించి, సంప్రదింపులు జరిపారు. ఈ విధంగానూ రాజీ కుదర లేదు.

తుదకు ఈ వ్యవహారం శ్రీ కామకోటి శంకరాచార్య స్వామికి నివేదించడానికి, వారి తీర్పును ఉభయపక్షాలూ అంగీకరించడానికి నిర్ణయమైంది. వదరాచారిగారు కంచి వెళ్లి, స్వామివారికి ఉద్ధరణసంఘం పక్షాన తమ వాదం వినిపించి వచ్చారు.

గర్భాలయం కొలతలను మార్చవలసిన అవసరం లేదని, మూడు వందల ఏళ్ల కిందట భక్తశిఖామణి రామదాసు నిర్మించిన గుర్భగుడి ప్రమాణం ప్రకారం పునర్నిర్మాణం చేయడమే సమంజసమనీ స్వామివారు తీర్పు చెప్పారు.

ఆ తీర్పు తమ వాదానికి అనుకూలం కానందున, శ్రీ చంద్రమౌళి, శ్రీ వరదాచార్యుల గార్లుభయులూ దానికి ఎదురు తిరిగారు.

పాంచరాత్ర ఆగమం వర్తించవలసిన భద్రాద్రి ఆలయం విషయంలో అద్వైత మత ప్రవర్తకులైన కామకోటి శంకరాచార్యుల జోక్యం కూడదంటూ కొత్త ఆక్షేపణను లేవదీశారు.

అంతటితో ఆగక, ఈ వ్యవహారాన్ని హైకోర్టుకు లాగారు. కాని, కోర్టులో వారి వాదం నెగ్గలేదు.

చివరకు, కామకోటి స్వామివారి నిర్ణయానుసారంగా పూర్వపు కొలతల ప్రకారమే గర్భగుడి నిర్మాణం జరిగింది.

.*****

కొంతకాలం గడిచింది. వార్ధక్యదశలో శ్రీ వరదాచారి గారు వ్యాధిగ్రస్తులైనారు. ఒక రోజు మాట పడిపోయింది. సగం రాత్రయింది. డాక్టరు చూచి రోగి జీవించే ఆశ లేదని చెప్పాడు. భూశయనం చేయించారు.

తరువాత జరిగిన కథంతా..... శ్రీ వరదాచార్యులు గారే స్వయంగా ఇలా వివరించారు, కళ్లనీళ్లు తుడుకుకుంటూ:

"స్వప్నంలో శ్రీ కామకోటి శంకరాచార్యులు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి స్వామి నాకు కనిపించారు. "భయపడకండి. మీ కింకా ఆయుష్యు ఉన్నది" అంటూ చేయెత్తి అభయమిచ్చారు. గాఢ నిద్ర నుంచి లేచినట్లు తోచింది నాకు. నా కదలిక చూచి, మా వాళ్లు తిరిగి నన్ను మంచంమీద పడుకోపెట్టారు. డాక్టరును పిలిపించారు. డాక్టరు ఆశ్చర్యం వెలిబుచ్చుతూ "గండం గడిచింది" అన్నాడు. నాలుగైదు రోజులకు నా ఆరోగ్యం మళ్లా దారి పట్టింది.

"కంచి స్వామి వారు అప్పుడు బందరులో ఉన్నారు. బందరు వెళ్లి స్వామిని సందర్శిం చాను. స్వామి వారిని స్తుతిస్తూ నేను రచించిన శ్లోకాలను స్వామికి వినిపించాను. వారిని మా యింటికి ఆహ్వానించాను. స్వామి మా యింటికి దయచేశారు. నేనూ, నా కుమారుడూ ఆయన మేనా మోశాము."

"పాంచరాత్ర ఆగమానికి చెందిన మా వైష్ణవాలయం విషయంలో జోక్యం కలిగించు కోడానికి అద్వైతమతాచార్యులకు అధికార మెక్కడిది?" అంటూ కంచి స్వామిని గురించి వాదా నికి దిగిన శ్రీ వరదాచార్యులు గారే, స్వామి తనకు ప్రాణదానం చేసినట్లు స్వయంగా అంగీక రించారు.

"అభయం సర్వ భూతేభ్యః" అన్నది స్వామి ఆశయం.

# "నా పేరు ఎలా వచ్చింది చెప్పమంటారా?"

డాక్టర్ చంద్రశేఖర్ ఠాకూర్ బొంబైలో సుప్రసిద్ధ ఆయుర్వేద భిషగర్వుడు. మహారాష్ట్ర, గుజరాత్ ప్రాంతాలలో వివిధ రంగాలకు చెందిన ప్రముఖు లనేకులకు చికిత్సలు చేసి, ఘన వైద్యుడుగా పేరు పొందినవాడు.

ఆయుర్వేదంలో పరిశోధనలు సలిపి, వాటిని పత్రికలలో ప్రచురించి విఖ్యాతిగాంచిన విద్యావేత్త, పలుమార్లు విదేశాలలో సంచరించి ఆయుర్వేద ప్రాశస్త్యాన్ని చాటిన ఘనుడు.

1987లో కార్యాంతరంపై నేను బొంబై వెళ్ళినప్పుడు డాక్టర్ చంద్రశేఖర్‌ఠాకూర్‌ను చూడడం తటస్థించింది. ఆయుర్వేదాన్ని గురించి, వనమూలికలను గురించి, 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్' పత్రికలో డాక్టర్ చంద్రశేఖర్ వ్రాసిన వ్యాసాలను గురంచీ ఇరువురం కొంతసేపు మాట్లాడుకున్నాము.

ప్రసంగవశాత్తు, కొన్నిసంవత్సరాలుగా ప్రొస్టేట్ గ్లాండ్ వ్యాధి నన్ను అంటిపెట్టుకుని ఉన్నదనీ, శస్త్ర చికిత్స ద్వారా దానిని నివారించుకొనవలసిందని సర్జనులనేకులు సలహా ఇచ్చారనీ, అయినప్పటికీ, గురువు ఆదేశాన్ననుసరించి సర్జనుల సలహాను నేను పాటించలేదనీ, అందువల్ల ఇప్పటివరకూ నా కేవిధమైన అసౌకర్యంగాని, బాధగాని కలగలేదనీ ఆయనతో చెప్పాను.

డాక్టర్ చంద్రశేఖర్: ఒహో, అలానా? ఆ గురువు ఎవరు? వారి పేరు?

నేను: కంచి కామకోటి పీఠాధిపతి శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి.

డా. చంద్రశేఖర్: జగద్గురు శంకరాచార్యులు వారే కదా?

నేను: ఔను, రెండువేల సంవత్సరాలకు పూర్వం ఆదిశంకర భగవత్పాదులు స్థాపించిన కామకోటి పీఠంలో 68వ ఆచార్య పురుషులుగా పీఠాన్ని అలంకరించిన మహనీయులు.

డా. చంద్రశేఖర్: సరి, సరి, నా పేరూ చంద్రశేఖరే! నా తండ్రిగారు నాకీ పేరు ఎలా పెట్టారో చెప్పమంటారా?

నేను: చెప్పండి వింటాను.

డా. చంద్రశేఖర్: అప్పటికి నేనింకా పుట్టలేదు. మా తండ్రిగారు శంకరాచార్య స్వామి వారిని సందర్శించారు. మీ కొక పుత్రుడు కలుగుతాడు, అతడు పెరిగి పెద్దవాడై ఆయుర్వేద వైద్యుడుగా పేరు ప్రఖ్యాతులు గడిస్తాడు, అంటూ స్వామివారు నా తండ్రిని ఆశీర్వదించారట.

ఈ విషయమంతా నా తండ్రిగారు తన డైరీలో వ్రాసుకున్నారు. ఇప్పటికీ అది నా వద్ద ఉంది. అందుకే నాకీపేరు పెట్టుకున్నారు అంటూ ఆనందంతో తాండవం చేశాడు ఆ 'చంద్ర శేఖరు'డు!

*****

నిజమైన ఆరాధన

స్వధర్మాన్ని ఆచరిస్తూ, దాని ఫలం ఈశ్వరుడికి అర్పించడమే నిజమైన ఈశ్వరారాధన.

# పరమార్థ మార్గంలో పరమ నాస్తికుడు!

అనుదినం స్వామిని దర్శించడానికి వచ్చే అశేష ప్రజలో ఆర్తులూ, అర్థార్థులూ ఎందరో ఉంటారు. ఒకరికి రోగంనయం కావాలి. ఒకరికి దరిద్రం పోవాలి. ఒక యువతికి వివాహం కావాలి. ఒక యువకుడికి ఉద్యోగం రావాలి. ఒక తండ్రికి బిడ్డలు కలగాలి. మరొకరికి వ్యాపారం కలిసి రావాలి.

ఎన్నో కోరికలు! స్వామిఅనుగ్రహంతో భక్తుల కర్మవిపాకం కావడంతో, వారి వారి కోరికలు నెరవేరుతూ ఉంటాయి.

అయితే వీటన్నింటినీ మించినదీ, ఉత్తమోత్తమమైనదీ, మనిషి ప్రకృతినే మార్చివేసి పరమ నాస్తికుని భగవద్భుక్తునిగా చేయజాలినదీ స్వామి దివ్యశక్తి!...

అందుకు ఒక నిదర్శనం:

అప్పుడు నేను భద్రాచలానికి రెండు మైళ్ల దూరాన "బిల్వవనం"లో నివసిస్తున్నాను. ప్రకాశం జిల్లా పర్చూరు కాపురస్థుడు శ్రీ గండు సిద్ధయ్య అనే వ్యక్తి దగ్గరనుంచి నాకొక ఉత్తరం వచ్చింది.

కొందరు పెద్దలను సన్మానించడానికి తమ ఊరిలో ఒక సభ ఏర్పాటుచేస్తున్నాననీ, ఆ సభకు వచ్చి తమ సన్మానాన్ని అందుకోవలసిందిగా మరీ, మరీ కోరుతున్నాననీ ఉన్నది ఆ ఉత్తరంలో.

సిద్ధయ్య గారెవరో అంతకుపూర్వం నాకు తెలియదు. ఎందుకు నాకీ సన్మానం తలపెట్టారో నే నెరుగను. అదీగాక ఆయనగారు సన్మానసభకు నన్ను ఆహ్వానించిన నాడే భద్రాచలంలో శ్రీరామచంద్రస్వామి దేవాలయ ధర్మకర్తల సమావేశంలో నేను పాల్గొనవలసి ఉన్నది.

ఈ కారణా లన్నింటిని పురస్కరించుకుని "పర్చూరులో జరిగే సన్మాన సభకు రాజాలనందుకు నన్ను క్షమించండి" అంటూ సిద్ధయ్య గారికి జాబు రాశాను.

అయినా ఆ "గండు" వారు నన్ను వదలలేదు. సభకు చాలా పెద్దయెత్తున సన్నాహం చేశామనీ, చుట్టుపక్కల గ్రామాలక్కూడా తెలియజేశామనీ, ఎలాగైనా వీలు చూసుకుని ఆ

ఒక్కపూటా పర్చూరులో ఉండవలసిందనీ, ఏ కారణం చేతనైనా అది సాధ్యం కాకపోతే ఫోటో అయినా పంపవలసిందంటూ గట్టిగా పట్టుకున్నారు "గండు"వారు.

ఆ ఉత్తరం చదువుకుని కాస్త మెత్తబడ్డాను. సిద్దయ్యగారి ఆహ్వానం కేవలం లాంఛన ప్రాయం కాదు, నిజమైన అభిమానంతోనే ఆయన నన్ను ఆహ్వానిస్తున్నారని భావించి, ధర్మ కర్తల సభకు హాజరు కాలేనంటూ ఆలయ కార్యనిర్వహణాధికారికి లేఖ వ్రాసి పర్చూరు సభకు బయలుదేరాను.

సభ నిండుగా జరిగింది. పరిసర గ్రామాల నుంచి కూడా ప్రజలు విచ్చేశారు. పండితు లను సభలో సన్మానించారు.

అయితే - "ఆంధ్రప్రభ" సంపాదకపదవి నుంచి విరమించుకుని, భద్రాచలంలో సీతా రాములను సేవించుకుంటూ రాజకీయాలకూ, పత్రికారంగానికీ, ప్రజాజీవితానికీ దూరంగా ఉన్న నన్ను ఈ సిద్దయ్యగారు ఇంత పట్టుబట్టి పర్చూరుకు ఎందుకు రప్పించాలి? అసలు నాకీ సన్మానం ఎందుకు తలపెట్టాలి? ఈ ప్రశ్నలకు సమాధానంగా ఒక కథ ఉన్నది. ఆ కథ శ్రీగండు సిద్దయ్య గారికీ, ఆయన రాజకీయాలకూ, ఆయన జీవితంలో జరిగిన కొన్ని వింత వింత పరిణామాలకు సంబంధించినది.

ఆ కథ:

శ్రీ గండు సిద్దయ్యగారు పర్చూరులో పేరుమోసిన కమ్యూనిస్టు. ఒక్క పర్చూరులోనే కాక చుట్టుప్రక్కల ఆ ప్రాంతం అంతట్లో కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యకర్తగా ఈయన పేరు మారుమ్రోగుతూ ఉండేది. భయమో, భక్తో ఆ రోజుల్లో సిద్దయ్యగారి మాట పార్టీలో, ప్రజల్లో బాగా చలామణి అవుతుండేది.

ఒకనాడు సిద్దయ్య గారు హోటల్లో కూచుని కాఫీ సేవిస్తూ "ప్రభ" ఆదివారం పత్రిక చూస్తున్నారు. అందులో కంచికామకోటిపీఠాధిపతి శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీస్వామి ఫోటో ఆయన కంటపడింది. ఏ వేళావిశేషమో, ఆ బొమ్మ ఆయన్ను ఆకర్షించింది. అది మొదలు వారం వారం "ప్రభ"లో కంచిస్వామి బోధనలను చదవడం మొదలుపెట్టారు.

నిత్యం కమ్యూనిస్టు కార్యక్రమాలలో మునిగి తేలుతూ ఉండే సిద్దయ్య గారి మనస్సు ను ఏదో తెలియని శక్తి స్వామి మీదికి మళ్ళించింది. ఆదివారం "ఆంధ్రప్రభ" రావడం ఆల స్యమైతే సిద్దయ్య గారికి స్థిరబుద్ధి ఉండేది కాదు.

రాను రాను ఆయనలో అదివరలో కెన్నడూ లేని,ఎవరూ ఊహించని మార్పు వచ్చింది. అంతటితో ఆయన రాజకీయాలకు స్వస్తి చెప్పారు. పార్టీకి విడాకు లిచ్చారు. ఆ ప్రాంతమంత టా ప్రసిద్ధి కెక్కిన కమ్యూనిస్టునాయకుడల్లా కామకోటిపీఠానికి ప్రియశిష్యుడైనాడు.

అయితే మరి నాకు సన్మానం ఎందుకూ?

నా సంపాదకత్వం క్రింద వెలువడిన "ఆంధ్రప్రభ" లో కంచి స్వామి ఫోటోలు చూసీ, స్వామి ఉపన్యాసాలు చదివీ, వాటిచే ప్రభావితుండైనందున, మార్క్సిస్టు రాజకీయాల నుంచి మతం వేపు మారడానికి పరోక్షంగా నేను కారకుణ్ణి కావడం చేత నన్ను సన్మానించాలని ఆయన సంకల్పమట!

అందరి కథలూ ఇలా గ్రంథస్థం కాకపోయినా గండు సిద్దయ్య గారి వంటి స్వామి భక్తులు దేశంలో ఇంకా ఎందరో!

హిందూ ధర్మానికి ఆధారం

ఒక ధర్మం శక్తి, ఆ ధర్మానికి చెందిన వ్యక్తుల సంఖ్యపైగాక, దానిని ఆచరించే వ్యక్తుల స్వభావం మీద ఆధారపడి ఉంటుంది. హిందూధర్మసిద్ధాంతాలకు అనుగుణంగా తనజీవితాన్ని తీర్చిదిద్దుకునే హిందువుడే హిందూధర్మానికి ఉత్తమ ప్రచారకుడు. అట్టి మహా పురుషల వల్లనే హిందూధర్మం నేటికీ నిలచిఉన్నది.

## "ఇక్క డే నా బాలాజీ!"

తమ వద్ద శిష్యుడుగా చేరి కడవరకు తమకు శుశ్రూష చేస్తూ వచ్చిన ఒక మహారాష్ట్ర సన్యాసి కథను కంచిస్వామి ఇలా వివరించారు.

1929లో ఉత్తరార్కాటుజిల్లా సరిహద్దు గ్రామంలో న న్నొక సన్యాసి కలుసుకున్నాడు. ఆయనకు తెలుగుగాని, అరవంగాని తెలియదు. మరాఠీ, హిందీ భాషలు మాత్రం వచ్చు.

రామేశ్వరం వెళుతూ ఉండగా సన్యాసులకు ఉండవలసిన దండం పోగొట్టుకున్నాడట. కొత్తదండం లభించేవరకు బహుశా ఆ సన్యాసి ఉపవాసదీక్ష వహించి ఉండాలి. కొత్తదండం అభిమంత్రించి నేను ఆయన కిచ్చాను.

తన ఆశ్రమధర్మాన్ని కాపాడిన కారణాన, అది మొదలుకుని ఆయన నన్ను తన గురువుగా పరిగణించాడు. అప్పటికి ఆయన వయస్సు ఎనభై పైబడ్డవి. 1945లో ఆయన సిద్ధిపొందాడు. అంతవరకు ఆయన నన్ను వదలడానికి ఇష్టపడలేదు.

1929లో చాతుర్మాస్య మప్పుడు ఆ సన్యాసి మాతో చేరిన వెంటనే దాదాపు నలభైరోజులు నాకు మలేరియా జ్వరం తగిలింది. అప్పటివరకు న న్నెవ్వరూ తాకేవారు కారు. ఆ జ్వరం వల్ల అప్పుడు నాకు నిలబడే శక్తిగాని, సహాయం లేకుండా నడిచే
శక్తిగాని ఉండేది కాదు. కొత్తగా వచ్చిమాతో చేరిన ఈ వృద్ధు, సన్యాసి కావడం చేత నాకు సహాయపడే బాధ్యత వహించాడు.

ఆయన ముక్కోపి, మాట్లాడితే శాసించినట్లు ఉండేది. చుట్టు పక్కల వారంతా ఆయనను చూసి భయపడేవారు.

ఆశ్రమ స్వీకారానికి పూర్వం మధ్య భారతం దేవాస్‌లో రెవిన్యూ శాఖలో ఉద్యోగిగా పనిచేశాడు. అధికారం చలాయించడంలో నానాసాహెబ్‌గాని, ఝాన్సీరాణజీగాని ఆయనకు సాటిరారు!

ఒక్కరోజైనా ఆయన నా పాదాలకు పూజ చెయ్యకుండా మానలేదు. ఆ నియమాన్ని

పాలించకుండా ఆయనను వారించ గల వారెవరూ లేరు. ఆ పూజ చేసేటప్పుడు ఆయన కళ్ల వెంట బొటబొట నీరు కారుతూ ఉండేది.

ఆయన బంధువు లొకరు తీర్థయాత్ర చేస్తూ కంచికి వచ్చి నన్ను చూశారు. ఆ సన్యాసితో కొంతసేపు మాట్లాడిన పిమ్మట ఆయన నా దగ్గిరకు వచ్చి నాతో నిష్ఠురంగా మాట్లాడారు.

తన బంధువైన ఆ సన్యాసి శతవృద్ధు కదా, భగవంతునికంటె నన్ను అధికంగా భావించి పూజిస్తున్నాడు కదా, అలాంటి వ్యక్తిపట్ల ఏ మాత్రం అభిమానంగాని, సానుభూతిగాని చూపించకుండా మీ రిట్లా ఎందుకు ఉంటున్నారు అని నన్ను దుయ్యబట్టాడు. ఆయన అంత కోపగించుకున్నా, నేనేమీ ఉలకలేదు, పలకలేదు.

ఒకసారి మేము తిరుపతి యాత్రకు బయలదేరాము. వృద్ధస్వామి కూడా అప్పుడు మాతో ఉన్నాడు. వేంకటేశ్వరుని సేవించడానికి నేను కొండపైకి నడిచివెళ్లాను. బాలాజీ దర్శనం చేసుకుని కిందకి నడిచి వస్తున్నాము.

కిందనుంచి వస్తూ ఆ వృద్ధ సన్యాసి దారిలో మాకు ఎదురైనాడు.

ఆయన వయస్సునుబట్టి అనండి, సన్యాసి కావడం వల్ల అనండి, లేదా మామఠంతో ఆయన కున్న సంబంధంచేత అనండి, ఏమైతేనేం, ఆయనకు ప్రత్యేక బాలాజీ దర్శనం చేయించడానికి ఆలయ అధికారులు అంగీకరించారు.

కాని, ఆయనమాత్రం అందుకు సమ్మతించలేదు. ‘‘ఇక్కడే నా బాలాజీ’’ అంటూ నా పాదాలు పట్టుకున్నాడు. అంతదూరం కొండ ఎక్కి వచ్చినవాడు, తీరా బాలాజీ దర్శనం లేకుండానే తిరిగివచ్చాడు!

పరమేశ్వరుడు కొందరిని పరుల కోసమే బతకమని సృష్టించాడు!

-- ఇది నేను నీ జీవితంలో నేర్చుకున్నాను.

అందరిలో ఈశ్వరపదార్థం

*ప్రతి మానవునిలోనూ ఈశ్వరపదార్థం ఉండనే ఉన్నది. కనుక భక్తులైన వారు సకల మానవులనూ ఒక్కరీతిగనే భావించవలసి ఉంటుంది.*

# జగద్గురు ప్రశస్తి

జ్ఞాత్వా తదీయాం బహవశ్శుభేచ్ఛా మధీత వేదా అయతంత విప్రాః,

వేదార్థ విజ్ఞాన సమార్జనాయ జయంచ తత్రాపురపి ప్రకృష్టం.

స్వామి ప్రోత్సాహంతో అనేక మంది విప్రోత్తములు వేదార్థ జ్ఞానమును ఆర్జించారు.

వర్షాణీ వింశత్యధికాని సమ్యగ్ వేదాంతశాస్త్రం బహుపండితేభ్యః,

అధీత్య యజ్ఞ్జా తు మశక్త ఆసీ ద్విద్వాన్ క్షణాద్వేత్తి తదస్యబోధాత్.

పండితులు ఇరవయ్యేళ్లు వేదాంత శాస్త్రం చదివి గ్రహింపజాలని రహస్యాలను ఒక్క క్షణంలో స్వామి ఉపదేశం చేత గ్రహించగలరు.

అర్థోపవాసీ నసకృత్య భిన్నః పూర్ణోపవాసీ నజహాతి వర్చః,

అభౌతికం తస్య బలం సమస్త మోజశ్చతేజశ్చ విలక్షణం తత్.

స్వామి అల్పాశనులు. అయినా, కార్యనిర్వహణలో అలసట నొందరు. పూర్ణోపవాసం చేసేప్పుడు కూడా వర్చస్సు తగ్గదు. స్వామి శక్తి లోకోత్తరం.

లోకకల్యాణ కార్యాణా మంగత్వేనైవ నాన్యథా,

అద్భుతాని ప్రవర్తంతే తస్మా త్కీర్తి పరాఙ్ముఖాత్.

లోకసంగ్రహ నిర్వహణలో భాగంగానే స్వామి తమ విభూతులను ప్రదర్శిస్తారే తప్ప ప్రదర్శన కోసం కాదు.

# భద్రాద్రినిధి సేకరణలో నాకు బలమెవ్వరు ?

1959లో 'ఆంధ్రప్రభ' దినపత్రికను, వార పత్రికను మద్రాసునగరం నుండి విజయవాడకు తరలించడానికి నిర్ణయించారు.

విజయవాడనుంచి వెలువడే ఆ రెండు పత్రికల సంపాదకత్వం వహించ వలసినదిగా పత్రికాధిపతి శ్రీరామనాథ గోయంకా నన్ను కోరారు.

దక్షిణభారత హిందీ ప్రచారసభ కార్యదర్శి, రాజ్యసభాసభ్యులూ శ్రీ మోటూరిసత్యనారాయణగారూ, సుప్రసిద్ధ పత్రికా సంపాదకుడు శ్రీ ఖాసా సుబ్బారావుగారూ శ్రీ గోయంకా ఆహ్వానాన్ని అంగీకరించవలసిందిగా నన్ను ప్రోత్సహించారు. వారుభయులూ నాకు చిరకాల మిత్రులు. నా శ్రేయోభిలాషులుగా వారిని నేను పరిగణించేవాణ్ణి.

ప్రయాణానికి మంచిరోజు చూసుకున్నాను. పెద్దల, బంధుమిత్రుల సెలవు పుచ్చుకున్నాను. మిగిలిందల్లా శ్రీ కంచికామకోటి పీఠాధిపతి శ్రీ చంద్రశేఖరేంద్రస్వామి దర్శనంచేసి, వారి ఆశీస్సులు పొందడం ఒక్కటే.

స్వామి అప్పుడు మద్రాసుకు ఏడెనిమిదిమైళ్ళ దూరాన వానావరం అనే ఒక చిన్న పల్లెటూళ్లో పరివారంతో సహ మకాం చేస్తున్నారు. రేపు ప్రయాణమనగా, ఆరోజు ఉదయం స్నానసంధ్యలు ముగించుకుని బస్సులో వానావరం చేరాను. ఒక చిన్న పూరిపాకలో స్వామి విశ్రాంతిగా ఉన్నారు.

నా రాకకు కారణం స్వామికి విన్నవించుకున్నాను. స్వామి ఆశీస్సులు అనుగ్రహించారు.

అటు తరువాత, రామేశ్వరంలో అగ్నితీర్థానికి ఎదురుగా తాము నిర్మించ తలపెట్టిన ఆదిశంకరుల మంటపాన్ని గురించి వివరంగా చెప్పారు.

ఒక్కొక్క రూపాయి మొదలుకుని భక్తులు సమర్పించే ఎంత స్వల్ప విరాళమైనా సేకరించి మండప నిర్మాణం పూర్తి చెయ్యడం తమ ఆశయమని చెబుతూ, "మద్రాసులో నీకు తెలిసిన మిత్రులద్వారా కొంత డబ్బు పోగు చేసుకురమ్మ" న్నారు.

"స్వామీ, అలాగే చేస్తా. కాని, రేపే విజయవాడకు ప్రయాణం పెట్టుకున్నాను కదా!"

అన్నాను.

"దానికేం, రేపుకదా నీ ప్రయాణం ? ఇప్పుడే మద్రాసుకు బయలుదేరి వెళ్ళి, కొద్దిమం దినైనా కలసుకొని ఈ పని నెరవేర్చుకురా" అన్నారు.

శిష్యులొకరిని పిలిచి, బయట ఎవరిదైనా కారు ఉన్నదేమో చూడమన్నారు. శేషయ్య గారిని ఏదోఒక కారులో మద్రాసుకు తీసుకువెళ్ళి, ఆయన చెప్పిన చోటుకువెళ్ళి, తిరిగి రమ్మని ఆదేశించారు.

ఎవరిదో ఒక కారులో నన్ను కూచోబెట్టారు. చెన్ననగరానికి షెరీఫ్ చేసిన శ్రీ పంచాగ్నుల సూర్యనారాయణగారినీ, మిత్రులు శ్రీ జె.వి.సోమయాజులుగారినీ ఇద్దరిని మాత్రమే చూడగలి గాను.

వారు ఉభయులూ చెరి అయిదువందలు చందా వేశారు. ఎక్కువమందిని చూసే అవ కాశం లేక, తిరిగి వానావరం వచ్చి, స్వామికి నివేదించాను.

ప్రసన్నవదనంతో మరల ఆశీర్వదించారు.

(ఈ శంకరమంటప నిర్మాణానికి ఎంత ఖర్చు అయినా, ఆ మొత్తమంతా తానొక్కడినే భరిస్తాననీ, తనకు ఆ అవకాశం కలిగించవలసిందనీ మద్రాసులోని ఒక కోటీశ్వరుడు స్వామిని అర్థించగా, స్వామి అందుకు అంగీకరించలేదని విన్నాను.)

మద్రాసులో ఉండగా తెలుగు పత్రిక లన్నిటిలో అనన్యప్రచారం కలదిగా పేరుపొందిన ఆంధ్రప్రభ విజయవాడకు మారినదరిమిలా, దాని సర్క్యులేషన్ నామమాత్రంగా మిగిలింది. పూర్వపు టౌన్నత్యం కోలుపోయింది. ప్రజాదరణ సన్నగిల్లింది.

ఈ స్థితిలో శ్రీరామనాథ గోయంకా పత్రికను నా చేతికి అప్పగించారు. ఆయన ఆశలను కొంతవరకైనా సఫలం చేస్తేనే నా పరువుదక్కుతుంది.

కొత్త పత్రికను వృద్ధికి తేవడం వేరు. పడిపోయిన దానిని పునరుద్ధరించడం అంత తేలికైన పనికాదు. అయినా, బరువు నెత్తికెత్తుకున్నాను. ఇప్పుడిక వెనకా ముందులు ఆలో చించి లాభం లేదు. భగవంతుడిమీద భారం వేశాను. రాత్రింబగళ్లు, అవిశ్రాంతంగా, శాయ

శక్తులా పాటుబడుతున్నాను. సహోద్యోగులు సహకరించారు. అచ్చుకూర్చే కంపోజిటర్లతో సహా పని వారంతానడుంకట్టి పనిచేశారు. క్రమంగా చందాదారుల సంఖ్య పెరుగుతూ వచ్చింది.

సరిగ్గా ఇదే సమయంలో ఆనాటి దేవాదాయశాఖమంత్రి శ్రీ కల్లూరి చంద్రమౌళిగారు భద్రాచలం దేవాలయ పునరుద్ధరణ కార్యక్రమాన్ని చేపట్టారు.

చంద్రమౌళిగారంటే నేటి యువతరానికి అంతగా తెలియకపోవచ్చు. ఆనాడు ఆయన సుప్రసిద్ధ కాంగ్రెసు నాయకుడు. దేశస్వాతంత్ర్య పోరాటంలో పలుమారులు కారాగార శిక్షలను భవించిన ధేశభక్తుడు, 'రామాయణ సుధాలహరి' అనే చక్కని గ్రంథం రచించిన సాహితీవేత్త. ఆయన దేశభక్తికి దీటైనది ఆయన రామభక్తి.

అట్టి వ్యక్తి భద్రాద్రిరామాలయ పునరుద్ధరణకు పూనుకున్నారని తెలియగానే నాఒళ్లు పులకరించింది.

ఎంతో కాలంగా నేను కంటున్న కలలు నిజం కాబోతాయా అన్నట్టు తోచింది. చెన్నపట్నంలో షెనాయ్‌నగర్‌లో ఏటేటా మా ఇంట్లో శ్రీరామనవమి ఉత్సవం చేసేవాళ్ళం. ఆ పేటలో  వారంతా వచ్చి ఉత్సవంలో పాల్గొనేవారు. ఎప్పుడు భద్రాద్రి పోదామా, సీతారాములను కళ్లారా ఎప్పుడు కాంచుదామా అనుకునేవాణ్ణి.

భద్రాద్రి చూడడమేగాక, భద్రాద్రి రాముడికి సేవ చేసే అదృష్టంకూడా పట్టబోతున్నదేమో అనిపించింది.

వెంటనే శ్రీ చంద్రమౌళిగారికి తెలియచేశా : "మీ ఉద్యమంలో పాలు పంచుకునే అవకాశం నాకూ కల్పించండి. ఉడతా భక్తిగా సేవచేస్తా, నా పత్రికతో నేను మీతో సర్వవిధాలా సహకరిస్తా" నంటూ.

సహృదయులు శ్రీ చంద్రమౌళిగారు వెంటనే 'శేషయ్యగారూ, అంత కంటె కావలసినదేముంది? మీ సహకారం నా కెంతో ఉపకరిస్తుంది. ఉభయులం కలసి రాముడి గుడికి విరాళాలు  పోగుచేద్దాం.' అన్నారు. విధానసభ స్పీకరు శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు మా సంకల్పం మెచ్చుకున్నారు.

వ్యక్తిగతంగా పెద్దవిరాళాలు అర్థించడంకంటె, పత్రికాముఖంగా చిన్న చిన్న మొత్తాలు ప్రజలనుండి సేకరిద్దామనుకున్నాను.

అయితే, ఇక్కడ ఒక చిన్న సమస్య ఎదురైంది. 'ప్రభ' కు నేను సంపాదకుడనే గాని, యజమానిని కానుకదా! యజమాని అంగీకారం పొందకుండా పత్రికను కొంత కాలంపాటు ఈ ఉద్యమానికి వినియోగించడం సబబుకాదు.

చివరకు ఒక యోచన తట్టింది. ఎంత వ్యాపారస్థుడైనా శ్రీ గోయంకా దైవ భక్తిగల వ్యక్తి. తనకు నచ్చేట్టయితే, ఏ పనికైనా, ఎంత త్యాగానికైనా వెనుకాడని స్వభావం అయనది. కాబట్టి బాణం సంధిద్ధామని నిశ్చయించాను.

"భద్రచలం రామాలయ పునరుద్ధరణ ప్రయత్నం జరుగుతున్నది. "ఆంధ్రప్రభ" ద్వారా నిధి సేకరణకు నేను ఉద్యమిస్తున్నాను. దయచేసి మీ విరాళం ప్రకటించండి" అని అప్పుడు ఢిల్లీలో వున్న శ్రీ గోయంకాకు టెలిప్రింటరుద్వారా కబురు పంపాను.

"తగినంత  మొత్తం సేకరించగలననే ధైర్యం మీకుంటే అలాగే చెయ్యండి. నా విరాళం అయిదువేలు" అని మళ్ళా టెలిరపింటర్పైనే జవాబు పంపారు శ్రీ గోయంకా.

ఎద్దులూ, బండీ ఏకమైతే కొండమీదికి పోవడానికి ఎంత సేపు !  "శుభస్యశీఘ్రం" అని దగ్గరలో ఉన్న ఉగాది నాడే నిధి సేకరణకు అంకురార్పణ చేశాం. అన్నిచోట్లకూ వెళ్లి, అందరినీ చూసే అవకాశం లేనందున, ఫోను మీదనే కొన్ని విరాళాలు పోగు చేశాను.

ప్రథమంలో నాలుగైదు రోజులు కాస్త ప్రయత్నం కావలసివచ్చింది.  తెలుగు వారికి ఇలవేలుపైన శ్రీరాముణ్ణిగురించీ, పరమపావనమైన భద్రాచలక్షేత్ర మాహాత్మ్యాన్ని గురించీ, రామభక్తాగ్రేసరుడైన రామదాసు సేవలను గురించీ, భద్రాద్రితో గోలకొండ నవాబులకు ఏర్పడిన అపూర్వమైన సంబంధాన్ని గురించీ, మన మతానికీ, మన సంస్కృతికీ గల ఐక్యతను గురించీ ఒకటి రెండు సంపాదకీయ వ్యాసాలద్వారా ప్రజలను మేలుకొలపడం జరిగింది.

అటు తరువాత మా ఉద్యమం మూడు పువ్వులూ, ఆరుకాయలుగా రాష్ట్రం నలుమూలలకూ పాకింది.ఎక్కడో మారుమూల ప్రదేశాలనుండి కూడా తెంపులేకుండా  విరాళాలు

వెల్లువలై రాసాగినవి. అయిదులూ, పదులూ సమర్పించిన వారి సంఖ్య అపరిమితంగా పెరిగింది.

ఉద్యోగస్థులు, వ్యాపారస్థులు, కర్షకులు, కార్మికులు, వైద్యులు, విద్యార్థులు, స్త్రీలు, ఒకరేమిటి, ఆబాలగోపాలం అహమహమికతో రాముని సేవకు నడుంకట్టారు.

చాకలి, మంగలి వృత్తులు చేసుకునే వారనేకులు 'మా రోజు ఆదాయం మీ నిధికి పంపుతున్నాం' అంటూ ఉత్తరాలు రాశారు.

మరీ ఆశ్చర్యమేమంటే, చందాలు పంపిన వారిలో హిందువులే కాకుండా కొందరు ముస్లిములూ, క్రైస్తవులుకూడా ఉన్నారు!

స్వల్పవ్యవధిలోనే నిధి మొత్తం లక్షకు చేరింది. లక్షా ఎనభైయేడువేలు దాటిన తరువాత వసూళ్లు విరమించాము.

ఈ రోజుల్లో లక్ష రూపాయలంటే లెక్కలేకపోవచ్చు. కాని, దాదాపు ముప్పయ్యేళ్లకిందటఎవరి పలుకుబడి వినియోగించకుండా, ఏ విధమైన వొత్తిడులు లేకుండా ప్రజలనుంచి స్వచ్ఛందంగా అత్యల్పకాలంలో రమారమి రెండు లక్షల రూపాయలు సేకరించడం సామాన్య విషయం కాదు.

ఆంధ్రమహాజనులనుంచి ఊరూరా ఆ విధంగా పోగుచేసిన ధనమే భద్రాచలంలో రామదాసు ధ్యానమందిరంగా రూపొంది, అశేష భక్తకోటిని ఆకర్షిస్తున్నది.

ఇంతకూ, ఎన్నడో జరిగిన ఈ కథంతా నేడు పాఠకుల ముందుంచడంలో నా ఉద్దేశం నా శక్తిసామర్థ్యాలను చెప్పుకోవడం కాదు.

విజయవాడ ప్రయాణానికి అంతాసిద్ధం చేసుకుని, స్వామి దర్శనం కోసం వానావరం గ్రామానికి వెళ్ళిన నన్ను, "రామేశ్వరంలోని శంకర మంటప నిర్మాణానికి విరాళాలు వసూలు చేసుకు రమ్మం"టూ, అప్పటి కప్పుడు కారులో మదరాసుకు ఎందుకు పంపించారో, స్వామి ఉద్దేశం అప్పుడు నేను ఊహించలేక పోయాను. స్వామి అడిగితేనే చాలు శంకరమంటపానికి వేలూ, లక్షలూ కుమ్మరించే దాతలూ, భక్తులూ ఎందరులేరు ? "ఎంతో కొంత వసూలు చేసుకురా"

అని నన్నే ఎందుకు పంపవలసివచ్చింది? కారణం ఊహించలేక పోయినా, 'స్వామి ఆదేశం పాలించాలి' అనుకుని మదరాసువెళ్ళి, పని చేసుకువచ్చాను.

అయితే, భద్రాద్రి ఆలయనిధికి అంతస్వల్ప వ్యవధిలో, అంత డబ్బు, అనాయాసంగా వసూలైన తరువాత, ఈ నిధి సేకరణ ప్రయత్నం జయప్రదం కావడానికీ, ఆనాడు స్వామి నన్ను మదరాసు పంపించడానికీ గల కార్యకారణ సంబంధం బోధపడింది కాదు!

"లోకోత్తరాణాం చేతాంసి

కోను విజ్ఞాతు మర్హతి"

లోకోత్తరులైన మహాత్ముల మనస్సు తెలుసుకొనడం ఎవరి తరం ?

# ఆ చిరంజీవి అదృష్టం

'ఆచారశ్చైవ సాధూనాం ఆత్మన స్తుష్టి రేవచ' - మనువు.

ఆచారాలు ఆత్మానందానికి అవసరమైన చిత్త సంస్కారాన్ని కలగజేస్తాయని సంస్కార ధర్మాలకు మనువు నిర్వచనం.

ఒకమారు పూర్వాచారాన్ని, లేక సంప్రదాయాన్ని ఉల్లంఘిస్తే, ఒకరి తరువాత ఒకరు ప్రజ లందరూ వాటిని ఉల్లంఘిస్తారు. అందువల్ల అనాచారం ప్రబలుతుంది. మతం సారహీన మవుతుంది.

'ఒక్కొక్క పొరనే ఒలిచివేస్తే, ఉల్లిగడ్డలో చివరకు మిగిలేది శూన్యం. అదేవిధంగా, మనకు అనుకూలించడం లేదని ఒక్కొక్క సంప్రదాయాన్ని తోసివేస్తే, అసలు సంస్కృతికే నష్టం వాటి ల్లుతుంది' అంటాడు ప్రపంచఖ్యాతి గాంచిన ఆంగ్లచరిత్రకారుడు ఆర్నాల్డ్ టాయన్‌బీ.

భక్తుల కోరికలను తృప్తిపరచడానికి ఒక్కొక్కప్పుడు స్వామి పూర్వాచారాన్ని సడలించి నట్టు కనిపిస్తుంది.

అయినా, అది ఆచారానికి విరుద్ధం కాదు, సంప్రదాయానికి భిన్నమూ కాదు. ఆచారా నికి భంగం వాటిల్లకుండా, భక్తులను తృప్తిపరచడంలో స్వామి సూచించే పరిష్కారమార్గం అపూర్వంగా , అద్భుతావహంగా ఉంటుంది. అందుకు ఒక ఉదాహరణ.

విదేశాల్లో చదువు ముగించుకుని, భార్యతో, ఏణ్ణర్ధం బిడ్డతో స్వదేశానికి తిరిగి వస్తున్న ఒక విద్యావంతుడు, దేశంలో అడుగు పెడుతూనే ఓం ప్రథమంగా కంచికి వెళ్లి శ్రీకామకోటి శంకరాచార్య స్వామిని సందర్శించాలనుకున్నాడు.

బొంబైలో విమానం దిగి, భార్యా భర్తలు బిడ్డను చంక నెత్తుకుని, మద్రాసు మీదుగా ముందు కంచికి వెళ్లారు. మఠం మేనేజరును కలుసుకున్నారు.

"మేము ఇంగ్లండు నుంచి వస్తున్నాము. స్వామి దర్శనం చేసి, పాదపూజ చెయ్యాలను కుంటున్నాము" అన్నారు.

"మీరు విదేశం నుంచి నేరుగా ఇక్కడికి వస్తున్నారు. విదేశం వెళ్లి వచ్చిన వారు ప్రాయశ్చిత్తం చేసుకుంటేనేగాని, పాదపూజ చెయ్యడానికి వీలులేదు. మీరుస్వామిని సందర్శించేందుకు మాత్రం అభ్యంతరం లేదు" అన్నాడు మేనేజరు.

ఆశాభంగం కలిగింది ఆ యువదంపతులకు. "వేల మైళ్లు ప్రయాణంచేసి, ఎంతో ఆశతో వచ్చాంకదా, మా కోరిక తీరడానికి మార్గ మేదైనా చెప్పలేరా?" అని అడిగారు.

"మఠంలో చిరకాలంగా మేము అనుసరిస్తున్న సంప్రదాయం ఇది. దీనిని ఉల్లంఘించడానికి మాకు వీలులేదు. అయినా, మీరు పెద్ద స్వామిని (శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి) చూడండి. మీ విషయం వారికి విన్నవించుకోండి. స్వామివారిప్పుడు విష్ణుకంచిలో చిన్న మఠం లో ఉన్నారు" అంటూ కొంచెం సానుభూతి కనబరిచాడు మేనేజరు.

వెంటనే విష్ణుకంచిలో ఉన్న చిన్న మఠానికి బయలుదేరారు ఆ దంపతులు. స్వామి దర్శనం చేశారు. తమ పరిస్థితి స్వామికి విన్నవించారు.

'ఎంత భక్తిశ్రద్ధలు లేకపోతే ఈ యువదంపతులు విదేశాల నుంచి వస్తూ, స్వగ్రామానికైనా వెళ్లకుండా, స్వజనాన్ని చూడకుండా, మొదట కంచికే ఎందుకు వస్తారు ? తమ కోరిక నిరాకరిస్తే వారు ఎంత నిరుత్సాహపడతారు? అయితే, పూర్వాచారానికి భంగం కలగరాదు. ఇందుకు ఉపాయాంతరమేదైనా వెతికి వారిని తృప్తిపరచాలి' అని యోచించి ఉంటారు స్వామివారు.

మఠంలో మామూలుగా పూజ జరిగేది 'ఆది శంకరుల' పాదుకలకు. వాటికి ప్రత్యామ్నాయంగా తమ సొంత పాదుకలను తెప్పించారు. బిడ్డచేత ఆ పాదుకలకు పూజ చేయించండి' అన్నారు.

అంత చిన్నబిడ్డ పూజ చెయ్యడం ఎట్లా అంటే, తల్లి తన ఒళ్లో బిడ్డను కూచోపెట్టుకుని, బిడ్డ చెయ్యి పట్టుకుని పూజ చేయించ మన్నారు.

స్వామి చెప్పిన విధంగానే, శిష్యులు ఆ బిడ్డ చేత పూజ చేయించారు. భార్యాభర్తలిరువురూ ఎంతో సంతోషించారు. తమ కూతురు అదృష్టం కొనియాడుకున్నారు.!

విదేశయాత్ర చేసి వచ్చినవారు ప్రాయశ్చిత్తం చేసుకోకుండా పాదపూజ చెయ్యరాదనే నియమానికి భంగం కలిగిందా లేదా, అనే వాదానికి స్వామి సమాధానం.

విదేశయాత్ర చేసి తిరిగి వచ్చినవారు భార్యాభర్తలు, నిజమే. కాని, ఆ బిడ్డ విదేశాలకు వెళ్లిందా? లేదు. విదేశంలో జన్మించింది. స్వదేశానికి వచ్చింది. విదేశయాత్ర చేసిన దోషం బిడ్డకు ఎట్లా వర్తిస్తుంది?

ఎంత ఉపజ్ఞాపూర్వకమైన సమర్థన!

# డాక్టర్లను 'చిత్తు' చేసిన స్వామి దివ్యశక్తి

1964లో నా రెండవ కుమారుడు మురళీధరకు ఊపిరి తిత్తులకు సంబంధించిన వ్యాధి కనిపించింది.

విజయవాడలో, గుంటూరులో పేరుగల వైద్యులను సంప్రదించాము. వారు ఎక్స్‌రే ఫోటోలు తీసి పరీక్ష చేశారు. శస్త్ర చికిత్స అవసరమన్నారు. రాయవెల్లూరు మిషన్ ఆస్పత్రిలో పనిచేస్తున్న డాక్టర్ గోపినాథ్ ఈ వ్యాధికి సంబంధించిన శస్త్ర చికిత్సలో చాలా నిపుణుడనీ, ఆయనచేత ఆపరేషన్ చేయించ వలసిందని కూడా సలహా ఇచ్చారు.

మురళిని మద్రాసుకు వెంటబెట్టుకు వెళ్లి అక్కడ డాక్టరులతో సంప్రతించాను. వారు కూడా ఆపరేషన్ అవసరమేనన్నారు. అదైనా, ఆరునెలలు దాటకుండా, ఆ గడువులోపల చేయించవలసిందని సలహా చెప్పారు.

నాకు ఆప్తమిత్రులైన ఒక రిద్దరు వైద్యులు 'ఈ ఆపరేషన్ అంత ప్రమాదరహితం కాద నీ, ఇతరవిధాల నివారణోపాయం ఏదైనా సాధ్యమయ్యేట్టయితే దానిని అనుసరించడం మంచి ద'ని సూచించారు.

సందిగ్ధంలో పడ్డాను.

ఇన్నిచోట్ల, ఇంతమంది డాక్టరులు ఆపరేషన్ అవసరమని ఏకగ్రీవంగా అభిప్రాయం వెలిబుచ్చిన తరువాత, వారి సలహా త్రోసివేయడం సాధ్యమా? శ్రేయస్కరమా? అయితే, గత్యంతరం?

భగవంతుడి మీద భారం వేసి, రాయవెల్లూరు వెళ్లాము. డాక్టరు గోపినాథ్‌ను సంప్రదించాము. ఆయన జాగ్రత్తగా పరీక్షచేసి, ఆపరేషన్ అవసరమేననీ, మార్గాంతరం లేదనీ తేల్చి చెప్పారు.

కొద్దిరోజులలో డాక్టర్ గోపీనాథ్ రాయవెల్లూరు ఆస్పత్రి వదలిపెట్టి, ఢిల్లీ వెళ్లుతున్నాడు. వెంటనే కాకపోతే, ఆరునెలలు మించకుండా ఢిల్లీకి రావలసిందని కూడా సలహా ఇచ్చాడు.

తుదకు, ఆపరేషన్ వాయిదా వెయ్యకుండా రాయవెల్లూరులోనే, గోపీనాథ్ చేతనే ఆప రేషన్ చేయించుకోడానికి నిశ్చయం చేసుకున్నాము. అవసరమైన ఏర్పాట్లన్నీ చేశాము.

అయితే, ఆపరేషన్ చేయించుకునే ముందు కంచికి వెళ్లి, శ్రీచంద్రశేఖరేంద్ర సరస్వతిని దర్శించి, వారి ఆశీస్సును పొంది రావాలనుకున్నాను.

వెంటనే కారులో నేనూ, నా కుమారుడు రాయవెల్లూరు నుంచి కంచికి బయలు దేరాము. కంచి చేరేసరికి సాయంకాలమైంది.

స్వామి మఠంలో లేరు. సర్వతీర్థం సమీపాన ప్రత్యేకంగా ఒక పాకలో ఉంటున్నారు. మేము సర్వతీర్థం వెళ్లే సరికి మసకమసగ్గా ఉంది. అనుష్ఠానాదులు ముగించుకుని స్వామి అప్పుడే పాకలో ప్రవేశించబోతున్నారు. స్వామి వెంట ఇద్దరు శిష్యులున్నారు. శిష్యుల ద్వారా మా రాక స్వామికి ఎరిగించాను. ద్వారం తెరిచి లోపలికి వెళ్లబోతున్నవారల్లా ఆగి, మావైపు తిరగి''ఏమిటి విశేషం'' అన్నారు.

నా రెండవ కుమారుడు మురళీధరకు జబ్బు చేసిందనీ, శస్త్ర చికిత్సకై రాయవెల్లూరు ఆస్పత్రికి వచ్చామనీ, ఆపరేషన్‌కు ముందు తమ ఆశీర్వాదం కోసం కంచి వచ్చామనీ విన్నవిం చాను.

స్వామి: ఏమిటి జబ్బు?

నేను: ఊపిరి తిత్తులకు సంబంధించిన వ్యాధి. ''బ్రాంకియక్‌టాసిస్'' అంటారు. ఊపిరి తిత్తులలో ఎడమ వైపు మచ్చ కనిపించింది ఎక్స్‌రే తీస్తే.

నకనకలాడే లాంతరు వెలుతురులో, ఆ దూరాన్నించే మురళి వక్షస్థలం వైపు చూశారు స్వామి.

''జబ్బు ప్రమాదకరమైనదే అయినా, భయపడవలసిన అవసరం లేదు.ఆపరేషన్ వద్దు. మఠానికి వెళ్లి ప్రసాదం పుచ్చుకుని, ఇంటికి వెళ్లండి'' అన్నారు.

బ్రహ్మదేవుడు ఆయుర్దాయం పొడుగించాడు!

ఇద్దరం స్వామికి సాగిలపడి, సెలవు పుచ్చుకుని, మఠంలో ప్రసాదం స్వీకరించి, రాయ వెల్లూరు వెళ్లి గోపినాథ్‌తో, ఆపరేషన్ వాయిదా వేస్తున్నామని చెప్పి, మద్రాసు మీదుగా విజయ వాడ చేరాము.

ఇది జరిగి నేటికి 26 ఏండ్లు గడిచాయి. ప్రధాన ఆంగ్ల పత్రికలో ఈ చిరంజీవి పాత్రికే యుడిగా పేరుగడించాడు. అతని వయస్సు ఇప్పుడు 54 సంవత్సరాలు. నైష్ఠిక బ్రహ్మచారి. ఇంతవరకు మళ్లా, ఊపిరితిత్తులకు సంబంధించిన వ్యాధి ఏమిటో ఎరగడు.

## " ఎల్లాం సామి అనుగ్రహందా!"

సుబ్బయ్య స్థపతికి తెలుగు బాగా రాదు, కంజీవరం వాస్తవ్యుడు కావడం చేత.

మా ఆవిడకు అరవం వచ్చు. అరవం అర్థం చేసుకొనడమేగాక, అరవవారితో ధారాళం గా ఆ భాషలో మాట్లాడుతుంది.

శ్రీశైలంలో శిల్పం పనిమీద, సుబ్బయ్య స్థపతి కంచి నుంచి బయలుదేరి విజయవాడ వచ్చాడు. ఒకరోజు మా ఇంట్లో ఆగాడు.

నా భార్య శ్రీమతి వెంకాయమ్మా, సుబ్బయ్య స్థపతీ, కామకోటి పరమాచార్యులు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి స్వామిని గురించి భక్తితో, ఆసక్తితో మాట్లాడుకున్నారు. ఒకరి అనుభ వాలు ఒకరికి చెప్పుకున్నారు.

సుబ్బయ్య స్థపతి తమిళంలో చెప్పిన అనుభవ సారాంశం ఇది:

*****

రామేశ్వరంలో అగ్ని తీర్థానికి ఎదురుగా సముద్రతీరంలో ఆదిశంకర మంటపం నిర్మిం చాలని స్వాములవారు సంకల్పించారు.

మంటపం అగ్రభాగంలో ఆదిశంకర భగవత్పాదుల విగ్రహమూ, ఆయన నలుగురు శిష్యుల విగ్రహాలూ నెలకొల్పడానికి నిశ్చయించారు. చలవరాతితో తయారుచేసిన ఆ అయిదు విగ్రహాలూ ఒక్కొక్కటీ మనిషి ప్రమాణం కంటే పెద్దవి.

"మంటపంతోపాటు విగ్రహాలు తయారుచేసే మొత్తంపని నాకు అప్పగించారు స్వామి వారు. పుణ్యకార్యం కావడంచేతా మొత్తం బాధ్యత స్వామి నాపైన పెట్టడంవల్లా భక్తితో నడుం కట్టి పనిలోకి దిగాను.

అడపాతడపా కంచికి వచ్చేవాణ్ణి. మఠంలో స్వామిని సందర్శించి మంటపం పని గురించి వారికి నివేదించేవాణ్ణి.

ఆ సందర్భంలో ఒకసారి స్వామికీ నాకు ఇలా సంభాషణ జరిగింది:

స్వామి: ఏం స్థపతీ, ఎట్లా నడుస్తున్నది మంటపం పని? అనుకున్నట్టు జరుగుతున్నదా? అక్కడ మీకు ఇబ్బందులేవీ లేకుండా సౌకర్యాలన్నీ అమరుతున్నవా? మనం పెట్టుకొన్న ముహూర్తానికి మొత్తం పని పూర్తి అవుతుందా?

స్థపతి: సామీ, పని సాఫీగానే జరుగుతున్నది. మాకే కొరతా లేదు. ఏ నెలకానెల పని వాళ్ళందరికీ జీతాలు సక్రంగానే ముట్టుతూనే ఉన్నవి. తమ దయా, కామాక్షీ అమ్మవారి కటాక్షం ఉంటే, మనం పెట్టుకున్న ముహూర్తం నాటికి అంతా సిద్ధమవడానికి ఏ ఆటంకం ఉండదు. కానీ..... స్వామి: ఏమిటి 'కానీ' అంటున్నావ్?

స్థపతి: (మౌనం)

స్వామి: ఎందుకట్లా మాట్లాడకుండా ఉంటావు? సందేహం లేకుండా, ఉన్నదున్నట్టు చెప్పు.

స్థపతి: అంతా సవ్యంగానే జరుగుతూ ఉన్నది సామీ! ఒక్కటే చిన్న ఆటంకం....

స్వామి: నీళ్ళు నమలకుండా చెప్పు స్థపతీ! నాతో చెప్పడానికి నీకేం భయం? ఏమి జరిగిందో వివరంగ చెప్పు.

స్థపతి: శంకరుల వారి విగ్రహం నేను స్వయంగా చెక్కుతున్నాను సామీ. ఇన్నాళ్ళబట్టీ పని చకచకా సాగుతూనే వచ్చింది. అయితే, విగ్రహానికి ముఖంమీద, కంటికి సమీపంలో అంగుళం వెడల్పున ఒక నల్లని మచ్చ కనిపించింది. అది రాతిలోనే ఉన్నది. ఇంతకాలంగా అది పైకి రాలేదు. ఇప్పుడే బయటపడింది. అదెంత లోతుగా ఉన్నదో చెప్పలేను. కొంత చెక్కి చూశాను. తగ్గడం లేదు. ఏమి చెయ్యడానికీ తోచడం లేదు. ఆ అభ్యంతరం ఒక్కటీ తీరిపోతే, విగ్రహాలన్నీ ముహూర్తం నాటికి తయారైనట్టే.

స్వామి: ఇది నిజమైన ఆటంకమే! అందులో మూల విగ్రహానికి. ఇంకోచోట, ఇంకో చోటగాక నొసటిమీదనే ఆ మచ్చ ఉండరాదు. నిజమే.

కానీ ప్రయత్నం చెయ్యి. అమ్మ అనుగ్రహిస్తే, అంతా అనుకూలంగా జరగవచ్చు.

స్థపతి స్వామికి నమస్కారం చేసి, సెలవు తీసుకుని రామేశ్వరం వెళ్ళాడు.

నెల రోజుల తరువాత మళ్ళా ఒకసారి కంచి వచ్చి మఠంలో స్వామి దర్శనం చేశాడు. మంటపం పని ఏదేది ఎంతవరకు వచ్చిందో సవిస్తరంగా స్వామికి నివేదించాడు.

అంతావిని, స్వామి అడిగారు: "సరేగాని, కిందటిసారి నీవు వచ్చినప్పుడు శంకరుల విగ్రహానికి నొసటిపైన రాతిలో మచ్చ కనిపించిందన్నావే, అదేమైంది? దాని సంగతి చెప్పలేదేం?"

స్థపతి: (నవ్వు ముఖంతో) సామీ, దాని పరిమాణంలో కొంత తగ్గింది. ఇంకా ఒక కాసు వెడల్పు ఉన్నది.

స్వామి: సరే, నీవు చేయవలసిన ప్రయత్నమంతా చేస్తూఉండు. దాని సంగతి విచారించకు. ఇక వెళ్ళు.

ఇదే విధంగా స్థపతి మరి మూడు నాలుగుమార్లు కంచివెళ్లి, స్వామిని సందర్శించడం, మండప నిర్మాణం ఎంతవరకు వచ్చిందీ స్వామికి నివేదించడం జరిగింది.

వెళ్ళినప్పుడల్లా స్వామి ఆ మచ్చను గురించి స్థపతిని అడుగుతూ ఉండేవారు. మచ్చ ఏమాత్రం తరిగిపోయిందో స్థపతి స్వామికి విన్నవించేవాడు.

చివరకు మంటపం పని యావత్తూ పూర్తి అయింది. అనుకున్న ప్రకారం మంటపానికి ప్రారంభోత్సవం జరగవలసి ఉన్నది.

కడపటి దఫా స్థపతి స్వామిని సందర్శించడానికి వచ్చాడు.

స్వామి మళ్లా స్థపతిని అడిగారు. "ఏమైంది విగ్రహం ముఖంమీద ఆ మచ్చ?" స్థపతికి కళ్ళనిండా నీళ్ళు నిండాయి. స్వామికి సాష్టాంగ నమస్కారం చేసి "సామీ, సామీ! వెంట్రుకవాసి కూడా లేకుండా మచ్చ పూర్తిగా మాయమయింది. ఎల్లాం సామి అనుగ్రహందా!" అంటూ ఆనందబాష్పాలు తుడుచుకున్నాడు!

అంగన్యాస, కరన్యాసాలు

ప్రాణుల ఒక్కొక్క అంగంలో ఒక్కొక్క దేవతా స్వరూపం సంస్థితమై ఉంటుంది. ఆ దైవరూపాలకే 'ఆధ్యాత్మికం' అని పేరు. వారు ఆయా అవయవాలలో ఉండి, ప్రాణులను రక్షిస్తూ ఉంటారు. మంత్ర జపాదులలో మనం చేసే అంగన్యాస కరన్యాసాలు ఆ దేవతలను ఉద్దేశించే చేస్తున్నాము.

# సర్వజ్ఞ పీఠ సార్ధకం

ఆదిశంకరభగవత్పాదులు మూడవ యేటనే దేశభాషలను అభ్యసించారు. అయిదో యేట సంస్కృతం చక్కగా నేర్చుకున్నారు. ఉపవీతులైన పిదప, ఎనిమిదో యేడు ముగిసే లోగా వేదశాస్త్రాలను పూర్తి చేశారు.

భగవత్పాదుల జీవిత చరిత్రలలో వ్రాయబడిన ఈ వాక్యాలను చదివినప్పుడు, మానవ మాత్రుల కిది సాధ్యమా అని శంకించే వారుండవచ్చు.

కాని, శ్రీశంకరులు అవతరించిన రెండువేల సంవత్సరాల తరువాత, అదే సంప్రదాయానికి చెంది, అదే కామకోటిపీఠం అధిష్ఠించిన ఒక మహాపురుషుడు సాక్షాత్తు పుంభావ సరస్వతిగా మనకు ప్రత్యక్షమైనప్పుడు, ఆదిశంకరులను గురించి ప్రాచీన పండితులు నుడివిన మాటలు అతిశయోక్తులుగా పరిగణించవలసిన పనిలేదు.

అవతారమూర్తులనూ, కారణజన్ములనూ అన్ని విద్యలూ అన్ని కళలూ, వాటంతట అవే వచ్చి ఆశ్రయిస్తాయి. అక్కడ గురుశుశ్రూష నామమాత్రమే.

శ్రీకృష్ణభగవానుడు మహర్షిసాందీపుని వద్ద శిష్యుడుగా చేరి 64 రోజులలో వేద వేదాంగాలను, అస్త్ర విద్యతో సహా అన్ని విద్యలను అభ్యసించాడని శ్రీ మద్భాగవతంలో చెప్పబడుతున్నది.

లోకంలో సర్వసాధారణంగా మనం చూచే గురుశిష్య సంప్రదాయం కామకోటి పీఠం 68వ ఆచార్యులు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి స్వామి విషయంలో కిందు మీదయింది. కంచి స్వామికి ఒకప్పుడు విద్యాగురువులైన మహామహోపాధ్యాయ బ్రహ్మశ్రీ కృష్ణశాస్త్రిగారు, స్వామితో ఇలా అన్నారు. "స్వామీ! నిమిత్త మాత్రంగా మిమ్ము శిష్యులుగా పాటించినా, యదార్ధంగా మీరే మా గురువులు, మేము మీకు శిష్యులం".

1907లో స్వామి పీఠాధిపత్యం వహించిన పిమ్మట కావేరీనది ఉత్తర తీరాన మహేంద్ర మంగళంలో ప్రత్యేకంగా ఒక పర్ణశాల నిర్మించుకుని, 1911 మొదలు 1914 వరకు నాలుగు

సంవత్సరాలు తదేకదీక్షతో విద్యాభ్యాసం చేశారు. ఆయా శాస్త్రాలలో నిష్ణాతులైన పండితుల వద్ద తర్క, వ్యాకరణ, మీమాంస, వేదాంతాలను నేర్చుకున్నారు.

బాల్యంలో ఆంగ్ల పాఠశాలలో చదివిన ఇంగ్లీషుతోపాటు ఫ్రెంచి కూడా అభ్యాసం చేశారు. మరాఠీ చదివారు. తమిళ వ్యాకరణం, తేవారం, తిరువాచికం, పెరియ పురాణం, తిరుక్కురళ్ మొదలైన గ్రంధాలు పఠించారు. తమిళ భాషలోని కావ్య ప్రబంధాలను కడ ముట్ట చూచారు.

గానకళకు సంబంధించిన శాస్త్రాంశాలను తెలుసుకున్నారు. ఛాయాగ్రహణ (ఫొటోగ్రఫి) రహస్యాలను గ్రహించారు. గణితం, జ్యోతిషం, ఖగోళశాస్త్రాదుల మర్మాలను అవగాహన చేసుకున్నారు. ప్రాచీనశాసన పరిశోధనలో, స్థలపురాణ సమస్యల పరిష్కరణలో ప్రావీణ్యం గడించారు.

"చరిత్రకు సంబంధించిన శాసనపరిశోధనలో మా కేవైనా సందేహాలు కలిగినప్పుడు కామకోటి స్వామి వారి సహాయంతో మేము మా సందేహ నివారణ చేసుకుంటాము" అని ఆర్కియలాజికల్ డిపార్టుమెంట ఉన్నతాధికారి శ్రీ టి.యన్.రామచంద్రన్ ఒక సభలో చెప్పగా నేనువిన్నాను. నేటికి సైతం, శాసనపరిశోధనలు చేసే పండితు లనేకులు ఆయా సమస్యలను గురించి స్వామిని సంప్రదిస్తూ ఉంటారు.

స్వామికి పదిహేను దేశ, విదేశ భాషలు తెలుసు. ఇన్ని విద్యలలో ఇన్ని కళలలో, ఇన్ని భాషలలో అపారమైన ఇంత విజ్ఞానాన్ని ఎలా సాధించగలిగారన్నది విద్యాధికులకూ, భాషావేత్త లకూ అంతుబట్టని విషయం.

ఈ విధంగా శిల్పమేమి, ఆగమమేమి, మంత్రమేమి, భాషాపరిశోధనమేమి అన్నిటా సర్వతోముఖమైన స్వామి పాండిత్య ప్రతిభలను గురించి ఆయా విద్యలలో, కళల్లో ఆరితేరిన ప్రవీణులు వాగ్రూపంగా, వ్రాతమూలంగా ఆశ్చర్యం వెలిబుచ్చటం నే నెరుగుదును.

అమేయమూ, విశ్వతోముఖమూ అయిన ఈ విజ్ఞానభాండాగారమంతా ఒక్క వ్యక్తిలో ఇలా కేంద్రీకృతం కావడం అనితర సాధ్యం. అలౌకికమైన వర ప్రసాదమే తప్ప, ఎంతటి వారికైనా కేవలం స్వయంకృషితో సాధ్యం కాదీ అసాధారణ, సర్వంకష ప్రతిభ.

"శంభోర్మూర్తిః

చరతి  భువనే శంకరాచార్య రూపా"

చివరికొక మాట. సాక్షాత్తు పరమశివుని అవతారమైన ఆదిశంకరులు అనేక శతాబ్దుల కిందట కంచికామకోటి పీఠం సర్వజ్ఞపీఠంగా లోకానికి చాటి, ఆ పీఠాన్ని అధిష్ఠించారు. మరల ఈ శతాబ్దిలో అదే పరంపరకు చెందిన అరవై ఎనిమిదవ ఆచార్య పురుషుడు ఆదిశంకరుల అపరావతారంగా సమస్త విజ్ఞ ప్రపంచంచే ప్రస్తుతించబడుతూ ఉన్న శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతియతీంద్రులు సర్వజ్ఞ పీఠమనే మాటను సార్థకం చేశారు.

* * * * *

# జగద్గురు ప్రశస్తి

*తద్వాచివర్తతేప్రాయో, భవిష్యద్వస్తుసూచనం,*

*త ద్బుద్ధిపూర్వకం వ్యాసా, దన్యధావేతి వేత్తికః?*

*ఆగామి వస్తుసకలం, జానా త్యేష మహానుత?*

*త ద్భావానుగుణం లోకే, సర్వమేవ ప్రవర్తతే?*

జరుగబోవుదాని సూచన స్వామివాక్కులో కనిపిస్తుంది. జరుగబోవునది స్వామికి తెలుస్తూ ఉంటుందా? లేక, వారన్నట్లుగానే సర్వం జరుగుతుంటుందా?

*శ్రీ దేవదేవీ కరుణా కటాక్ష మాకాంక్షమాణా బహుకష్టసాధ్యం,*

*నరా నిరాశాన భవేయు రద్య యదేషమౌనీ సులభప్రసాదః,*

దేవదేవి అనుగ్రహం పొందడం మానవులకు కష్టతరం. కాగా, వారు నిరాశ చెందనక్కర లేదు. ఈ స్వామి అనుగ్రహం పొందడం సులభమే.

*స్వాధీనేశ్వర ఏషస్యాత్ సాక్షాత్తన్మూర్తి రేవవా,*

*తదనుగ్రహ లాభశ్చేత్ కిమస్మాకన్ను దుర్లభమ్?*

ఈశ్వరుడు స్వామికి అధీనుడు, లేదా, స్వామి రూపాన్నే ధరించాడు. స్వామి దయ ఉంటే మనకు లభించని దేమున్నది?

*తద్దర్శనం పాపవినాశనం స్యాత్ తద్భాషణం శ్రోత్ర విభూషణంచ,*

*తద్బోధనం గ్రంధి విభేదనంచ తత్సంస్మృతి స్సర్వ శుభప్రదాత్రీ.*

స్వామి దర్శనం పాపవినాశనము. స్వామి భాషణం కర్ణ భూషణము. స్వామి బోధనం అజ్ఞానగ్రంధి భేదనము. స్వామి స్మరణం సర్వశుభము.

* * * * *

# స్థపతికి అనుగ్రహం

1960లో భద్రాచలం శ్రీ సీతారామస్వామి దేవాలయ సముద్ధరణకు బృహత్ ప్రయత్నం జరిగింది. రాష్ట్ర ప్రజలు, పిన్న పెద్ద లక్షలాది కానుకలు సమర్పించారు.

ఆలయమంటపాలకు సంబంధించిన శిల్పాలను రూపొందించడానికి అరవ దేశం నుంచి కొందరు శిల్పులను రప్పించారు. అట్లా వచ్చిన శిల్పులందరికీ నాయకుడు ఇరవైయ్యేండ్లు నిండీ నిండని గణపతి అనే యువకుడు.

కొత్తగా నిర్మించిన స్వామివారి కళ్యాణ మండప మంతా ఆ యువశిల్పి చేతులమీదుగా రూపుదాల్చిన కళా విశేషమే.

ఆలయ పునఃప్రతిష్ఠకు అరుదెంచిన శ్రీ కామకోటి పీఠాధిపతి శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి కళ్యాణమండపంలోని శిల్ప సంపదను చూచి ముగ్ధులైనారు.పూర్వం దక్షిణదేశంలో చేర, చోళ, పాండ్యరాజుల యాజమాన్యంలో నిర్వహించిన శిల్పకళావైభవంకంటే ఇది మిన్న అని శ్లాఘించారు. యువశిల్పి గణపతిని ఆశీర్వదించారు.

అది మొదలుకొని గణపతి స్థపతి శిల్పకళా ప్రవీణుడుగా పేరొంది ఆంధ్రదేశంలోనేగాక, అఖిలభారతంలో పలు రాష్ట్రాల్లో అనేక ఆలయాలను, మండపాలను నిర్మించడానికి కారణ భూతుడైనాడు. రాష్ట్రపతి అవార్డును గడించాడు.

ఉత్తరప్రదేశ్ ప్రయాగలో నిర్మించిన ఆది శంకరమంటపం, సతారాలో నటరాజస్వామి ఆలయం, షికాగోలో (అమెరికా) శ్రీ రామచంద్రస్వామి దేవాలయం మొదలైన అద్భుత నిర్మాణాలన్నీ గణపతి స్థపతి పర్యవేక్షణలో వెలసినవే.

దేశ విదేశాల్లో ఎక్కడ ఏ ఆలయం నిర్మించవలసి వచ్చినా, కంచిస్వామి అనుమతి లేనిది, స్వామిద్వారా శిల్ప రహస్యాలను గ్రహించనిది ఆలయ నిర్మాణానికి పూనుకోడు శ్రీ గణపతి.

ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం దేవాదాయ శాఖలో ప్రధాన స్థపతిగా ఉన్నత పదవి నిర్వహించి, ఇటీవలనే ఆ పదవి నుంచి విరమించుకున్నాడు. పద్మశ్రీ బిరుదాంకితు డైనాడు.

స్వామి ఆశీర్వాదంతో ఎంత దుర్ఘటమైన కార్యమైనా అనాయాసంగా, నిర్విఘ్నంగా నెర వేర గలదంటాడు ప్రముఖ శిల్పకళానిధి శ్రీ గణపతి స్థపతి.

* * * * *

# 'భక్తు డెందు చనిన పరతెంతు వెనువెంట'

కొందరు భక్తుల అనుభవంలో ఉన్న మరొక విశేషం: స్వామిని దర్శించడానికి ఎక్కడి నుంచి బయలుదేరినా, ఏ వేళ బయలుదేరినా, ఆ ప్రయాణం నిర్విఘ్నంగా కొనసాగుతుంది. స్వామి దర్శనానికి వెళ్లే భక్తులు మంచిరోజూ, మంచి ముహూర్తం కూడా వెతుక్కోరు. అయినా, ప్రయాణంలో ఏ ఆటంకాలూ ఎదురుకావు.

అనుకున్న;రైలు అందుతుంది. రైలులో చోటు దొరుకుతుంది.; ఒక్కొక్కప్పుడు, సంచారంలో స్వామి ఏ మారుమూల గ్రామంలోనో మకాం చేస్తారు. ఆ గ్రామానికి రైలు ఉండదు. బస్సులో పోవలసివస్తుంది. కొంత దూరం నడవవలసిన అవసరం కూడా ఉంటుంది. అయినప్పటికి విఘ్నం లేకుండా ప్రయాణం సాగుతుంది. రైలు ఆలస్యంగా రావటం వల్ల బస్సు దొరకదేమో అనుకుంటే , ఆ రోజున ఏ కారణం చేతనో బస్సు కూడా ఆలస్యంగా బయలుదేరుతుంది ! ఇదంతా వింత కాదు, వినోదమూ కాదు. సహజంగా జరుగుతుంది.

కాఫీ , టీలు సేవించటంచేతా , వేళకు ఆహార నిద్రలు లేకపోవటంవల్లా, ఇంకా ఏవేవో ఇతర అలవాట్లకు బానిసలు కావటం మూలంగా , ఈ కాలంలో అనేకమందిని అనేక రకాలైన రుగ్మతలు వెంటాడుతూ ఉంటాయి. ఇల్లు విడిచివెళితే వాటివల్ల మరీ ఇబ్బంది పడుతుంటారు. కాని , స్వామి దర్శనానికి బయలు దేరగానే , ఆ బాధలన్నీ సమసి పోవటమో లేదా బహుపరిమితంగా కనిపించటమో జరుగుతుంది. తిరిగి ఇంటికి చేరుకునే వరకు అవి వారి జోలికి రావు.

ఇదంతా ప్రత్యక్ష అనుభవమే కాని , ఊహాజనితం కాదు, మనస్తత్వపు మార్పు కాదు.

థాయిలాండ్ దేశపు రాజ గురువు పూజ్య వామదేవముని , వారి అనుయాయులతో భారతదేశం విచ్చేసారు. స్వామి విజయవాడలో ఉండగా 1968 అక్టోబరు 14 వ తేదీన అక్కడికి వచ్చి స్వామిని దర్శించారు.

స్వామిని దర్శించినప్పుడు తమ పూర్వీకులు , తమ తాత ముత్తాతలు స్వామిలో తమకు ప్రత్యక్షమైనట్టు తోచిందని అన్నారు శ్రీ దేవముని.

స్వామిని సందర్శించి, స్వామితో సంభాషించి, స్వామి చేతితో ప్రసాదం స్వీకరించి, స్వామివద్ద సెలవు పుచ్చుకుని ఒక నెల రోజుల పాటు భారతదేశమంతా తిరిగి దివ్యక్షేత్రాలను దర్శనీయమైన ప్రసిద్ధ స్థలాలను వీక్షించారు.

తమ పర్యటనంతా ముగిసిన తర్వాత రాజగురువు ఇలా అన్నారు :

"నెలరోజులు మేము చేసిన దేశ పర్యటనలో స్వామి మా వెంట వుండి మాకు ఏ విధమైన అసౌకర్యమూ లేకుండా , ప్రతిచిన్న విషయంలోనూ మాకు సాయపడినట్టు స్పష్టంగా తోచింది.

విజయపురి , నాగార్జునసాగర్, తిరుపతి, కంచి, మద్రాసు , మథుర, ఢిల్లీ, ఆగ్రా, హరిద్వార్, హృషీకేశ్ , అయోధ్య, సారణార్థ్, గయ, నలందా, కలకత్తా ఈ స్థలాలన్నింటా , ప్రత్యక్షంగానో, పరోక్షంగానో స్వామితో మాకు సంబంధం ఏర్పడింది.....

స్వామి నామం , స్వామి రూపం , స్వామి దండం, స్వామి పాదుకద్వయం ...... ఇవన్నీ నా హృదయసీమల్లో స్థిరంగా చోటుచేసుకున్నవి ! "

# అంధురాలికి దృష్టి !

1963 ఆశ్వీయుజమాసం. తిరుచిరాపల్లిలో జాతీయ కళాశాల వద్ద నవరాత్రి ఉత్సవాలు జరుపుతున్నారు కంచికామకోటి పీఠాధిపతులు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ, శ్రీ జయేంద్రసర స్వతీ.

ఉత్సవం తిలకించటానికి వచ్చే వేలాది భక్తుల నిమిత్తం విశాలమైన పందిళ్ళు వేశారు. ఆ తొమ్మిది రోజులూ పెద్దస్వాములు దీక్షలో ఉండి, నవరాత్రులకు సంబంధించిన కార్యకలాపాలను స్వయంగా కొనసాగిస్తున్నారు. ప్రముఖులైన వారికి ప్రత్యేక దర్శనాలూ, ఇంటర్వ్యూలు వగైరా రద్దు చేశారు ఆ తొమ్మిది రోజులూ.

స్వామి దర్శనానికి వచ్చిన భక్తులలో సుమారు 90 సంవత్సరాల వయస్సు గల ఒక వృద్ధురాలున్నది. వార్ధక్యానికి తోడు ఆమె కళ్ళుకూడా ఆమెకు కనిపించవు. మూడు రోజులుగా ఆ ముదుసలి ఉపవాసాలు కూడా చేస్తున్నదట. 20 మైళ్ళ దూరం నుంచి ప్రత్యేకంగా స్వామి దర్శనం కోసం వచ్చింది.

'శివ శివా హరహరా' అనటం తప్పితే , మరేమీ మాట్లాడదు. ఆహారం అడగదు. ముందు స్వామి దర్శనం కావాలి అంటుంది. నవరాత్రి దీక్షలో ఉండగా స్వామి దర్శనం ఆమెకు సాధ్యమేనా , అని అందరూ సందేహించారు.

కాని , అక్కడ చేరిన భక్తులలో ఒకరికి ఒక యోచన తోచింది. గదిలో నుంచి స్వామి ఒక ద్వారం గుండా రోజుకు ఒకటి రెండు మారులు వెలుపలికి వస్తుంటారు. ఈ ముదుసలిని ఆ వాకిలి పక్కగా కూర్చోబెట్టారు ఆ భక్తుడు. ఇహ , అక్కడే కూర్చొని 'శివశివా , హరహరా' అంటూ తన 'హఠం' సాగించింది ఆభక్తురాలు ! ఆమెను చూట్టానికి స్వామి బయటికి రావచ్చు అన్న ఆశతో అక్కడ కొన్ని వందలమంది మూగారు.

ఇంతలో తలవని తలంపుగా , స్వామి వారి శిష్యులలో ఒకరు తలుపు తీసుకుని వెలుపలికి వచ్చి వాకిలి పక్కన కూర్చొని జపం చేస్తున్న ఆ భక్తురాలిని చూశాడు. చుట్టూ చేరిన

వాళ్ళందరూ ఆమె కథ వినిపించారు ఆ శిష్యుడికి. శిష్యుడు గబా గబా లోపలికి వెళ్ళి ఆ భక్తు రాలి సంగతి స్వామికి తెలియజేశారు.

మధ్యాహ్నం పూజకు గాను పూజా మందిరంలోకి వెళ్ళబోతున్న స్వామి , శిష్యుడు చెప్పిన వార్త వినగానే వెనక్కు తిరిగి, వాకిలి తలుపు తీసి వెలుపలికి వచ్చారు. ఎర్రని ఎండలో 'శివశివా హరహరా' అంటూ కూర్చొన్న ఆ వృద్ధురాలిని చూశారు.

"ఏం పాటీ! (అవ్వా!) నేను నిన్ను చూడటానికి వచ్చాను. ఎంత సేపటినుంచి ఇక్కడ కూర్చున్నావు !'' అని అరవంలో అడిగారు స్వామి ఆ అవ్వను.

ఆమెకు కాస్త చెవుడు కూడా ఉన్నందున చుట్టూ ఉన్న భక్తులు ఆమెకు వినిపించారు స్వామి మాటలు.

ఆ మాటలు విని ఆ అవ్వ బిగ్గరగా అరుస్తూ 'వచ్చావా నా దేవుడా!వచ్చావా నా తండ్రీ, నన్ను దీవించటానికి.

'కాసేపు నా ఎదుటనే నిలబడు, నేను నీ కాళ్ళకు మొక్కాలి' అన్నది అరవంలో.

'అవ్వా , నీకు చూపు లేదు కదా ఎలా చూస్తావు నన్ను ?'

'పోనీ దగ్గరకు వస్తే నీ మాటన్నా వింటాను.'

'అట్లా కాదు నేను చెప్పినట్టు చెయ్యి' అన్నారు స్వామి ఆమెతో.

ఆ ఎండలో ఆమెను కాస్త దూరంగా నిలుచోబెట్టారు. స్వామి ఆమె చుట్టూ ప్రదక్షిణం చేశారు. ఆ ప్రదక్షిణంలో ఎనిమిది దిక్కులలో , ఒక్కొక్క దిక్కులో ఒక్కొక్క క్షణం ఆగుతూ 'నేను నీకు కనపడుతున్నానా, నన్ను నీవు చూస్తున్నావా ?' అని అడిగారు స్వామి అవ్వను.

"ఆ ఆ! నీ కాషాయ వస్త్రం కనిపిస్తున్నది. చేతిలో నీ దండం కనిపిస్తున్నది.....' అంటూ వరుసగా వర్ణించింది స్వామి రూపమంతా! స్వామి ప్రదక్షణ పూర్తి చేసేసరికి, '20 ఏళ్ళ కిందట నిన్ను నేను చూసినప్పుడు నాకళ్ళకు ఎట్లా కనిపించావో , ఇప్పుడు మళ్ళా అట్లాగే అచ్చం అట్లా గే కనిపిస్తున్నావు, నా తండ్రీ' అన్నది.

స్వామికి సాగిలపడి నమస్కారం చేసింది.

చుట్టూ ఉన్న భక్తులంతా ఆశ్చర్య సంభ్రమాలతో ఆ అంధురాలి గురు భక్తిని ఒకటే పొగిడారు. స్వామి మహిమను  కొనియాడారు.

*ఆపద్ధర్మం*

ఆపద్ధర్మం ఆపన్నిమిత్తంగా వచ్చింది. ఆ ఆపద తొలగగానే మానవుడు సాధారణ ధర్మాచరణను తక్షణం అవలంబించాలి.

# అది ఒక లీల!

1965లో మద్రాసు సమీపాన తిరువొత్తియూర్‌లో నా షష్టిపూర్తి స్వామి సమక్షంలో శాస్త్రీయంగా జరగటం నా అదృష్టం.

అది మొదలు ఏటేటా నా జన్మ నక్షత్రం నాటికి దేశంలో స్వామి ఏమూల ఉన్నా అక్కడికి వెళ్ళి స్వామిని సందర్శించి రావటం ఈశ్వరానుగ్రహం వల్ల ఈనాటి వరకూ నిరంతరాయంగా జరుగుతున్నది.

1971 డిశంబరులో నా జన్మదినానికి స్వామి దర్శనం చేయ్యాలి. స్వామి కార్యక్రమం తెలుపవలసందని కంచి మఠం వారిని కోరాను.

'ప్రస్తుతం చిత్తూరు జిల్లాలో మారుమూల గ్రామాల్లో ఎక్కడో పర్యటన చేస్తున్నారు. మీరు వెళ్ళే రోజుకు ఎక్కడ మకాం చేస్తారో చెప్పటం సాధ్యంకా'దని మఠం వారు సమాధానం రాశారు.

నిజమే. కదాచితుగా తప్ప , సంచారంలో ఉన్నప్పుడు స్వామికి ఒక నిర్ణీత కార్యక్రమం అంటూ ఉండదు. మంత్రులకూ, ఉద్యోగస్తులకూ ఉన్నట్టు. ఏరోజు ఎక్కడ ఉంటారో, ఎక్కడ నుంచి ఎక్కడకు బయలుదేరుతారో , అంతే వాసులయిన శిష్యులకూ , అత్యంత సన్నిహితులకు కూడా సరిగ్గా తెలియదు. స్వామి ఎప్పుడు బయలుదేరితో అప్పుడు మూట ముల్లే సర్దుకొని శిష్యులు వెంట నడుస్తారు.

మాటవరుసకు 'మూటముల్లె' అన్నానే కాని మూట తప్పితే , ముల్లె అంటూ ఏమీ ఉండదు. స్వామి ప్రయాణంలో. 'కరతల భిక్షా, తరుతల నిద్రే' కదా !

ఏమైనా సరే, డిసెంబరు 15 కు చిత్తూరు జిల్లాలో స్వామి ఎక్కడ ఉంటే అక్కడ వారి దర్శనం చేద్దామని కృతనిశ్చయులమై దంపతులం ఇద్దరం భద్రాచలం నుంచి బయలుదేరి తిరిపతి చేరుకున్నాము. తిరుపతి చేరితే , స్వామి ఎక్కడ ఉండేది అక్కడ బస్సులవాళ్ళు గానీ, ఇతరులెవరైనగానీ మాకు చెప్పగలరనే నమ్మకంతో.

తిరుపతి సత్రాల్లో వారినీ వీరినీ వాకబు చేశాము. కొద్ది రోజుల కిందట ఫలానా గ్రామం లో ఉన్నట్టు విన్నామనీ , అక్కడికి వెళ్లితే ప్రస్తుతం ఉండేదీ తెలియవచ్చునీ , బస్సు కండక్టర్లు ఒకరిద్దరు చెప్పారు. ఆ మాత్రం ఆధారం దొరికినందుకు సంతోషించి బస్సు ఎక్కి , వారు చెప్పిన ఊరికి టికెట్లు తీసుకున్నాం.

మేము బయలు దేరే ముందు తిరుపతిలో కుంభవృష్టి. ఆ ముందు రోజు ఒక్క చిను కు లేదు. ఆకాశం చిల్లి పడ్డట్టు కురిసింది. సగం తడుస్తూ బస్సు ఎక్కాము. ఆమర్నాడే నా జన్మదినం కాబట్టి ఎట్లాగయినా సరే , ఆ నాటికి స్వామి సమక్షంలో ఉండాలి అది మా సంక ల్పం.

బస్సు ఎక్కి కూర్చొని ప్రయాణీకులను ఒక్కొక్కరినీ అడగటం మొదలు పెట్టాను. ఆరా తీయగా తీయగా చివరకు ఒక కొండ గుర్తు దొరికింది. అక్కడికి సమీపంలో రామగిరి అనే కొండ ఉంది. ఆ కొండ దిగువన వాలీశ్వరాలయం ఉంది. కొండపైన మరొక ఆలయం స్కందగుడి కాబోలు ఉన్నది.

ఆ ఆలయాలు శిథిలావస్థలో ఉంటే , వాటిని పునర్నిర్మాణం  చేయటానికి సమీప గ్రామస్తులు కొందరు నడుం కట్టారు.  కంచి స్వామిని రప్పిస్తే ఆలయ పునరుద్ధరణ సులభం గా నెరవేరుతుందని వారి విశ్వాసం. ఆ విధంగా స్వామి అక్కడ మకాం చేస్తున్నారని కొందరు ప్రయాణీకులు చెప్పారు. బస్సు దిగి స్వామి ఉన్న రామగిరి చేరుకున్నాము.

నా అదృష్టం వల్ల స్వామి చుట్టూ జనం లేరు. ఆలయానికి దగ్గరగా చిన్న కొలను గట్టుపైన కూర్చున్నారు స్వామి ఏకాతంగా. గబా గబా వెళ్ళి స్వామికి సాష్టాంగ పడ్డాము.

మర్నాడు నా జన్మనక్షత్రమనీ , భద్రాద్రి నుంచి బయలు దేరి తిరుపతి వచ్చామనీ , తిరుపతి నుంచి దారిలో స్వామి ఎక్కడున్నారు అంటూ ఒక్కొక్కరినీ అడుగుతూ చివరకు రామ గిరి చేరామనీ విన్నవించాము.

స్వామి : మీరు వచ్చేప్పుడు తిరుపతిలో వర్షం కురిసిందా ?

నేను : ఎక్కడి వర్షం స్వామీ, కుండపోతగా కురిసింది. మేమిక్కడికి చేరుకోగలమా అని సందేహించాము.

స్వామి : అలాగ ! తిరుమలపై ఈ మధ్య వర్షాలు లేక యాత్రికులు నానా అవస్థలు పడ్డారు. ఆలయం ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు నా సలహా అడిగారు. వరుణ జపాలు చేయించవల సిందని చెప్పాను. వాటిని చక్కగా నిర్వహించగల పురోహితులను కూడా ఏర్పాటు చేశాము. మండలం రోజులు దీక్షతో , ఆహారనియమంతో జపాలు చేయాలి. నిన్నటితో 40 రోజులు పూర్తి అయినాయి - అందుకని అడిగాను.

మేము ఆశ్చర్య పోయాము. ఈ కాలంలో కూడా వరుణ జపం చేస్తే వానలు కురవటం సంభవమేనా !

జజజజజ

భద్రాద్రిలో మా 'బిల్వవనం నుంచి భద్రంగా మూటకట్టుకు తెచ్చిన బిల్వపత్రాన్ని స్వామి ముందు ఉంచాము. ఆ బిల్వ వృక్షం మా భూమిలో కొంత కాలం క్రితం స్వామి వారు స్వహస్తంతో నాటిందే. పత్రాన్ని కళ్ళకు అద్దుకుని దానిని వాలీశ్వరాలయంలో ఈశ్వరుడికి అర్చన చేయటానికి పంపారు స్వామి.

జజజజజజ

కొంతసేపయ్యింది. సావకాశంగా స్వామి మాటలు వింటూ కాలం గడపటానికి అవకాశం లభించింది గదా అని ఆనందిస్తున్నాము. ఇంతలో కొందరు పురజనులు వచ్చారు. కొండ పైన ఉన్న ఆలయం చూడవలసిందని స్వామిని ప్రార్థించారు.

స్వామి బయలుదేరారు. ఇద్దరు శిష్యులు స్వామి వెంట వచ్చారు. మేము కూడా స్వామితో వెంట నడిచాము. కొండ పైకి దారి తిన్నగా లేదు. మెట్లన్నీ శిథిలమై పోయినై. అడుగులో అడుగు వేసుకుంటూ , కింద చూస్తూ , జాగ్రత్తగా నడవాలి. దానికి తోడు స్వామికి ఒక కన్ను పూర్తిగా కనిపించదు.

శిష్యులు స్వామికి అరవంలో చెపుతున్నారు. 'ఇక్కడ అడుగువేయండి, అక్కడ కాదు. ఇటూ అటూ' అంటూ. శిష్యులైనా స్వామిని తాకరు కదా ! శిష్యులు చెప్పినట్టే చేస్తున్నారు స్వామి.

ఇంతలోకి రానే వచ్చింది వాన. దారీ తెన్నూ లేని మెట్లు అసలే కాళ్ళు జారేట్టున్నవి. చూపు గలవాళ్లకే భయమేస్తున్నది. ఎక్కడ కాలు జారుతుందోనని. మరి స్వామి మాటో! 'వాన నిలిచేవరకైనా ఆగండి' అని చెప్పగల ధైర్యం ఎవరికుందీ ? ఏం చెయ్యాలి అని అందరూ యోచిస్తున్నారు. 'ఆగితే బాగుండును' అని గుస గుసలాడుతున్నారు.

శిష్యులు చెపుతుంటే అడుగులో అడుగు పెడుతూ నడిచిన స్వామి, గబ గబా అందరి కంటే ముందుగా నడవటం మొదలుపెట్టారు.! మిగిలిన వాళ్లు స్వామిని అనుసరించటమే కష్ట మయ్యింది!!

దారిలేని దారిలో, పై పెచ్చు వర్షంలో , కాలు పెడితే జారిపడే కొండరాళ్ళపైన , సరిగ్గా కళ్లు కనిపించని స్వామి అందరికంటే ముందుగా ఎలా నడవగలిగారో స్వామికే తెలియాలి!

ఇలాంటి లీలలు అనేకం అప్పుడప్పుడు స్వామి ప్రదర్శిస్తూ ఉంటారు. ప్రదర్శించటం కాదు, అవి జరుగుతూ ఉంటవి. ఎప్పుడో , ఎందుకో , ఎవరి కొరకో , మనం ఊహించలేం.

ఒక్కటి మాత్రం నిజం. జ్ఞానులకూ యోగులకూ మహాతపస్వులకూ లభ్యమయ్యే సిద్ధులన్నీ సహజంగానే ఉన్నవి స్వామికి.

'జన్మౌషధి మంత్ర తపః సమాధిజాః సిద్ధయః'

అంటూ , సిద్ధులు పుట్టుకతోనే సిద్ధించవచ్చునంటాడు పతంజలి మహర్షి.

ప్రకృతి శక్తులపై అధికారం చలాయిస్తారు స్వామి అనటానికి అనేక నిదర్శనాలు ఉన్నాయి. వర్షం కురవమంటే కురుస్తుంది. ఆగమంటే ఆగుతుంది !

*నైష్కర్మ్యానికి మార్గం*

సకాలంలో సత్కర్మలను ఆచరించటమే నైష్కర్మ్యానికి మార్గం. కర్మే అకర్మణ్యతకు సాధన మవుతుంది. ఆ పిమ్మట పొందదగిన దంటూ లేదు.

# జర్మనీ పర్యటనమా, జగద్గురు ఆదేశమా?

హిందూ ధర్మశాస్త్రం ప్రకారం శిష్టాచారపరులు సముద్రాలు దాటి విదేశాలకు వెళ్ళ రాదు. విధిలేక వెళితే, తిరిగివచ్చి ప్రాయశ్చిత్తం చేసుకోవాలి.

కాని, ఈ కాలంలో ఈ నిషేధాన్ని పాటించేవారు నూటికి కోటికి ఒక్కరూ లేరు. శిష్టాచారుల మాటేమిటి, సన్యాసదీక్ష పుచ్చుకున్న స్వాములెందరో, తీర్థయాత్రలు సేవించినట్టు ఏటేటా విదేశాలు తిరిగి వస్తుంటారు. కొందరు డబ్బు మూటలుకట్టి తెస్తుంటారు.

జజజజజజ

1967లో విజయవాడలో నేను 'ఆంధ్రప్రభ' సంపాదక పదవిలో ఉన్నప్పుడు, తమ దేశాన్ని సందర్శించడానికి  పశ్చిమజర్మనీ ప్రభుత్వం నాకు ఆహ్వానం అందజేసింది.

భారతీయ పత్రికా ప్రతినిధి వర్గంతో లోగడ 1940లో మలయా, సింగపూర్లు పర్యటించి వచ్చానుగాని, పశ్చిమదేశాలు సందర్శించే అవకాశం అప్పటికి నాకు కలగలేదు. అందుచేత, పశ్చిమజర్మనీ వారి ఆహ్వానం నాకు ముదావహమే అయింది.

జర్మనీ ఎలాగూ వెళుతున్నాను కదా, ఆ దేశంతోపాటు ఫ్రాన్సు, ఇంగ్లండు దేశాలను కూడా చూడాలనుకున్నాను. మనదేశంలో ఉన్న ఆ దేశాల రాయబారులకు నా అభిమతం తెలి యజేశాను. వారంత తమ తమ దేశాల్లోని చారిత్రక, కళా, సాహిత్య రంగాలకు చెందిన ప్రసిద్ధ స్థలాలను చూడడానికి కావలసిన సౌకర్యాలన్నీ కలగజేస్తామన్నారు.

పశ్చిమజర్మనీ కొంతకాలం ఆచార్య పదవిలో ఉండి, ఆ దేశంతో బాగా పరిచయం గల నా మిత్రులు డాక్టర్ వి.యస్.శర్మ, జర్మనీ దేశస్తురాలైన ఆయన సతీమణీ, ఇరువురితో మాట్లా డాను. జర్మనీలో కలుసుకోదగిన ప్రధాన వ్యక్తులు పలువురను గురించీ, చూడదగిన సంస్థల ను గురించీ తెలుసుకున్నాను. వీసా, పాస్‌పోర్టు వగైరాలన్నీ సిద్ధం చేసుకున్నాను.

కొద్ది రోజులలో ప్రయాణం జరగవలసి ఉంది. ఇంతలో కంచి శ్రీ శంకరాచార్య స్వామి ని సందర్శించి, వారి ఆశీర్వాదం పొందాలనుకున్నాను.

స్వామివారప్పుడు ఆంధ్రదేశంలో కాళహస్తి మకాంలో ఉన్నారు. స్వామిని దర్శించి, నా విదేశయాత్రా సంకల్పం విన్నవించాను.

"పశ్చిమజర్మనీకి నిన్ను మీ ఆఫీసువారు పంపుతున్నారా?నీ అంతట నీవే వెళుతున్నావా?' అని స్వామి అడిగారు.

నేను: ఆఫీసు పనిమీద వెళ్ళడం లేదు. ప్రధాన తెలుగు పత్రికకు సంపాదకునిగా పశ్చిమ జర్మనీ ప్రభుత్వం నన్ను వ్యక్తిగతంగా ఆహ్వానించింది.

స్వామి: ఆఫీసు తరపున కాకపోతే, ప్రయాణం విరమించుకోవడం మంచింది.

పశ్చిమ దేశాల పర్యటనకు నేను పొందిన ఉత్సాహం, ఆ సందర్భంలో పలువురితో నేను సలిపిన సంప్రదింపులూ, ఈ అవకాశం నాకు లభించినందుకు పాత్రికేయులూ, మిత్రులూ  నాకు అందజేసిన అభినందనలూ, ఇంగ్లండు, ఫ్రాన్సు దేశాల రాయబారుల సానుభూతి, సహకారాలూ, అన్నీ ఒక్క క్షణంలో మెరుపు మెరిసినట్టు నా కళ్ళకు పొడగట్టినయ్.

మనం సొంతంగా ఎంత డబ్బు వెచ్చించినా, ఆయా దేశాల ప్రభుత్వ సహకారం లేనిది, అంత పరిశీలనగా దేశాలను చూడగలమా? ఇంత చక్కటి అవకాశం జీవితంలో మరల మరల లభిస్తుందా? అయాచితంగా వచ్చిన ఈ ఆహ్వానాన్ని పూర్వాచారంపైగల అభిమానంతో తోసిపుచ్చవలసిందేనా?

ఈ విధమైన ఆలోచనలు మనస్సును కలతపరిచాయి. రాయడానికి ఇంత రాశానేగాని, ఈ ఆశలూ, నిరాశలూ ఇవన్నీ మనసులో మెదలడానికి నిమిషం కూడా పట్టలేదు.

అంతలోనే, మరో విచారధార సముద్రంలో కెరటంలా పైకెగిసింది.

ఏమిటీ వ్యామోహం? ఎందుకీ చాపల్యం? ఎన్ని దేశాలు సంచరిస్తే ఏమి? ఎన్ని ప్రసిద్ధ స్థలాలు సందర్శిస్తే ఏమి? ఎందరు ప్రముఖులను కలుసుకుంటేనేమి?

పరదేవతా స్వరూపులైన గురుదేవుల ఆజ్ఞాపాలనంతో పోలిస్తే ఇవన్నీ ఏపాటి? వీటి విలువ ఎంత? అన్న యోచన స్ఫురించింది. పైకెగసిన కెరటం నేలకు వాలింది!

నా ఆనందానికి అవధులు లేవు!

# మూగికి మాటలు!

శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి మహాస్వామి దక్షిణ దేశంలోని చిదంబరం యాత్ర ముగించుకొని, సమీపంలో ఉన్న ఆనందతాండవపురం చేరారు.

ఆ ఊరిలో పండితులూ, ప్రజలూ స్వామికి అఖండస్వాగతం సమర్పించారు.

ఆ జనసమూహంలో అనేకమంది బాలురున్నారు. ఆ బాలు రందరినీ పిలిచి, 'శ్రీ రామాయనమః' అని నూరు పర్యాయాలు వ్రాసి, ఆ వ్రాసిన పత్రాలను తనకు చూపించవల సిందిగా స్వామి వారికి చెప్పారు.

అదేవిధంగా వారంతా 'శ్రీరామాయనమః' అని నూరుసార్లు వ్రాసి, ఆ పత్రాలన్నింటిని స్వామికి సమర్పించారు.

వారందరికి ఒక్కొక్కరికి ఒక్కొక్క కామాక్షి అమ్మవారి బంగారు ముద్రను స్వామి బహు కరించారు.

వారిలో ఒక బాలునికి అమ్మవారి ముద్ర ఇవ్వబోతూ, స్వామి అరవంలో "సొల్లు, సొల్లు " నీవు వ్రాసింది నీ నోటితో 'చెప్పు చెప్పు' అని ఆదేశించారు.

అక్కడ స్వామి చుట్టూ మూగిన పండితులందరూ "అయం మూకః, అయం మూకః" (అతడు మూగవాడు, మూగవాడు) అని సంస్కృతంలో స్వామికి విన్నవించారు.

అయినా,స్వామి వారి మాటలను విననట్టుగా మరల ఆ పిల్లవానివైపు తిరిగి "నీ సొల్లు, సొల్లు" (నీవు 'చెప్పు చెప్పు') అన్నారు.

అంతట ఆ బాలుడు "శ్రీ రాయాయనమః" అని అందరూ వినేట్టు బిగ్గరగా అన్నాడు.

"మూకం కరోతి వాచాలం!"

ఈ సంఘటన శ్రీ కల్లూరి వెంకట సుబ్రహ్మణ్య దీక్షితులుగారు స్వయంగా చూచినది.

*వరకట్నాలను నిషేధించాలి*

వరకట్నాలు పుచ్చుకోరాదు. ఆడంబరం కోసం వివాహాదులలో అవసరమైన ఖర్చులు చేయరాదు. స్త్రీలు, విశేషించి శ్రీమంతులైన వారు పట్టుచీరలు ధరించరాదు. మధ్యతరగతి కుటుంబాల దుస్థితికి కారణమవుతున్న కాఫి, టీలను మానివేసి, వాటి బదులు గంజి, లేక మజ్జిగలను పానీయాలుగ పుచ్చుకోవాలి.

# కలియుగ ఋష్యశృంగులు!

1960 మేనెల. స్వామి మధుర సమీపాన ఇలయత్తాన్ గుడిలో మకాం చేస్తున్నారు. కుటుంబంతోసహా మేము రామేశ్వర యాత్రకు బయలుదేరాము. మధురలో మీనాక్షి అమ్మ వారిని సేవించుకుని, ఇలయత్తాన్ గుడికి మధ్యాహ్నానికి చేరుకున్నాము.

ఆనాడే స్వామి జన్మనక్షత్రం. ప్రచండంగా ఎండకాస్తున్నది. నాటుకోటి సెట్లు కట్టించిన అలవిమాలిన సత్రంలో స్వామి, ఒకమూల, చీకట్లో, బియ్యం బస్తాలు పేర్చి ఉన్నచోట బాచి పెట్లు పెట్టుకు కూచుని ఉన్నారు. భక్తులైనా ఎక్కువమంది లేరు. కొందరు సువాసినులు పళ్లూ, పూలూ తెచ్చి స్వామికి సమర్పిస్తున్నారు. కొందరు హారతులు పడుతూ పాటలు పాడుతు న్నారు.

ఆ సత్రపు భవనం ఎంత పెద్దదంటే, బయట ఒకవేళ ఒక బాంబు వేసినా, ఆ శబ్దం లోపలికి వినిపించదు. పాపం శమించుకాక!

కొంతసేపు ఆ కార్యక్రమం కొనసాగింది. ఇంతలో వెలుపలి నుంచి వచ్చిన భక్తులను స్వామి అడిగారు అరవంలో, 'బయట వర్షం కురుస్తున్నాదా?'

భక్తులు: ఆహా, కురుస్తున్నది.

స్వామి: పెద్ద వర్షమా?

భక్తులు: బ్రహ్మాండంగా కురుస్తున్నది. మేము సత్రానికి బయలుదేరి వచ్చేప్పుడు ఎం డలో మా తలలు మాడిపోయాయి. కాళ్లు కాలాయి.

ముత్తయిదువులు స్వామికి హారతులుపట్టే సమయానికి పిలిస్తే వచ్చినట్టు వచ్చింది అంత పెద్దవర్షం - ఆ మే నెల ఎండల్లో!

ఇలాగే ఒకసారి స్వామి సూళ్లూరిపేట ప్రవేశించగానే, ఉన్నట్టుండి వర్షం పట్టుకుంది. ధారాపాతంగా కురిసింది. ఆ ఊరివారు నాతో చెప్పారు, కొన్ని నెలలుగా వర్షాలు లేక అవస్థ పడుతున్నామని!

మరొక నిదర్శనం :

1983 జులై నెలలో కర్నూలు పట్టణంలో కామకోటి పీఠంస్వాములు చాతుర్మాస్యం చేశారు. పరమాచార్య శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి, ప్రస్తుత పీఠాధిపతి శ్రీ జయేంద్ర సరస్వతి, మూడవ ఆచార్య స్వామి విజయేంద్ర సరస్వతి స్వాములు ముగ్గురూ ఆ చాతుర్మాస్యంలో పాల్గొన్నారు. రాష్ట్రం నలుమూలల నుంచీ, పరిసర ప్రాంతాల నుంచి కూడా ఆచార్యత్రయాన్ని సందర్శించడానికి వేలాది ప్రజలు అరుదెంచారు.

స్వాములు కాలు పెట్టడానికి పూర్వం కర్నూలులో నీటికరవు ఏర్పడింది. చాతుర్మాస్యం జరిగే స్థలంలో మరింత ఎద్దడి సంభవించింది. నూరు, నూట ఇరవై మీటర్ల లోతున బోర్లు త్రవ్వినా నీరు పడలేదు. అయినా పరమాచార్యులు సూచించిన ప్రదేశంలో 20మీటర్ల లోతుకే సమృద్ధిగా నీరు పడడం చూచి, పురజనులు ఆశ్చర్యపడ్డారు.

అంతేకాదు; ఒక ఆదివారం ఉదయం ముగ్గురు స్వాములూ సమీపంలో ఉన్న నదిలో స్నానానికి వెళ్ళినప్పుడు అక్కడ మోకాటి లోతుకంటే నీరు లేదు. అద్భుతమేమంటే, వ్యాసపూజ జరిగిన 12 గంటలకు ఎక్కడ నుంచి వచ్చిందో కట్టలు తెగేట్టు నీరు ప్రవహించింది. ఆ మరు నాడు కర్నూలు పట్టణంలో వర్షం ప్రారంభమైంది.

జగద్గురువులు పాదంమోపిన ఫలితమని పట్టణవాసులంతా ఆనందంలో ఓలలాడారు!

జజజజజజ

వాల్మీకి రామాయణం బాలకాండలో ఋష్యశృంగుని గురించి ఇలా వర్ణించబడింది:

తత్ర చానీయ మానేతుత

విప్రేతస్మిన్ మహాత్మని

వవర్ష సహసాదేవో

జగత్ ప్రహ్లాదయం స్తదా.

(మహాత్ముడగు ఆ ఋష్యశృంగుడు అంగదేశంలో కాలిడి నంతనే సర్వ ప్రపంచానికి సంతోషం కలిగేట్టు శ్రీఘ్రంగా వర్షం కురిసింది).

స్వామి కలియుగ ఋష్యశృంగులు!

జజజజజజ

*నేటి ప్రమాణాలతీరు*

ప్రమాణాలలో మొదటిది వేదం. దాని తరువాత ధర్మ శాస్త్రాలు, పిదప పురాణాల వల్ల తెలియదగిన ఋషుల నడవడి. ఆ తరువాత శిష్టాచారం, చివరి ప్రమాణం మనస్సాక్షి. ఈ క్రమాన్నే మనం అనుసరించాలి.

కాని, ఈ కాలంలో అన్నీ తల క్రింద అయ్యాయి. ఇప్పుడు మొదట మనస్సాక్షి; చిట్ట చివరకు వేదం ప్రమాణం!

# జగద్గురు ప్రశస్తి

జపేన హోమేనచ సాధనేన పరేణ చేతో విమలత్వ మాప్తుం,

అశక్త ఆప్నోమి తదీయ పాదౌ ఇష్టార్థసిద్ధ్యై శరణాగతస్సన్.

చిత్తశుద్ధి సంపాదించుకొనడానికి జపాలను, హోమాలను, ఇతర కష్టసాధనాలను నేను ఆచరింపలేను. స్వామి పాదాలనే ఆశ్రయిస్తున్నాను.

యోగధ్యాన తపోఽర్చనాదిక విధై రేతేనయా సాధనై

ప్రాప్తా శక్తి రనేకరీతి విభవా లేశోఽపి తస్యామయి,

స్యందేతేతిచ జన్మనస్సఫలితా స్యాదిత్యహం భక్తిత

స్తచ్చారిత్ర పవిత్రభావన జలైః ప్రక్షాళయే మేమనః.

యోగధ్యానాది సాధనములచేత స్వామి ఏ శక్తిని సంపాదించారో దాని నుండి లేశమైనా నా పైన చిందుననీ, జన్మసాఫల్యం కలుగుననీ ఆశిస్తూ స్వామి పావన చరిత్ర భావనమనే జలంతో నా మనస్సును కడిగివేస్తూ, శుద్ధి చేసుకుంటున్నాను.

*వేదం - రామనామం*

వేదవేద్యుడగు పరమపురుషుడు దశరథాత్మజుడుగ అవతరించినందున రామాయణ రూపం దాల్చిన వేదసారం రామనామంలో అణిగి ఉంది. ఆ రామనామం చిత్తమాలిన్యాన్ని పొగొట్టి వేరొక దానిపై ఆశ కలుగనీయక, సదా ఆనందంగా ఉండేటట్లు చేస్తుంది.

*వేదం - రామనామం*

వేదవేద్యుడగు పరమపురుషుడు దశరథాత్మజుడుగ అవతరించినందున రామాయణ రూపం దాల్చిన వేదసారం రామనామంలో అణిగి ఉంది. ఆ రామనామం చిత్తమాలిన్యాన్ని పొగొట్టి వేరొక దానిపై ఆశ కలుగనీయక, సదా ఆనందంగా ఉండేటట్లు చేస్తుంది.

## "ఆచార్యుల వారిలో అల్లాను చూస్తున్నాను"

1926లో ఆచార్యస్వామి కారంబక్కుడి నుంచి పుదుక్కోటకు వెళ్ళేప్పుడు అనేకమంది ప్రజలు గుంపులుగా వచ్చి వారిని దర్శించారు. వారిలో కొందరు మహమ్మదీయులు కూడా ఉన్నారు.

ఆ మహమ్మదీయులలో ఒకరు స్వామిపై తన గౌరవానికి సూచనగా స్వామి వారెక్కిన పల్లకిని తన చేత్తో పట్టుకున్నాడు. ఆ విధంగా దాదాపు మూడు మైళ్లు ఆ ముస్లిం భక్తుడు పల్లకి వెంట నడిచాడు.

స్వామి అప్పుడు పల్లకి ఆపి, ఆ మహమ్మదీయుని తన సమక్షానికి పిలిపించి, అతని యోగక్షేమాలను విచారించారు.

ఆ ముస్లింభక్తుడు తన స్వవిషయాలను స్వామికి నివేదించి,స్వామి సలహా నర్థించాడు. స్వామిని స్తుతిస్తూ తాను వ్రాసిన పద్యాలను ఫలపుష్పాదులతో స్వామికి సమర్పించాడు.

స్వామి ఆదేశానుసారం ఆ భక్తుడు తాను వ్రాసిన పద్యాలను చదివి, వాటి అర్థం వివరించాడు.

అక్కడి నుండి స్వామివద్ద సెలవు పుచ్చుకుని వెళుతూ ఆ ముసల్మాన్ భక్తు డన్న మాటలివి:

"ఆచార్యులవారి రూపంలో నా కళ్లకు 'అల్లా' కనిపించాడు. భవబంధాలు తెంచుకొని, ముక్తి కోరే వారికి శ్రీవారి దర్శనం చాలు!"

***

*మంత్రశక్తి*

మనం మంత్రజపం చేస్తున్నాం. అది శబ్దతరంగాలను ఉత్పత్తి చేస్తున్నది. ఆ తరంగాలే మంత్రమూర్తులుగా మారుతున్నాయి.

మనం ఉపదేశం పొందిన మంత్రాన్ని అవిరామంగా జపం చేస్తూ ఉంటే ఆ పరాశక్తి అనుగ్రహం మనకు తప్పకుండా సిద్ధిస్తుంది. ఆ మంత్రదేవత మనలను ఆవహించి, కళేబరాన్ని త్యజించే సమయంలో కూడా మనలను వదలిపెట్టదు. ఆ ధ్యానంలోనే మనం ఉండిపోగలం.

## "నీలంరాజును ఎరుగుదువా?"

దేశ సంచారం చేస్తూ కామకోటి పీఠాధిపతి శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి మహారాష్ట్ర లోని సతారా పట్టణంలో కొంతకాలం మకాం చేశారు.

సతారా పట్టణవాసులేగాక, చుట్టుపక్కల ఉన్న ఆ ప్రాంతాల ప్రజలంతా తండోపతండాలుగా వెళ్ళి స్వామిని సందర్శించారు.

సతారాలో ఒక బ్యాంక్ ఉద్యోగం చేస్తున్న ఒక మహారాష్ట్ర యువకుడు అందరితో బాటు ఒకనాడు స్వామి దర్శనానికి వెళ్ళాడు.

స్వామి ఆ యువకుణ్ణి చూశారు. దగ్గరికి రమ్మని పిలిచారు:

"నీలంరాజు వెంకట శేషయ్యను నీవు ఎరుగుదువా?" అని అడిగారు.

ఆ పేరు వినగానే ఆ చిన్నవాడు ఆశ్చర్యపోయాడు:

"తమరు చెప్పిన పేరు మాత్రం నాకు పరిచయమే. ఆయన మా తండ్రిగారికి స్నేహితులు. అయినా, వారిని గూర్చి మా తల్లి ద్వారా వినడమే తప్ప, ఇంతవరకు వారిని నే నెన్నడూ చూడలేదు" ఆశ్చర్యపోతూనే సమాధానం చెప్పాడు.

"సరి, మంచింది. నీకు శుభం జరుగుతుంది" అంటూ, ఆ చిన్నవాడికి ప్రసాదం ఇచ్చి ఆశీర్వదించారు.

***

కొన్ని రోజులకు ఆ కుర్రవాడి దగ్గర నుంచి నా కొక ఉత్తరం వచ్చింది. అది ఇంగ్లీషులో ఉన్నది.

ప్రస్తుతం సతారాలో మకాం చేస్తూ ఉన్న కామకోటి శ్రీ శంకరాచార్యస్వామిని ఇటీవల తాను సందర్శించాననీ, స్వామివారు తనను పిలిచి 'నీలంరాజు వెంకట శేషయ్యను ఎరుగుదువా?'' అంటూ ప్రశ్నించారనీ, స్వయంగా నేను ఎరుగను కాని, ఆయన మా తండ్రిగారి స్నేహితులని సమాధానం చెప్పాననీ, స్వామివారడిగిన ప్రశ్న తనకెంతో ఆశ్చర్యాన్ని, సంభ్రమాన్నీ కలిగించిందనీ, ఆ ఉత్తరంలో రాశాడు.

***

ఉత్తరం చదివిన తరువాత, ఆ చిన్నవానికి కలిగిన ఆశ్చర్యంకంటె పదింతలుగా నేను ఆశ్చర్యపడ్డాను.

ఆ యువకుని తండ్రి మహారాష్ట్రలో కొల్హాపూర్ వాస్తవ్యుడు. పేరు జగదీశ్‌రావ్ సాలిగ్రామ్. హిందుస్థానీ సంగీతంలో విద్వాంసుడు. ప్రఖ్యాత గాయని పద్మాసాలిగ్రాం సోదరుడు. అతడు కొంతకాలం మద్రాసులో ఉన్నాడు. ఆ సందర్భంలో మేమిద్దరం ఆప్తమిత్రులమైనాము. మద్రాసు నుంచి కొల్హాపూర్ వెళ్ళిన తర్వాత అతడు పెళ్ళి చేసుకున్నాడు. ఇద్దరు కుమారులు కలిగిన అనంతరం దురదృష్టవశాత్తూ, అకాలంగా మరణించాడు.

అతడు కొల్హాపూర్ చేరిన పిమ్మట అప్పుడప్పుడు ఒకరికొకరం ఉత్తరాలు రాసుకుంటూ వచ్చామేకాని,మళ్ళా కలుసుకోడం తటస్థించలేదు. అతని కుమారులను నేను అసలే ఎరుగను. ఎంతోకాలం గడిచింది.

ఇలా నాకు మహారాష్ట్ర స్నేహితుడు, సంగీత విద్వాంసుడు ఒకడు ఉండేవాడని స్వామితో నే నెన్నడూ ప్రస్తావించలేదు. అలాంటి అవకాశం ఎన్నడూ కలగలేదు.

అలాంటి పరిస్థితుల్లో, గతించిన నా మిత్రుని గురించి స్వామికి ఎలా తెలిసింది? నా మిత్రుని కుమారుని స్వామి ఎలా గుర్తించగలిగారు?''నేను జగదీశ్ సాలిగ్రాం కుమారుణ్ణి''

అని చెప్పుకుంటే తప్ప నేనైనా ఆ చిన్నవాణ్ణి గుర్తుపట్టలేనే! ఏ సంబంధమూలేని ఆ యువకుని ఫలానా అని స్వామి ఎలా తెలుసుకున్నారు?

స్వామికి ఉన్నదంతా 'అసాధారణమైన ధారణాశక్తి' తప్ప మరొకటి కాదనీ, ఆ శక్తితోనే వారు ప్రజలను ఇలా భ్రమపెట్టగలుగుతున్నారనీ భావించేవారు - మేధావులనే వారిలోనే - కొందరున్నారు. అణిమాది సిద్ధులనూ, అతీంద్రియ శక్తులనూ వీరు నమ్మరు.

కాని, పైన వ్రాసిన దానికీ ధారణా శక్తికీ సంబంధం లేదు. ఒకమారు దేనినైనా వినడమో, చూడడమో సంభవించినప్పుడు, కొంతకాలం గడచిన తరువాత దానిని యథాతథంగా వివరించడం ధారణకు సంబంధించిన విషయం. కనీ, వినీ ఎరుగని విషయాలను కళ్ళకు కట్టినట్టు చెప్పడంతో మేధస్సుకు సంబంధం లేదు. ఇది అతీంద్రియ జ్ఞానం. దేశ కాలావసరాలకు అతీతం. దివ్యదృష్టి. మన లౌకిక జ్ఞానానికి, మన తార్కికశక్తికి మించినది.

***

### సేవకు ప్రతిఫలం

ఒక వ్యక్తి మరొకడికి నిజంగా ఉపకారం చేస్తున్నాడా? ఏమో! అవతలివాడికి నీ వలన వాస్తవంగా ఉపకారం జరుగుతున్నదా లేదా అన్నది సంశయాస్పదం; కాని, నీవు పరులకు మనస్ఫూర్తిగా సాయపడదలచినప్పుడూ, సాయం అందజేసినప్పుడూ నీ మనస్సూ, నీ బుద్ధీ పరి శుద్ధమవుతాయి. ఈ ప్రతిఫలం ఒక్కటీ చాలు నీవు చేసే సహాయానికి.

## భక్త జన సులభులు

భక్తులపై స్వామికిగల వాత్సల్యం అంతా ఇంతా కాదు. భక్తులను సంతృప్తి పరచ టానికి, వారిని సంతోషపెట్టడానికి స్వామి వహించే శ్రద్ధ చెప్పశక్యం కాదు.

ఆధ్యాత్మిక విషయాలను చర్చించే వారి సంగతి అలా ఉంచి, అనేకమంది భక్తులు జీవితంలో తమ కష్టసుఖాలను గురించి, సంసారంలోని చిక్కులను గురించి స్వామితో తమ సమస్యలు చెప్పబోయే సరికి - భక్తి చేతనో, భయం చేతనో, మాటలు తడబడతాయి. ఒకటి చెప్పబోయి వేరొకటి చెబుతారు. అసలు తాము చెప్పదలచింది మరిచిపోతారు, సగం చెప్పి ఊరుకుంటారు. అలాంటి సందర్భాల్లో స్వామి అసహనం చూపరు. తమ సమయాన్నంతా వృథా చేస్తున్నారని అనుకోరు. వారి బాధ ఏమిటో తెలిసికోవడానికి ప్రయత్నిస్తారు. వారి మన స్సులోని మాట రాబట్టడానికి తామే అనేక ప్రశ్నలడిగి, తగిన ఉపాయాలను సూచించి వారి బాధలను ఉపశమింప జేస్తారు.

చూడ వచ్చినవారి పెద్దలను గురించీ, వారి బంధువర్గాన్ని గురించీ పేరు పేరునా అడిగి, వాళ్ల యోగక్షేమా లన్నింటినీ తెలుసుకుంటారు. తమ దూరపు బంధువులను, ఒకవేళ భక్తులెవరైనా మరిచిపోతారేమోకాని, స్వామికిమాత్రం జ్ఞాపకం ఉంటుంది. ఎన్ని సంవత్సరాలు దాటినా ఒక్కొక్క భక్తుని వంశచరిత్ర స్వామి జ్ఞాపకశక్తి అనే బీరువా అరలో ఎలా భద్రపరచి ఉంటుందో ఊహకు అంని విషయం! మఠం వ్యవహారాలను స్వామి స్వయంగా చూచుకునే రోజులలో భిక్ష చెయ్యడానికి వచ్చిన భక్తులు ఆ రోజు భిక్షకు కావలసిన సామగ్రిని - కూర

గాయలతో సహా - తట్టలతో, పళ్ళేలతో తెచ్చి స్వామి ముందు ఉంచేవారు. సాధారణంగా భిక్షకు తెచ్చే సామానంతా, ఇంటియజమాని స్వయంగా వెళ్లి, మార్కెటులో దొరికే వస్తువుల్లో మేలురకాలను ఎంచి, శ్రేష్ఠమైన వస్తువులనే సేకరించి తెస్తాడు. వాటి నన్నింటిని చూచి స్వామి మెచ్చుకోవాలని భిక్ష చేసే వారి కోరిక. వారి హృదయాన్ని కనిపెట్టిన స్వామి ప్రతి వస్తువునూ స్వయంగా చేత్తో ముట్టుకుని పరీక్షించి చూస్తారు.

స్వామి భుజించేవి కాకపోయినా, కుంకుమపువ్వేమిటి, పచ్చకర్పూరమేమిటి, జీడిపప్పే మిటి, సీమబాదం పప్పేమిటి - (స్వామి ఆహారం సాధారణంగా పేలాలూ, మజ్జిగా, ఎవో కొన్ని పండ్లూ) - రకరకాల కూరగాయలు, అవన్నీ ఏయే ప్రాంతాల్లో ఎక్కువగా లభిస్తాయో ఆయా భాషల్లో వాటి పేర్లేమిటో, వాటితో ఎన్ని విధాలైన వంటకాలు చేయవచ్చునో, ఆయుర్వే దం ప్రకారం వాటి గుణగణాలేమిటో, - మనకు తెలియని వివరాలన్నీ ప్రశ్నోత్తరాల మూలంగా స్వామి భక్తుల నుంచి రాబట్టుతారు.

చిన్నతనం నుంచీ సన్యాసదీక్షలో ఉండి, ఆహార విహారాల్లో కఠిన నియమాలను అవ లంభిస్తున్న ఈ స్వామి 'వస్తుగుణదీపిక' నంతా కంఠస్థం చేశారు అని ఆశ్చర్యం వేస్తుంది. కాని, స్వామికి అదొక లీల. తాను చెప్పే మాటలవల్లా, తాను చేసే పనులవల్లా భక్తులు ఆనందిం చాలి. వారి ఆనందం చూచి తానూ తనివి చెందాలి!

ఈ సందర్భంలో నాకొక సంగతి జ్ఞాపకం వస్తున్నది. ఇది జరిగి ఇరవై ఏళ్లు దాటింది. ఆంధ్రదేశ సంచారంలో స్వామి గుంటూరు జిల్లా రేపల్లెలో మకాం చేస్తున్నారు.

నా ప్రతి జన్మదినానికీ స్వామిని సందర్శించి, వారి ఆశీస్సులు పొందిరావడం నాకు అలవాటు. ఆ సంవత్సరం నా కుటుంబంతో సహా విజయవాడ నుంచి బస్సులో రేపల్లె బయ లుదేరాను.

కార్యక్రమం యావత్తు యథావిధిగా ముగిసింది. ఆ రోజు మధ్యాహ్నం మమ్ముల నంద రినీ అక్కడే మఠంలో భోంచెయ్యమన్నారు. అందరం కలిసి వనభోజనంలా చెట్ల నీడన భుజి స్తున్నాము. ఎక్కడి నుంచి వచ్చారో ఏమో, మేము భోజనాలు చేసేచోట, స్వామి ఒక బల్లపైన

కూచున్నారు. మా విస్తళ్లల్లో వడ్డించిన శాకపాకాలు చూసి, వాటిని గురించి మాట్లాడడం మొదలు పెట్టారు. ఏయే వంటకాలు, ఏ ప్రాంతంవారు, ఏ విధంగా తయారు చేస్తారో వివరంగా చెప్పసాగారు.

స్వామి మాటలు వింటూ ఉంటే, భోజన పదార్థాలు మాకు మరింత రుచిగా తోచాయి. వారి మాటలు ఆలకిస్తూ, ఇన్ని విషయాలను గురించి ఇంత పరిజ్ఞానం పుట్టు సన్యాసి అయిన ఈ స్వామికి ఎలా అమరిందా అని ఆశ్చర్యపోతూ ఆనందంగా భోంచేస్తున్నాం.

ఇంతలో ఎక్కడి నుంచి ఊడి పడ్డాడో మఠం మేనేజర్ శ్రీ విశ్వనాథయ్యర్, దూరం నుంచే స్వామిని చూసి, ఉరుమినట్టు బిగ్గరగా, ''స్వామికి ఇహ విశ్రాంతి అంటూ అక్కరలేదా? పగళ్లూ, రాత్రులూ భక్తులతో సంభాషణ లేనా?'' అని అరిచాడు. విశ్వనాథయ్యరు ఎంతో కాలంగా మఠం మేనేజరుగా ఉండి, పీఠాన్ని, స్వామినీ సేవిస్తున్నాడు. స్వామిపై ఆయనకు అంత స్వతంత్రం.

కేక వింటూనే స్వామి గబగబా లేచి, కాషాయం సర్దుకుని, పసిపిల్లవాడు పరుగెత్తినట్టు మమ్మల్ని వదిలిపెట్టి, పాకలోకి ప్రవేశించారు.

భక్తులపై స్వామికి అంత అనురాగం. తన నిద్రాహారాలు ఆయన కొకలెక్కలోవి కావు.

''దళమైన పుష్పమైనను
ఫలమైనను సలిలమైన బాయని భక్తిన్
గొలిచిన జనులర్పించిన
నెలమిన్ రుచిరాన్నముగనె యేను భుజింతున్''

అని కుచేలోపాఖ్యానంలో శ్రీకృష్ణుడు అన్నట్టు, స్వామికి మనం సమర్పించే టెంకాయలూ, అరటిపండ్లూ కావు; ఆ మహనీయునిపై మనకు గల భక్తి అమూల్యం.

సౌజన్య సింధువు స్వామి!

***

*సినిమాలు: చిత్తశాంతి*

నాట్యజీవనులైన భరతపుత్రులకు కొన్ని నియమాలు ఉండేవి. నాటకంలో దంపతుల వేషాలు ధరించే స్త్రీపురుషులు జీవితంలో దంపతులై ఉండాలేగాని, పరపురుషునికి భార్యగా స్త్రీ నటించకూడదు. నేటి నాటకాలలోనూ, సినిమాలలోనూ ఈ నియమాన్ని ఉల్లఘించడంవల్ల సంఘంలో బహిరంగంగా నేమి,చాటుమాటుగా నేమి అవినీతి ప్రబలిపోతున్నది.ఇంతకూ, నేటి సినిమాలు కామాది ప్రకోపనమే పనిగా పెట్టుకున్నవి. చిత్తశాంతినీ, ఆనందాన్నీ చేకూర్చే నాటకాలు, సినిమాలు మృగ్యమైనవి.

## నీ కర్తవ్యం నీవు నిర్వర్తించు!

ఎంతటి స్వల్ప విషయంలో నైనా తమ కర్తవ్య నిర్వహణలో స్త్రీలూ, పురుషులూ అప్రమత్తులుగా ఉండడం అవసరమని బోధిస్తారు స్వామి.

ఉదాహరణ:

తమ పర్యటనలో ఒక గ్రామంలో పూజ పూర్తిచేసి భక్తులకు తీర్థమిస్తున్నారు స్వామి. ఒక ఇల్లాలు తన కుమార్తెను, అయిదేండ్ల పిల్లను వెంటబెట్టుకుని తీర్థం పుచ్చుకోడానికి వచ్చింది.

స్త్రీ లందరూ ఒక ప్రక్కగా, పురుషు లొక ప్రక్కగా నిలబడి, తీర్థం పుచ్చుకోడానికి సిద్ధంగా ఉన్నారు. ఈ సందడిలో ఆ పిల్ల మెళ్లో ఉన్న బంగారం గొలుసు కాస్తా, ఏ 'పుణ్యాత్మురాలో' తస్కరించి దాచేసింది.

గొలుసు పోగొట్టుకున్న పిల్ల ఏడవసాగింది. అమ్మలక్కలంతా 'అయ్యో, గొలుసు పోయిందా' అంటూ పిల్లనూ, తల్లినీ ఓదారుస్తున్నారు.

తక్కిన స్త్రీ లందరితోపాటు ఆ పిల్ల తల్లి కూడా తీర్థం పుచ్చుకునేందుకు 'క్యూ'లో నిలబడింది. స్వామిని సమీపించింది. తక్కిన వారందరికీ తీర్థమిచ్చి, ఆమెను మాత్రం 'క్యూ'లో నుంచి తప్పుకుని, ప్రక్కగా నిలబడమన్నారు స్వామి.

స్వామి ఎందుకు అలా అన్నారో ఎవ్వరూ ఊహించలేకపోయారు.

ఇంతలో ఒక ముసిలావిడ తీర్థకోసం స్వామి దగ్గరకు వచ్చి చెయ్యిచాపింది.

ఆమెను ఉద్దేశించి స్వామి, ''ఇచ్చేసెయ్యి'' అన్నారు.

''నా దగ్గ రేముంది ఇవ్వడానికి?'' అన్న దా ముసలమ్మ.

''ఒక్కటి చాలదా, ఇంకా ఎన్ని పాపాలు మూటకట్టుకుంటావు?'' అన్నారు స్వామి.

ఆ మాటలు విని కొందరు ఆడవారు ఆ వృద్ధురాలి చీరె విదిలించ మన్నారు. పరిశీలించగా చీరె మడతల్లో దాచిన బంగారం గొలుసు బయటపడ్డది. దాన్ని తీసి స్వామి వద్ద పెట్టారు.

గొలుసు పోగొట్టుకున్న ఇల్లాలిని స్వామి దగ్గరకు పిలిచారు. తీర్థం ఇచ్చారు. ఇలా అన్నారు:

''అదిగో నీ గొలుసు, తీసుకో. ఇకనుంచి మాత్రం, చెయ్యవద్దన్న పని చెయ్యకు'' అన్నారు స్వామి.

''ఇక మీదట ఎప్పుడూ అట్లా చెయ్యను స్వామీ'' అంటూ చెంపలు వేసుకుని ఆ గృహిణి, పమిట కొంగుతో కన్నులు తుడుచుకుంది.

ఏమిటా ఇల్లాలు చేసిన తప్పు?

ఆమె భర్త ఆ ఊళ్లో ఒక గుమాస్తా ఉద్యోగం చేస్తున్నాడు. ఉద్యోగానికి టైము తప్పకుండా వెళ్లాలి. తనకు అన్నం వడ్డించి తరువాత పూజకు వెళ్లమని భార్యతో చెప్పాడు.

కాని, పూజకు ముందుగా పోవాలని తొందరపడి, ఆదరాబాదరాగా అన్నం వండి, అక్కడ పడేసి, పిల్లను తీసుకుని గబాగబా బయలుదేరి వచ్చిందా ఇల్లాలు.

''తీర్థం మీద నీకెంత శ్రద్ధ ఉన్నా, నీ ధర్మాన్ని నీవు వదలి పెట్టకు, నీ భక్తి కంటె అది అధికమైంది.'' అని ఆమెకు బోధపడింది.

***

# "అదే నాకూ ఆశ్చర్యం!"

మద్రాసు మకాంలో మైలాపూరులోని సంస్కృత కళాశాల భవనంలో స్వామి విడిది. భవనం చుట్టూత పందిళ్లు వేశారు. వేలాది ప్రజ కూచునేందుకు.

ఒక రోజున త్రిపురసుందరీ, చంద్రమౌళీశ్వరుల రెండో కాలం పూజ జరుగుతున్నది. చుట్టూ వేసిన పందిళ్లు చాలక భక్తులు చాలా మంది ఆరు బయట నిలిచి పూజ చూస్తున్నారు.

అనుకోకుండా ఆకాశం మేఘావృతమైంది. వర్షం పడుతుందేమోనని బయట నుంచున్న జనం ముందుకు ముందుకు తోసుకువస్తున్నారు. భారీవర్షం కురిస్తే పందిళ్లయినా ఆగేట్టు లేవు. తడిసిపోతా మని భక్తులు ఆందోళన పడుతున్నారు.

ఆనాడు చిన్న స్వామి శ్రీ జయేంద్ర సరస్వతి కూచున్నారు. పెద్దస్వామి పందిరి వెలుప లికి వచ్చి ఆకాశంవైపు చూస్తున్నారు అదే పనిగా. కొన్ని నిమిషాలు అయ్యే సరికి, అంతగా భయపెట్టిన కారు మేఘం చెక్కలు చెక్కలుగా చెదిరిపోయింది. సహస్రకిరణాలతో సూర్య భగవానుడు దర్శనమిచ్చాడు.

స్వామి ప్రక్కనే ఉన్న ఒక వ్యక్తి ఈ దృశ్యమంతా తిలకిస్తున్నాడు.

"మీ సందేహం నివృత్తి అయిందా?" అని స్వామి ఆ వ్యక్తిని అడిగారు.

'ఆహా, అయింది స్వామీ' అంటూ నీళ్లు నములుతూ సమాధానం చెప్పాడు ఆ వ్యక్తి.

ఆయన పేరు శ్రీ ఊటుకూరి నరసింహారావు; విజయవాడలో హరిజన సేవకుడుగా పేరుపడిన కాంగ్రెస్ వాది.

ఈ కథంతా ఆయనే విజయవాడలో మా ఇంటికి వచ్చి నాకు వినిపించారు. తనకు స్వాములవార్లంటే నమ్మకం లేదనీ, వారి మహిమలను అంతకంటే నమ్మననీ, కాని మద్రాసు లో తానీ దృశ్యం స్వయంగా తన కంటితో చూసిన తరువాత, తనలో ఏదో జిజ్ఞాస బయలు దేరిందనీ అన్నారు.

"అయితేమరి, మీకీ అనుమానాలూ, అపనమ్మకాలూ ఉన్నట్టు ఆ స్వామికి ఎలా తెలుసునండీ, మిమ్మల్ని ఆ ప్రశ్న అడగడానికి? అన్నాను నేను.

"అదే నాకూ ఆశ్చర్యం" అన్నారు నరసింహారావు గారు!

***

# "నేనంటే స్వామికి ఎక్కువ యిష్టం"

స్వామికి సన్నిహితులైన వారు ఒక వింత అనుభవం పొంది ఆనందిస్తారు:

"నే నంటే స్వామికి ఎక్కువ ప్రీతి. అందరికంటె స్వామి నన్నే ఎక్కువ ఆదరిస్తారు. నాతో ఎంతో ప్రేమగా మాట్లాడతారు. నా విషయం, నాకుటుంబ విషయం అన్నీ జ్ఞాపకం పెట్టుకుంటారు. అందరికంటే నేనే స్వామి అనుగ్రహానికి పాత్రుణ్ణి!"

విశేష మేమంటే, ఈ విధమైన భావాన్ని స్వామి ఎందరెందరికో కలిగిస్తారు. ఇది స్వామికి సహజమో, ప్రయత్న పూర్వకమో ఋజువు చెయ్యడం కష్టం. సహజమేనని నా నమ్మకం. కాకపోతే, అందరినీ సమధికంగా తృప్తిపరచడం మానవమాత్రులకు సాధ్యమా? అపూర్వమూ, అనితరసాధ్యమూ అయిన ఈ లక్షణం దైవాంశసంభూతులకే సాధ్యం.

మన పురాణాలు తిరగవేస్తే రామ, కృష్ణుల్లాంటి అవతారమూర్తులు ఈ లక్షణాలు కలిగి ఉన్నట్టు కనిపిస్తుంది.

శ్రీకృష్ణుడు గోపకాంతలతో రాసకేళి సలిపేటప్పుడు "ఆత్మారాముండయ్యును గోపసతు లెందరో అందరకు నందరై నిజ ప్రతిబింబంబు తోడన్ క్రీడించు బాలుర పోలిక" కేళిసలిపెనట -- భాగవతం, దశమస్కంధం.

అదేవిధంగా పట్టాభిషేకానంతరం రామచంద్ర ప్రభువు వానరసేనను సంభావించినప్పుడు వానరు లొక్కొక్కరూ "ప్రభువు నన్ను చూసే నవ్వాడనీ, నా వైపే చేతులు చాచాడనీ, నన్నే పలకరించాడనీ, నన్ను మెచ్చుకున్నాడనీ," పలువిధాల సంతోషించారట.

న్యూనాధిక తారతమ్యం లేని ఈ భావం దివ్య పురుషులకు మాత్రమే సాధ్యం! కీర్తి శేషులు శ్రీ జటావల్లభుల పురుషోత్తంగారీ కింది శ్లోకంలో ఇదే భావాన్ని ప్రకటించారు.

మయ్యేవ పూర్ణారిస్తి గురోర్దయేతి

సర్వస్య శిష్యస్య నిరూఢభావః

తథావిభక్తారి పి దయావ్యయారీ స్య

సర్వేశ్వరో మేయదయోహినాన్య ॥

## హరిహర స్వరూపం

శంకరనారాయణ స్వరూపమూ అర్ధనారీశ్వర స్వరూపమూ రెండూ ఒకటేనని చెప్పడానికి శాస్త్రాలలో ఆధారాలు ఉన్నాయి. మహవిష్ణువు ఈశ్వరునిలో ఒక భాగం; ఈశ్వరుడు కూడా మహావిష్ణువులో ఒక భాగమని చెప్పడానికి పురాణాల మూర్తులు, క్షేత్రాలు ఆధారాలు.

దక్షిణాన తిరునెల్వేలి జిల్లాలో శంకర్‌నయనార్‌కోయల్ అనే ఊళ్ళో ఒకే మూర్తిలో శంకరనారాయణ స్వరూపంగా భగవానుడు ఉండటంనేటికీ మనం చూడవచ్చు. ఇలాగే మైసూరు, మహారాష్ట్రల మధ్య 'హరిహర' క్షేత్రంలో హరి, హరుడు ఏకస్వరూపంగా ఇమిడి ఉన్నారు.

***

# సౌజన్యానికి మారు పేరు

స్వామి

ఔదార్యానికి మేరలేదు. అద్వైతులే కాదు, శైవ, వైష్ణవాది ఏ శాఖకు చెందిన వారినైనా స్వామి ఎంతో గౌరవంగా చూస్తారు. స్వీయప్రతిష్ఠగానీ, పీఠగౌరవంగానీ అందుకు అడ్డురావు.

వైష్ణవ సంప్రదాయానికి చెందిన వానమామలై జియ్యర్ ఎనభై సంవత్సరాల వృద్ధు. కంచిపీఠాధిపతిని గురించీ, ఆయన తపో మహిమ గురించీ పలువురి ద్వారా విని, వారిని స్వయంగా చూడాలని ఆశించారు. కొందరు మధ్యవర్తుల ద్వారా ఆ సంగతి కంచి స్వామికి తెలియజేశారు. ఎప్పుడైనా సరే, కంచిలోనే తనను కలుసుకోవచ్చని శ్రీ జియ్యర్ స్వామికి కబురంపారు.

తరువాత కొంతకాలానికి శ్రీ జియ్యర్ కంచికి రావడం తటస్థించింది. ఈ సంగతి విన్న స్వామి మధ్యవర్తులెవ్వరితో పనిలేకుండా, ఏ లాంఛనాలనూ పాటించకుండా, ఎకాయెకిని తామే స్వయంగా బయలుదేరి, జియ్యర్‌గారు మకాం చేస్తున్న ఇంటికి వెళ్లి శ్రీ జియ్యరును కలుసుకున్నారు.

ఆశ్చర్య సంభ్రమాలతో జియ్యర్ కంచి స్వామికి స్వాగతం పలికారు. ఉభయులూ గంటసేపు అరమరికలు లేకుండా మాట్లాడుకున్నారు.

ఎవరి వద్దకు ఎవరు రావాలి? అన్న ప్రశ్నకు అవకాశమే కలగలేదు.

సౌజన్యానికి మారుపేరు చంద్రశేఖర యతీంద్రులు!

***

# "ప్రాణదాత స్వామి"

"శేషయ్యగారూ, ఆ ఆనందాన్ని నేను అనుభవించగలనే గాని, వివరించలేను. అది చాలు నా జీవితానికి" అంటూ అతిథి సత్కారాలతో తృప్తి పరచడానికి యత్నిస్తారే గాని, కామకోటిస్వామివారితో విలువైన తన అనుభవాల మూట విప్పరు 'చావలి శాస్త్రిగారు' (పూర్తిపేరు శ్రీ చావలి సుబ్రహ్మణ్యశాస్త్రి.)

కంచి స్వామి సూచనలపై శ్రీ శాస్త్రి గారు చేసిన దానధర్మాల, కట్టించిన గుళ్ల గోపురాల విలువ కోట్ల సంఖ్యలో పడింది.

శ్రీ శాస్త్రిగారు దివంగతులైనందున తన తండ్రిగారి అనుభవాలను వారి కుమారులు శ్రీ చావలి శ్రీకృష్ణగారు సప్రామాణికంగా నాకు అందజేశారు!...

కీర్తిశేషులైన మా తండ్రి గారు చావలి సుబ్రహ్మణ్య శాస్త్రిగారికి, కంచికామకోటిపీఠం పరమాచార్యులు శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతి మహాస్వామికి గల పరిచయం దాదాపు 45 సంవత్సరాలు.

1943లో ఒకమారు మా నాన్నగారూ, మా అమ్మగారూ, నేనూ, మా కుటుంబంలో మరికొందరూ కలిసి, కంచిపీఠానికి స్వామివారి దర్శనం కోసం వెళ్లాము. స్వామివారు శ్రీ చంద్రమౌళీశ్వరులకు అభిషేకం చేస్తున్నారు. అభిషేకం చేస్తూ చేస్తూ శ్రీవారు మా నాన్న గారిని దగ్గరకు రమ్మని సౌంజ్ఞ చేశారు. మా నాన్న గారు స్వామిగారి దగ్గరకు వెళ్ళారు.

"కొంచెం సేపు ఉండి ప్రసాదం తీసుకువెళ్లు. మదరాసులో మీటింగు పని రేపు చూసుకోవచ్చు"

మా నాన్నగారికీ, అమ్మగారికీ ప్రసాదం ఇస్తూ "తరచుగా వచ్చి అమ్మ వారి దర్శనం చేసుకుని వెళుతూ ఉండండి, మీకు మేలు కలుగుతుంది" అన్నారు శ్రీవారు.

అంతకు పూర్వ మా నాన్నగారు అప్పుడప్పుడు తిరువన్నామలైలో శ్రీరమణమహర్షి వద్దకూ, పాండిచేరిలో శ్రీ అరవిందయోగి దర్శనానికి వెళుతుండేవారు.

శ్రీ రమణులు సిద్ధిపొందిన తరువాత కామకోటిపరమాచార్యులే తరచూ తమ కళ్లకు కనపడుతుండేవారని మా నాన్న అనేవారు.

అనంతరం 1952లో కంచిస్వామివారు మదరాసు వచ్చి మైలాపూరు సంస్కృత కళాశాల లో ఉండగా మా అన్నగారికీ, నాకూ ఉపనయనం జరిగింది. మా నాన్న గారు మా అన్నదమ్ము లను వెంట బెట్టుకుని సంస్కృత కళాశాలలో స్వామి వారి దర్శనం చేయించారు. స్వామి మమ్మల్ని ఆశీర్వదించి, ''అమ్మవారి కటాక్షం వల్ల ఇకమీదట మీకు అంతా వైభవంగా జరుగు తుంది'' అని దీవించారు.

## మా నాన్నగారి అనారోగ్యం

1978లో ఒకసారి ఉన్నట్టుండి మా నాన్నగారికి తీవ్రంగా జబ్బు చేసింది, స్పృహ తప్పి పోయిన స్థితిలో వారిని హాస్పిటల్‌లో చేర్పించాము. స్వామివారప్పుడు హంపి మకాంలో ఉన్నా రు. నా సోదరుడు శ్రీరామ్ హంపి వెళ్లి మా నాన్నగారి జబ్బు సంగతి శ్రీవారికి విన్నవించాడు. ఆ వార్త వింటూనె శ్రీవారు తన వంటికి విభూతి రాసుకుని, దాని నొకవిస్తరిలోకి విదిలించి, దానిని పట్టుకెళ్లి నీళ్లలో కలిపి మా నాన్నగారి చేత తాగించమన్నారు. మా తమ్ముడు విభూతి తేగానే శ్రీవారు చెప్పినట్లు చేశాము. పదిరోజుల నుండి స్పృహ లేకుండా ఉన్న మా నాన్నగారు ఆ భస్మపునీరు గొంతులోకి పోగానే కళ్ళు తెరిచి నిద్రనుంచి లేచినట్లు లేచి కూర్చున్నారు. డాక్టరులంతా ఆశ్చర్యపోయారు. అది మొదలుకొని 1982 వరకూ మా తల్లిదండ్రులెవరికీ ఏ అనారోగ్యం లేకుండా చక్కగా జరిగింది.

శ్రీవారికీ మా నాన్నగారికి ఎడతెగని సంబంధం ఏర్పడింది. శ్రీవారి భక్తులలో ఎవరికైనా వివాహాలు, చదువులు తదితర సహాయాలు ఏవి కావలసి వచ్చినా వారిని స్వామి వారు మా నాన్నగారి దగ్గరకు పంపించేవారు. శ్రీవారి వాక్కులు అమ్మవారి వాక్కులుగా భావించి మా నాన్నగారు తన దగ్గరకు వచ్చిన వారిని సర్వవిధాలా సత్కరించి సంతృప్తి పరిచేవారు. అయినా సహాయం చేసినట్టు తన పేరు వ్రాయనిచ్చేవారు కారు.

1981-82 తిరువాలూరులో బృహదీశ్వర ఆలయానికి రెండు గాలి గోపురాలకు మా నాన్నగారు పదిలక్షలరూపాయలు ఎవరికీ తెలియకుండా విరాళంగా ఇచ్చారు. ఆలయాధి కారులు మా నాన్నగారి పేరు వ్రాస్తానంటే అందుకు అంగీకరించక, కంచిస్వామి పేరు వ్రాయ వలసిందన్నారు.

## అమ్మగారికి ప్రాణదానం

1982లో మా తండ్రిగారికి శతాభిషేకం జరిగింది. శతాభిషేకానికి జరగవలసిన ప్రక్రియ యావత్తు శ్రీవారే వ్రాయించి పంపారు. యథావిధిగా జపాలు, హోమాలు వగైరా జరుగుతూ ఉన్నవి. రెండవ రోజున మా అమ్మగారికి హఠాత్తుగా జబ్బు చేసింది. ఆమెకు మధుమేహం ఉన్నందు వల్ల కోమాలోకి వెళ్లింది. ఆమె స్థితిని చూసి మేమందరమూ ఆందోళన పడ్డాము. మా తండ్రిగారు మాత్రం చలించలేదు. అప్పుడు స్వామి వారు దేశసంచారం చేస్తూ ఉగార్ అనే గ్రామంలో ఉన్నారు.

వెంటనే నేను మద్రాసు నుండి విమానంలో హైదరాబాద్‌కు వచ్చి, అక్కడి నుంచి కారులో బయలుదేరి రాత్రి 2 గంటలకు ఉగార్ చేరుకున్నాను. స్వామి వారప్పుడు నిద్రలో ఉన్నారు. చూడడానికి వీలులేదని శిష్యులన్నారు. వేకువజాము నాలుగున్నర గంటల వరకు నేను కారులోనే ఉండి, అప్పుడు స్వామిని చూడడానికి వెళ్లాను. నేను ఫలానా అని చెప్పగానే శ్రీవారు నన్ను పిలిచి ఈ రాత్రివేళ హఠాత్తుగా రావడానికి కారణమేమి అని అడిగారు. మా నాన్నగారికి శతాభిషేకం సందర్భంగా జపాలు ప్రారంభించామని, ఉన్నట్టుండి రెండోరోజున మా అమ్మగారికి జబ్బుచేసి కోమాలో ఉన్నదనీ, ఆసుపత్రిలో చేర్చామని, ఏమి చెయ్యడానికి తోచక తమ వద్దకు పరుగెత్తుకుంటూ వచ్చానని స్వామికి విన్నవించాను.

స్వామి కళ్లు మూసుకుని కొన్ని నిముషాలు ధ్యానం చేసి "ఏమీ ఫరవాలేదు. మీ అమ్మ గారికి భయం లేదు. మీ నాన్నాగారు చేసిన దానాలు, ఘనకార్యాల వల్ల కొంత దృష్టి వచ్చింది.

ఇక మీదట అంతా సక్రమంగా జరుగుతుంద"ని ధైర్యం చెప్పి కొద్దిగా పంచదార పొట్లం కట్టి ఇచ్చి, దానిని మా అమ్మగారి నోట్లో వెయ్యవలసిందని ఆదేశించారు.

"తిరుగు ప్రయాణానికి నీకు విమానం ఎన్ని గంటలకు ఉన్న"దని స్వామి నన్నడిగారు. 7గంటలకని చెబుతూ విమానం అందుతుందో అందదో అన్నాను. భయం లేదు. విమానం అందుతుందిలే, వెళ్లు అన్నారు శ్రీవారు.

అయినా నాకు విమానం అందుతుందని నమ్మకం లేదు. అందదేమో అనే సందేహం తోనే హైదరాబాద్ చేరాను. ఇంటికి వెళ్ళి విమానం సంగతి ఫోనులో అడుగగా విమానం గంట న్నర ఆలస్యంగా బయలుదేరుతుందని చెప్పారు. సీట్లు కూడా ఉన్నవని చెప్పారు.

త్వరగా వెళ్ళి విమానంలో కూచున్నాను. విమానం అందిందే గాని, నేను మద్రాసు చేరే లోపల అమ్మగారి స్థితి ఎలా ఉంటుందో ఏమో అని ఆందోళన పడుతూనే ఉన్నాను, మానవ మాత్రుణ్ణి కాబట్టి. మద్రాసులో విమానాశ్రయం వద్దకు కారు వచ్చింది."అమ్మ స్థితి ఎలా ఉన్న" దని ఆదుర్దాగా డ్రైవరును అడిగాను. "వేకువఝామునే నాలుగున్నర గంటలకు అమ్మగారు కళ్ళు తెరిచారు" అని డ్రైవరు చెప్పగానే 'అమ్మయ్యా' అనుకున్నాను. విచిత్రం. సరిగ్గా నాలుగు న్నర గంటలకే ఉగార్‌లో స్వామివారు కళ్ళు మూసుకుని ధ్యానం చేసి, ప్రసాదం నా చేతికిచ్చి భయంలేదంటూ నన్ను పంపించారు.

నేను మద్రాసు చేరగానే స్వామివారిచ్చిన చక్కెర ప్రసాదం పాలల్లో కలిపి మా అమ్మగారి చేత తాగించాను. ఆ పాలు తాగడంతోనే మా అమ్మగారు కళ్ళు తెరిచి మాట్లాడడం మొదలు పెట్టింది. అటు తరువాత మా తల్లిదండ్రులు పార్వతీపరమేశ్వరులు లాగా శతాభిషేకం సక్రమంగా సలక్షణంగా జరుపుకున్నారు! 1983లో మా అమ్మగారు ఉత్తరాయణపుణ్యకాలం లో పౌర్ణమి శుక్రవారం నాడు స్వర్గస్థులైనారు. ఆ సంవత్సరం శ్రీవారు కర్నూలులో ఉండగా మేము శ్రీవారి దర్శనం చేసుకుని అమ్మగారు కాలం చేసిన సంగతి శ్రీవారికి చెప్పాము.

"మీ అమ్మగారు సంవత్సరం క్రితమే కాలం చేసి ఉండవలసింది. కాని శ్రీ కామాక్షి అమ్మవారు మీ అమ్మగారి ఆయుర్దాయం ఒక సంవత్సరం పొడిగించింది. మీ అమ్మగారు

కొడుకులతో, కోడండ్లతో, మనుమలు, మనుమరాండ్రతో సర్వసౌఖ్యములూ అనుభవించి, మీ నాయనగారి శతాభిషేకం సలక్షణంగా జరుపుకుని ఉత్తమ లోకానికి వెళ్ళింది. ఆమెకై మీరు ఏమాత్రం చింతించ పనిలేదు. ఆమె ఎంతో అదృష్టవంతురాలు'' అంటూ శ్రీవారు మమ్ము ఓదార్చారు.

మళ్ళా మా తండ్రిగారికి ప్రమాదస్థితి:

1987లో మా ఉమ్మడి స్థలంలో 30 గ్రౌండ్లు ఏదైనా ధర్మకార్యాల వినియోగం కొరకు అగ్రిమెంటు వ్రాసుకున్నాము. ఆ స్థలాన్ని ఏ విధంగా వినియోగించవలెనో స్వామివారితో సంప్రదించి, వారి సలహా ప్రకారం చేద్దామనుకున్నాము. ఇంతలో ఆ సంవత్సరం మార్చి నెలలో మా నాన్నగారికి మళ్ళా జబ్బు చేసింది. ప్రమాద స్థితిలో వారిని హాస్పటల్లో చేర్పించాము. వారికి శ్వాస కూడా పీల్చుకోలేని పరిస్థితి సంభవించింది.

మేము కంచికి వెళ్ళి శ్రీవారిని దర్శించి, ఈ వార్త వారికి వినిపించాము. వెంటనే శ్రీవారు కామాక్షి అమ్మవారి ఆలయానికి వెళ్ళి స్వయంగా అమ్మవారికి అభిషేకం, కుంకుమార్చనలు చేసి, ఆ ప్రసాదం మా నాన్నగారికి ఇవ్వమని చెప్పి ఇంకా ఇలా అన్నారు.

''కామాక్షి అమ్మవారు మదరాసు నగరంలో మీ తండ్రిగారి చేత తనకొక ఆలయం నిర్మించుకోవాలి అని సంకల్పించింది. అంతవరకూ మీ నాన్నగారికి ఏ భయమూ ఉండదు'' అని అభయమిచ్చారు. శ్రీవారిచ్చిన ప్రసాదం తెచ్చి మా నాన్నగారికి ఇవ్వగానే వారికి ప్రమాద స్థితి తప్పిపోయింది. అపోలో అస్పత్రిలోని డాక్టర్లు అందరికీ ఎంతో ఆశ్చర్యం వేసింది. ''మీ నాన్నగారు కేవలం ఆత్మశక్తితో, ఎవరి ప్రభావంతోనో జీవించి ఉన్నారేగాని క్లినికల్‌గా మాత్రం వారు ప్రాణంతో లేనట్టే. ఊపిరితిత్తులు ఇంత బలహీనంగా ఉన్నా 87 సంవత్సరాలు వారిలా జీవించి ఉండడం అసామాన్యం'' అని వారంతా అన్నారు.

ఆలయ నిర్మాణం

అటు తరువాత మా నాన్నగారిని ఆస్పత్రి నుండి ఇంటికి తెచ్చాము. శ్రీవారి ఆనతి ప్రకారం మా ఇంటి ప్రక్కనున్న మా స్థలంలోనే 1987 మే నెల 4వ తేదీ శ్రీలక్ష్మీ కామాక్షి అమ్మ

వారి ఆలయానికి శంకుస్థాపన జరిగింది. ఆలయ నిర్మాణానికి ముందు ప్రభుత్వం నుంచీ, మున్సిపల్ కార్పొరేషన్ నుంచీ ఎన్నో అనుమతులు వగైరా కావాలి. అయినా అవి అన్నీ శ్రీవారి అనుగ్రహం వల్ల వెంట వెంటనే లభించినవి. 1987 ఆఖరుకు ఆలయనిర్మాణం చాలా వరకు పూర్తి అయింది.

ప్రతి శుక్రవారం మా నాన్నగారికి కామాక్షి అమ్మవారు స్వప్నంలో కనిపించేవారు. మా నాన్నగారు ముప్పొద్దులూ 'చంద్రశేఖరా, చంద్రశేఖరా' అంటూ శ్రీవారిని సంస్మరిస్తూ ఉండేవారు. ఆ స్థితిలోనే ఒకమారు మా నాన్నగారిని శ్రీవారి దర్శనానికి కారులో కంచికి తీసుకు వెళ్ళాము. మా నాన్నగారు స్వామివారిని చూడగానే సాష్టాంగ నమస్కారం చేయడానికి పూనుకున్నారు. మేమంతా వారికి సాయపడబోగా 'మీరెవ్వరూ వారిని పట్టుకోకండి. వారిని వదలి పెట్టండి' అన్నారు. అంత దుర్బలస్థితిలో ఉండి మా నాన్నగారు ఎవరి సహాయం లేకుండా శ్రీవారికి అయిదుసార్లు సాష్టాంగ నమస్కారం చేశారు, అందరూ ఆశ్చర్యపోయినారు.

"ఆలయ నిర్మాణానికి ఏవిధమైన ఆటంకం ఉండదు. ఆదాయపు పన్నుకు సంబంధించిన ఏ ఇబ్బందులున్నా, అవి అన్నీ పనపరిష్కారమై, నిర్విఘ్నంగా నిర్మాణం పూర్తి అవుతుంది." అంటూ శ్రీవారు అభయప్రదానం చేశారు. ఎంతో సంతృప్తితో మేమంతా మద్రాసు తిరిగి వచ్చాము.

1988 ఏప్రిల్ 8వ తేదీ ఉదయం మా నాన్నగారు ఎప్పటివలె నిద్రలేచి, కాలకృత్యాలన్నీ తీర్చుకుని, పక్కమీద పడుకుని, నిద్రలోనే శాశ్వతంగా కన్నుమూశారు. అనాయాస మరణం వారిది.

మేము శ్రీవారి దగ్గరకు వెళ్లి వారికి మా నాన్నగారు దివంగతులైన సంగతి తెలియజేశాము.

స్వామివారిలా అన్నారు మాతో. "మీ నాన్నగారు ఎంతో పుణ్యమూర్తి. అరుదుగా గాని అట్టి వారుండరు. జీవించి ఉండగా మీ నాన్నగారు అమ్మవారి ఆలయం పూర్తిచెయ్యలేదని

మీరెంతమాత్రం విచారపడవద్దు. ఆ కార్యం మీవల్ల పూర్తి కావలసి ఉన్నది. ఆ అదృష్టం మీకు దక్కుతుంది. ఆలయం పని పూర్తిచేసి పుణ్యం మూట కట్టుకోండి!'' అని ఆశీర్వదించారు.

శ్రీవారి ఆశీర్వాద ఫలితంగా, అప్పటికి రెండు సంవత్సరాల నుంచి ఇన్‌కంటాక్స్ డిపార్ట్ మెంటు వారు బిగపట్టినందువల్ల మా చేతికి రాని పెద్ద మొత్తం వడ్డీతో సహా మాకు లభించింది.

దేవాలయ నిర్మాణం పూర్తి కావచ్చింది. ఆలయ నిర్వహణకూ, 108 మంది వేదపండితుల గృహనిర్మాణానికి ''శ్రీ చంద్రశేఖరమహాస్వామి ట్రస్టు'' అనుపేరుతో ఒక ధర్మసంస్థ ఏర్పాటు చేశాము.

మా నాన్నగారికి శ్రీవారిపై గల భక్తి అనన్యం. స్వామివారికి మా నాన్నగారిపై గల అనుగ్రహం అపారం. శ్రీవారు సంకల్పిస్తే మా నాన్నగారు ఎటువంటి పని అయినా దానిని నెరవేర్చేవారు. ఒకసారి శ్రీవారు ఏలూరులో ఉండగానూ, మరొకమారు ఉగార్‌లో ఉన్నప్పుడూ, మా నాన్నగారు మహామాఖమప్పుడు కుంభకోణం నుంచి విమానంలో తీర్థం తెప్పించి, ఆ తీర్థంతో శ్రీవారిని స్నానం చేయించారు.

శ్రీవారికీ మా నాన్నగారికీ గల అన్యోన్య సంబంధం అటువంటిది. మా నాన్నగారు చేసిన సేవలవల్ల శ్రీవారి అనుగ్రహం మాయింటిల్లిపాదికీ, మా కుటుంబ మంతటికి లభ్యమైంది.

- చావలి శ్రీకృష్ణ

## ఏంత శిక్ష!

కంచిమఠాన్ని అంటిపెట్టుకుని ఎందరో పరిచారకులున్నారు. వేదాధ్యయనపరులు, జమాఖర్చు లెక్కలు రాసేవారు, ఉత్తర ప్రత్యుత్తరాలు చూసేవారు, వంటవాళ్ళు, పశువులను కాచేవాళ్ళు, కావలి వాళ్ళు, మేళగాళ్ళు మొదలైన వారంతా.

వీరందరూ తప్పకుండా, గుణవంతులూ, శీలవంతులూ అని చెప్పడానికి వీలులేదు. ఉత్తమ, మధ్యమ తరగతులున్నవి. ముఖంమీద విభూతి రేఖలున్నంత మాత్రాన, అందరిలో అపరిగ్రహ లక్షణాలన్నీ గూడుకట్టుకు ఉన్నవనుకోడానికి వీలులేదు.

రోజూ ఇంత అనుష్ఠానంతో, అతిథి సత్కారంతో, విద్వద్గోష్ఠులతో, వివిధ విషయ చర్చలతో మునిగి తేలుతూ ఉన్నా, మఠం వ్యవహారాలకు సంబంధించిన మంచి చెడ్డలు స్వామికి తెలియకుండా ఉండవు. అయితే, వాటిని పరిష్కరించడంలో ఆయన అవలంబించే పద్ధతులు వేరు. అవి మనకు అసాధారణంగా, ఆశ్చర్యజనకంగా తోచవచ్చు.

ఉదాహరణకు, భిక్షలు చేసేవారు ఎంత ఖరీదైనా పెట్టి భిక్షకు కావలసిన సామగ్రి అంతా సమృద్ధిగా, శ్రేష్ఠమైనదిగా ఎంచి తెస్తారు. ఏ వస్తువూ చాలలేదే అని అతిథులు అనుకోరాదు. ఇది ఆతిథ్యం ఇచ్చేవారి ఆశయం.

అయితే, ఒక్కొక్కప్పుడు భిక్షకు తెచ్చిన వస్తువులన్నీ వంటలోకి రావు. ఈ సంగతి స్వామి ఎలాగో కనిపెడతారు. భోజనాలు అయిన తరువాత వంటచేసిన వాళ్లు వినేటట్టు, "ఇవాళ పాయసంలో జీడిపప్పు అంతగా కనిపించలేదే! ధర ఎక్కువగా ఉన్నదని బహుశా జీడిపప్పు తగ్గించి తెచ్చి ఉండాలి. లడ్డులలో పచ్చ కర్పూరం వాసన రావడం లేదు. దానిని వెయ్యడం మనవాళ్లు మరిచిపోయి ఉండవచ్చు" అంటూ మృదువుగా, వ్యంగ్యంగా మందలిస్తారు.

ఆ మర్నాటి నుండి శాకపాకాలన్నింటిలో అన్ని వస్తువులూ సమృద్ధిగా ఉంటాయి!

***

ఒక రోజున మఠం పరిచారకుడు ఒకడు తన తల కింద చిన్నమూట పెట్టుకుని నిద్రపోతున్నాడు. ఆ మూటలో ఏమున్నదో నని మేస్త్రీ మూట విప్పి చూశాడు. మూడు పడుల మినపప్పు కనిపించింది! ఆ సంగతి స్వామికి వినిపించాడు మేస్త్రీ.

మేస్త్రీ చెప్పినదంతా స్వామి విన్నారు. చివరకు ఇలా అన్నారు: "ఆ పరిచారకుడికి మినప్పిండితో చేసే వడ లంటే చాలా ఇష్టం కావచ్చు. మఠంలో వడలు చేసినప్పుడు అతనికి కావలసినన్ని వడ్డించి ఉండరు! ఒక పని చెయ్యండి. ఆ మూడు పడుల మినపప్పూ బాగా మెత్తగా రుబ్బి, అందులో అల్లం, పచ్చిమిరపకాయ, జీలకర్ర మొదలైన వస్తువులన్నీ దండిగా వేసి, చాలినంత నూనెపోసి, ఆ పరిచారకుడు ఎన్ని తింటే అన్ని వడ్డించండి. అతడు తృప్తిగా భోంచెయ్యాలి."

అది మొదలు ఆ సేవకుడు ఇంకెన్నడూ అలాంటి పనులకు దిగకుండా తన ప్రవర్తనను దిద్దుకున్నాడు.

***

విజయవాడలో ఒకనాడు కృష్ణానదిలో స్నానం చెయ్యబోతూ మఠం పరిపాలనను గురించి పక్కనున్న వారితో స్వామి ఇలా అన్నారట. "మఠం అన్నంత మాత్రాన మఠంలో ఉన్న వారందరూ సత్యహరిశ్చంద్రులు అనుకోనక్కరలేదు. ఒడ్డు నుంచి చూస్తే కృష్ణనీరు నిర్మలంగా కనిపిస్తుంది. నీటిలో దిగి కొంత దూరం వెళితే అడుగునంతా బురదగా ఉంటుంది!"

స్వామి వాస్తవిక పరిజ్ఞానం, లోకానుభవం అంతాయింతా కావు. అయితే స్వామి వ్యవహరించే తీరు మాత్రం వేరు.

*బౌద్ధమతాన్ని వెళ్లగొట్టింది భగవత్పాదులా?*

శంకరభగవత్పాదులు బౌద్ధమతాన్ని హిందూదేశం నుంచి వెళ్లగొట్టారని అందరూ అనుకుంటారు. కాని, శంకరుల భాష్యాలను చూస్తే వాటిలో బౌద్ధమత ఖండన చాలా అరుదుగా కనిపిస్తుంది. ఆయన చేసిన ఖండనమంతా మీమాంస మీదా, సాంఖ్యం మీదా సాగింది.

***

# మరుపురాని సంఘటన

శ్రీ బులుసు సూర్యప్రకాశ శాస్త్రి

'ఆంధ్రప్రభ'లో జగద్గురుబోధలు చదువుతూ ఉండగా జగద్గురు చంద్రశేఖరేంద్రసరస్వతిస్వామిని దర్శించాలని కోరిక కలిగింది. అయితే, నావంటి వానికి ఆ మహనీయుని దర్శనం అయ్యేనా అని సందేహం కలిగింది.

శ్రీవారికి సన్నిహితులైన శ్రీ కుప్పా లక్ష్మావధానిగారికి జాబు రాశాను, శ్రీవారికి పరిచయం చేయవలసిందని. 'నేను మిమ్ము పరిచయం చెయ్యనక్కరలేదు. మీరు స్వామివారి అనుగ్రహం పొందగలరు. కంచి వెళ్లి దర్శనం చెయ్యండి' అని శ్రీ లక్ష్మావధానిగారు సమాధానమిచ్చారు.

స్వామిని ధ్యానించుకుంటూ అప్పుడు శ్రీవారు మకాం చేస్తున్న అంబి అనే గ్రామానికి వెళ్లాను. పీఠం తాలూకు కార్యకర్తలను స్వామివారిని ఎప్పుడు దర్శించవచ్చునని అడిగాను. ఉదయం 6 గంటలకు గోపూజ, గజపూజ జరిగేటప్పుడు దర్శించ వచ్చునని చెప్పారు. గోపూజ, గజపూజలు చూశాను. పూజచేసిన పుష్పాలను గజరాజు స్వామివారి శిరస్సున ఉంచిన దృశ్యం మనోహరంగా ఉంది. ఆ సమయంలో స్వామికి సాష్టాంగ నమస్కారం చేశాను. స్వామి నా వైపు చూసి "ఎవరూ? బులుసు సూర్యప్రకాశశాస్త్రిగారా, తెనాలి నుంచి వచ్చారా?" అంటూ అభయహస్తం చూపించారు. నా శరీరం జలదరించింది. నన్ను గురించి శ్రీవారికి ఎవ్వరూ చెప్పలేదు. మరి, శ్రీవారికి నాపేరూ, ఊరూ ఎలా తెలిసిందా అని ఆశ్చర్యపోయాను. శ్రీవారు సర్వజ్ఞులు.

నాటి రాత్రి స్వామివారు శ్రీ చంద్రమౌళీశ్వరుని అర్చన చేసి చిన్నగదిలో కూర్చున్నారు. వివిధ ప్రాంతాల నుంచి వచ్చిన ఉద్యోగస్థులతో సహా అనేకులు బారులు తీరి నిలుచున్నారు. స్వామివారొక పరిచారకుని పిలిచి ఎక్కడో చివర నిలబడిన నన్ను తమ దగ్గరకు పిలిపించుకున్నారు. సాష్టాంగ పడ్డాను. కూర్చోమని సంజ్ఞ చేశారు. కూచున్నాను. "బులుసు లేని యజ్ఞం, బలుసు లేని శ్రాద్ధం" అనే సామెత తెలుసునా? అని అడిగారు. తెలుసునన్నా. తరువాత,

నా పరిస్థితులు, నా చదువు, నా గురువులు, మా పెద్దలు బులుసు పాపయ్య శాస్త్రి, పూర్ణ సోమయాజులు, అచ్చయ్య శాస్త్రిగారు, బులుసు సాంబమూర్తి గారు, వారి తండ్రి మొదలైన వారందరిని గురించి సుమారు గంటసేపు మాట్లాడారు.

సోమవారం మూలా నక్షత్రం రాత్రి 12-5 గంటలకు దీక్షావిధానంగా ఆంజనేయం ఉప దేశించారు. ఇది మరపురాని సంఘటన. స్వామి దర్శనం సర్వదేవతా సందర్శనం.

## *బుద్ధి వాస్తవ పక్షపాతి*

నీరు ఏ విధంగా నిమ్న ప్రదేశం చిక్కే వరకూ అల్లాడుతుంటుందో అదే విధంగా ఒక వస్తువు వాస్తవస్థితి తెలియనంతవరకూ బుద్ధి కూడా అల్లాడుతుంటుంది. నిజం తెలిసిన తర్వాత శాంతిని పొందుతుంది.

## "స్వామి కరుణతో కడుపు పండింది"

సంతానం కోసం జపాలూ, తపాలూ దానాలూ, ధర్మాలూ చేస్తారు. ఔషధాలు సేవిస్తారు. శస్త్ర చికిత్స చేయించుకుంటారు. ఇన్ని చేసినా, కొందరికి సంతాన ప్రాప్తి ఉండదు.

ఆడసంతతి ఉన్నవారు పుత్రసంతతి కోసం విశ్వప్రయత్నం చేస్తారు. అపుత్రస్య గతిర్నాస్తి అని విశ్వసించేవారు వీరు.

శ్రీ ఓరుగంటి నృసింగయోగి కోనసీమ పండితుడు. ఆంధ్రంలో, సంస్కృతంలో అనర్గళంగా గంటలకొలది ఉపన్యసించే శక్తి ఉన్నవాడు. హిమవత్పర్వత ప్రాంతాల్లో కొంతకాలం గురుశుశ్రూష చేసి యోగంలో అనుభవం గడించి, యోగిగా పేరు పొందిన వ్యక్తి.

కంచిస్వామి ఆంధ్రదేశ సంచారం చేస్తూ విజయవాడ మకాంలో ఉండగా ఒకనాడు శ్రీ నృసింగయోగి మా కార్యాలయానికి వచ్చి, తన రాకను గురించి ఇలా అన్నాడు. "ఆచార్య స్వామి దర్శనం కోసం విజయవాడ వచ్చాను. మాకు మగ సంతతి లేకపోగా, ఈ మహానుభావుడి అనుగ్రహం వల్ల మా కొక పుత్రుడు కలిగాడు. ఆ పాపణ్ణి స్వామి పాదాలపై పడవేసి, పుత్ర భిక్ష పెట్టినందుకు కృతజ్ఞతను తెలుసుకోడానికి ఇక్కడికి వచ్చాము."

అదే సంవత్సరంలో ఇంకో మాట కూడా అన్నాడు శ్రీ నృసింగయోగి. "అయ్యా, నా యౌవనదశలో నాకంటె విద్యావంతు డెవ్వ రున్నాడే అహంభావంతో వేదాంత విషయంపై ఈ స్వామితో వాదనకు తలపడ్డాను. అది నా అజ్ఞాన దశ!"

ఇద్దరం నవ్వుకున్నాము.

దశరథమహారాజు అంతటివాడు పుత్రసంతతికై 'పుత్ర కామేష్టి' యాగం చేశాడు. పుత్రులు లేకున్న గతులు లేవు అనే నమ్మకంతో కాకపోయినా, తన పేరు నిలిచేందుకైనా ఒక్క మగ నలుసు కలిగితే బాగుండునని చెట్టు చెట్టుకూ, పుట్ట పుట్టకూ మొక్కేవారింకా సంఘంలో ఎందరో ఉన్నారు. స్వామి అనుగ్రహంతో సంతానం బడసి సంతోషిస్తున్నవారిని అనేకమందిని ప్రత్యక్షంగా చూస్తున్నాము.

ఆధునిక నాగరికతా ప్రభావం చేత కొందరు స్త్రీ పురుషులు అసలు సంతానంతో పనే మున్నదని గర్భనిరోధక మార్గాలు అనుసరించవచ్చు. సంతాన విషయంలో ఆడ, మగ భేదమే ముందనే వారుండవచ్చు. కాని, వివాహం కేవలం స్త్రీ పురుషుల కామవ్యాపారం మాత్రమే కాదనీ, సత్సంతానప్రాప్తి కొరకనీ సనాతనుల విశ్వాసం. వైవాహిక వ్యవస్థకు పరాకాష్ఠ సంతా నమే నని  నమ్మేవారు విల్ డ్యూరెంటు వంటి తత్వవేత్తలూ, మహామేధావులు పాశ్చాత్యులలో సైతం లేకపోలేదు.

***

### *రాచరికం ధర్మబద్ధం కావాలి*

రాజు కూడా ప్రజలవలె శాస్త్రానికి బద్ధుడు. రాచరికం ధర్మబద్ధంగా ఉండాలి. పాలకు లకూ, పాలితులకూ ఉన్న ఈ ధర్మశ్రద్ధే మన దేశానికి ధర్మక్షేత్రమన్న పేరు తెచ్చింది.

# స్వామి సన్నిధిలో షష్టిపూర్తి

విశ్వావసునామ సంవత్సర మార్గశిర బహుళ ఏకాదశి నేను పుట్టిన రోజు. విశాఖ నక్షత్రం. ఇంగ్లీషు తేది 1905-12-22. మన పంచాంగం లెక్కకు 1965 డిసెంబరు 20 తేదికి 60 సంవత్సరాలు నిండుతవి.

షష్టిపూర్తి ఉత్సవం కామకోటి పీఠాధిపతి శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి స్వామి సమక్షంలో జరుపుకుందామని సంకల్పించుకున్నాము. నిజానికి, అది మా శ్రీమతి సంకల్పమే. నేను 'బాగు బాగు' అంటూ తల ఊపాను.

స్వామి అందుకు దయతో సమ్మతించారు. ఆ నాటికి తాము ఎక్కడ ఉంటే అక్కడికి బంధుమిత్రులను, పండితులను వెంటబెట్టుకు రమ్మన్నారు.

డిసెంబరు నెలలో స్వామి మద్రాసు నగరంలో, మైలాపూరు సంస్కృత కళాశాల భవనంలో మకాం చేస్తున్నారు.

స్వామి ఆదేశం ప్రకారం ఆ రోజుకు నేను నా తల్లిదండ్రులతో, కుటుంబంతో, బంధుమిత్రులతో, విజయవాడ, గుంటూరు పట్టణాల నుంచి దయచేసిన పండితులతో, పురోహిత బృందంతో మద్రాసు చేరాను.

పూర్వాశ్రమంలో శ్రీ స్వామిపాదుల సోదరులు శ్రీ సాంబమూర్తిశాస్త్రిగారు సెంట్రల్ స్టేషన్‌కు వచ్చి, స్వామి మైలాపూరు నుంచి తిరువొత్తియూరుకు మకాం మార్చారని చెప్పి, మమ్మందరిని తిరువొత్తియూరుకు వెంటబెట్టుకు వెళ్లారు.

తిరువొత్తియూరు పుణ్యక్షేత్రం. సంగీత త్రిమూర్తులలో ఒకరైన త్యాగరాజు సందర్శించిన ఊరు. కామకోటి పరంపరలోని పూర్వ పీఠాధిపతులలో ఒకరు సిద్ధిపొందిన స్థలమది.

మంటపారాధనంతో మహాకలశ స్థాపనం జరిగింది. అధిదేవతా, ప్రత్యధిదేవతలతో మృత్యుంజయుణ్ణి ఆవాహనం చేశారు. సప్తచిరంజీవులను, నవగ్రహాలను, సంవత్సర నక్షత్రదేవతలను, దిక్పాలాదులను ఆవాహనం చేసి, యథావిధిగా పూజలు జరిపారు.

పరమనైష్ఠికులు, ఆహితాగ్నులు అయిన శ్రీ కప్పగంతుల లక్ష్మీపతి చయనులుగారు బ్రహ్మగా వ్యవహరించారు. పౌండరీకాది మహాక్రతువులు ఆచరించిన శ్రీ రెంటచింతల పౌండ రీక యాజులుగారు, శ్రీ కప్పలవాయి యజ్ఞేశ్వరశర్మగారు, వారి సోదరులు రామశాస్త్రిగారు షష్టి పూర్తి ఉత్సవంలో పాల్గొన్నారు.

మహాపండితులు చతుర్వేదమంత్రాలు పఠిస్తూ ఉండగా మహదాశీర్వాదం ఆరంభ మైంది. యాగశాల వేదఘోషతో ప్రతిధ్వనించింది. పెద్దలు స్వస్తివాచకం చెప్పబోతున్నారు. సరిగ్గా ఆ సమయానికి జగద్గురువులు శిష్యసమేతంగా సభామంటపానికి విజయం చేశారు. మేళతాళాలతో ఎదురేగి మహాస్వామిని మందిరంలో ప్రవేశపెట్టాము. శ్రీ చరణుల శుభాగమ నంతో సభాభవనం కళకళలాడింది. ఆ వైభవం అవర్ణనీయం!

సభాసదుల పాదాభివందనాలు స్వీకరించిన పిమ్మట స్వామిపాదులు వేదిక నధిరోహిం చి, ఈ క్రింది శ్లోకం చదివి, సంస్కృతంలో వ్యాఖ్యానించగా, శ్రీ జమ్మలమడక మాధవరామ శర్మగారు తెలుగులో దానిని సభ్యులకు వినిపించారు:

**గుణదోషౌ బుధోగృహ్ణన్ ఇందుక్ష్వేలా వివేశ్వరః**

**శిరసా శ్లాఘతే పూర్వం పరం కంఠే నియచ్ఛతి॥**

ఈశ్వరుడు పాలసంద్రంలో పుట్టిన కాలకూట విషాన్నీ, చంద్రుణ్ణీ స్వీకరించి, చంద్రుని శిరస్సున ధరించి, విషాన్ని పైకి రానీయకుండా కంఠంలోనే ఇముడ్చుకున్నట్టు, పండితుడు పరుల గుణాలను శ్లాఘిస్తూ దోషాలను దాచుతాడు.

“వేంకటాధ్వరి రచించిన విశ్వగుణాదర్శ చంపువులో కృశాను, విశ్వావసులనే ఇద్దరు గంధర్వులున్నారు. వారిలో కృశాను ఇతరుల దోషాలను వెలిబుచ్చుతాడు. విశ్వావసు వారి గుణాలను మాత్రమే ప్రకటిస్తాడు. అదే విధంగా విశ్వావసునామ సంవత్సరంలో జన్మించిన ఈ నీలంరాజు వెంకట శేషయ్య గుణ గ్రహణ పారీణుడై, గుణ ప్రకటన చేస్తూ చిరంజీవిగా వర్థిల్లాలని నారాయణ స్మరణ పూర్వకంగా ఆశీర్వదిస్తున్నాము”.

కవులూ, పండితులూ పద్యగద్యోపాయినాలు అందజేశారు. మిత్రులు శుభాకాంక్షలను అందించారు. పండిత సత్కారంతో సభాకార్యక్రమం ముగిసింది.

***

# ‘ఆదిశంకరుల అవతారమే’’

- పండిత మదనమోహనమాలవ్యా

‘‘రెండు వేల సంవత్సరాలకు పూర్వ ఆదిశంకరులు కాశీ మహాక్షేత్రానికి విచ్చేసి, హిందూమత పునరుజ్జీవనానికి పునాదులు వేశారని ఎరుగుదుము.

నేటికి మరల ఆ శంకరభగవత్పాదుల అవతారమూర్తులైన కంచి కామకోటి పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతులను కాశీలోనే కళ్లారా చూచే భాగ్యం కలిగినందుకు మేమందరం ఆనందిస్తున్నాము.

దక్షిణదేశం నుంచి పాదచారులై పలుశ్రమలకోర్చి శ్రీ కామకోటి స్వాములు కాశీకి రావడం, ఆనాటి ఆదిశంకరుల దిగ్విజయ యాత్రను మరల మరల స్ఫురణకు తెస్తున్నది. ఇది ఒక అపూర్వానుభవం...’’

***

1934లో కాశీ హిందూవిశ్వవిద్యాలయం పక్షాన జరిగిన బ్రహ్మాండమైన మహాసభలో కంచి కామకోటి పీఠాధిపతి చంద్రశేఖరేంద్ర సరస్వతి యతీంద్రులకు స్వాగతం పలుకుతూ, హిందూ విశ్వవిద్యాలయ సంస్థాపకుడు దివంగతుడు శ్రీ మదన మోహన మాలవ్యా పండితుడు నుడివిన స్వాగతవాక్యాలు అవి.

మాలవ్యాపండితుడు కాశీ హిందూ విశ్వవిద్యాలయ సంస్థాపకుడే కాదు, ఉత్తర ప్రదేశంలో జన్మించి యావద్భారత ప్రశస్తిగాంచిన సుప్రసిద్ధ జాతీయ నాయకుడు. గాంధి, తిలక్, నెహ్రూల కోవకు చెందిన అకళంక దేశభక్తుడు. మీదుమిక్కిలి, అకుంఠిత సనాతన ధర్మ పరాయణుడు. ఆయన వాణి అశేష భారతహిందూ జనవాణి. ‘‘సమస్త హిందూ సంఘానికి మకుటం లేని మహీపతి’’ అని మాలవ్యాపండితుని గురించి లాలాలజపతి రాయి ప్రశంస. సనాతన ధర్మావలంబకుల తరపున కంచి యతీంద్రులకు నివాళులర్పించిడానికి మాలవ్యాపండితుల కంటె మహోత్తములుండరు.

కాగా, కామకోటి పీఠాధీశ్వరులు ఆదిశంకరుల అపరావతారమని మాలవ్యా చేసిన ప్రస్తుతిని మించినది వేరొండు లేదు.

కాశీమహాక్షేత్ర సుదీర్ఘ చరిత్రలో శ్రీ కామకోటి పీఠాధిపతులకు జరిగిన ఈ ఘన సత్కారం ఇతరులెవ్వరికీ జరగలేదంటే అతిశయోక్తికాదు.

యావద్భారతంలో హిందువులకు కాశీ క్షేత్రరాజం. ''పావన క్షేత్రముల రాశి వారణాసి.'' ఆర్ష సంస్కృతికి అనాదినుంచి ప్రధాన కేంద్రం. ఈ క్షేత్రంలోనే ఆది శంకరులు భాష్యగ్రంథ రచన ఆరంభించారు. ఇక్కడి నుంచే తమ దిగ్విజయ యాత్ర కొనసాగించారు. కాశీలో సన్మానంపొందితే అశేష పండితలోకం హర్షించినట్టే.

దక్షిణ దేశంలో కామకోటి స్వామి కీర్తి దశదిశలా వ్యాపించింది. ఈ సన్మాన సభా విశేషాలను తెలిసికోడం ద్వారా ఔత్తరాహులలోని విద్వద్వరేణ్యులు స్వామికి ఏ విధంగా బ్రహ్మరథం పట్టారో విదితమవుతుంది.

ప్రయాగయాత్ర ముగించి, అక్కడి నుండి కాశీకి 80 మైళ్లు నడకసాగించి, 1934 అక్టోబరు 6వ తేది కంచి స్వామి కాశీ నగరంలో అడుగు పెట్టారు. ఆనాటి నగర ప్రవేశమహోత్సవంలో లక్షమంది ప్రజలు పాల్గొన్నారు.

అలహాబాద్ విశ్వవిద్యాలయ వైస్-ఛాన్సలర్ డాక్టర్ గంగానాథ గారితో సహ ఇరవై మంది మహా మహోపాధ్యాయ పండితులు వివిధ సన్మానసభలలో స్వామికి ప్రస్తుతులందజేశారు. వారిలో నవద్వీప పండితులు కామాక్ష్యనాథ తర్కవాగీశులు, బెంగాలు బ్రాహ్మణ మహాసభాధ్యక్షులు పంచాననతర్కరత్న, పండిట్ లక్ష్మణశాస్త్రి ద్రావిడ్, పండిట్ భానుశాస్త్రి వషే, పండిట్ పద్మనాభ శాస్త్రి ప్రభృతు లెందరో ఉన్నారు.

1935 ఫిబ్రవరి 9 తేది మాలవ్యాపండితుడు కాశీ హిందూ విశ్వవిద్యాలయం యాజమాన్యాన సమావేశ పరిచిన మహాసభ కాశీ నగరంలో ఉన్న పండిత బృందంతో, విశ్వవిద్యాలయాధికారులతో, సంస్థానాధిపతులతో, యతివరేణ్యులతో నిండిపోయింది. స్వాతంత్ర్యోద్యమ సందర్భంలో తప్ప, అపూర్వమైన ఇలాంటి సభ అంతకు ముందెన్నడూ జరగలేదు.

పండిత మదన మోహన మాలవ్యా శ్రీ కామకోటిపీఠాధిపతులకు స్వాగతం పలికారు.

వారు స్వయంగా రచించి చదివిన పంచరత్నాలను ఈ పుస్తకంలోనే వేరొకచోట ప్రచురించాము.

స్వాగతపత్ర సమర్పణమూ, పండితుల కృతజ్ఞతాపూర్వక ప్రసంగాలూ జరిగిన పిమ్మట శ్రీ కంచి స్వామి సరళ సంస్కృతంలో సభవారి నుద్దేశించి ప్రసంగించారు. స్వామి ఉపదేశ సారాంశమిది.

"విద్య మనశ్శాంతికి కారణం కావాలి. జ్ఞానార్జనం చేస్తూ మర్త్యభావాన్ని అధిగమించగలగాలి.. మాలవ్యా పండితుడు స్థాపించిన ఈ విశ్వవిద్యాలయంలో ప్రధానంగా ఆస్తిక్యంగల విద్యాభ్యాసాన్ని లక్ష్యంగా పెట్టుకుని విద్యా ప్రణాళికలు రచింపబడాలి."

ఆలోచనలలోను, ఆచరణలోను ఆదర్శప్రాయమైన జీవనం చెయ్యగల విద్యార్థులను తీర్చిదిద్దగల విద్యావిధానాన్ని ఈ విశ్వవిద్యాలయం సృష్టించాలి".

## మాలవ్యా పంచరత్నాలు

*కాశీ విశ్వవిద్యాలయ స్వాగతాభినందనమ్.*

యద్వాచాం లసితై స్త్రిలోక జనతా మోహాంధకార క్షయః
పాదాబ్జస్మరణేన యస్య కలుష ధ్వంసాత్ ప్రసాదః స్థిరః
తస్యాద్వైతగిరాం గురోర్భగవతః శ్రీశంకర స్యోన్నతం
కాంచీపీఠపదం యతీశ్వర మహత్ స్థానం త్వయాధిష్ఠితమ్.

తత్త్వజ్ఞాన - తపః సమాధి - కరుణౌదార్య ప్రసాదాదిభిః
పుణ్యం భారతవర్ష మేత దనఘం ప్రాప్నోతి లాభమ్ పరమ్
కీర్త్యా తే మలయా యతీంద్ర! మహతామాదర్శతాం ప్రాప్తయా
సంతః సంతత ములలసంతిచ దిశః సర్వాః సముద్భాసితాః

స్వామిన్! స్వాగతమస్తు తే శివపురీ శ్రీవిశ్వవిద్యాలయే

శిక్షాకేంద్ర వరేత్ర భారతభువాం విద్యార్థినాం సర్వతః

శ్రీమద్ వక్త్రసరోరుహోదిత శుభాశీ గీ(సు)స్సుధాధారయా

సాఫల్యం శ్రుతి జన్మనోర్భవతు నః శాంత్యై స్రవంత్యా భువః.

ఘోరే కలౌ ప్రతిదిశం భువి సత్యధర్మో

హస్తాపకర్ష మధునా నితరా ముపైతి

తస్యోన్నతిః పునరిహాఖిల మంగళార్థా

భూయాద్యథా కరుణయోపదిశేతి యాచే.

ప్రాచ్య ప్రతీచ్య శుభభావ సమన్వయేన

భోగాపవర్గద సుశిక్షణ దానశీలః

ఏషో ఖి లా భ్యుదయ కృద్యతివర్యవిశ్వ

విద్యాలయ స్తవ శుభాగమనేన దన్యః.

**- మాలవీయో మదన మోహనః**

## జీవకారుణ్యానికి పరాకాష్ఠ

స్వామి జీవకారుణ్యం ఆదర్శప్రాయం. అనన్యసాధ్యం.

దేశసంచారం చేసేటప్పుడు రైలుగాని, మోటారుగాని ఉపయోగించకుండా, కేవలం నేలపై నడిచి వెళ్లడానికి ఈ జీవకారుణ్యమే ఒక కారణంగా స్వామి పేర్కొన్నారు.

రైలు, మోటారుకార్ల చక్రాల క్రింద భూమిపై తిరిగే కోటానుకోట్ల సూక్ష్మజీవులు నశించే అవకాశం ఉంది. కాలినడకవల్ల వాటికి అంతహాని సంభవించదు. అలాంటి జీవులకు ఎక్కువ హాని జరగని పద్ధతిని తాను అవలంబిస్తున్నామంటారు.

స్వామి జీవకారుణ్యం ఎంతటి పరాకాష్ఠకు చేరుకున్నదో తెలుసుకోడానికి ఒక నిదర్శనం:

స్వామి ఒకసారి మఠంలో గోడ నానుకుని కూర్చున్నారు. కూర్చుని ఉండగా కునుకు పట్టింది. అది నిజంగా నిద్రావస్థో, సమాధిస్థితో మనం చెప్పలేము.

కొంతసేపటికి స్వామికి తెలివి వచ్చింది. కళ్లు తెరిచారు. తమ వీపుమీద ఏవో పాకుతు న్నట్టు తోచింది. పరిశీలించగా, ఆ గోడపై వున్న చదపురుగులు శ్రీవారి వీపుమీదకి పాకి విహరి స్తున్నాయి!

స్వామి చేత్తోగాని, గుడ్డతోగాని వాటిని విదిలించడానికి ప్రయత్నించలేదు. ఒక శిష్యుని పిలిచారు. తమ వీపుపై పాకే చదల్లో ఒక్కదానికైనా హాని కలగకుండా, నేర్పుగా, నెమ్మదిగా తీసివేయమన్నారు.

చదల కెక్కడ అపాయం జరుగుతుందోనని భయపడుతూ, భయపడుతూ శిష్యుడు ఆ పురుగుల నన్నింటిని జాగ్రత్తగా తొలగించేసరికి అతడి తలప్రాణం తోకకు వచ్చింది! అయినా, స్వామికోరిక నెరవేరింది.

### *ధర్మాచరణకు శ్రద్ధ ప్రాతిపదిక*

ధర్మాచరణకు శ్రద్ధ ప్రాతిపదిక. ధర్మవిషయంలో 'ఎందుకు?' అన్న ప్రశ్నకంటె, 'ఏది?' అన్నదే ప్రధానం. 'ఎందుకు' అనేది అనవసరం.

ధర్మం ఆత్మసంబంధం. ఆత్మ మనస్సుకు పైది. ఆత్మకు సంబంధించిన విషయం

మనస్సుకు బోధపడక తికమకపడుతుంది.

ధర్మం శాసనం. శాసనాలకు శాస్త్రాలు చెబుతాయి. ''తస్మాత్ శాస్త్రం ప్రమాణంతే కార్యా కార్య వ్యవస్థితౌ''

# శ్రీ కాంచీ క్షేత్రం

అయోధ్యా మధురా మాయా కాశీ కాంచీ అవంతికా।

పురీద్వారవతీ చైవ సప్తైతే మోక్ష దాయకాః।

భారతదేశంలో గల సప్తమోక్షపురులలో శ్రీ కాంచీ క్షేత్రం ఒకటి. అది మోక్షవిద్యకు మూలపీఠం. అద్వైతవిద్యకు ఆధారస్థానం. ఆదిశంకరులు అధిష్ఠించిన కామకోటిపీఠవైభవంతో ఆ నగరశోభ మరింత దేదీప్యమాన మయింది. ఆది శంకరుల నుండి నేటి వరకు అవిచ్ఛిన్నంగా కామకోటిపీఠజగద్గురుపరంపరను సాక్షాత్కరింపజేస్తున్న గురుపీఠానికి ఇది ఆవాసభూమి.

'కాంచీ' అనగా మొలనూలు. వడ్డాణం. మొత్తం భారతభూమికి ఇది నాభిస్థానం. అతి ప్రధానమైన శక్తిక్షేత్రం. పరమపూజ్యులైన ఆదిశంకరభగవత్పాదుల విదేహముక్తి నందిన పుణ్యస్థలం.

దేవర్షి అయిన అగస్త్యుడు తీర్థాటనం చేస్తూ కాంచీ క్షేత్రానికి విచ్చేసి శ్రీ కామాక్షీ దేవిని పూజించాడు. "కామీక్షీ సదృశీదేవీ, నాస్తి మంగళదేవతా."

శ్రీరామచంద్రుడు సీతావినియోగంతో అడవిలో సంచరిస్తూ కాంచీ పట్టణానికి వచ్చి, అగస్త్యమహాముని వాక్యాన్ని పాటించి, ఇచట ఈశ్వరార్చన చేశాడు.

సర్వతీర్థం:- కంచికి పశ్చిమంగా 'సర్వతీర్థం' సరస్సు ఉంది. ఇది సర్వతీర్థాలకు సమాహారరూపమైన సార్థకమైన పేరు కలిగి ఉన్నది.

ఆమ్రవృక్షం:- కంచిలో ఉన్న ఏకామ్రేశ్వర ఆలయంలో వేదాలన్నీ మామిడిచెట్టు రూపంలో ఆవిర్భవించాయి. దీనివల్లనే ఇచటి ఈశ్వరునికి 'ఏకామ్రేశ్వరుడనే పేరు ప్రసిద్ధమైంది. ఈ వృక్ష దర్శనం సర్వసిద్ధులను ప్రసాదిస్తుంది. నేటికీ ఈ వృక్షాన్ని కన్నులారా కాంచి సేవించుకోవచ్చు. శ్రీఏకామ్రేశ్వరుడు పృథివీలింగరూపంలో ఉంటాడు.

శ్రీ కామాక్షి అమ్మవారు

కాంచీక్షేత్రం చక్రాకృతిలో నిర్మితమైంది. ఈ క్షేత్రం మధ్యభాగాన బిందు స్థానీయంగా శ్రీ కామాక్షీ అమ్మవారి ఆలయం ఉంటుంది. అమ్మవారే ఇచ్చటి ప్రధాన దేవత. కంచిలోని

దేవాలయ విమానగోపురాలన్నీ కామాక్షీదేవి ఆలయానికి అభిముఖంగా ఉంటాయి.

శ్రీరాజరాజేశ్వరీ స్వరూపిణి అయిన ఈ తల్లి ఇక్కడ సిద్ధాసనంలో ఆసీనురాలై ఉంటుంది. ఈమె చతుర్భుజ. కుడివైపు వెండిచేతిలో పంచపుష్పబాణాలు, పై చేతిలో పాశం, ఎడమ వైపు వెండి చేతిలో ఇక్షుధనస్సు,పై చేతిలో అంకుశం.

ఈ అమ్మవారి విగ్రహానికి ముందు శ్రీ ఆదిశంకరులు సాలగ్రామశిలపై స్వయంగా లిఖించి ప్రతిష్ఠించిన శ్రీచక్రఅధిష్ఠాత్రిగా ఆ పరాశక్తి సూక్ష్మరూపిణిగా దర్శనమిస్తుంది. ఇదే కామకోటి పీఠం.

ఇచ్చట చిదాకాశ (బిలాకాశం) రూపమే అమ్మవారి కారణరూపం. అఖండ సచ్చిదానంద రూపిణి అయిన పరదేవత యొక్క స్థూల, సూక్ష్మ, కారణ రూపాలను ఇక్కడ మనం దర్శించ వచ్చు.

కంచిలోని ఏకామ్రనాధుని రథోత్సవం, శ్రీవరదరాజస్వామి రథోత్సవం మొదలైనవి, కంచిలోని ఏ దేవునకు ఏ ఉత్సవం జరిగినా అది శ్రీ కామాక్షీదేవి ఆలయ ప్రదక్షిణ రూపంగా, అమ్మవారి ఆలయం చుట్టూ ఉండే నాలుగు ప్రధాన వీధులగుండా వెళ్లడం ఇప్పటికీ సంప్రదాయసిద్ధమైన ఆచారం.

కంచిలోని వరదరాజ స్వామి ఆలయంలో కూడా ఎనిమిది స్థంభాల మంటపం వేద వ్యాస, ఆది శంకరుల శిల్పాలు ఉన్నవి.

ఐతిహాసిక ప్రశస్తి:- కాంచీక్షేత్రం వైదికధర్మ పోషణ, ప్రచారాలకు కేంద్రస్థానమై సింహళం, ఇండోనేషియా మొదలైన పలు ప్రాంతాలకు వైదిక ధర్మాన్ని వ్యాపింపజేస్తూ ఉండేది. ప్రాచీనపురాణాల్లో 'బ్రహ్మశాల', 'దివ్యక్షేత్రం' అని ఈ పట్టణం వర్ణించబడింది.'నగరేషు కాంచీ' అని కూడా ప్రసిద్ధి గాంచింది.

*ఈశ్వరానుగ్రహం*

కామజయానికీ, కాలవిజయానికీ ఈశ్వరభక్తే సాధనం. మన యత్నమే ఆధారంగా ఇంద్రియ విజయాన్ని సాధించలేమా అనుకోవడం ఒక విధంగా అహంకారమే అవుతుంది.

భగవంతుడు ప్రేమ స్వరూపీ, జ్ఞాన స్వరూపీ. ఆయన అనుగ్రహం ఉంటేనే గాని మనకు ప్రేమా, జ్ఞానమూ లభించవు.

## రెండు నిముషాలు నాకు దానమివ్వండి

"మీరందరూ నావద్దకు అనేక కానుకలు తీసుకుని వస్తున్నారు. పుష్పఫలాదులు తెస్తున్నారు. ధనమిస్తున్నారు. వీటిని వేటినీ నేను కోరడం లేదు. దినానికి రెండు నిమిషాలు మాత్రం నాకివ్వండి. ఆ రెండు నిమిషాలు నిశ్చలమైన భక్తితో పరమేశ్వరుని ధ్యానించండి. అదే నాకు అత్యంత ప్రీతికరమైన కానుక. దినమంతా మీరు లౌకిక వ్యాపారాలతో గడుపుతారు. రెండు నిమిషాలు ఈ బీద సన్యాసికి దానమివ్వలేరా? నాకు కావలసిన దంతే!"

# మతంపరంగా హిందువులకు జరుగుతున్న అన్యాయం

*స్వామితో ఏ.యస్.రామన్ ఇంటర్వ్యూ*

సావకాశంగా స్వామివారితో సంభాషించాలని నేను చేసిన ప్రయత్నాలలో ఇది అయిదవది..." అంటూ 1964లో ఇలస్ట్రేటెడ్ వీక్లీ ఆఫ్ ఇండియా పత్రికకు సంపాదకుడు డా.ఎ.యస్. రామన్ శ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతి సమక్షంలో విన్నవించారు.

ఆ మాటకు స్వామి సమాధానం చెప్పలేదు. మందహాసం చేసి మౌనంగా ఉన్నారు.

"పోయిన వారం ప్రత్యేకించి నాకై ఏర్పాటు చేసిన సమావేశంలో దాదాపు 45 నిమిషాలు మీ సాన్నిధ్యంలో ఉండే అదృష్టం నాకు పట్టింది."

"మరోసారి నేను మిమ్ము సందర్శించ వచ్చునీ, ఏ రోజైనా, ఏ వేళ అయినా చూడవచ్చనీ ఆనాడు దయతో సెలవిచ్చారు."

అప్పటికి కూడా స్వామి వారి నుంచి జవాబు రాదు. 'అవును, అవును' అన్నట్టు ముఖం మీద మందహాసం పొడగట్టుతుంది.

"అది మొదలుకుని నేను తమ వద్దకు వస్తూనే ఉన్నాను. అయినా, నేటి మధ్యాహ్నం వరకూ నా అదృష్టం కలిసి రాలేదు."

ఇందుకూ స్వామి సమాధానం మౌనమే.

"నేను తమర్ని కొన్ని ప్రశ్నలు అడగదలుచుకున్నాను. అనుమతిస్తే అడుగుతాను."

సహజమైన కమ్మని తెలుగులో చిట్టచివరకు "సరే" అన్న మాట స్వామినోట వెలువడింది. "మిమ్మల్ని నేను మరిచిపోలేదు. నిజమైన సందేహాలతో వస్తే, ఎవరికైనా నేను సమాధానం చెబుతాను. చిత్తశుద్ధి ఉంటే చాలు."

**రామన్:**స్వామి వారికి కృతజ్ఞుణ్ణి. ఇది నా మొదటి ప్రశ్న: వర్తమాన భారతదేశంలో ప్రజల మత విశ్వాసాలకు మూలమేమిటి? ఆచార వ్యవహారాలలో, కర్మకలాపాలలో మన ప్రజలు శ్రద్ధ వహించినా, ఐరోపా, అమెరికా దేశాల ప్రజలకంటె తత్వతః మన దేశ ప్రజలు ఎక్కువ భౌతిక దృక్పథం కలవారు కారా?

నా ప్రశ్నకు స్వామి వారేమీ చలించలేదు. తటస్థంగా ఉన్నారు. స్వామిఔదాసీన్యం చూచి నేను కంగారు పడ్డాను. నే నడిగిన ప్రశ్న సముచితంగా లేదా? అనుదాత్తంగా ఉన్నదా?...... స్వామి వారు నన్ను పరికించి చూశారు; సానుకంపంగానే కావచ్చు.

స్వామి:మీరు నన్నడగదలచిన మొత్తం ప్రశ్నలు ఎన్నింటికి నేను సమాధానం చెప్పాలి?

**రామన్:** నేను అడగదలచిన ప్రశ్నలు లెక్కకు కొంచెం ఎక్కువే. స్వామివారి సమయాన్నీ, సహనాన్నీ ఎక్కువ హరిస్తానేమో!

స్వామి:పరవాలేదు. కానివ్వండి. ముందు మీ ప్రశ్నలన్నీ వినిపించండి. తరువాత అన్నింటికీ అనువర్తించేట్టు సమాధానం చెబుతాను.

తమ ప్రశ్నలన్నీ శ్రీ రామన్ స్వామికి వినిపించారు. స్వామి మౌనం వహించారు. కళ్లు మూసు కున్నారు. యధాలాపంగా గడ్డం తడుముకున్నారు. క్షణంలో స్వామి ముఖం వికసించింది. పెదవులు విడివడ్డవి. మందస్వరంతో నాలుగైదు మాటలు మాత్రం వినిపించాయి. అవి అంత స్పష్టంగా లేవు. మరొకసారి సెలవివ్వండని శ్రీ రామన్ స్వామిని ప్రార్థించారు.

కిందికి జారుతున్న కాషాయాన్ని పైకి సర్దుకుని కూచుంటూ స్వామి ఇలా అన్నారు. "ఈ ప్రశ్నా వళి తయారు చెయ్యడానికి మీకు ఎన్నిరోజులు పట్టింది? సుదీర్ఘంగా ఉంది. మీ ప్రశ్నలన్నిం టికీ సమాధానం చెప్పడానికి ప్రయత్నిస్తాను."

"స్వామివారు మొత్తం నాలుగు గంటల సేపు తెంపు లేకుండా, అవధాన శక్తితో, తపస్వులకు మాత్రమే సాధ్యమయ్యే సుసూక్ష్మ విషయ పరిగ్రహణ సామర్థ్యంతో సంభాషించారు. చివరకు చూసుకుంటే, నేను స్వామివారిని అడిగిన అన్ని ప్రశ్నలకూ  సమాధానాలు సంపూర్ణంగా, సంతృ ప్తికరంగా లభించాయి" అంటారు రామన్‌గారు.

***

## *'మనదేశంలో మతప్రభావం ఎన్నటికీ క్షీణించదు.'*

అధునాతన భారతదేశంలోని ప్రజల మత విశ్వాసాలను గురించి శ్రీ రామన్ అడిగిన ప్రశ్నకు స్వామి సమాధానం:

స్వామి:మన దేశంలో మత ప్రభావం ఎన్నటికీ క్షీణించదు. స్థూలదృష్టికి మనం భౌతిక దృక్పథం కలవారంగా కనిపించవచ్చు.కాని, నూటికి నూరుపాళ్ళు మనలో మతం జీర్ణించి ఉన్నది, తుదకు మన రాజకీయ నాయకులు సైతం తమ మతేతర ప్రయోజనాలకు మతాన్ని ఉప యోగించుకుంటారు.

సామాన్య ప్రజా హృదయాన్ని ఆకర్షించడానికి గాంధిగారు మతాన్ని ఎంత చమత్కారంగా వాడు కున్నారో మీకు జ్ఞాపకం ఉండి ఉండాలి. మంత పేరు చెప్పి, అమాయకులైన మన ప్రజానీకం చేత ఏదైనా చేయించవచ్చు.

దేశ విభజన జరిగిన వెంటనే లక్షలాది హిందువులు తమ ప్రాణాలను ఎందునిమిత్తం త్యాగం చేశారో బహుశా మీరు విస్మరించి ఉండరు. అనుమానాలను భరించడం కంటె వారు తమ అసువులను కోల్పోవడానికే సిద్ధపడ్డారు.మధ్య ఐరోపా ఖండంలో జరిగిన మత విధ్వంసం కంటె,దేశవిభజన ఫలితంగా భారతభూమిలో జరిగిన సంఘటనలు దారుణమైనవనడానికి సందేహం లేదు.

యూరప్ ఖండంలో ఎప్పుడు ఏ సంఘటనలు జరిగినా ప్రాణాలర్పించిన వ్యక్తులను గురించి మాత్రం చెప్పుకుంటారు. భారతదేశంలో అలా కాదు. మత సంబంధమైన కలహాలు సంభవిం చినప్పుడు మతం కోసం ప్రాణత్యాగం చేసేవారు సామాన్యప్రజలే గాని మేధావులూ కారు, సంస్కర్తలూ కారు.

### *మతాభిమానానికి మరొక నిదర్శనం*

హిందువుల మతాభిమానానికి మరొక నిదర్శనం చెప్పమన్నారా? మన పవిత్రక్షేత్రాలలో దేని నైనా సందర్శించండి. అవసరమైతే మీ విదేశీ మిత్రులను కూడా వెంటబెట్టుకుని పొండి. తిరు ణాలలో వలె ప్రజావాహిని కనిపిస్తుంది. మన పుణ్య తీర్థాలలో, మన పవిత్ర నదీతీరాలలో సంవత్సరం పొడుగునా వేలకు వేలు జనం కూడుతారు. పర్వదినాల్లో నదులలో స్నానాలకై ప్రజలెంత ఉత్సహిస్తారో మీకు తెలియనిది కాదు.

కుంభమేళ వంటి మహోత్సవం ఒక్క భారతదేశంలోనే చూడగలుగుతాము. భౌతిక జీవనానికి మన ప్రజలెంత అలవాటు పడినా, నేటికి కూడా మనదేశంలో మత ప్రభావం సడలలేదు. అది మనందరిలో అస్థినంటుకుని ఉంది.

**ప్రశ్న:**సామ్యవాదం (సోషలిజం) లౌకిక రాజ్యాంగం (సెక్యులరిజం) అనే విషయాలకు అవసర మైనంత కంటె ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వడం ద్వారా నాయకులు ప్రజల్లో సంశయదృక్పథాన్ని, నిరాశావాదాన్ని ప్రబోధిస్తున్నారని నా అనుమానం. ప్రజల జీవితంలో ఒక విధమైన శూన్యతా భావాన్ని సృష్టిస్తున్నారు. తాము నాతో ఏకీభవిస్తారా?

## హిందువులపట్ల విచక్షణ

**స్వామి:**మన రాష్ట్రప్రభుత్వాలేమి, కేంద్రప్రభుత్వమేమి సెక్యులరిజాన్ని బలవంతంగా ప్రజలపై మోపుతున్నాయి. అల్పసంఖ్యాక ప్రజల (మైనారిటీల) విషయంలో మతపరమైన వారి హక్కుల కు ఎక్కడ భంగం కలుగుతుందో అనే భయంతో వర్తిస్తారు. అధిక సంఖ్యాక ప్రజల పట్ల మాత్రం ఆ విధంగా ప్రవర్తించరు. వివాహాలు, విడాకులు, వారసత్వం, దేవాలయాలలో పూజా పునస్కారాలు, ఒకటేమిటి, అధిక సంఖ్యాక ప్రజలకు సంబంధించిన అన్ని విషయాల లోనూ పాలకులు జోక్యం కలిగించుకుని విచక్షణాపూర్వకమైన శాసనాలు చేస్తారు.

తుదకు, కుటుంబనియంత్రణ విధానానికి సైతం హిందూ సంఘమేగురి అవుతున్నది. దీని ఫలితంగా ఇటీవల దేశంలో హిందువుల సంఖ్య నూటికి మూడు వంతులు తగ్గింది. ముస్లిం జనాభా నూటికి అయిదు రెట్లు పెరిగింది. (ఈ సంభాషణ 1964లో జరిగింది. గత 26 సంవ త్సరాలలో ఈ సంఖ్యలు మరింత పెరిగి ఉండాలి - రచయిత) ప్రత్యేకించి అస్సాం రాష్ట్రంలో ముస్లిం జనాభా క్రమంగా హెచ్చిపోతున్నది.

ముస్లిం, క్రైస్తవ సంఘీయుల సాంఘిక, మత వ్యవస్థలను సంస్కరించే సాహసం మన శాసనక ర్తలకు లేదు. అయినా హిందువుల విషయంలో వారి మతాన్ని మూలచ్ఛేదం చెయ్యడానికైనా పాలకులు వెనుకాడరు.

ఆసియా ఖండంలోని అన్ని దేశాలలో మతపరమైన ప్రభుత్వాలున్నవి -- సింహళం, బర్మా,

పాకిస్తాన్, మలయా వగైరాలు. భారతదేశానికి మాత్రమే అలాంటిది లేదు. రాజకీయవేత్తల మతరాహిత్య విధానం ఒక్క హిందువులకే వర్తించబడుతున్నదనడం సుస్పష్టం. హిందువులు తమలో తాము చీలి ఉండడం చేత బలహీనులుగా ఉన్నారు. హిందువులకు నాయకుడు లేడు. వారి క్షేమాన్ని కాపాడే నాథుడు లేడు. అందుచేత, హిందూమతాన్ని భారతప్రభుత్వ మతంగా పార్లమెంటులో ఆమోదింప చెయ్యగల వారెవరున్నారు?

## పాలకుల పాక్షిక విధానం

ముసల్మానులు, క్రైస్తవులు, పార్సీ మతస్థులు తదితర అల్ప సంఖ్యాక వర్గాల వారంతా సుసంఘటితులై బలవంతులుగాఉన్నారు.హిందువులు తమలో తాము ఏకీభవించే ప్రయత్నం చేస్తే చాలు, అట్టి వారిని మతోన్మాదులుగా చిత్రించి, వారి సంస్థలను నిషేధించడంజరుగుతున్నది. ఈ విధంగా అధిక సంఖ్యాకవర్గ ప్రజలను శాశ్వతంగా నిర్వీర్యులుగా చేస్తున్నారు. హిందూమతానికి సంబంధించినంతవరకు బ్రిటీష్ వైసురాయీల కంటె కూడా నేటిపాలకులే ప్రతికూలురుగా కనిపిస్తారు. మతపరమైన మైనారిటీల కోరికలు ఎట్టివైనా వాటిని నెరవేర్చడమూ, హిందువులను కష్టనష్టాలపాలు చెయ్యడమూ, మన నాయకులు అవలంబిస్తున్నవిధానం. ఈ తత్వం నాకు అర్థం కావడం లేదు. దీని ఫలితంగా ప్రజల జీవితంపై హిందూ మత ప్రభావం క్రమంగా క్షీణిస్తుంది.అయినప్పటికీ, మన ప్రజలు మతాన్ని కోలుపోరు.

# సంస్కృతం జాతీయ భాష

(ఎ.ఎస్. రామన్ ఇంటర్వ్యూ)

ప్రశ్న :భాషా సమస్యపై స్వామివారి అభిప్రాయాన్ని తెలుసుకో గోరుతున్నాను.

స్వామి:ఆ విషయాన్ని గురించి నా అభిప్రాయం మీకు ఇదివరకే తెలుసుననుకుంటాను. సంస్కృతం, ఆంగ్లం - ఈ రెండే మనదేశానికి ప్రధాన భాషలుగా ఉండాలి. ఆధునిక భారతీయ భాషలు చాలా వరకు నే నెరుగుదును. వాటిలో అట్టి స్థానం ఆక్రమించేవి మరేవీ లేవు.

ప్రశ్న:తమకు తమ మాతృభాషవలె అంత సిసలుగా ఆధునిక భారతీయభాషలు తెలుసుగదా ?

స్వామి:అంతగా అని నేను చెప్పలేను. కాని, ఇప్పటి భారతీయ భాష లేవీ సంస్కృతాంగ్ల భాషలకు సరిరావు. సంస్కృతం మనకు సహజమైన దేశభాష. థాయిలాండ్, బర్మా,ఇండోనేషియా, సింహళం మరికొన్ని దేశాలలో కూడా సంస్కృతం సజీవ భాషగా ప్రచారంలో ఉన్నది. సంస్కృతాన్ని మనం జాతీయభాషగా రూపొందించుకునే పక్షంలో ఆగ్నేయాసియా దేశాల సంస్కృతికి భాగస్వాములం కాగల పరిస్థితి ఏర్పడుతుంది. ఆ దేశాల ప్రజలు మనలను తమవారుగా భావిస్తారు. రష్యన్ భాషలో కూడా సంస్కృతజన్యమైన పదాలు ఎన్నో ఉన్నవి.

గ్రాంధికమైన సంస్కృత భాషను ఆధునిక వ్యవహారయోగ్యమైన భాషగా మలుచుకుని, దానికి ఆ ప్రతిపత్తిని ఇంతకు ముందే కట్టబెట్టి ఉండవలసింది. ఆ సంస్కరణ జరిగే లోపల ఆంగ్లభాషను మన దేశం నుంచి వెలివేయకూడదు. ఆంగ్లభాష ఉత్తమశ్రేణికి చెందినది. విస్తృతమైన ఈ ప్రపంచంతో సంబంధం కలిగి ఉండటానికి ఆంగ్ల మొక్కటే మనకు ఆధారం. అంతర్జాతీయ ప్రయోజనాలకు ఆంగ్లభాష కున్నంత యోగ్యత ఇతర భాషలకూ లేదు.

ప్రశ్న:ఆర్థర్ కోయిస్లర్ రాసిన "the lotus and the robot" అనేపుస్తకం స్వామివారు చదివారా?

స్వామి : అవును. అది నిషేధించబడక పూర్వం దానిని చదివాను.

ప్రశ్న:ఆ పుస్తకం గురించి తమ అభిప్రాయం ? చదవడానికి ఆ పుస్తకం ఆసక్తిదాయకంగా ఉన్నది. కోయస్లర్ మిమ్ము సందర్శించిన సందర్భమూ, దాని వర్ణనా రమ్యంగా ఉన్నవి.

స్వామి:ఏసుక్రీస్తు ముఖంపై ఉండే మందహాసం గురించి కోయస్లర్ రాస్తాడు. యూరోపియ

ల శిల్ప, చిత్రకళలలో అట్టి చిరునవ్వు చూడలేమనీ, హిందూ సన్యాసుల ముఖాలపైనే చూడ గలమనీ అతను అంటాడు.

రామన్:ఆ మందహాసం విశేషించి తమ వదనం మీద చిందులాడుతుందని ఆయన వ్రాశాడు !

స్వామి:భారతదేశంలోని సత్యాన్వేషకులంటే ఆయనకు అంత గౌరవం లేదని నాకు తోచింది.

రామన్:తమ విషయంలో ఆయన అభిప్రాయం అదికాదు. తమపట్ల సంపూర్ణగౌరవభావం కన బరచాడు. అయినా, భారతదేశమన్నా, భారతీయులన్నా, ఈ యూరోపియన్ 'ప్రబుద్ధుల' అభి ప్రాయాలు అంతగా పరిగణించదగినవి కావు - వాటికి ఒక ప్రమాణం లేదు.

చివరకు, నేనొక ప్రశ్న అడగవచ్చునా ? భగవంతుని పై గల భావన విషయమై పాశ్చా త్యులకు, భారతీయులకు గల ముఖ్యమైన భేదమేమిటి?

స్వామి:భగవంతుని పట్లగల భావన విషయంలో అభిప్రాయభేదం ఉండటానికి అవకాశం ఏమున్నది ? భగవంతుని చేరుకోడానికి అవలంబించే మార్గాలలో భేదం ఉండవచ్చు.

పాశ్చాత్యులు మతం ద్వారా ఈశ్వరుని చేరడానికి ప్రయత్నిస్తారు. భారతదేశంలో మన వారు తత్త్వశాస్త్రం (వేదాంతం) ద్వారా భగవంతుని పొందడానికి చూస్తారు.మన కర్మకలాపాలు, మన అనుష్ఠానాలు, మన జపతపాలు - ఇవన్నీ, కఠినమైన ఈ మార్గానికి సోపానాలు. సత్యా న్వేషణపై తన మనస్సు లగ్నమైందని సాధకుడు, లేదా భక్తుడు భావించినంతవరకే వాటి ప్రయోజనం.

అంతటితో శ్రీ ఎ.యస్. రామన్ తన ఇంటర్వ్యూ ముగించి, స్వామి ఆశీస్సులను పొంది, చివర కు ఇలా అన్నారు.

"నాలుగు గంటలు నిర్విరామంగా జరిగిన ఈ సంభాషణ మూలాన తమకు కలిగిన ప్రయా సను నేను గుర్తించకపోలేదు".

స్వామి:మీ ప్రశ్న లన్నిటికీ సమాధానాలు వచ్చినవా ? నేను మాట్లాడిన తెలుగు పరవాలేదు కదా ! అంటూ మౌనం వహించారు.

మృదువైన స్వామి పెదవులపై అనుగ్రహపూర్వకమైన మందహాసం మరొకమారు చిగురిం

చింది. కాంతివంతమైన ఆ విశాలనేత్రాలలో మెరుపు మెరిసింది. కృపారసం వెదజల్లే స్వామి రూపంలో నటరాజును, బుద్ధభగవానుని దర్శించాను.

ప్రధాన పీఠాధిపతులలో ఒకరైన స్వామివారికి ఏ కొరతా లేదు.. వజ్రకిరీటాలు, సింహాసనాలు, ఏనుగులు, ఒంటెలు, గుఱ్ఱాలు, పరిచారకులు, సేవకు ఈ సమస్తం సర్వసిద్ధంగా ఉంటవి. అయినా ఆయనకు వాటితో పనిలేదు. భక్తులు తెచ్చియిచ్చిన పూలదండలే స్వామి కిరీటం. వాహనంతో పనిలేని పాదచారమే స్వామి ప్రయాణసాధనం. భక్తుల హృదయమే స్వామి సింహాసనం.

భస్మంతో బంగారం చెయ్యరు ఈ స్వామి. దరిద్రులను క్షణంలో ధనవంతులను చెయ్యరు. మామూలు గుమాస్తా మరుసటి దినంలో కార్యదర్శి కాడు. న్యూయార్కు కాటన్ మార్కెటు మెంబర్లను స్వామి ప్రసాదించడు. ఇలాంటి అద్భుతాలను వేటినీ స్వామి ప్రదర్శించరు.

కాని, ఏ మాంత్రికుడూ, ఏ ఇంద్రజాలికుడూ చెయ్యలేని ఒక్క అద్భుతాన్ని స్వామి చేస్తారు. అదేమంటే, స్వామి సమక్షంలో ఉన్నప్పుడు సాక్షాత్తు భగవంతుని సాన్నిధ్యంలో ఉన్నామనే భావం మనకు కలగజేస్తారు !

## హిందూ వివాహం

అవివాహిత అయిన కన్య ఈశ్వరుణ్ణే భర్తగానూ, వివాహిత అయిన పిమ్మట భర్తనే ఈశ్వరుడుగానూ ఎంచుకోవలి అన్నారు.

మనమతంలో వివాహం కేవలం ఒడంబడిక (contract) కాదు, ఆత్మోన్నతికి ఏర్పడిన సంస్కారం.

# దోషాలన్నింటికీ విరుగుడు వర్ణవ్యవస్థ

*ఎ.యస్.రామన్ ఇంటర్వ్యూ*

**ప్రశ్న:**వర్ణవ్యవస్థను తాము ఎలా సమర్థిస్తారు? దేశకాల పరిస్థితులకు విరుద్ధంగా కనిపించే ఈ విధానాన్ని సంస్కరించడానికి, మార్చడానికి అవకాశం ఉన్నదా?

**స్వామి:**వర్ణవ్యవస్థకు సంబంధించినంత వరకు దానిలో గుణదోషాలు రెండూ ఉన్నవి. ప్రపంచంలో అత్యంత ప్రాచీనమైన జీవితవిధానం అది. దానిలో సత్యం ఉండబట్టే నేటికీ అది సజీవంగా ఉన్నది.

ఏ నాగరికత గానీ క్షీణించడానికి ముఖ్యకారణం మానవుని స్వార్థపరత్వమే. స్వార్థం వల్లనే పోటీ, దురాక్రమణ, పరపీడన, చివరకు వినాశనం అన్నీ సంభవిస్తాయి. పేదలను ధనికులూ, అజ్ఞానులను విజ్ఞావంతులూ, అమాయకులను నాగరికులూ, ఆస్తికులను నాస్తికులూ లోబరుచుకుంటారు.

ఆదిలో రూపొందించిన హిందువుల వర్ణవ్యవస్థ మూలసూత్రాలు ఇట్టి దుష్పరిణామాలను ప్రోత్సహించేవి కావు. వాస్తవంలో, ఆ దోషాల కన్నిటికి విరుగుడే వర్ణవ్యవస్థ. అలా కాకపోతే, రమారమి అయిదువేల సంవత్సరాలలో తటస్థించిన అనేకానేక వైపరీత్యాలను, హెచ్చుతగ్గులను తట్టుకుని అది నేటికీ జీవించి ఉండేది కాదు. 'సర్వేజనాః సుఖినోభవన్తు' అన్నదే దాని మూలసూత్రం. వర్ణాంతర్గమైన ఒక్కొక్క విభాగాన్ని సంఘటితంచేస్తూ, మొత్తం హిందూ సంఘం అభ్యుదయాన్ని సాధించడమే దాని ముఖ్యోద్దేశం. భిన్నత్వంలో సమైక్యతను రూపొందించడమే దాని లక్ష్యం.

ఈనాటికి కూడా యావద్భారతదేశంలో ఆ జీవిత విధానమే కొనసాగుతున్నది. ఒక్కొక్క రాష్ట్రానికి ఒక్కొక్క భాష. రాష్ట్రానికే కాదు, కొన్ని చోట్ల జిల్లాలకు సైతం వేర్వేరు భాషలున్నవి. అయినప్పటికీ, అశేష భారతంలో హిందువులంతా క్రమానుగతమైన జీవితవిధానాన్నే అనుసరిస్తారు. ఇంత కాలంగా వారి ఆధ్యాత్మిక వికాసానికి ఇదెంతో ఉపకరించింది.

ఆదిలో రూపుదాల్చిన పద్ధతి ననుసరించి వర్ణవ్యవస్థ హిందువులందరిలో క్షమాగుణాన్ని పెంపొందిస్తుంది. ప్రతి వర్ణమూ స్వధర్మాచరణంపై శ్రద్ధ వహిస్తుందే గాని, ఇతర వర్ణస్థుల విధానాలను అవలంబించాలని కోరదు.

ఉదాహరణకు, బ్రాహ్మణుడు నిరుపేద స్థితిలో ఉన్నా, వైశ్యుని సంపదను చూచి అసూయ చెందడు. అదేవిధంగా, వైశ్యుడు తానెంత సంపన్నుడైనా, క్షత్రియుని రాజ్యాధికారానికి తాను ప్రాకులాడడు... మతం, తత్వశాస్త్రం, కళ, సారస్వతం మొదలైన వివిధ విషయాలలో మనవారు సాధించిన మహోన్నత విజయాలకు మూలాధారం వర్ణవ్యవస్థేనని చెప్పవచ్చు.

కాని, నేటి పరిస్థితి ఆ విధంగా లేదు. నేడు వర్ణ విభాగం నామ మాత్రమే. అది వాస్తవ స్థితిలో లేదు. అందుచేతనే నేడు మనకీదుస్థితి కనిపిస్తున్నది. వైవిధ్యం ఒకప్పుడు మనకు బలాన్ని ప్రసాదించింది. ఇప్పుడది పరస్పర వైరుధ్యానికి హేతువైంది. నాలుగు వర్ణాల ప్రజలు ఎవరికి వారు వేరై పోవడమే గాక, ఒకరినొకరు ద్వేషించుకునే పరిస్థితులు కల్పించబడినవి. ఇది చూచి, చాతుర్వర్ణ ్య వ్యవస్థకు వెలుపల ఉన్నవారు సంతోషిస్తున్నారంటే ఆశ్చర్యం చెందనక్కర లేదు. ఒక్కొక్క కులాన్ని విడివిడిగా దెబ్బకొట్టవచ్చు. అందువల్లనే, బ్రాహ్మణులు సైతం క్రైస్తవ ఫాదరీలకు అవలీలగా వశులైనారు.

## నేటి బ్రాహ్మణుని దుస్థితి

పూర్వం బ్రాహ్మణుడు హిందూసంఘానికి ఆధ్యాత్మికపరంగా నాయకుడు. మన మతం పేరు కూడా బ్రాహ్మణమతం (బ్రాహ్మనిజం) అనే కాని, హిందూమతం (హిందూయిజం) కాదు. ఈ రోజుల్లో కింది కులాల వారు ఆ నాయకత్వాన్ని బ్రాహ్మణుడి చేతులలో నుంచి తప్పించి తమకు సంక్రమింప చేసుకుందామని ఆశిస్తున్నారు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర జాతులకు చెందిన ప్రజలందరూ ఒకరిని ఒకరు సహించరు. ఎవరికి వారే అగ్రేసరుల మని గర్విస్తారు. ద్వేషించుకుంటారు. ప్రచ్ఛన్నంగా ఈ నాలుగు తెగలకూ అంతర్యుద్ధం జరుగుతూ ఉంటుంది. నన్నడిగితే, ఈ దుస్థితికి ప్రధాన కారకుడు బ్రాహ్మణుడే అంటాను. ఇతర కులాల వారి గౌరవానికి బ్రాహ్మణుడీనాడు పాత్రుడు కావడం లేదు.బ్రాహ్మణేతరులు బ్రాహ్మణుణ్ణి విశ్వసించలేరు.

ఆధ్యాత్మికంగా హిందూసంఘానికి ఆచార్యుడుగా ఉండే యోగ్యతను బ్రాహ్మణుడు కోల్పో యాడు.

ఒకానొకప్పుడు బ్రాహ్మణుడు ఆర్థికంగా హిందువు లందరికంటె అట్టడుగున ఉండట మే గాక, మేధావిగా, శాస్త్రవేత్తగా, ఆచార్యుడుగా ఔన్నత్యంలో ఉండేవాడు. ఎంతటి దరిద్రస్థితి లో ఉన్నా అందరిచేతా అతడు గౌరవింపబడేవాడు. గ్రామంలో బ్రాహ్మణుడు ఒక్కరోజు లేకు న్నా, అందరికీ లోటుగా, వెలితిగా తోచేది. అతని ఇల్లు తపోవనంలా, ఆశ్రమంలా కనిపించేది. యావత్ప్రపంచం తనను కనిపెట్టి చూస్తున్నదనే భావంతో బ్రాహ్మణుడు ఎల్లరకు ఆదర్శప్రా యుడుగా జీవనం గడిపేవాడు. ఆధ్యాత్మికమార్గంలో తాను అగ్రస్థానం వహించి ఉండడం చేత, ప్రజల ధర్మాన్ని కాపాడేందుకు తానెంతటి త్యాగమైనా చేయడానికి సిద్ధపడేవాడు.

కాని, నేటి పరిస్థితి ఎలా ఉన్నది? బ్రాహ్మణుడు తన బాధ్యతలను పూర్తిగా విస్మరిం చాడు. తన పూర్వీకులు ఆచరించిన జీవిత విధానాలను ఇతరులకు బోధించడానికి సైతం అర్హతను కోలుపోయాడు. క్షత్రియ, వైశ్య, శూద్రజాతులకూ, బ్రాహ్మణ జాతికీ భేదం అంతరిం చింది. అట్టి స్థితిలో బ్రాహ్మణేతరులు బ్రాహ్మణుని 'నీ ఆధిక్యమేమిటి?' అని ప్రశ్నించడానికి ఆటంక మేమున్నది? అందరూ కలిసి వర్ణవ్యవస్థను కేవలం విమర్శించడమే కాదు, దానిని నామరూపాలు లేకుండా చెయ్యడానికే సిద్ధపడతారు.

## నివారోణోపాయం

ఇందుకు నివారణోపాయం ఏమిటి? కులాలను రద్దు చెయ్యడమా? అంతకంటే తేలికై న పని వేరొకటి ఉండదు. అయితే, అది పరిష్కారమార్గం కానేకాదు. వర్ణవ్యవస్థను పునరుద్ధ రించి, పూర్వపు ఔన్నత్యాన్ని దానికి కట్టపెట్టగల వాడు బ్రాహ్మణుడే గాని, అన్యుడు కాడు. అందుచేత బ్రాహ్మణులకు నా సలహా ఇది. 'మీరు సద్బ్రాహ్మణులుగా జీవితాలు గడపండి. అందరికీ ఆదర్శప్రాయులుకండి. మీ గుణాలను ఇతరులు అనుకరించేట్టు, మీ దోషాలను వారు పరిహరించుకునేట్టు చూడండి. మనో నిగ్రహం, ఆత్మనిగ్రహం, తమకై తాము దారిద్ర్యా న్ని వరించడం మొదలైనవి, మీ పూర్వీకులూ, మీ పెద్దలూ అవలంబించిన జీవిత విధానంలోని

కొన్ని పవిత్ర లక్ష్యాలు. వారివలె మీరు కూడా వాటిని అనుష్ఠించండి. అప్పుడు హిందూసంఘం లోని బ్రాహ్మణేతర ప్రజానీకమంతా మీచే ప్రభావితులౌతారు. హిందువులలో ఐక్యత సమకూడుతుంది. ఆధ్యాత్మిక విలువలకు సంబంధించినంత వరకు ఎలాంటి పరిస్థితులలోనూ నియమోల్లంఘనం చెయ్యకండి!

ఇందుకు ఎంతో త్యాగం అవసరం. దానిని కాదదను. దేశం కోసం ప్రాణాలు త్యాగం చేసిన దేశభక్తులు లేరా? తన మతం కోసం, తన ధర్మం కోసం బ్రాహ్మణుడు ప్రాణం ధారపోయలేడా? నాయకుడైనవానికి లాభాలతోపాటు బాధ్యతలు కూడా ఉన్నవి. బ్రాహ్మణుని స్వార్థ రాహిత్యమూ, త్యాగపరత్వమూ - ఈ రెంటి మీదనే వర్ణవ్యవస్థ జవసత్త్వాలు ఆధారపడి ఉన్నవి. కాని పక్షంలో, బ్రాహ్మణునిపై విధింపచబడిన నైతిక ప్రమాణాలను సమర్థించే దెట్లా? ఈ సంస్కరణకు ముందు బ్రాహ్మణుడే ఉద్యుక్తుడు కావాలి.

## నైతిక విలువలు

ప్రశ్న:మతపరంగా హిందువుల నుద్ధరించడానికి మీరు సూచించే మార్గమేది?

స్వామి:అన్నిటికంటె ముఖ్యమైనది ప్రజల నైతిక ప్రమాణాలను అభివృద్ధి పరచడం. ధర్మమార్గావలంబనం అవసర మనే అంతఃప్రేరణ మనకు రానంతవరకు శాసన రీత్యా ఎలాంటి సంస్కరణలు తలపెట్టినా, అవి నిరుపయోగమే కాగలవు. పాఠశాలల్లోనూ, ఇళ్లల్లోనూ మన బాలబాలికలకు నైతికబోధ చెయ్యడం అవసరం. వారి లేత మనస్సులను ఆకర్షించే పద్ధతిలో ఆ బోధనను రూపొందించాలి. వైద్యం, ఇంజనీరింగ్ మొదలైన విద్యలను ఉచిత వయస్సులో నేర్చుకొనవచ్చు.  విద్యార్థుల నడతకు, నైతిక సూత్రాలకు అన్నిటికంటె ప్రధాన స్థానం ఇవ్వాలి.

మా చిన్నతనంలో వలె పాఠశాలల్లో విద్యాభ్యాసం ప్రయోజనకరమూ, ఆధ్యాత్మిక భావసమన్వితమూ అయినప్పుడు, ప్రజల సాంఘిక, నైతిక సంస్కరణలకు సంబంధించిన చట్ట నిర్మాణం అంతగా అవసరం ఉండదు. కేవలం శాసనాల ద్వారా ప్రజల నైతిక ప్రమాణాలను పెంపొదించుదామని నేడు ప్రభుత్వం చేసే ప్రయత్నా లన్నీ ఆచరణ సాధ్యంకాని చట్టాలుగా, మృతాక్షరా

లుగా నిలిచిపోతాయి. న్యాయవాదులు తమ జేబులు నింపుకోవడానికి మాత్రమే అని ఉపకరి స్తాయి. వెనకటి రోజులలో విద్యార్థులకు నీతిని, ధర్మాన్ని బోధించే పాఠ్య పుస్తకాలు నిర్బంధ ప ఠనీయాలుగా నిర్ణయించేవారు. దొంగతనం చెయ్యనివారికి, అబద్ధాలు చెప్పనివారికి, పెద్దల ఆదర్శాలను పాటించే బాలబాలికలకు బహుమతు లిచ్చి వాళ్ళను ప్రోత్సహించే వారు. నేటి పా ఠశాలల్లో విద్యార్థుల నైతికశిక్షణతో ఏ మాత్రం సంబంధం లేని చదువులకు మాత్రమే పారితోషి కా లిస్తున్నారు. బాలల శీలంకంటె వాళ్ల ఉద్యోగాలకూ, జీవనాధారాలకూ ఎక్కువ ప్రాముఖ్యం ఇవ్వడం జరుగుతున్నది. యువతీయువకుల నడతలను సరిదిద్ధవలసినది పార్లమెంటు చట్టా లుకావు, మన మత గ్రంథాలలో నిర్వచించబడిన మహోత్తమ ఆదర్శాలు.

ప్రశ్న:మత పరమైన జీవితం గడిపే వారు పూర్వాచారాలు పాటించడం అవసరమా ?నోములూ, వ్రతాలూ, అనుష్ఠానాలూ ముఖ్యమా ? ఏది ఉచితమో, నిర్ణయించడానికి ఈ కార్య కలాపాలు ఎంతవరకు అవసరం ? భగవంతునిలో విశ్వాసం ఉంటే తప్ప మనిషి నీతిమంతుడు కాడా? సజ్జనులైన వారంతా విధిగా మత విశ్వాసం కలవారా ? నీతికీ మతానికీ గల సంబంధంపైనా, దైవభక్తీ, మానవ ప్రేమకూ గల సంబంధంపైనా స్వామివారి అభిప్రాయాలు వినగోరుతున్నాను. చోరులూ, వ్యభిచారులూ సైతం తమ వ్యాపారాలలో విజయం కలగాలని తమ ఇష్టదేవతలను ఆరాధించవచ్చు కదా ?

స్వామి:మానవుని ఆత్మానుభూతికి, ఆత్మసాక్షాత్కారానికి మతకార్య కలాపాలు అంత ప్రధానం కాని మాట నిజమే. అయితే, అది ఒక్కొక వ్యక్తి ఆధ్యాత్మికసాధనపైనా, పరిణతి పైనా ఆధార పడి ఉంటుంది.

సామాన్యసాధకుడు, లేదా భక్తుడు శాస్త్రనిధి ననుసరించి ఆచార వ్యవహారాలను తూ.చా తప్పక పాటించడం అవసరమే. వాటిని ఆచరించడం వల్ల కనీసం ఏకాగ్రత సిద్ధిస్తుంది. పార మార్థిక సాధనకు క్రమశిక్షణ, ఏకాగ్రత, నియమవర్తన, సంకల్పబలం మొదలైనవి అవసరం. మత కార్యకలాపాలవల్ల వీటిని అలవరచుకోవచ్చు.

మతమూ, నైతిక వర్తనమూ అన్యోన్యాశ్రయాలు కావు. బుద్ధుడూ, మహావీరుడూ దేవుని నమ్మ

లేదు. అయినా, వారు నీతిపరులు, ధర్మపథంలో నడిచారు. వైదికమతానుయాయులలో సైతం నాస్తికులు లేకపోలేదు. సాంఖ్యవాదులు నాస్తికులే. సాంఖ్యులకు కర్మ ముఖ్యమైనంతగా దేవుడు ముఖ్యం కాదు.

## ఆదర్శం అవసరం

అయితే, మనిషికి ఏదో ఒక ఉత్తమమైన ఆదర్శం ఉంటేనే గాని, పరిపూర్ణమైన నీతి సాధ్యం కాదు. ఆ ఆదర్శానికి తన్ను తాను సమర్పించుకుంటాడు. అటు తరువాత, అతని జీవితం శుభపరిణామం చెందుతుంది. మానవుని ఆంతరంగికసాధనకు లక్ష్యమూ, గమ్యమూ భగవంతుడొక్కడే. ఇతర దేశా లన్నిటిలో కంటె భారతదేశంలో ఎక్కువ మంది భక్తులు అవతరించారు. మన మత సాహిత్యం ఎంత సుసంపన్నమో, ఎంత మహిమోపేతమో చూడండి. ఎంతటి వాడైనా మానవుడు అసంపూర్ణుడే. కావున, మానవుడు మానవునకు పరమ లక్ష్యం కాజాలడు. ఆ కారణం చేత, తన నైతికాభ్యున్నతికై, తన ఆధ్యాత్మికపరిణతికై తనకంటె ఉత్తముడూ, మహోన్నతుడైన వానిని, పురుషోత్తముని ఆలంబనంగా ఎన్నుకుంటాడు.

బుద్ధుడు అహింసను పరమధర్మంగా బోధించాడు. ఆ సిద్ధాంతమే బౌద్ధులకు దేవుని స్థానాన్ని ఆక్రమించింది. కాని, బౌద్ధమతం వ్యాప్తిలో ఉన్న దేశా లన్నిటిలో నేడు మన మేమి చూస్తున్నాము ? అహింస పరమధర్మంగా పాటించే ఆ ప్రజల్లో జీవహింస, మాంసాహారం మహావికృత రూపం దాల్చి ఉన్నాయి. మేము అహింసా ధర్మపరాయణుల మని చెప్పుకోవడానికై అచ్చటి ప్రజలు తాము స్వయంగా జంతువధ చేయకపోవచ్చు. మన తూర్పు తీరాలనుంచి కొందరిని తమ దేశానికి రప్పించుకుని వారిచేత ఉత్తమాధర్మాన్ని తన లక్ష్యంగా పెట్టుకుంటేనే తప్ప మానవుడు నైతికంగా పరిపూర్ణతను సాధించలేడు. వ్యక్తి కంటె కూడా, ఒక జాతికి భగవంతుడనే మహోన్నతమైన ఆదర్శం అవసరం. 'చోరులు, వ్యభిచారులు' అని మీరు ఉదహరించిన దోషులు అపమార్గాన పడిన నేటికాలపు బౌద్ధులలాంటి వారు. ఆధ్యాత్మిక సాధనలో విజయం సాధించలేక పోవడం వల్ల కలిగే ఫలితాలకు మానవ సహజమైన దౌర్బల్యం కారణం గాని, ఆదర్శం కారణం కాదు.

## వైజ్ఞానిక పరిశోధన :

ప్రశ్న:ఇటీవలి కాలంలో వైజ్ఞానికంగా మానవుడు అత్యద్భుతమైన ఫలితాలనుసాధించాడు కదా మానవుల మత విశ్వాసాలపై ఈ వైజ్ఞానిక పరిశోధనల ప్రభావ మేమైనా ఉండవచ్చునా?

స్వామి:విజ్ఞానశాస్త్రమూ, అధ్యాత్మికమూ రెండూ ఈ రోజులలో ఒకదాని కొకటి దగ్గరకు చేరుతు న్నవి. మన కంటికి కనిపించే భౌతిక పదార్థము నంతటినీ శక్తి (energy) గా మార్చవచ్చు నని వైజ్ఞానికుడు ప్రకటిస్తున్నాడు. ఆ 'ఎనర్జీ' నే నేను పరాశక్తి అంటున్నాను. ఆ విధంగా విజ్ఞాన శాస్త్రజ్ఞుడు అనుద్దేశపూర్వకంగానే అద్వైతులలో చేరిపోతున్నాడు !

ఉష్ణము, విద్యుత్తు మొదలైన వివిధ రూపాలలో ప్రత్యక్ష మవుతున్నప్పటికీ 'శక్తి' అన్నది సర్వ శక్తిమంతమని వైజ్ఞానికుడు నేను కనిపెట్టిన విషయం. ఇది నేడు అతనిని శంకరుల వాదం చేరువకు చేర్చక తప్పదు. ద్రష్ట లేదా ఆత్మ దేనిని చూస్తుందో, చూచేదీ, చూడబడేదీ రెండూ ఒకటే అవుతాయి.

ఆధునిక విజ్ఞానశాస్త్రానికి గల సంహారకశక్తీ, దానివల్ల ప్రపంచానికి వాటిల్లే నష్టమూ - ఆ సమస్య వేరు.

ప్రశ్న:మరొక ప్రపంచసంగ్రామం జరుగుతుందని తాము భావిస్తున్నారా ? ప్రపంచశాంతి సంరక్ష ణకు తమ సూచన లేమిటి ? తెల్లజాతులకు నల్లజాతులకూ, అరబ్‌లకు యూదులకూ, హిం దువులకు ముస్లింలకూ మధ్య నానాటికీ ప్రజ్వరిల్లుతున్న కలహాలను నశింప జేసే మార్గా లేమిటి?

స్వామి:నేను ప్రవక్తను కానుకదా. అయినా, మూడవప్రపంచ యుద్ధం సంభవిస్తే అది కట్టకడ పటి యుద్ధం కావచ్చు. ఈ మాట చెప్పడానికి నేను ప్రవక్తను కా నవసరం లేదు. ఈసారి తిరిగి అట్టి యుద్ధమే సంభవిస్తే, అటు తరువాత ప్రపంచమూ ఉండదు, యుద్ధాలూ ఉండవు. అయితే అణ్వాయుధాల నిర్మాణంలో పోటీ పడుతున్న రష్యా, అమెరికా దేశాలు రెండూ, ఒక దాని నొకటి గాని, లేదా రెండూ కలిసి మొత్తం ప్రపంచాన్నే గాని, సర్వనాశనం చేసుకోవని నేను భావిస్తున్నాను. తిరిగి ప్రపంచయుద్ధమే సంభవిస్తే అది రెండు రోజులకు మించకుండానే

ముగియవచ్చు !

యుద్ధానికి సన్నద్ధమయ్యే దేశాల మధ్య ప్రేమ, సహనం, పరస్పర అవగాహన, సమాధాన తత్వం మొదలైన ఆదర్శాలున్న పక్షంలో ప్రపంచ ప్రజలలో విద్వేషాలు ఉడిగి, శాంతిస్థాప నకు అవకాశాలేర్పడగలవు.

ప్రశ్న:దేవాలయాల పునరుద్ధరణ పేరిట నేడు కొందరు ధర్మకర్తలు ఆలయాలను వికృతంగా తయారుచేస్తున్నారు. మంచి శిల్పసంపద కలిగిన గోపురాలకూ, రాతిస్థంభాలకూ సున్నపుపూత పూయడం, రకరకాల రంగులు పులమడం, ఇలాంటి చర్యలవల్ల దేవాలయాల జీవితాలను పొడిగించడం లేదు సరికదా, వాటి ఉదాత్తతను, గాంభీర్యాన్నీ మరుగుపరిచి, వాటిని చౌక బారు నిర్మాణాలుగా మారుస్తున్నారు. దీర్ఘకాలం గడిచి నందువల్ల ఈ నిర్మాణాలకు చేకూర వలసిన పవిత్రత మొదలైన ఉత్తమ లక్షణాలు ఆలయోద్ధరణ పేరిట మరుగుపడి పోతున్నవి. మన గోపురాల 'సూడై' లకు కన్నుచెదరే రంగులు పూయడం వల్ల అవి బొమ్మల కొలువుగా తయారవుతున్నవి. తమ అభిప్రాయ మేమి ?

స్వామి:మీ అభిప్రాయాలతో నేను ఏకీభవిస్తున్నాను. ఈ విషయంపై మీరు వెల్లడించిన భావా లను మించి నేనేమీ చెప్ప నక్కరలేదు. దేవాలయం ప్రజల నాకర్షించవలసిన పనిలేదు. కాని, ఏ ప్రమాణాలైతే దానికి నిర్ణయింపబడినవో వాటిని మాత్రం తప్పకుండా పోషించాలి. ఎంత పునరుద్ధరణ చేసినా, ఆదిలో దాని కున్న అందచందాలను,అలంకరణాదులను చెడగొట్టరాదు. ఆలయ ధర్మకర్తలకు దేవునిలో, దేవాలయాలలో విశ్వాసం మాత్రం ఉంటే చాలదు. అభిరుచీ, సంస్కారం కూడా ఉండాలి.

## సినిమా - సంఘసంస్కరణ

ప్రశ్న :సామాన్య ప్రజానీకంపై సినిమా ప్రభావాన్ని గురించి స్వామి అభిప్రాయం ఏమిటి ?

స్వామి:అణుశక్తి మోస్తరుగానే సినిమా కూడా, మంచికీ, చెడ్డకూ రెంటికీ ఉపయోగపడుతుం ఒక కళగా, వైజ్ఞానిక విశేషంగా సినిమా కోర తగిందే కాని, దాని వినియోగం పరిమితమని నా అభిప్రాయం. భూగోళశాస్త్రం, విజ్ఞానం (సైన్సు) వైద్యం, ఇంజనీరింగ్ , సాంకేతిక పరిజ్ఞానం

మొదలైన విషయాల బోధనకూ, డాక్యుమెంటరీలకు అది ప్రయోజనకరమే.

సాంఘిక సమస్యలను సినిమా చిత్రాలుగా ప్రదర్శించడం సమంజసం కాదు. సంఘసంస్కరణ సినిమా లక్ష్యం కారాదు. సినిమా కళను జీవనోపాధిగా చేసుకొనడంవల్ల మన ఆడవారు కులస్త్రీలకు ఉండవలసిన గౌరవమర్యాదలను కోలుపోయి క్షుద్రమైన ప్రదర్శకురాండ్రుగా మారడం అత్యంత శోచనీయం.

నాటకరంగంపై స్త్రీలు అభినయించడం వేరు. భారతపుత్రులని, కళావంతులని, భట్రాజులనే పేర్లతో ఒక ప్రత్యేకతెగకు, కులానికి చెందిన వారు నాటక కళను సంప్రదాయంగా పాటించి, రంగస్థలంపై అభినయించేవారు. అదివారి వృత్తి. నటన వృత్తిగా అవలంబించిన స్త్రీలైనా తమ భర్తల పక్కనే అభినయించే వారు. నటీ సూత్రధారుల రంగ ప్రవేశం గురించి మీరు విని ఉంటారు. నైతిక సూత్రాలను ఉల్లంఘించేవారు కారు. నేను చెబుతున్న విషయాలు నిన్నామొన్నటివి కావు. చాలా పురాతనకాలపు సంగతులు.

నేడీ మర్యాదలను గురించి నియమనిబంధనలను విధించే అధికారం ఎవరికున్నది ? - అందులో ముఖ్యంగా మన చిత్ర నిర్మాతలకు ? చిత్రనిర్మాతలు వారికి వారే అధికారులు.

ప్రశ్న:మన పురాణగాధలను గురించి సినిమాలు తియ్యడం స్వామి వారికి ఇష్టం ఉండ దనుకుంటాను.

స్వామి:సాంఘిక సమస్యలు సినిమాలకు వినియోగించడమే నా అభిమతం కానప్పుడు పౌరాణికగాధలను సినిమాలుగా తీయడం అన్న ప్రశ్నే ఉదయించదు.

# త్యాగానికి తక్షణ ఫలం

1929 ఫిబ్రవరిలో  శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి స్వామి దక్షిణార్కాటు జిల్లాలో పర్యటన చేశారు. ఆ పర్యటనలో ఒకరోజు స్వామి తండలం అనే గ్రామం గుండా ప్రయాణిస్తున్నారు.

ఆ సమీపంలో ఉన్న ఒక గొల్లకులస్తుడు తనకున్న కొద్దిపాటి భూమి మొత్తం అమ్మివేసి, శ్రీవారికి సమర్పించ దలచి, స్వామికి తన ఉద్దేశం తెలియజేశాడు. ఆ పని చెయ్యకుండా అత నిని వారించడానికి స్వామి ఎంతో ప్రయత్నించారు. అయినా, అతడు తన నిర్ణయం మార్చుకో లేదు. తన కున్న చారెడు భూమినీ ఒక ధనవంతుడికి అమ్మివేసి, ఆ డబ్బు తెచ్చి స్వామికి మనః పూర్వకంగా సమర్పించుకున్నాడు.

అతడు నిరాధారుడు కావడం స్వామికి ఎంతమాత్రం ఇష్టంలేదు. అందుచేత, స్వామి వెంటనే ఆ తాలూకా తహశిల్‌దారును పిలిపించి, ఆ ప్రాంతంలో ఉన్న పోరంబోకు భూమిలో తగుమాత్రం భూమిని ఆ గొల్ల ఆసామి పేర పెట్టించారు !

మహాకవి ఎవరు ?

ఎవరి గ్రంథాలు కాలగర్భంలో విస్మృతములు కాక, చిరంజీవములై ఉంటాయో, అతడు మహాకవి!

# నమోవాకము

-శ్రీ కాటూరి వెంకటేశ్వరరావు

శ్రీమద్ భారతకాంచీ దామాయిత కాంచినగరధామునకు నవిధ్యామయ హరణ సుధాకలశీమంజుల దర్శనునకు సిద్ధపదునకున్.

స్మయదూరునకున్ నతసంశయ దళనున కనుపమాన శాంతినిధికి విస్మయకారి బోధ మతి కవ్యయపద వితరణ సమర్థ పాదాబ్జునకున్.

దూరీకృత నతచింతాభారునకు ముముక్షు సేవ్య భవ్య మహోవిస్తారున కద్వయ పద సంచారణ శిక్షాపదాన సంవిన్మతికిన్.

నతమస్తక తల సంయోజిత కరతల మాత్రధూత చిరతాపునకున్ ప్రతివాది ముఖపిధానా ప్రతిమా ద్వయ వాదవికచ వాగ్వల్లిరికిన్.

పరమశమ నిరతునకు శంకరదేశిక కామకోటి కల్పిత పీఠ స్థిర మంగళ దీప శ్రీచరణు నకున్ మాదృశప్రసన్న శివునకున్.

***

# శ్రీ జయేంద్ర సరస్వతి

కామకోటిపీఠం ప్రస్తుత పీఠాధిపతులు శ్రీ జయేంద్రసరస్వతీ శ్రీ చరణుల పూర్వాశ్రమ నామం శ్రీ సుబ్రహ్మణ్యయ్యర్. వీరి తండ్రి శ్రీ మహదేవయ్యర్. తల్లి శ్రీ మతి సరస్వతీదేవి. జననం తంజావూరు జిల్లా 'తిరుళ్లిణికి' గ్రామం. వీరిది ఔచథ్యగోత్రం ఋగ్వేదీయులు. వడమ శాఖ. 1935 లో యువసంవత్సరం , ఆడిమానంలో జననం.  జన్మ నక్షత్రం ధనిష్ఠ.
శ్రీ మహాదేవయ్యర్, సరస్వతి పుణ్యదంపతుల ముగ్గురిపుత్రులలో వీరు జ్యేష్ఠులు.
శ్రీ సుబ్రహ్మణ్యయ్యర్ మూడు సంవత్సరాల వయస్సు వరకు తల్లిదండ్రులవద్దనే ఉండి, అనంతరం మాతామహికి తండ్రిగారైన శ్రీ వీరాస్వామి ఘనాపాఠివారి వద్ద ఆరవసంవత్సరం వరకు ఉన్నారు. తదుపరి తల్లిదండ్రులవద్ద ఉండి నాలుగైదు తరగతులు ప్రాథమిక విద్య నభ్యసించారు. గర్భాష్టమున ఉపనీతులైనారు.

రైల్వేలో ఉద్యోగిగా ఉన్న తండ్రి శ్రీ మహదేవయ్యర్ తన కుమారునిచే వేదాధ్యయనం చేయించదలచి, సమీప గ్రామంలో యజుర్వేద పాఠశాలలో బాలుని చేర్పించారు.

ఇదే సందర్భంలో కామకోటిపీఠాధిపతులు శ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతి శ్రీ చరణులు విల్లుపురానికి విజయం చేశారు. శ్రీ మహదేవయ్యర్ తన కుమారుని శ్రీ వారి దర్శనానికి తీసుకువెళ్ళి కుమారునిచే వేదాధ్యయనం చేయించే ఉద్ధేశంతో ఉన్నామంటూ, స్వామివారి ఆశీర్వాదం కోరారు. ఉత్తమసంస్కారం కోసం రెండు మూడు సంవత్సరాలు మాత్రం బాలునిచే వేదాధ్యయనం చేయించి, అటు పిమ్మట, వృత్తి కొరకు లౌకికవిద్య నేర్పించ దలచినట్లు శ్రీ మహదేవయ్యర్ స్వామివారికి నివేదించారు. కాని, స్వామి మాత్రం ఈ బాలునిచే పూర్తిగా వేదాధ్యయనం చేయించవలసినదిగా తండ్రికి ఉపదేశించారు.

ఆ మరునాడు కంచిలో శ్రీ కామాక్షి అమ్మవారి ఆలయానికి కుంభాభిషేకం చెయ్యడం కోసం శ్రీ స్వామి వారు అక్కడికి బయలు దేరుతూ, విల్లుపురంలోని యజుర్వేదపాఠశాల అధ్యాపకులను, శిష్యులను కంచికి రావలసిందిగా ఆదేశించారు. తమ కుమారుని కూడా వెంట బెట్టుకొని శ్రీ మహాదేవయ్యర్ కంచికి వెళ్లారు.

అది 1944 సంవత్సరం. శ్రీ కామాక్షి ఆలయానికి కుంభాభిషేకం జరిగిన రోజునే అమ్మ వారి సన్నిధిలోనే శ్రీ సుబ్రహ్మణ్యయ్యర్ ఋగ్వేదాధ్యయనం ఆరంభం అయింది. మధ్యార్జునం లోని ఋగ్వేదపాఠశాలాధ్యాపకులైన బ్రహ్మశ్రీ కృష్ణమూర్తి శాస్త్రి గారే అధ్యాపకులు. కాని, గృహ స్థులు పీఠం సొత్తుతింటూ ఉండటం ఉచితం కాదని శ్రీ మహదేవయ్యర్ అభిప్రాయం వెలిబుచ్చటంచేత, చివరకు మధ్యార్జునంలో స్మార్తబ్రాహ్మణపోషణలో ఉండి, కామకోటిపీఠ పర్యవేక్షణలో నడుస్తున్న వేదపాఠశాలలో ఈ బాలుడు ఋగ్వేదాధ్యయనం ప్రారంభించారు. ఆ విధంగా 13 సంవత్సరాలవయస్సు వరకు అక్కడనే ఋగ్వేదాధ్యయనం జరిగింది.

ఆ సమయంలో శ్రీ స్వామి వారు తమ విజయయాత్ర సందర్భంలో మధ్యార్జునం వచ్చారు. ఋగ్వేదం అభ్యసిస్తున్న శ్రీ సుబ్రహ్మణ్యయ్యర్‌ను 69వ పీఠాధిపతిగా స్వీకరించ దలచినట్లు , బాలుని తల్లితండ్రులకు కబురంపారు. తల్లితండ్రులు స్వామి ఆదేశాన్ని శిరసావహించారు.

పీఠ సంప్రదాయాన్ని పలువిషయాల్లో ఈ బాలునికి మూడు సంవత్సరాలు శిక్షణ ఇచ్చారు. రెండు సంవత్సరాలు శ్రీ సుబ్రహ్మణ్యయ్యరు తల్లితండ్రుల వద్దనే ఉండి ఆంగ్లం మొదలైన భాషలను అభ్యసించారు.

అటు తరువాత 1955 మార్చి 19 నుండి 22 తేదీ వరకు కంచిలో ఈ బాలునికి ఆశ్రమ స్వీకారోత్సవం మహావైభవంగా జరిగింది.

విశ్వేశ్వర సన్నిధిలో శ్రీ స్వామివారు శిష్యులకు మహావాక్యోపదేశం చేసి, 'జయేంద్ర సరస్వతి' అనే యోగపట్టాన్ని  ఒక రుద్రాక్షమాలను పీతాంబరాన్ని ప్రసాదించారు, అదిమొదలు శ్రీ జయేంద్ర సరస్వతి శ్రీ చరణులు, శ్రీ చంద్రశేఖర సరస్వతులకు ప్రథమ శిష్యులై పీఠ కార్యక్రమాలన్నిటిలో పాల్గొంటూవచ్చారు.

జనజాగరణ, జన కళ్యాణం

పీఠపరిపాలనాదక్షులు, పూజాకార్యక్రమదురంధరులు, ప్రస్తుతం దేశమంతటా ప్రబలుతున్న అధార్మికవర్తనం, అలజడి, హింసాకాండను చూసి ఖిన్నులై జనసముదాయంలో ధార్మిక

ప్రవృత్తిని పెంపొందించడానికి, ప్రతివ్యక్తి స్వయంకృషితో ద్రవ్యార్జన చేసికొంటూ సంసారాన్ని చక్కదిద్దుకొంటూ, దేశక్షేమానికి పురోగమనానికి ఎంతో దోహదం చేస్తాడనే భావంతో కుల, మత విచక్షణ లేకుండా, సమస్త ప్రజలు క్షేమంగా ఉండాలనే సంకల్పంతో "జన జాగరణ", ' 'జన కళ్యాణం" అను రెండు మహోన్నత కార్యక్రమాలను చేపట్టిన మహనీయులు జయేంద్ర సరస్వతి. ప్రజలలో మన సంస్క ృతి, సంప్రదాయాలను పునరుజ్జీవింపచేయడానికి కార్యక్రమా లను రూపొందిస్తూ అర్హులకు ఆర్థిక సహాయం కల్పిస్తున్నారు. మత ప్రచారంతోబాటు సంఘ సంస్కరణకు పూనుకొన్న పీఠాధిపతి శ్రీ స్వామివారు.

***

# నిరాడంబర దాత రాచూరి రంగదాసు

శ్రీ రాచూరి రంగదాసుగారి పూర్వీకులు మూడు దశాబ్దాలకుపైగా హైదరాబాదులో స్థిరపడిన వారు.

రాచూరివారు వైష్ణవ సంప్రదాయానికి చెందిన సూర్యవంశ క్షత్రియులు.

రంగదాసుగారి తండ్రి శ్రీ రాచూరి శాయన్న కంట్రాక్టుపనులు చేసేవారు. కుమారుడు రంగదాసు పదవ తరగతి వరకు చదివి, తండ్రి అడుగుజాడలలో నిపుణుడైన కంట్రాక్టరుగా రూపొందాడు.

1968లో భద్రాచలంలో శ్రీ సీతారామాలయ కుంభాభిషేక మహోత్సవ సందర్భంలో శ్రీ రంగదాసు ప్రప్రథమంగా శ్రీ కంచి కామకోటి శంకరాచార్యులు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి స్వామి వారిని దర్శించడం తటస్థించింది.

"అంతకు ముందు నాలో లేశమాత్రంగా ఉన్న దైవభక్తి కంచి స్వామివారిని సందర్శించిన తదుపరి ఇనుమడించింది' అంటారు శ్రీరంగదాసుగారు.

"అటు పిమ్మట శ్రీ జయేంద్ర సరస్వతిస్వామితో నాకు సాన్నిహిత్యం పెరిగింది. ఇరువురు స్వాముల అనుగ్రహం ఫలితంగా పెద్ద పెద్ద కంట్రాక్టు పనుల నన్ను వరించి వచ్చినవి. నా ఆదాయం వృద్ధి అయింది."

శ్రీ రంగదాసుగారు తన స్వానుభవాన్ని ఇంకా ఇలా వివరించారు. పెద్దలు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి స్వామి కర్ణాటక రాష్ట్రంలోని గోకక్ అనే గ్రామంలో మకాం చేస్తూ ఉన్నప్పుడు "వెంటనే ఒకసారి వచ్చి స్వామివారిని దర్శనం చేసి వెళ్లవలసిందంటూ" హైదరాబాదులో నాకు వర్తమానం అందింది. స్వామి ఆజ్ఞమేరకు నేను గోకల్ వెళ్లాను. స్వామివారు నాతో ఇలా అన్నారు: "అహోబిలం మఠాధిపతి శ్రీ శఠగోప వేదాంత మహాదేశికులవారి వద్ద నుంచి నాకొక జాబువచ్చింది. శ్రీరంగ క్షేత్రం రంగనాథస్వామి వారికి స్వప్నంలో దర్శనమిచ్చి, అసంపూర్ణంగా నిలిచిపోయిన దేవాలయ గోపుర నిర్మాణం ప్రారంభించవలసిందని శ్రీ జియ్యర్‌స్వామిని ఆజ్ఞాపించాడట. అందుకు ఆర్థిక సహాయం కోరుతూ వారు నాకు జాబు రాశారు."

"నా అభిప్రాయంలో ఆ గోపుర నిర్మాణం అంతా రాతితోనే జరగాలి అని వున్నది. నీవు కంట్రాక్టరువు కాబట్టి, శ్రీరంగంవెళ్లి, అసంపూర్తిగా ఉన్న ఆ కట్టడాన్ని పరిశీలించి, రాతితో కట్టడం ఎంతవరకు సాధ్యమో, అందుకు పునాదులు తగినంత దృఢంగా ఉన్నవో లేవో చూచి నీ అభిప్రాయం నాకు చెప్పాలి."

" ఈ గోపుర నిర్మాణానికి ఎంత ఖర్చు కాగలదో ఆ మేరకు ప్రజల నుండి విరాళాలు కోరుతూ నేనూ శ్రీ శఠగోపయతీంద్రులవారూ ఇరువురం కలిసి ఒక విజ్ఞాపన చేస్తాము."

" ఇకపోతే, గోపుర నిర్మాణాన్ని పర్యవేక్షించడానికి ఒక రిటైరైన ఐ.ఏ.యస్. అధికారిని అడ్మినిస్ట్రేటివ్ అధికారిగానూ, రిటైర్ అయిన అకౌంటెంట్ జనరల్‌ను జమాఖర్చులు చూడడానికీ, అలాగే ఉద్యోగం నుంచి విరమించుకున్న ఒక చీఫ్ ఇంజనీరును గోపుర నిర్మాణ పర్యవేక్షణకు నియమిస్తాము.

ఈ పనులన్నింటికీ వృద్ధులైన శ్రీ యతీంద్రులవారు (అప్పటికి వారి వయస్సు సుమారు 85) శ్రమపడవలసిన పనిలేదు. ఈ విషయాలన్నీ అహోబిలం పీఠాధిపతులతో చర్చించి వారి అభిప్రాయమేమో తిరిగి వచ్చి నాకు చెప్పవలసింది" అని స్వామి ఆజ్ఞాపించారు.

శిల్పశాస్త్ర ప్రవీణుడు శ్రీ గణపతి స్థపతినీ, శ్రీసౌందరరాజన్‌నూ, హైదరాబాద్ అకౌంటెంట్ జనరల్ ఆఫీసులో ఉద్యోగి శ్రీ కె.కృష్ణమూర్తిగారినీ, పునాదులు పరీక్ష చేయడానికి సూపరింటెండింగ్ ఇంజనీరు శ్రీ డి.శ్రీరామమూర్తిగారినీ, మఠం కార్యకర్తలలో ఒకరైన శ్రీ కన్నన్‌గారినీ వీరందరినీ వెంటబెట్టుకుని నేను శ్రీరంగం బయలుదేరాను.

శ్రీరంగంలో నేను శ్రీ ఆచార్యులవారిని దర్శించడం అదే తొలిసారి. కంచిస్వామి వారు చెప్పినదంతా శ్రీ జియ్యరు స్వామికి వివరంగా వినిపించాను. అంతావిని, అందుకు వారిలా అన్నారు. "శ్రీకంచి శంకరాచార్యులవారూ, నేనూ ఉభయులం కలిసి విరాళాలకై విజ్ఞప్తి చెయ్యడం సాధ్యంకానిపని."

పోతే, రిటైరైన ప్రభుత్వాధికారుల పర్యవేక్షణ కింద నిర్మాణం జరగాలన్న శ్రీవారి సూచనను కూడా వారు అంగీకరించలేదు.

కట్టడమంతా రాతితోనే జరగాలన్న విషయంలో శ్రీ జియ్యర్ స్వామి ఇలా అన్నారు: "సిమెంటుతో, ఇటుకతో గోపురం కట్టడానికే ఒకటిన్నర కోట్ల రూపాయిల అంచనా వేశారు. ఆ ద్రవ్యమే ఇంతవరకు లభ్యం కానప్పుడు, పదికోట్లు ఖర్చు అయ్యే రాతిపని ఎలా చేపడ గాము?" అని ప్రశ్నించారు.

పైగా, అప్పటికి తన వయస్సు 85 దాటిందనీ, ఈ గోపుర నిర్మాణం పూర్తయితే చూసి ఆనందించాలని తనకు ఉన్నదనీ, ఇటుక కాకుండా, రాతికట్టడమైన పక్షంలో పది సంవత్సరా లకుగాని పని పూర్తి కాకపోవచ్చని శ్రీ జియ్యర్‌స్వామి అన్నారు.

ఏతావతా, జియ్యర్‌గారు తమ కోరిక ఇలా చెప్పారు: "శ్రీరంగనాథుడు నాకు స్వప్నం లో కనుపించి ఈ పని నీవు పూర్తి చేయవలసిందని ఆజ్ఞాపించాడు. సాధ్యమైతే, నాకు ఈ నిర్మా ణానికి డబ్బు సాయంచేయవలసిందని శ్రీ శంకరాచార్యులవారితో చెప్పండి. అంతకు మించి నేను చెప్పవలసింది ఏమీ లేదు" అన్నారు.

హైదరాబాద్‌లో శ్రీ అహోబిలమఠానికి కార్యదర్శిగా ఉన్న శ్రీసౌందర్యరాజన్ గారితో కలిసి తిరిగి మేమంతా గోకక్‌లో శ్రీవారి వద్దకు వచ్చి, శ్రీరంగంలో జరిగిన విషయమంతా స్వామివారికి నివేదించాము.

స్వామివారు మేము చెప్పినదంతా సావకాశంగా విని, ముక్తసరిగా "అలాగే, జీయర్ గారికి ఎలా ఉచితమని తోస్తే అలా చెయ్యమను" అని సెలవిచ్చారు.

తరువాత శ్రీజయేంద్ర సరస్వతిని పిలిచి, "మఠంలో నిలవ ఎంత ఉన్నది?" అని శ్రీవారు అడిగారు. దాదాపు పదిలక్షలు ఉన్నదని శ్రీ జయేంద్రుల వారన్నారు.

"అయితే, ఒక లక్షరూపాయలు వెంటనే అహోబిలం మఠాధిపతులకు పంపే ఏర్పాటు చెయ్యి" అన్నారు పెద్దలు.

కొన్ని నెలలు గడిచాయి. శ్రీవారు మహారాష్ట్రలోని సతారాలో ఉండి, తిరిగి నాకు కబు రు పెట్టారు. నేను సతారా వెళ్లి స్వామిని కలుసుకున్నాను."నీవు మళ్లా శ్రీరంగం వెళ్లి వస్తావా?" అని అడిగారు.

శ్రీ జియ్యర్‌గారు గోపుర నిర్మాణం ప్రారంభం చేశారనీ, గోపురంలో కనీసం ఒక అంత స్థు కట్టడానికి తమ సహాయం అడుగుతున్నారని, ఒక అంతస్థుతో గోపురం పూర్తికాదు కదా, మిగిలిన అంతస్థులను వారు ఎలా ఏర్పాటు చేస్తారో, వారి ప్రణాళిక ఏమిటో అన్ని విషయాలు వివరంగా వారితో మాట్లాడి తెలుసుకుని రావలసిందిగా నన్ను స్వామివారు ఆదేశించారు.

శ్రీరంగంవెళ్లి నేను శ్రీ జియ్యర్ స్వామిని కలిసికొన్నప్పుడు వారు చాలా ఆవేదన వ్యక్తం చేశారు. "అందరూ వస్తున్నారు, పోతున్నారు. ఎవరూ డబ్బు ఇవ్వడం లేదు" అన్నారు.

జియ్యర్‌గాని మాటవిని నేనెంతో కష్టపడ్డాను. వెంటనే నేను స్వయంగా 25,000 రూపా యలకు చెక్కురాసి వారికి సమర్పించాను.

"ఈ సొమ్ము ఎవరు ఇచ్చినట్టు రాయమంటారు?" అడిగారు శ్రీ జియ్యర్‌స్వామి. "నేను కంచి మఠం నుంచి వస్తున్నాను కాబట్టి కంచిమఠం ఇచ్చినట్టు జమ రాసుకోండి" అన్నాను.

సతారాకు తిరిగివచ్చి, స్వామివారితో పరిస్థితి అంతా చెప్పాను.

స్వామివారిలా అన్నారు: "గోపుర నిర్మాణం పూర్తికాకుండా శ్రీ జియ్యర్‌స్వామి దివంగతు లయ్యే ప్రమాదం లేదు. ఆ పని పూర్తి అయ్యేవరకు వారు సజీవులై ఉంటారు."

నేను మరల శ్రీ జియ్యర్‌గారి వద్దకు వెళ్లినప్పుడు శ్రీవారన్న మాటలను శ్రీ జియ్యర్ స్వామికి వినిపించగా, వారు ఇలా అన్నారు:

"శ్రీచంద్రశేఖర సరస్వతి, శ్రీ జయేంద్ర సరస్వతులు ఇరువురూ నాకు సుపరిచితులే. నాపూర్వాశ్రమంలో నేను వారుభయులనూ ఎరుగుదును. గోపుర నిర్మాణం పూర్తయ్యే వరకూ నేను జీవించివుంటానని పెద్దస్వామి వారు అన్నారంటే అది వారి ఆశీర్వాదం. అంతమాత్రంచేత నేను అంతవరకు జీవించి ఉంటానని గ్యారంటి ఏమున్నది?"

ఇదంతా చెప్పి తరువాత, శ్రీ చంద్రశేఖర సరస్వతి, శ్రీ జయేంద్ర సరస్వతి స్వాము లిరు వురూ హైద్రాబాదులో ఉన్నప్పుడు తన గృహానికి దయ చేసి, తననూ, తన కుటుంబాన్ని అను గ్రహించారనీ, అది మహద్భాగ్యంగా భావిస్తున్నాననీ శ్రీరంగదాసుగారన్నారు.

తనంతట తాను చెప్పలేదుగాని, కొన్ని పత్రికలలో ప్రచురించబడిన వార్తలననుసరించి శ్రీ రంగం గోపుర నిర్మాణానికి మొత్తం ఎంత ద్రవ్యం సమర్పించారని శ్రీరంగదాసుగారిని గుచ్చి గుచ్చి ప్రశ్నించిన తరువాత, మొత్తం లక్ష రూపాయలు ఇచ్చామని, అయితే అది కంచిమఠం పేరిట సమర్పించామని అంగీకరించారు. అది శ్రీరంగదాసుగారి నమ్రతనూ, నిరాడంబరతనూ సూచిస్తుంది.

అంతేగాదు, శ్రీరంగదాసుగారు తన ఇంటి సమీపంలోవున్న రామాలయ ఆవరణలో శ్రీజ్ఞాన సరస్వతి ఆలయాన్ని, శ్రీ ఆదిశంకరుల మందిరాన్ని కూడా నిర్మించారు.

ఇలాగే కంచిస్వామివారి భక్తులలో ఒకరు, సేలంలో ఆడిటరు, తన పేరు ప్రకటించుకో కుండా దాదాపు మూడున్నర లక్షల రూపాయల సేకరించి కంచిమఠం ద్వారా శ్రీరంగనాధుని గోపుర నిర్మాణానికి సమర్పించారు.

ఇందులో ముఖ్యంగా చెప్పదగిన విశేషమేమంటే దక్షిణ భారతదేశంలో ఒక ప్రధాన వైష్ణవాలయ గోపుర నిర్మాణానికై అద్వైత, విశిష్ఠాద్వైత సంప్రదాయాలకు చెందిన ఇరువురు పీఠాధిపతులు ఏకమై, 232 అడుగుల ఎత్తున ఉన్నతోన్నతమైన ఒక మహానిర్మాణాన్ని పూర్తిచే యడం చరిత్రలో అపూర్వం.

మరొక విశేషం. రంగనాధుని గాలి గోపుర నిర్మాణాన్ని గురించి అహోబిలంమఠాధిపతి శ్రీ శఠకోపయతి గారినడిగితే "అంతటికీ కంచి పీఠాధిపతి శ్రీచంద్రశేఖరేంద్రులవారే కారకులు" అంటారు. కంచిస్వామి వారు, "నాదేమున్నది? అంతా అహోబిలం వారికృపే" నంటారు. ఉదార చరితుల ఔదార్యానికి, స్వార్ధరాహిత్యానికీ ఇంతకంటే నిదర్శనమేముంటుంది?

***

# 'నీకు లక్ష్మీకటాక్షం ఉంటుంది'

శ్రీ మాగంటి సూర్యనారాయణ

కామకోటిపీఠాధీశ్వరులు శ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతి వారిని ప్రప్రథమంగా దర్శించే భాగ్యం ఇలయత్తాన్ గుడిలో 1962 సంవత్సరంలో నాకు కలిగింది.

ఆ కాలంలో మా అల్లుడు చిరంజీవి వసుమర్తి సుబ్రహ్మణ్యశాస్త్రి మూర్ఛ వ్యాధివల్ల బాధపడినాడు. ఎంత చికిత్స చేసినా మందులవల్ల వ్యాధి నివారణ కాలేదు. పూజ్యులు, పండితులు, స్వామి వారి భక్తులూ అయిన కీ.శే.మండలీక వెంకట శాస్త్రిగారి సలహాపై కంచిస్వామి వారిని సందర్శించాము. మా అల్లుడి వ్యాధిని గురించి వారికి నివేదించాము. తొమ్మిది ఆదివారాలు వేదోక్తంగా పంచగవ్యములు ఇప్పించవలసిందని స్వామివారు ఆదేశించారు. తు.చ. తప్పకుండా స్వామి ఆజ్ఞను అనుసరించాము. 9 ఆదివారాలు గడువు దాటగానే మా అల్లుడికి సంపూర్ణ ఆరోగ్యం చేకూరింది.

లక్ష్మీ కటాక్షం:

నేను అప్పుడు మోటారుకార్లు విక్రయించే వ్యాపారం చేస్తుండే వాణ్ణి. వ్యాపారంలో పోటీ అధికం కావడం చేత ఆ సమయంలో నా వ్యాపారం చాలా మందగించి, మా వద్ద ఉండే పనివారంతా పని మానుకొనడం సంభవించింది.

అప్పుడు నేను నా కుటుంబంతో కంచికి వెళ్లి శ్రీవారిని దర్శించి, మఠంలో భిక్షచేశాను. భిక్షకాగానే శ్రీవారు నాకు ప్రసాదంఇస్తూ 'నీకు లక్ష్మీకటాక్షం ఉంటుంది' అని ఆశీర్వదించారు.

అప్పటివరకు నేను నా వ్యాపారం మీద ప్రభుత్వానికి నెలకు రు.3,000లు అమ్మకం పన్ను చెల్లించే వాణ్ణి. స్వామివారి ఆశీర్వచనం లభించిన తరవాత నేను చెల్లించవలసిన అమ్మకం పన్ను మూడువేలల్లా, నెలకు లక్ష రూపాయలకు పెరిగింది! ఆ సమయంలో నావద్ద ఒకే ఒక పనివాడుండేవాడు. బయటికి వెళ్లి ఆర్డర్లు తెచ్చేవారే లేరు. అలాంటి పరిస్థితుల్లో స్వామి ఆశీర్వాదబలంతో నాలుగైదు జిల్లాల నుంచి టెలిగ్రాముల ద్వారా ఆర్డర్లు రాసాగినవి. కంపెనీ

వారీ విషయం గమనించి ఆశ్చర్యం వెలిబుచ్చారు. ఇదంతా స్వామివారి ప్రభావం తప్ప మరొ కటి కానేకాదు.

శ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతిమహాస్వాములు సాక్షాత్తు భగవంతుడే తప్ప, మానవమాత్రు లు కారని నా విశ్వాసము. ఇటువంటి నిదర్శనాలు ఇంకా అనేకం వున్నవి.

*నానాత్వంలో ఏకత్వం*

నానాత్వంలో ఏకత్వం దర్శించడం ఒక్కటే మతానికీ, జీవితానికీ పరమార్థం. ఏకమతం కోసమని నేటి మాతాలన్నింటినీ రూపుమాటడానికి యత్నించకూడదు. ఎవరి ఇష్టదేవతపై వారి కి భక్తిని పెంపొందింపజేయడమే ఉత్తమం.

***

# 'స్వామిని స్మరించి శస్త్ర చికిత్స'

డాక్టర్ పిన్నమనేని వేంకటేశ్వరరావు

1967 సంవత్సరంలో విజయవాడ నుంచి వెలువడే 'ఆంధ్రప్రభ'లో వారంవారం శ్రీ కంచికామకోటిపీఠాధిపతి శ్రీచంద్రశేఖరేంద్రసరస్వతిస్వామివారి ఉపన్యాసాలు ప్రకటిస్తూండే వారు. మేమా ఉపన్యాసాలు చదువుతూ వచ్చాము.

ఆ తరుణంలో మా కుమార్తె అకాలమరణం, మా రెండవ కుమారుని అనారోగ్యం కారణంగా మా దంపతులకు మనశ్శాంతిలేకపోయింది. కుమారుని జాడ్యం ఫలానా అని నిర్ణయించలేకపోయినాము. అందుచేత ఢిల్లీలో 'ఆల్ ఇండియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్'లో రోగ నిర్ణయం చేయించుదామనుకున్నాము.

ఢిల్లీ వెళ్ళేముందు శ్రీ కంచిశంకరాచార్యులవారి దర్శనం చేద్దామని మాకు కోరిక కలిగింది. నరసరావుపేట సమీపంలో శ్రీ స్వామి వారిని దర్శించాము. సుమారు 45 నిమిషాలు శ్రీవారితో గడిపాము. వైద్యపరీక్షకై కుమారుని ఢిల్లీకి తీసుకు వెళుతున్నామని చెప్పగానే, కురుక్షేత్రం వెళ్లి దేవుని దర్శించండి అని స్వామి వారు ఆదేశించారు. అదేవిధంగా కురుక్షేత్రం పోయి దేవుని దర్శించాము.

ఆ తరువాత ఢిల్లీ 'మెడికల్ సైన్సెస్ ఇన్‌స్టిట్యూట్'లో పిల్లవాడిని పరీక్ష చేయించాము. మా కుమారునికి ఏ జబ్బు లేదని ఇన్‌స్టిట్యూట్ వారు నిర్ణయించారు. కొండంత బరువుతో కుంగిపోతూ ఢిల్లీకి వెళ్లిన మాకు ఎంతో మనశ్శాంతి కలిగింది. అది మొదలుకొని మా కుమారుడు నేటి వరకు ఆరోగ్యంగా ఉంటున్నాడు.

మాకు జీవితంలో ఎప్పుడు ఏ సమస్యలు వచ్చినా శ్రీవారి దర్శనం చేస్తాము. వారి దర్శనం వల్ల మాకు కలిగే ఆనందాన్ని వర్ణించడానికి మాటలు చాలవు.
ఇప్పుడు మేము ప్రతిదినం అధమం ఉదయం ఒకసారి, రాత్రి ఒకసారి అయినా స్వామిని స్మరించకుండా ఉండలేము.

అంతేకాదు, తదాది నేను ఏ రోగికి శస్త్రచికిత్స చేసినా, స్వామిని సంస్మరించి చికిత్స ప్రారంభిస్తాను.

*ఆత్మస్తుతి*

ఒకడొక పుణ్యకార్యం చేసి, అందుకు ఇతరులు తనను స్తుతిస్తుంటే విన్నా, లేక తనను తాను పొగడుకున్నా, వాని పుణ్యఫలం కొంత తగ్గుతుంది.

అందుచేత, ఎవరినైనా మనం మెచ్చుకోవాలనుకుంటే, పరోక్షంగా మెచ్చుకోవడం మంచిది.

***

# నుతి మంజరి

శ్రీ శంకర శ్రీరామారావు

వెలుగులు చిమ్ము నెమ్మొగము, విచ్చిన పూవులవంటి కన్నులున్,
పొలుపగు లేత చిర్నగవు పుత్తడి తళ్కులమేని చందమున్,
లలితవిభూతిరేఖల కళాపరిపూర్ణత జూపు ఫాలమున్
వెలయగ కామకోటి గురుపీఠమునందొక మూర్తి వెల్గెడున్.

అతడు మహామహోన్నత విహాయస వీధుల తాకివచ్చి శి
ష్యతతికి జ్ఞానపాయస మొసంగును నిత్యము సావధానుడై
పతితజనావళికై తపఃఫలమంతయు ధారపోయు భా
రతహృదయంబు వాక్యమకరందపుసోనల గ్రుమ్మరించుచున్.

పలుకులముత్తెముల్ చిలుకు పండితు లెందరు లేరు? చిత్తసం
చలన మడంచి, జ్ఞానకలశమ్మును పొంది, తదాత్మభావనో
జ్వల పరమానుభూతి తమ భక్తుల కీగలవార లెందరీ
కలియుగమందు నేటి మతకర్తలలో పరికించి చూడగన్.

విన్నా నా మహనీయకీర్తి సహజ ప్రేమస్వరూపుండటం
చన్నా రెందరొ, మానవాభ్యుదయకార్యారంభసంరంభియై
యెన్నో జీవితముల్ స్పృశించి సుధ లందించెన్ కృపాసాగరో
త్పన్నంబై నవనీతకోమలమునై పాలించు చిత్తమ్ముతో.

హైందవ సంస్కృతీవిభవమంతయు, ఆత్మవివేకమంతమయున్

సుందరమందహాస పరిశోభితమౌ ముఖమండలమ్మునన్

విందొనరింప శిష్యపరివేష్ఠితుడైన యతీంద్రునేత్రని

ష్యందమరందపానము మదాత్మకు శాంతి యొసంగు గావుతన్.

# సన్నిధాన భాగ్యం

- శ్రీ కల్లూరి వెంకట సుబ్రహ్మణ్య దీక్షితులు

శ్రీవారు అరవదేశంలో సంచారం చేస్తున్నారు. వేసవి సెలవులలో వారి సన్నిధికి వెళ్ళటం నాకు అలవాటు. ఒకనాటి సాయంత్రం వారు తమిళంలో ఉపన్యాసం ప్రారంభించారు.

"జీవులకు పుట్టుట, గిట్టుట స్వభావ ధర్మాలు.. పుట్టుకకు కారణం కాముడు, అంటే మన్మథుడు. గిట్టుటకు కారణం కాలుడు, అంటే యముడు. ఈ ఇద్దరి బాధా లేకపోతే జనన మరణాలు లేకుండా పోతాయి. జననం లేకుండా చేసుకోవాలంటే మన్మథుణ్ణి నిగ్రహించిన వాని నాశ్రయించాలి. మరణం లేకుండా చేసుకోవాలంటే మరణకారకుడైన కాలుని శిక్షించిన వాని దగ్గరకు పోవాలి. ఈ రెండు పనులూ చేసిన పెద్దమనిషి ఒకరే. ఆయనే స్మరహరుడు, మృత్యుంజయుడు అయిన శివుడు. శ్రీకాంతుడంత సులభంగా దొరకడు గాన శివుడు మాత్రం సులభసాధ్యుడు. ఆయనను ఆశ్రయిద్దాం... నమః పార్వతీ పతయే హరహర మహాదేవ!"

అందరితోపాటే నేనూ గొంతు కలిపాను. శ్రీవారు మరో ఘట్టం ఎత్తుకున్నారు.

ఉపన్యాసం ముగిసిన తర్వాత రాత్రి ఒక ఇంట్లో డాబామీద విశ్రమించారు. క్రింద పారా ఇస్తున్నారు. అర్ధరాత్రి పన్నెండు గంటలు దాటింది. నాకు నిద్రపట్టలేదు. ఆ యింటి అరుగుమీద కూర్చొని శ్రీవారి దర్శనం కోసం తహతహలాడుతున్నాను. ధైర్యం చేసి లోనికి వెళ్ళబోయాను. పారా ఇస్తున్న బ్రాహ్మణుడు, "పెరియవాళ్ విశ్రాంతి తీసుకుంటున్నారు. పైకి పోవద్దు" అన్నాడు. నిరాశతో తిరిగి వెళ్ళి, గోపికలు కృష్ణపరమాత్మను గురించి విరహంలో అన్న మాటలు - పోతనగారి పద్యాలు చదువుకుంటూ కూర్చున్నాను. అంతలో ఏదో ప్రేరణచేత మళ్ళీలేచి డాబామెట్లు సమీపించి చటాలున అయిదుమెట్లు ఎక్కేశాను. పారాయిచ్చే బ్రాహ్మణుడు పరధ్యానంలో ఉన్నాడు. పైకిరమ్మని ఎవరో పిలిచినట్లయింది. పైకి దూకాను.

అక్కడ శ్రీవారు చేతిమీద తల ఆనించి ఓ ప్రక్కకు ఒదిగి పడుకొన్నారు. సడిచేయకుండా అడుగులు వేసి దూరంగా నిలిచాను. సంస్కృతంలో 'కః?(ఎవరు) అని ప్రశ్నించారు.

“నేను, కల్లూరిని” అన్నాను.

వెంటనే--

“నిద్రా నాయతా కిం? నైదాఘస్తాపో బాధతేవా?” (నిద్ర పట్టలేదా? ఎండ ఉడుకు బాధవల్లనా?) అని మళ్ళీ ప్రశ్నించారు.

“న నైదాఘస్తాపః -- ఎండ ఉడుకు కాదు. నేటి ఉదయం మొదలు అయిదు నిమిషాలైనా శ్రీవారి సన్నిధానం, దర్శనభాగ్యం దొరకలేదు. అందుకు తపిస్తున్నాను. శ్రీవారి సన్నిధిలో ఉన్నప్పుడు అయిదు నిమిషాలైనా నాకు ఏకాంత దర్శనం అనుగ్రహించాలి” అన్నాను.

“త్వయి గోపికాత్వ మతి దిశ్య మయి కృష్ణత్వం సంభావ్య కిమపి సంభావితం ఖలు--” నీయందు గోపికాభాదం, నాయందు కృష్ణత్వం భావించి ఏదో అనుకుంటున్నావా? --అని అడిగారు శ్రీవారు. ఎలా తెలిసిందో!

ఆ తర్వాత, “అద్య అస్మాభి స్తమిళ భాషాయాం ప్రసంగః కృతః. త్వం భాషానభిజ్ఞః. కిం జానాపి మదుక్తం” -- మేము తమిళంలో మాట్లాడాము. నీకు అర్థమైందా? అని ప్రశ్నించారు.

“శ్రీవారు నా కర్థం కావాలని సంకల్పించారు. అందుచేత అర్థమైంది.” అన్నాను. శ్రీవారి నిమిత్తం కొన్ని సంవత్సరాలుగా అరవదేశం వెడుతూ వస్తున్నా, నాకు అరవభాష కొంచెం కూడా పట్టుబడలేదు. ఆ రోజు... అత్యాశ్చర్యం, శ్రీవారి తమిళ ప్రసంగం బాగా అర్థమైంది. అది వారి సంకల్పం. ఉపన్యాస సారాంశం చెప్పమన్నారు. చెప్పాను. దానిని ఈ చిన్ని శ్లోకంలో ఇమిడ్చాను.

జనిమృతి విరతిర్భవేదితిత్వాం రతిపతి శాసకమీశ కాలకాలమ్

హిమగరి తనయా ద్వితీయ మీడే పరమ దయారస మీశ మద్వితీయమ్.

తెలుగు వివరణం --

జనన కారణం మన్మథుడు. మరణకారణం కాలుడు. ఆ యిద్దరిని నిగ్రహించిన ప్రభువు ఒక్కడే, కామవైరి మృత్యుంజయుడు. చంద్రశేఖరుడు శివుడు. ఆయన హిమగిరి, మంచుకొండ కూతురికి సగము శరీరమిచ్చినవాడు. చల్లనివాడు, దయామూర్తి. ఆయనను

ఒక్కని ఆశ్రయిస్తే రెండు లాభాలు కలుగుతాయి అనివారి ఉపన్యాస సారాంశం ఈ శ్లోకంలో ఇమిడించికొన్నాను.

శ్రీవారు చిరునవ్వుతో విన్నారు. ఆ మందహాసం నాకు వెన్నెలై తోచింది.

"నా సన్నిధి రోజు మొత్తం మీద అయిదు నిముషాలైనా కావాలన్నావు కదా! ఇప్పుడెన్ని నిముషాలైంది?" ప్రశ్నించారు శ్రీవారు.

"పదిహేను నిముషాలు అయుంటుం"దన్నాను.

అటుపైన, ప్రాకృతదృష్టితో వారిపై జాలితోచి, శ్రీవారు కటికనేల మీద పడుకొన్నారు. హృదయం ద్రవించిపోతోంది" అన్నాను.

వెంటనే, "కిం నశ్రుతమ్" -- వినలేదా?

' క్షితితల శయనం తరుతలవాసః

కరతలభిక్షా, కౌపీనవంతః ఖలు భాగ్యవంతః '

కౌపీన ధారులు, పరివ్రాజకులు భాగ్యవంతులు. కటికనేలపై పడక, చెట్టుక్రింద నివాస ము, అరచేతిలో అన్నపుముద్ద - అంతకంటె భాగ్యవంతులెవ్వరు? అన్నీ ఉన్న సంసారుల దేమి భాగ్యం -- అని నన్ను ఊరడించి విశ్రమించమని పంపించారు.

## పద్యపాద స్ఫురణ

నావల్లనే జ్ఞాపకం, జ్ఞానం, మరుపు కలుగుతుంటాయి అన్నాడు యోగీశ్వరేశ్వరుడైన కృష్ణుడు, అర్జునిడితో. కృష్ణావతారం తరువాత జ్ఞానావతారంగా వచ్చిన ఆదిశంకరుల అనంత రం, వారి సంపూర్ణాంశతో వచ్చిన అవతారం శ్రీవారు అన్నది నాకు స్పష్టంగా రుజువైంది. అదొక అద్భుత ఘట్టం.

శ్రీధరవారు ఆంధ్రులు. పశ్చిమ గోదావరిజిల్లా కానూరు అగ్రహారీకులు. ఆ కుటుంబం తంజావూరు జిల్లాకు వలసపోయింది. ఆ కుటుంబం నుంచి వచ్చిన వెంకటాధ్వరి అనే మహా నుభావుడు యజ్ఞాలు చేసినవారు, బ్రహ్మణ్యులు, గొప్ప అనుష్ఠాతలు, శివభక్తులు. మహా పండితుడు, మహాకవీ కూడా. 'అయ్యవాళ్' అనేది వారి గౌరవనామం. ఆయన మహిమల

గురించి ఆ ప్రాంతంలో కథలు కథలుగా చెప్పుకొంటారు. శ్రీవారే కొన్ని కథలు నాకు చెప్పారు.

వారు సిద్ధిపొందిన తర్వాత వారి గృహం శంకరమఠంగా మారింది. శ్రీవారు ఆ ఇంటిలో మకాం చేసినప్పుడు వారి దర్శనానికి వెళ్ళాను. ఓ రోజు సాయం సమయంలో ఆ గ్రామంలోని దేవాలయాలను సందర్శించడానికి శ్రీవారు బయలుదేరారు. వారి వెంట నేనూ ఉన్నాను. ప్రదక్షిణం చేస్తూ, 'ఇది శివాలయం. శివుని మీద నీవు చెప్పిన పద్యం చదువు' అన్నారు. అప్పుడొక శ్లోకం చదివాను. మందస్మితంతో అనుగ్రహించి శ్రీవారు, అదే ప్రాకారంలో ఉన్న విష్ణ్వాలయానికి దారితీశారు. అక్కడ, విష్ణువు మీద పద్యమొకటి చదవమన్నారు. మా ఊరిలోని మా కులదైవంపై వ్రాసిన పద్యం ఒకటి చదవడం ప్రారంభించాను. మొదటి మూడు పాదాలు చదివానుగానీ నాలుగవ పాదం ఎంతకూ జ్ఞాపకం రాలేదు. గిలగిల లాడాను.

శ్రీవారు వెంటనే "అస్య పద్యస్య కతిపాదాః" -- ఈ పద్యానికి ఎన్ని పాదాలు? అని అడిగారు.

"చత్వారః" -- నాలుగు పాదాలు అన్నాను. "అయం మదనగోపాలః -- ఉత వేణుగోపాలః?" అని అడిగారు మళ్ళీ.

"వేణు గోపాలః"

"వేణుః కుత్ర?" -- వేణువేదీ?

"దానికోసమే వెతుకుతున్నాను. మరచిపోయాను" -- అన్నాను. వెంటనే స్మృతికి తగిలింది. ఆ పిల్లనగ్రోవి --

"మధుర బింబాధర సుధ దోగి తోడి యింపొలసి వేణువు దివ్యకళలు గురియ" ఇదీ ఆ పద్యపాదం. చదివాను. మొన్నమొన్న ద్వాపరంలో అవతారం చేసిన పరబ్రహ్మ వస్తువు ఆ గీతాచార్యుడు, ఇప్పుడు అవతారం చేసిన ఈ జగదాచార్యుడు ఒక్కరే అన్న అనుభూతి నాకు కలిగింది. ఆ మీద నా 'గురుకృపాలహరి'లో శ్రీవారిని శివుడుగా శివలీలాతరంగంలోనూ, కృష్ణుడుగా హరిలీలాతరంగంలోనూ -- వట్టి కవిత్వంతో గాదు -- ప్రత్యక్షంగా పొందిన అనుభూతితో పెక్కు శ్లోకాలలో కీర్తించుకొన్నాను.

## ప్రారబ్ధశేషం

అది  నా జాతకంలో క్లిష్టమైన ఘట్టం. జీవన్మరణ సమస్య. మహాప్రస్థాన సమయం. కాలదర్శనం అయింది. దక్షిణాధీశుడు నాకై వచ్చారు. శ్రీవారు ప్రత్యక్షమై 'ఇప్పుడే పంపము' అన్నారు. ఇద్దరూ ఏమో మాట్లాడుకొన్నారు. యమవాహనం గోడదూకి వెళ్ళిపోయింది. ధర్మప్రభువు నిటలాక్షుని చూసి వెనుకడుగు వేసుకొంటూ తన దిశగా వెళ్ళిపోయారు. శ్రీగురుదేవులు ఈ ఘట్టంలో మృత్యుంజయులుగా సాక్షాత్కరించి నాకు మార్కండేయునితో సామ్యం అనుగ్రహించారు. ఈ ఘట్టం నా 'గురుకృపాలహరి'లో ఉంది. అందులో లేని తరువాతి ఘట్టాన్ని ఇప్పుడు వివరిస్తాను.

చిదంబరానికి అవతలి మజిలీ ఆనందతాండవపురంలో శ్రీవారు బసచేసి ఉన్నారు. మృత్యుముఖం నుంచి బయటపడిన నేను అక్కడకు ధర్మపత్నితో శ్రీవారి దర్శనానికి పరుగెత్తాను. పూర్తిగా కోలుకోకుండానే రైలులో దక్షిణాదికి దీర్ఘప్రయాణం చేశాను. స్నానం చేసి మడిగా శ్రీవారి దర్శనం చేద్దామని ఒక బసకు వెడుతున్నాను. శ్రీవారు స్వయంగా నాకు ఎదురు వచ్చారు. రైలు బట్టలు. స్నానం లేదు. రాత్రి నిద్ర లేదు. ఈ స్థితిలో శ్రీవారికి ఎదురవడమెట్లా అనుకొంటూ ఒక ఇంట్లోకి వెళ్ళాను. నా వెంటే వారూ అక్కడకు చొచ్చుకొని వచ్చారు. ఇక చేసేదిలేక వెనుదిరిగి సాష్టాంగ పడ్డాను.

తర్వాత కోనేటికి స్నానార్థం బయలుదేరారు. నేనూ వెంట నడిచాను. అది వేసవికాలం. నా శరీరంలో రక్తంలేదు. కాళ్ళు అంటుకుపోతున్నాయి. శ్రీవారు ఏమేమో ప్రసంగం చేస్తూ చెరువుకు తీసుకొని వెళ్ళారు. వారు నీటిలో దిగారు. నేను మెట్లమీద నిలబడ్డాను. కాళ్ళు అంటుకుపోతున్నాయి. వెళ్ళిపోదామా అంటే శ్రీవారు ఏవో మాటలు ప్రారంభించారు. ప్రశ్నలు అడుగుతున్నారు. ఒక కాలు ఆనించి ఇంకో కాలు ఎత్తుతూ, అతికష్టంమీద ఆ వేడిని తట్టుకొంటూ వారికి జవాబులు చెబుతున్నాను.

స్నానమై వారు మఠానికి దారితీశారు. నేనూ వెంట నడుస్తున్నాను. నేను బసచేసిన ఇంటి వద్ద వారు ఆగారు.

"శ్రాంతోసి. విశ్రమస్వ. స్నానాదికం కురు"-- చాలా అలసిపోయావు. ప్రయాణం బడలిక.. విశ్రమించు. స్నానాదికం చేసుకో -- అన్నారు.

బ్రతుకుజీవుడా అని ఇంట్లోకి వెళ్ళి కూర్చున్నాను. అంతవరకు ఉడికిపోయిన నా పాదాలు హఠాత్తుగా పన్నీటిలో ముంచెత్తినంత చలువదనం పొందాయి. ఆ వేడి అంతా ఏమైందో! హాయి అనిపించింది.

అప్పుడు నాకు అర్థమైంది. రోగరూపంలో నేను అనుభవించవలసిన ప్రారబ్ధశేషం క్షణం ముందు వరకు మిగిలిందన్నమాట. ఆ సంగతి శ్రీ గురుదేవులకు తెలుసు. ఆ కర్మ శేషాన్ని నైదాఘతాపం చేత పొగొట్టి సుఖానుభూతికి పాత్రం చేశారు. ఈ అనుభవం ద్వారా అనేక శాస్త్ర తాత్పర్యం అవగహన చేశారు.

## "లీలా తాండవ పండితః"

ఆనందతాండవపురంలోనే మరో అద్భుత ఘట్టం. శ్రీవారు సంధ్యావందనానంతరం ఒక దేవాలయ ప్రాంగణంలో పండితులతో పేరోలగం చేశారు.

శ్రీవారు ధార్మిక విషయాలుగాని, వేదాంత విషయాలు గాని బహిరంగసభలలో ముచ్చటించడం ఎన్నడూ నేను ఎరుగను. కాని ఆనాడు అద్వైతం మీద, దాని గురించిన భిన్నభిన్న ప్రస్థానములు, వాటిలోని సామరస్యం మీద వాదోపవాద సిద్ధాంత సమ్మర్దంతో శ్రీవారు సంస్కృతభాషలో చేసిన ప్రసంగం కేవలం చిదంబరనాధుడు, నటరాజమూర్తి చేసిన ప్రదోషతాండవమేనని నాకు అనిపించింది. మైమరచి నాలో నేను,

"లీలా తాండవ పండితః"

అని శ్రీవారిని చిదంబరేశ్వరునితో పోల్చుకొని మురిసిపోతున్నాను. వేయిమందిలో నేనుండి, నాలో నేను అనుకొంటున్న మాట ఇది. కానీ, శ్రీవారు ఆలయం గోడకు జేర్లబడి, అటూఇటూ ఊగుతూ "లీలా తాండవ పండితః" అని మూడుసార్లు అన్నారు. దానితో నాకు మతిపోయింది. పరుగు పరుగున వారి సన్నిధి చేరి, ఆనందభాష్పాలు కురుస్తుండగా సాష్టాంగ

పడ్డాను. శ్రీవారు గంభీరంగా నవ్వారు. "ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేనం" అన్న గీతాశ్లోకం స్ఫురణకు వచ్చింది.

ఆ మరునాడు సోమవారం. ప్రదోష సమయంలో శివాలయంలో సభ ఏర్పాటైంది. శ్రీవారు సభకు నడిచి వెళుతున్నారు. వెనుక నేను ఉన్నాను. వారు నాకేసి తిరిగి "అస్మిన్ దినే సంస్కృత భాషాయంత్వయా ప్రసంగః కర్తవ్యః" (ఈరోజు నీవు సంస్కృత భాషలో మాట్లాడాలి) అన్నారు. ముందురోజే దక్షిణాత్యపండితులు సంస్కృత భాషలో వీరవిహారం చేశారు. వారి ముందు ఈ శిశువు నాడించాలని శ్రీవారి కోరిక కాబోలు. "మీ అనుగ్రహంతో లభించిన వాక్కుతో, మీ ఆజ్ఞానుసారం అలాగే ప్రసంగిస్తాను" అని వారితో అన్నాను.

సభలో దిగ్గంతులైన పండితులున్నారు. శ్రీవారు అగ్రాసనం అలంకరించారు. ఒకరిద్దరు మాట్లాడిన తర్వాత నన్ను పిలిచారు.

అప్పుడు నేను, "'ఏ బ్రహ్మవస్తువు నుండి వాక్కులు (శ్రుతులు) మరలునో, వాచామగోచరమైన ఆ వస్తువును నిరూపించలేక వెనుదిరుగునో, అలాంటి ఒకానొక సచ్చిదానందాత్మకమైన చంద్రిక (జ్ఞాన ప్రకాశము), మౌళిగాగల (తలమానికముగా గల) పరబ్రహ్మకు, తద్రూపులైన శ్రీచంద్రశేఖర గురుమూర్తికి నమస్కారం" అనే అర్థం కలిగిన శ్లోకంతో నా ప్రసంగం ప్రారంభించాను.

ఆ మీదట,

"అభయం దత్త మేవాస్తి మృత్యుంజయ కుతో భయమ్

తాండవే స్థలనం క్వాపి శిశోస్తదపి మండనమ్"

శ్రీవారు యముని తరిమినప్పుడే "మృత్యుంజయులు"గా ఈ శిశువుకి అభయమిచ్చారు. ఇప్పుడు సంస్కృతభాషలో మాట్లాడటమనే ఈ గెంతులలో స్ఖలనం (తప్పటడుగు) పడితీరుతుంది. ఇది శిశువువేసే తప్పటడుగు గనుక లయానుగుణంగా ఉంటే అందమే లేదు. తప్పటడుగు పడితేనే అందం' - అన్నాను.

తదుపరి ''నటరాజౌ స్థితే సాక్షాద్గురు వానంద తాండవే, తండుర్యది భవేయంమే లీలా తాండవ మస్తుతత్'' అనే శ్లోకం చదివాను. దీని భావం -- సాక్షాద్గురుమూర్తి ఇప్పుడు నటరాజై ఆనందతాండవంలో ఉండగా, నేను శివపరివారంలోని తండువు అనే పరిచారకుడనైతే, నా యీ ఉపన్యాస రూపమైన లీల నిజంగా తాండవమే అవుగాక!

వెంటనే శ్రీవారు ''సుబ్బు శాస్త్రి! శ్రుతంవా అనేన తాండవ శబ్దస్య పరిష్కారః కృతః'' తాండవశబ్దం వ్యుత్పత్తి ఇచ్చాడు, విన్నావా?! -- అన్నారు. సుబ్బుశాస్త్రిగారు సర్వశాస్త్ర పారంగ తులు. ఆనందంతో తలవూపారు.

ఆపైన సుబ్బుశాస్త్రి గారు ''మీరు వ్రాసి చదివిన శ్లోకంలో మీకు తెలియకుండానే ఒక అద్భుతఘట్టం స్ఫురిస్తోంది. మీ కవిత్వం సార్థకం'' అంటూ, అదే ఊళ్ళో అంతకు పదిరోజుల క్రితమే ఒక మూగ కుర్రవానికి స్వామి వాక్కును ప్రసాదించిన ఉదంతాన్ని వినిపించారు.

శ్రీవారు చిరునవ్వుతో అనుగ్రహించారు. సభ్యులు ఆనంద భరితులయ్యారు.

ఇలాంటి వినోదాల ప్రదర్శనలో శ్రీవారికి కుతూహలం ఉందా అనేది ప్రధాన ప్రశ్న. ఉండదు. అక్కడసలు సంకల్పమే ఉండదు. నిస్సంకల్పస్థితి వారిది. అయితే ఇవి మనకెందు కు కనిపించాయి? ఇది మన మనోవిలాసమే. దృశ్యమంతా మనస్సే. ఈ విషయాన్ని నా ''గురు కృపాలహరి''లో ''నసంకల్ప వేశోభవేద్వా వికల్పః''అనే శ్లోకంలో పేర్కొన్నాను.

*మనకు చరిత్ర లేదా?*

మనదేశానికి లిఖితపూర్వకమైన చరిత్రలేదని సామాన్యంగా అందరూ అనేమాటలు. మన పురాణాలు చరిత్ర కాదని వీరి అభిప్రాయం. క్రీస్తుశకం అనంతరం జరిగిన సంఘటలను మాత్రమే ఆధునిక విద్యావంతులు చరిత్రగా పరిగణిస్తారు. అంతకు పూర్వం జరిగినదంతా వారి దృష్టిలో చరిత్రకాదు! ఒకవేళ పూర్వ వృత్తాంతాన్ని చరిత్రకింద అంగీకరించవలసి వచ్చినా, తమ చారిత్రక పరిశోధనల ప్రకారం పురాణగాథలలో గల సత్యం అత్యల్పం. తమకు నచ్చిన సిద్ధాంతాలకు, తాము నమ్మిన సూత్రాలకు అనుగుణమైన విషయాలు మాత్రమే వారికి విశ్వస నీయాలు.

అప్రాకృతిక సంఘటన లేవైనా వారి దృష్టిలో కేవలం కట్టుకథలు. సాధారణ మానవుని అనుభవానికి, గ్రహణశక్తికి మించినదంతావారు అసత్యంగా కొట్టివేస్తారు. పురాణాల్లో మహిమలూ, అణిమాది సిద్ధులూ ఉండడంచేత వాటిని 'చరిత్ర'గా అంగీకరించరు.

****

# బిడ్డకు సంతోషం - స్వామికి సంతృప్తి !

శ్రీ త్రిపుర సుందరీ చంద్రమౌళీశ్వరులను స్వామి పూజిస్తున్నారు. వేలాది భక్తులు శ్రద్ధ తో పూజను వీక్షిస్తున్నారు. అమ్మవారికి అలంకరించిన పట్టుచీరె అందరినీ ఆకర్షిస్తున్నది.

వేదికకు దూరంగా ఒకమూల తల్లి ఒడిలో కూచున్న చిన్నపిల్ల అమ్మవారికి కట్టిన చీరె చూసింది. చూడ్డంతోటే తన కా చీరె కావాలని తల్లిని వేధించడం మొదలుపెట్టింది అమాయ కంగా. తల్లి కూతురును ఎంతో బుజ్జగించింది; మందలించింది. విన్నదికాదు కూతురు. పూజ ముగిసింది.

స్వామి అందరికీ తీర్థం ఇస్తున్నారు. క్యూలో నిలబడి జనమంతా తీర్థం పుచ్చుకుంటు న్నారు. తల్లి పిల్లను ఎలాగో సముదాయించి, తీర్థం అందుకోడానికి అందరితోపాటు వేదిక దగ్గర కొచ్చింది.

హఠాత్తుగా స్వామి తీర్థం ఇవ్వడం ఆపేశారు. ఎందుకో ఎవరికీ అర్థం కాలేదు. స్వామి లేచి అమ్మవారికి కట్టిన పట్టుచీరెను తెచ్చి, ఆ పిల్ల కిచ్చి, తరువాత తీర్థం ఇవ్వడం మొదలు పెట్టారు.

పిల్లకెంత సంతోషమో, స్వామికి అంత సంతృప్తి!

తల్లి విస్తుబోయింది. ఎక్కడో అంతదూరాన కూచున్న తన బిడ్డ కోరిక స్వామికి ఎలా తెలిసింది!

# మహాపురుష సంశ్రయం

వేదశాస్త్రాభివృద్ధికై జీవితం అంకితం చేసిన వారిలో దక్షిణ భారతంలో శ్రీకౌతా సూర్య నారాయణరావుపంతులుగారు అగ్రగణ్యులు. వేద విజ్ఞానాభివృద్ధి ప్రచారం కోసం నేటికి 98 సంవత్సరముల ముందు శ్రీదేవీ శరన్నవరాత్ర వేదశాస్త్రసభను స్థాపించి, అవిచ్ఛిన్నంగా వేదాధ్య పకులను, విద్యార్థులను సన్మానిస్తూ ప్రోత్సహిస్తున్నది కౌతావారి వంశం. శాస్త్రార్థచర్చలు జరిగి, శాస్త్రపండితులను సత్కరించిన భాగ్యం కూడా వీరికే దక్కింది.

శ్రీ సూర్యనారాయణరావుగారి పౌత్రులు శ్రీ లలితామనోహర్‌గారు తాతతండ్రుల గుణ సంపదను పుణికి పుచ్చుకుని వారి సత్సంకల్పాలను సఫలం చేయడానికి కృషి సల్పుతున్నారు. మూడవతరంలో కూడా వేదసభలను క్రమం తప్పకుండా వీరు నడిపించడం మెచ్చదగ్గ విష యం.

జజజజజజ

శ్రీ శంకరభగవత్పాదులు వివేకచూడామణిలో

"దుర్లభం త్రయమేవైతత్ దైవానుగ్రహహేతుకం।

మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుషసంశ్రయః" అని చెప్పినారు.

మానవ జన్మ లభించుట, మనిషిగా జన్మించిన తర్వాత కేవలము విషయసుఖములచే మోహింపబడుచు, జీవితమును వ్యర్థము చేసికొనకుండా జ్ఞానమును సంపాదించి, క్రమముగా మోక్షసామ్రాజ్యమును పొందగోరుట (ముముక్షుత్వము), మహాపురుషుల ఆశ్రయమును పొం దుట, అను నీ మూడును చాలా దుర్లభములు. ఈ మూడు వైభవములు కేవలము దైవానుగ్ర హము వల్లనే కలుగును.

శ్రీ శంకరభగవత్పాదులు సూచించిన "మహాపురుష" శబ్దమునకు సర్వాత్మనా లక్ష్యభూ తులు శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతిసంయమీంద్రులు. వారు సంచరించుచున్న కాలములో జన్మను పొంది, వారి సాన్నిధ్యములో కొంతకాలమైనను గడిపిన వ్యక్తులు ధన్యజీవులు. "తత్ప శ్యన్తిచధామ నాభిపతతో యచ్ఛార్మణే చక్షుషి. " ఈ చర్మ చక్షువునకు గోచరముగాని విషయ

ములను జ్ఞాననేత్రముతో జూచెదరు'' అని మురారికవి ఇటువంటి త్రికాలజ్ఞులను గురించి వ్రాసినాడు. ''తద్దృష్టి గోచరా స్సర్వేముచ్యన్తే సర్వకిల్బిషైః'', అనగా ''అటువంటి మహనీయుల దృష్టి పడినంత మాత్రముననే సమస్త పాపములు నశించును.'' అని శాస్త్రవచనము. సంయమ ధనులైన శ్రీ స్వామివారితో యావద్భారతమునందు అనేక మహనీయులకు పలువిధములైన అనుభూతులు గలవనుటకు సంశయము లేదు.

ఈ మహనీయునితో అతిసన్నిహితముగా సుమారు నాలుగుమాసములు గడుపు భాగ్యము నాకు కలిగినది. 1968 సంవత్సరములో శ్రీవారు తమ పీఠముతో సికింద్రాబాదు నందలి మా ఆవరణలో ''శంకరజయంతి'' సందర్భముగా రెండు మాసములు, తర్వాత ''చాతుర్మాస్య దీక్ష'' సందర్భముగా రెండు మాసములు గడుపుట మా భాగ్యవిశేషము. ఆ తర్వాత వారు విజయవాడలో మా గృహమున పీఠముతో నుండుట, తదుపరి సుమారు 5 రోజులు రామవరప్పాడులో నున్న మా ''భాస్కర వనము''నకు ప్రతిరోజు వెళ్లి రోజంతా అచ్చట గడుపుట, ఒకరాత్రి అక్కడే ఉండుట ఒకవిచిత్ర సంఘటన.

సికింద్రాబాదు  మా ప్రాంగణములో ఒక ఆదివారము నాడు మధ్యాహ్నము నాకు కబురు పంపినారు. వెళ్లి వందనము చేయగానే ''ఢిల్లీలో నక్షత్రేష్టి జరుగుతున్నది. రేపు సమాప్తి. నాకు ఆరు కాశ్మీరు పండిత శాలువాలు వెంటనే కావాలి. రాత్రి విమానములో ఢిల్లీకి పంపవలయును'' అన్నారు. దానికి నేను ''ఈ రోజు ఆదివారము. దుకాణములు ఉండవు. ఇవి దొరుకుట సాధ్యమా!'' అని అంటే ''అందుకే నీకు చెబుతున్నాను. ప్రయత్నము చెయ్యి'' అని మందహాసము చేసినారు. 1968వ సంవత్సరములో హైదరాబాదులో మన సంస్కృతి, సంప్రదాయములు ఇంకా విస్తరించలేదు. కొంచెము బాధపడుతూ ఒక కొట్టుయజమాని ఇంటికి ఫోను చేసినాను. అతను కొట్టు తెరచుట కంగీకరించి నన్ను రమ్మనినాడు. వెళ్లి ఆ కొట్లో శాలువాలు పెట్టు బీరువాను తెరచి, కట్టను తీసి విప్పి చూడగా శ్రీవారు కోరిన శాలువలు సరిగ్గా ఆరు మాత్రమే అందులో ఉన్నవి. చాలా ఆశ్చర్యము వేసినది. సంబరపడుతూ తెచ్చి శ్రీవారికి చూపించినాను. ''నేను అనుకొన్నవి దొరికినవి గదా'' అన్నారు. వెంటనే ఆ రాత్రి విమానములో

వాటిని ఢిల్లీకి పంపుట, అవి మరునాడు సకాలములో యాగశాలకు చేరుట జరగినది. శ్రీవారు సంకల్పసిద్ధులు కదా!

1968లో సికింద్రాబాదులో శ్రీవారు చాతుర్మాస్యం చేయుచున్న సమయముననే నాకు ప్రథమ సంతానము, ఒక పుత్రిక 13-7-1968న కలిగినది. శిశువు గ్రహణమొరికతో పుట్టినదని గుంటూరు నుంచి నాకు టెలిగ్రాం వచ్చింది. జాతములో వారిని దర్శించవచ్చునో లేదో అని వారి దగ్గరకు వెళ్లలేదు. సాయంత్రము వారు కబురు చేసినారు. వారి దగ్గరకు వెళ్లాను. వందనము చేయగూడదుగాను దర్శనము చేసికొనుటకు అభ్యంతరము లేదు. జాతమునకు వృద్ధి అంటారు. "నేను పూజ చేయుచున్న అమ్మ నీ ఇంటికి నడచివచ్చింది" అన్నారు. నాకు బోధపడలేదు.ఆ రాత్రి స్వప్నములోవారు దర్శనమిచ్చి "నేను పూజచేయు తల్లి "త్రిపుర సుందరి", నీ తల్లి పేరు కూడా అదే. ఈ శిశువునకు ఆ పేరు పెట్టు" అని చెప్పినారు. తర్వాత నేను గుంటూరు వెళ్లి పిల్లను చూసి వచ్చినాను. శుద్ధి అయిన తర్వాత ప్రొద్దున శ్రీవారిని చూచుటకు వెళ్లాను. "తల్లీ పిల్లా కులాసానే కదా! పిల్ల ఎలా ఉంది?" అని ప్రశ్నించారు శ్రీవారు. నేను కొంచెము బాధతో, "మీకు చేయుచున్న సేవలకు మంచి ఫలితమే లభించినది" అని కొంత నిష్ఠురముగా అన్నాను. వారు వెంటనే లేచి పీఠము దగ్గరకు నన్ను తీసికొని వెళ్లి ఏకాంతములో సుమారు 40 నిముషములు ధ్యానములో గడపి మందహాసము జేయుచు, "ఈ పిల్లకు ఎటువంటి లోపము ఉండదని అమ్మ అంటున్నది" అని వారు చెప్పేసరికి నా ఒడలు పులకించి ఆనంద్రాశ్రువులు ధారగా పడుతుండగా వారికి సాష్టాంగప్రణామము చేసినాను. అప్పుడు వారు ప్రసాదము తెప్పించి "నీవు గుంటూరు వెళ్లి ప్రసాదమును తల్లికి, శిశువునకు పెట్టి వెంటనే చికిత్సకు ఏర్పాటు చేయుము" అన్నారు. తర్వాత ఆ చికిత్స చేయబోవు డాక్టరును తమ వద్దకు పంపమని చెప్పగా, ఆ వైద్యుడు వారిని దర్శించినారు. ఆయనతో శ్రీవారు సుమారు 45 నిముషములసేపు ఆపరేషను విధానమును చర్చించి ప్రసాదమును ఇచ్చి "నీవు ఆపరేషను చేయునపుడు ఈ కుంకుమ పెట్టుకుని శ్రీ కామాక్షిని ధ్యానము చేసికొని చేయుము" అని ఆదేశించినారట. ఆ విధముగనే జరిగినది. ఇప్పుడు నా కుమార్తె డిగ్రీ ఫస్ట్‌క్లాసులో ఉత్తీర్ణురాలైంది.

సంగీతము బాగా పాడుతుంది. ఈ అమ్మాయి నామకరణమునకు శ్రీవారు విజయవాడ మా ఇంట్లో ఉండి అనుగ్రహించినారు. ఎప్పుడు శ్రీవారిని దర్శించినా "సుందరి బాగుందా' అని కుశలప్రశ్న వేస్తారు. శ్రీవారి అవ్యాజకరుణకు ఇది ప్రత్యక్ష నిదర్శనము.

మా కుటుంబములో, వ్యవహారములో కొన్ని చికాకులు బయలుదేరినవి. కర్తవ్యతా మూఢుడనై శ్రీవారిని సతారాలో దర్శనము జేసికొనుటకు వెళ్లినాను. ఆ రోజు శ్రీవారి గుర్వారాధన. భిక్ష చాలా ఆలస్యమయినది. నేను వందనము చేసి లేవగానే "చాలా శ్రమగా నున్నది. రేపు ఉదయం 7 గంటలకు కలుద్దాము. ముందు లోపలికి వెళ్లి గురు ప్రసాదము తీసికో" అని చెప్పారు. నేను గురుప్రసాదము తీసికొని ఆ రాత్రి పూజను చూసి మరునాడు అనగా 8-3 -1981 ఉదయము శ్రీవారి దర్శనమునకు వెళ్లాను. వందనము చేసి లేవగానే నా సమస్యల నన్నింటిని వారు గ్రహించారా అన్నట్లు నన్ను వారు మూడు ప్రశ్నలు, చాలా భావగర్భితమైనవి వేసినారు. నాకు దేహము పులకించి గద్గద స్వరముతో "నేను తమకు చెబుదామనుకున్న విషయములన్నింటికీ తమ ఈ మూడు ప్రశ్నలలో సమాధానములు వచ్చినవి. ఇక నేను చెప్పుటకేమియులే"దన్నాను. ఇప్పుడు నీవు ఇంతదూరము ఎందుకు వచ్చావో చెప్పాలి" అని ఆదేశించి నా బాధలన్నీ చాలా విపులముగ విని, "ధర్మమార్గమును వదలవద్దు, అమ్మని నమ్ముకొని జయాపజయములను లెక్క చేయక నీ విధిని నిర్వర్తించు" అని ఉపదేశము చేసినారు. "ఇది చాలా శ్రమ సాధ్యము, కష్టము. సుఖముగనున్న జీవితమును ఎందుకు కష్టపెట్టుకోవాలి" అని ప్రశ్నించాను. "ధర్మాచరణ, ధర్మరక్షణ ఎప్పుడూ కష్టసాధ్యములే. అలాగ ధర్మమును విడచి నడచుట తగదు. గీతలో శ్రీకృష్ణుడు అర్జునున కుపదేశమిచ్చినది అదియే గదా, మరచితివా?" అని ప్రశ్నించారు. తర్వాత, ధర్మరక్షణకు నిరంతరము ప్రతివ్యక్తి కృషి చేయవలయుననియు, దాని వలన వచ్చు పుణ్యము అనంతమనియు ఉపదేశించారు.

24.11.1985న శ్రీవారి దర్శనమునకు కంచి వెళ్లాను. ఆ రోజు మధ్యాహ్నము వారితో సుమారు 2 గంటలు గడిపినాను. మాట్లాడుతూ వారు "వ్యవహారము లెంతలో ఉన్నాయి? ఈ కోర్టు విషయములు, ధర్మసంస్థల విషయములు చూచినావు కాదా. నీ అభిప్రాయము,

మనోభావము ఏమిటి?" అని ప్రశ్నించారు. "యది సీతాపి దుఃఖార్తా కాలోహి దురతిక్రమః" అను వాల్మీకివచనమును నా సమాధానముగా చెప్పాను. "మిగిలిన రెండు పాదములు కూడా వచ్చునా, చెప్పు" అన్నారు. "మాన్యా గురు వినీతస్య లక్ష్మణస్య గురుప్రియా! యది సీతాపి దుఃఖార్తా కాలోహి దురతిక్రమః" అని చదివాను. "దీనిలో విశేషమేమిటి?" ప్రశ్నించారు. "స్వామీ! ఆ శ్లోకములో అంత తిరుగుడు లేకుండా "రామప్రియా" అనిగాని "రాఘవప్రియా" అని గాని చెప్పుటకు వాల్మీకికి ఏమి శ్రమ ఉండేదికాదు". నవ్వారు శ్రీవారు. వారి చరణము లను చూచుచు ధ్యానించుచున్నాను. అర్థము స్ఫురణకు వచ్చినది. " ఈ శ్లోకమునందు గురు భక్తి ఉత్కృష్టతను చెప్పినట్లు స్ఫురించుచున్నది." అన్నాను. ఆ శ్లోకమును ఇంకా రెండుసార్లు చదవమన్నారు. చదివాను. "ఈ అర్థము నీకు ఎవరు చెప్పారు?" అని అడిగారు. "శ్రీవారి పాద పద్మములే" అని సమాధానమిచ్చాను. "చాలా బాగుంది" అని అంటూ ప్రక్కన ఉన్న ఒక విద్వాంసుని అరవములో "ఈ శ్లోక మెప్పుడైనా విన్నావా?" అని ప్రశ్నించి అరవములో వివరణ చేసారు. అంతవరకు తోచని అర్థము వారి చరణధ్యానము చేయగానే స్ఫురించుట "గురుకటా క్షము"నకు నిదర్శనము.

15.1.1988న నా తండ్రిగారు "బ్రహ్మవిద్యాలంకార" శ్రీ కౌతా రామమోహన శాస్త్రిగారు విదేహకైవల్యమును పొందిరి. శ్రీవారికి తంతి ద్వారా తెలియజేశాను. శుభస్వీకార సమయము నకు వారు ఒక పండితునిచే శాలువ, ప్రసాదము పంపి తర్వాత వచ్చి నన్ను కలువమని వర్త మానము చేసారు. 29.3.1988 కంచి వెళ్లి శ్రీవారి దర్శనము చేసికొన్నాను. నాతో మాట్లాడు తూ ఒక శాలువను తెప్పించి, దానిని కప్పుకొని ఒక అరగంట సేపు సమాధిలోకి వెళ్లారు. తర్వాత నన్ను నిలబడమని "ఆంధ్రదేశములో ధర్మమును కాపాడుటలోను, ధర్మమార్గములో నడచుటలోను ఆదర్శ కుటుంబము నీది. నీ పితామహులు వెళ్లిపోయారు. ఆ భారము నీ భుజముల మీదికి వచ్చినది. అవిచ్ఛిన్నముగా ఈ ధర్మము జరుగవలయునని నా కోరిక" అని అంటూ ఆ శాలువను తీసి నాకు కప్పించినారు. వారి అనుగ్రహమునకు నా కుటుంబము జన్మజన్మలకు ఋణపడి ఉన్నది.

శ్రీ లలితాసహస్రనామములో "అవ్యాజకరుణామూర్తిః అజ్ఞానధ్వాంతదీపికా, ఆబాల గోపవిదితా" అని మూడు నామములు ఉన్నాయి. ఏమియు నెపము లేకుండానే కరుణను చిందించుమూర్తి, అజ్ఞానమనే చీకటిని పొగొట్టుకాంతి, అందరికీ తెలిసినది (ప్రకృతి) యని వీటి కర్థములు. శ్రీ త్రిపురసుందరీస్వరూపులైన శ్రీవారికి కూడ ఈ మూడు లక్షణములు పరిపూర్ణ ముగ వర్తించు ననుట అతిశయోక్తి కాదు.

ఈ విధముగ శ్రీవారిని గురించి చెప్పవలనంటే అనేక సంఘటనలు చిత్ర విచిత్రములు, ఆశ్చ ర్యభరితములు చాల గలవు. వారు కేవలము ఈశ్వరావతారమని గ్రహించుట సముచితము "శంకర శ్శంకర స్సాక్షాత్" అను వచనమునకు శ్రీవారు లక్ష్యభూతులు. వారిని స్మరించుచూ, వారి ఉపదేశమును గ్రహించి సన్మార్గములో నడచుట ప్రతి ఒక్కరి కర్తవ్యము, ఇహ, పర సాధ కము.

*స్వకర్మానుష్ఠానం*

స్వకర్మానుష్ఠానానికి మించిన ఈశ్వరపూజా, ఈశ్వరారాధనమూ లేదు. ఎవరి వంతుకు వచ్చిన కర్మలను వారనుష్ఠిస్తూ తద్వారా ఈశ్వరార్చనపరులై శ్రేయం సంపాదించుకోవాలి.

తనను ఉద్ధరించుకున్న వాడే ఎదుటి వారిని ఉద్ధరించగలడు.

దుస్సాంగత్యమనే వ్యాధికి చికిత్స సత్సాంగత్యం.

ప్రతి కర్మకూ ప్రత్యేకమైన కాలమూ, మంత్రమూ, దేవతా, ద్రవ్యమూ ఉన్నాయి. అన్ని టికీ పరమతాత్పర్యం పరమేశ్వరార్పణం.

# శ్రీ విజయేంద్ర సరస్వతి

క్రీస్తుకు పూర్వం సుమారు అయిదు శతాబ్దాల కిందట ఆద్య శంకరాచార్యులచే స్థాపించబడిన శ్రీ కంచికామకోటిపీఠం అధిపతుల పరంపరలో 1983, మే నెల 24 తేదీ సోమవారం నాడు ఆ పీఠాన్ని అధిష్ఠించిన శ్రీ శంకర విజయేంద్ర సరస్వతి 70వ వారు.

శ్రీశంకరభగవత్పాదుల నుంచి నేటివరకు రమారమి రెండు వేల అయిదు వందల సంవత్సరాలు కామకోటిపీఠాధిపత్యం అవిచ్ఛిన్నంగా, నిరంతరాయంగా కొనసాగడం మతానుయాయులకేగాక, హిందువు లందరికీ హర్షదాయకం.

ఆరేడు సంవత్సరాల క్రితం కామకోటిపీఠాధిపతి శ్రీజయేంద్రసరస్వతి స్వామి, అప్పటికి పదునాలుగేళ్ళు నిండీనిండని శంకరం అనే ఒక వేద విద్యార్థికి కంచిలో, శ్రీ కామాక్షీఅమ్మవారి సన్నిధిలో యధావిధిగా గురూపదేశం చేసి, సన్యాసదీక్ష ఇచ్చారు.

పద్నాలుగేళ్లు నిండని ప్రాయంలో శ్రీ జయేంద్ర సరస్వతులచే గురూపదేశం పొంది ఆశ్రమస్వీకారం చేసిన ఆ బాలసన్యాసి ఎవరు? ఏమాబాలుని బుద్ధికుశలత? ఎందరో వేద విద్యార్థులుండగా, ఏ కారణం చేత అతడే కాంచికామకోటి భవిష్యత్ పీఠాధిపతిగా వరించబడవలసి వచ్చింది?

పొన్నేరికి సమీపాన తండలం అనే చిన్న గ్రామంలో ఒక తెలుగు బ్రాహ్మణ కుటుంబం. ఆ గ్రామంలో బ్రహ్మశ్రీ ముక్కామల కృష్ణమూర్తిశాస్త్రి అనే వేదపండితుని నాల్గవ పుత్రరత్నం నేటి విజయేంద్రుడు. పూర్వాశ్రమంలో తల్లిదండ్రులు ఆ బాలుడికి పెట్టిన పేరు శంకరం. అయిదవ తరగతి వరకు శంకరం మామూలు పాఠశాలలో చదివాడు. అప్పటి నుంచే తన అన్నదమ్ములకంటే, తన క్లాసులోని తోటి విద్యార్థుల కంటె కూడా కుశాగ్రబుద్ధిగా గుర్తింపబడుతూ వచ్చాడు.

తండ్రి శ్రీ కృష్ణమూర్తిశాస్త్రి తన తనయుని మేధాసంపత్తిని గుర్తించారు. మామూలు పాఠశాల చదువుకు స్వస్తి చెప్పించి, తన వద్దనే పోలూరు వేదపాఠశాలలో వేదం చెప్పసాగారు.

అది మొదలు ఏడు సంవత్సరాలు శంకరం వేదాధ్యయనం చేశాడు. వేద విద్యార్థులకు ఏటేటా తంజావూరు, తిరుచిరాపల్లి జిల్లాలలో జరిగే వేదపరీక్షలన్నిటిలో శంకరం ప్రథమ బహుమతిని పొందుతూ, విద్యార్థులలో అగ్రగణ్యుడవుతూ వచ్చాడు. సామాన్యంగా ఏడేళ్లు చదవలవలసిన ఋగ్వేదాన్ని మూడు సంవత్సరాలలోనే పూర్తి చేశాడు.

ముసిరిలో జరిగిన వేదపరీక్షలలో తమిళనాడులోని 48 వేదపాఠశాలల విద్యార్థులు పాల్గొన్నారు. అన్ని వందలమంది విద్యార్థులలోనూ ఆ సంవత్సరం శంకరమే అగ్రేసరుడై ప్రథమ బహుమతిని సంపాదించాడు. శంకరం ఏకసంథాగ్రహిగా పండితులు గుర్తించారు.

బాల శంకరుని మేధాసంపత్తికి, సమయస్ఫూర్తికి తార్కాణంగా మరొక సందర్భాన్ని పేర్కొనవచ్చు. ఒక సంవత్సరం కంచికామకోటిపీఠంలో శ్రీ జయేంద్రసరస్వతిస్వామి ఆధ్వర్యంలో నవరాత్రిపూజ జరుగుతూ ఉండగా పండితులు చదివే వేదమంత్రాలలో ఒక ప్రమాదం వాటిల్లింది. అంతటి మహాసభలో పండితు లెవ్వరూ గమనించని ఆ దోషాన్ని శంకరం ఒక్కడే కనిపెట్టి, దానిని సభవారి దృష్టికి తేవడం, అప్పు డా బాలుని ధీశక్తిని శ్రీ జయేంద్రసరస్వతు లెంతోప్రశంసించడం జరిగింది. తన అనంతరం కామకోటిపీఠాధిపతిగా ప్రతిభావంతుడైన ఈ బాలునినియమించుకోవాలనే సంకల్పం శ్రీ జయేంద్రసరస్వతికి అప్పుడే ఉదయించిందేమో!

అటు తరువాత శ్రీ జయేంద్రసరస్వతి ఈ విషయం పరమాచార్యులకు నివేదించి, ఉభయులూ సంప్రతించుకొనిన పిమ్మటనే శంకరం తల్లిదండ్రులకు తమ నిశ్చయాన్ని వెల్లడించారు. తల్లిమాత్రం ప్రేమాస్పదుడైన తన కుమారుడు తన కంటి ఎదుట లేకుండ, విరాగి కావలసివచ్చెనే అని ఆదిలో కొంత విచారపడినా, కొడుకు కామకోటిమహాపీఠాన్ని అధిష్ఠించి, జగద్గురువు కాగలడన్న ఉత్సాహంతో ఆమె తన సమ్మతిని కూడా తెలియజేసింది.

శంకరం సన్యాసదీక్ష వహించడానికి 1983 మే నెల 29 తేదీన ముహూర్తం నిర్ణయించబడింది. దీక్ష స్వీకారానికి ముందు వ్రతాలు, ఉపవాసాలు, నియమనిష్ఠలు మొదలైన కార్యకలాపమంతా, పితృకర్మతో సహా, యథావిధిగా, సంప్రదాయబద్ధంగా శ్రీ జయేంద్రసరస్వతుల పర్యవేక్షణలో కొనసాగించాడు శంకరం. ఒక రాత్రి రాత్రంతా గాయత్రీమంత్రం జపించి, మరు

సటి ఉదయం శ్రీ కామాక్షీదేవి ఆలయ తటాకంలో వేలాదిపురజనుల సమక్షంలో జయేంద్ర సరస్వతిచే గురూపదేశం పొంది శంకరం కాషాయాన్ని దండకమండలాలను ధరించి విజయేంద్రసరస్వతిగా అవతరించారు.

కాషాయవస్త్రాలను, రుద్రాక్షలను, దండకమండలాలను ధరించిన విజయేంద్రుని చూసినవారంతా ఆదిశంకరుడు భూమిమీద తిరిగి అవతరించాడా అని భావించారు. ఆశ్చర్య కరమైన విషయమేమంటే 'యథాకృతి స్తత్రగుణాభవంతి' అన్నట్టు సకలజనాకర్షమైన ఆకృతికి తోడు, దానికి సదృశమైన గుణమూ, తదనుగుణమైన నామధేయమూ -- ఇన్ని గుణాలు ఒక్కవ్యక్తిలో మూర్తిభవించడం నాన్యతో లభ్యం.

# శ్రీజగద్గురు శ్రీ చంద్రశేఖరాష్టకమ్

*శ్రీ జనార్ధనస్వామి*

చంద్రశేఖర మిందు మంజుల సుస్మితోల్లసదాననం
కాకకోటి సుపీఠమండన మాశ్రితామర భూరుహమ్.
భక్తికోటి హృదన్తరాతత తాపనోది సుధాకరమ్
భూమి మాగత మిందుశేఖర మాశ్రయే భవ తారకమ్.
చంద్రశేఖర సద్గురూత్తమ పాదపంకజ మాశ్రయే
జన్మకోటి పరంపరాగత దృశ్యదర్శన వాసనామ్.
సద్య ఏవ వినాశయే చ్ఛుభ వాసనా మిహ యోజయేత్
యత్ర ప్రయచ్ఛతి బోధమాశ్యపవర్గ మప్యతిదుర్లభమ్.
చంద్రశేఖరకింకరాః కిల మన్వతే భవవారిధిమ్
గోష్పదం విధిలోకభూతిసమృద్ధి మిప్యణుసమ్మితామ్
బ్రహ్మభావ సుసంపదం నిజపాణిపల్లవ సంగతాం
జానతే పి  నిష్క్రియామల నిత్యముక్త సదాత్మతామ్.
దక్షిణాస్య మమౌనముద్ర మమోఘబోధ విధాయినమ్
శంకరార్య మవాద గాఢగిరం మృదూక్తి సుబోధకమ్.
త్యక్త నాగ విభూషణం హ్యభయప్రదం శశిశేఖరం
చంద్రశేఖర మిందు శీతల వీక్షణం గురుమాశ్రయే.
ముగ్ధ ముగ్ధ సుమోహనాంగ కలాప నిర్జిత మన్మథం
యుక్త యుక్త సుచారు భాషణ నిర్జితామరదేశికమ్
చిన్మయాద్వయ వస్తుదర్శన శాంత నిర్వృత మానసం
చంద్రశేఖర మాశ్రయే యతి బృందం వంద్య పదాంబుజమ్.

ఇందుశేఖర మిందు సుందర మిందుశీతల భాషణమ్

వంద్య పార మవంధ్య భాష మనింద్య చారు సువర్తనమ్

సత్య చిద్ఘన మత్య గోచర చైత్య ముక్త చిదాత్మకం

సద్గురుం గురుమోహవారక మాశ్రయే జగతాం గురుమ్.

ముక్త పున శరేక్షుచాప సుపాణ మీశ్వర వల్లభాం

ముక్త వర్ణ పదాకృతిం శ్రుతిశేఖరం పురుషాకృతిమ్

ముక్తి మాదృత దివ్య మానుష విగ్రహం భువి భాసురాం

భావయే గురు చంద్రశేఖర మిజ్య పూజ్య పదాంబుజమ్.

శాస్త్ర దృష్టి సుసంభృతం శ్రుతిసంఘమాన్య సమన్వయం

శాస్త్రయోని మనన్యతాంచిత కార్యజాత మహేతుకమ్

అక్షరం చ తదంబరాన్త విధారణోద్యత మవ్యయం

వ్యాస సూక్తి సమంచితం గురు చంద్రశేఖర మాశ్రయే.

శ్రీ చంద్రశేఖరేంద్ర శ్రీ సరస్వత్యంఘ్రి పంకజే

భక్త్యా ర్పితా స్తుతి రియం ప్రీయతాం జగతాం గురుః.

*వేదానికీ, ఇతర మతాలకూ భేదం*

ఇతర మతాలు తమ మార్గమే సత్యమనీ, తక్కినవి నరక హేతువులనీ చెబుతున్నాయి.

ఒక్క గమ్యానికే పెక్కుమార్గాలున్నాయని వేదం ఒక్కటే చెబుతున్నది.

# అడుగడుగునా స్వామి అనుగ్రహం

శిల్పకళానిధి, శిల్పకళా విద్వన్మణి, పద్మశ్రీ గణపతి స్థపతి

కంచి కామకోటి పీఠం పరమాచార్యులు శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి స్వామివారి పరిపూర్ణ అనుగ్రహానికి పాత్రులైన అశేష శిష్యకోటిలో నేను కూడా ఒకడిని. శిల్పకళారంగంలో నాకు గుర్తింపు రావడం వెనుక అడుగడుగునా వారి ప్రేరణ, ఆశీస్సులు పూర్తిగా ఉన్నాయి. ఆంధ్రప్రదేశ్ దేవాదాయశాఖలో శిల్పిగా నేను ప్రవేశించడం వారి ఆశీః ఫలితమే. తదాదిగా, దేశ విదేశాలలో శిల్పకళామతల్లి వైశిష్ట్యాన్ని చాటిచెప్పే అవకాశం నాకు లభించింది.

స్వామివారి సన్నిధిలో నా అనుభూతులు గురించి వ్రాయవలసి వస్తే ఒక ఉద్గ్రంథమవుతుంది. కొన్ని సన్నివేశాలను మాత్రం మీకు నివేదించుకుంటాను.

## విద్వత్ సదస్సు

శ్రీవారు ఆంధ్రదేశపర్యటనలో ఉన్నప్పుడు రాజమండ్రిలో ఆగమశిల్ప సదస్సును నిర్వహింపజేశారు. ఆ సదస్సుకు నాకూ పిలుపు వచ్చింది. బయలుదేరి రాజమండ్రి వెళ్ళాను. నేను వెళ్ళేసరికి, పెద్దస్వామివారు స్వయంగా శ్రీ చంద్రమౌళీశ్వర స్వామి పూజ చేస్తున్నారు. అప్పుడు ఆ తాపసమూర్తిలో కనిపించిన వెలుగు ఇప్పటికీ నాకళ్లకు కడుతున్నది. నిశ్శబ్దంగా నమస్కరించి అక్కడి నుండి కదలివెళ్ళి శ్రీజయేంద్ర సరస్వతి స్వామి వారిని దర్శించుకున్నాను. కుశల ప్రశ్నలు అయిన తర్వాత మరునాటి ఉదయం ఎనిమిది గంటలకు శిల్పసదస్సు ప్రారంభమవుతుందని, అప్పటికి రమ్మని స్వామివారు అన్నారు. సదస్సుకు ప్రధాన పర్యవేక్షకులైన బ్రహ్మశ్రీ కల్లూరి వీరభద్రశాస్త్రి గారిని కలిశాను. వారు - "స్థపతిగారూ, పుస్తకాలేమైనా తెచ్చారా?" అని అడిగారు. "లేదండీ. పదిపదిహేను నిముషాలు మాట్లాడటానికి కొన్ని అంశాలు వ్రాసుకుని వచ్చాను" అన్నాను. "అదేమిటి? ఇక్కడి పండితులంతా నిన్ను పరీక్షించాలని చాలా ప్రశ్నలు తయారు చేసుకొని వచ్చారు. ఎలా సమాధానం చెబుతావు?" అన్నారు శాస్త్రిగారు. "ఏదో నాకు తెలిసినది చెబుతాను. ఆపైన గురుకటాక్షం" అని ఊరుకున్నాను.

మరునాటి ఉదయం సదస్సు ప్రారంభమైంది. శైవ, వైఖానస, పాంచరాత్ర, స్మార్త, ఆగమ, శిల్ప విద్వాంసులంతా సభలో ఆసీనులై ఉన్నారు. శ్రీ జయేంద్ర సరస్వతి స్వామి సభకు అధ్యక్షులు. రాజమండ్రి వాస్తవ్యులు శ్రీ కె.వి. రత్నం గారు ముందు మాట్లాడారు. ఇంతలో - గణపతి స్థపతి మాట్లాడాలంటూ సభలో కలకలం వినిపించింది. తదుపరి, నేను లేచి ప్రార్థనచేసి ప్రసంగం ప్రారంభించాను.

ప్రశ్నల వర్షం

ప్రసంగం ముగించిన తర్వాత పరంపరగా ప్రశ్నలు సంధించారు పండితులు. వాటన్నింటికీ నాకు కంఠస్థంగా ఉన్నశ్లోకాలతోనే, శ్రీవారి అనుగ్రహంలో సమాధానాలు చెప్పాను. పదకొండుగంటలయ్యే సరికి ప్రశ్నలవర్షం కొంత వరకు ఆగింది. తర్వాత ఆగమపండితుల ప్రశ్నలకు కూడా సమాధానాలు చెప్పేటప్పటికి మధ్యాహ్నం పన్నెండున్నరగంటలు అయింది.

మధ్యాహ్నం సభలో మళ్ళీ నేనే ప్రసంగించాను. ఆనాటి సదస్సంతా, నా సమాధానాలతో, ప్రసంగాలతోనే జరిగిపోయింది. శ్రీ జయేంద్రసరస్వతి స్వామి అనుగ్రహభాషణంతో నాటి సదస్సు పూర్తయింది.

అచటినుండి అరకులోయ వెళ్ళి మళ్ళీ రాజమండ్రి వచ్చాను. "పెద్ద స్వామి భద్రాచలం వెడుతున్నారు. నీవూ వెడతావా ?" అని శ్రీ జయేంద్ర సరస్వతి అడిగారు. దేవాదాయశాఖ కమిషనర్ గారి అనుమతితో నేనుకూడా భద్రాచలం వెళ్ళాను.

"పూర్వ శిల్పుల కన్నా నీ శిల్పం మిన్న"

భద్రాచలం చేరిన మరునాటి ఉదయం పెద్దస్వామి గోదావరి స్నానానికి వెడుతున్నారు. నేను రంగనాయకుల గుట్టమీద నుంచి శ్రీవారు ప్రయాణం కావడం చూశాను. వారున్న స్నానఘట్టానికి పరుగెడుతూ వెళ్ళాను. అప్పటికి ఉదయం ఆరుగంటలయింది. స్వామివారు స్నానం ముగించి తిరిగి వస్తున్నారు. నేనూ స్నానం చేసి తడిబట్టల తోనే వారికి నమస్కరించాను. శ్రీవారు కల్యాణమంటపానికి విచ్చేశారు. వారి వెంట నడుస్తూ ఒక్కొక్క శిల్పం గురించి వివరించే భాగ్యం నాకు కలిగింది. వారు చాలా సంతోషించారు. బ్రహ్మను, సరస్వతీదేవినీ చూసి

ఆ ప్రక్కనున్న వారు ఎవరని అడిగారు. సావిత్రీదేవి అని చెప్పాను. వెంటనే వారి ముఖారవిం దం పై మందహాసం చిందులాడింది. శిల్పాలన్నీ చూసి, మధ్యలో ఉన్న ప్రపుల్ల పద్మాసనం - కల్యాణపీఠం మీద ఆసీను లయ్యారు. చిరునవ్వు తొణికిసలాడుతూండగా - "నీవు చోళ, పల్లవ, పాండ్య, నాయకరాజుల కాలంలో వెలసిన శిల్పకళారీతుల కంటె మిన్నగా శ్రీ రామునికి దేవాలయ మంటపాదులు కల్పించావు" అని , తమ మెడలో ఉన్న మారేడు మాలను తీసి, దానిని నాకు వేయమని ఆజ్ఞాపించారు. దానిని అందుకొని నేను వారికి సాష్టాంగపడ్డాను. ప్రక్కనే ఉన్న 'ఆంధ్రప్రభ' సిబ్బంది ఆ సన్నివేశాలు ఫోటో తీసి నా కెంతో సాయం చేశారు. అదిఒక మధురస్మృతిగా ఆజన్మాంతం నా మనస్సులో నిలిచిపోయింది. ఆ ఫోటోలను అప్పటి 'ఆంధ్రప్రభ' సంపాదకులైన సుకృతి శ్రీ నీలంరాజు వెంకటశేషయ్యగారు 'ప్రభ' లో ప్రచురిం చారు.

"నదిలో పడిన నవరత్నమాల"

భద్రాచలంలో కుంభాభిషేకం జరుగుతోంది. స్వామివారు స్నానం చేస్తున్న సమయానికే నేనూ గోదావరిలో స్నానానికి వెళ్ళాను. నా మెడలో ఉండే నవరత్నమాల నదిలో పడిపోయింది. ఎంత వెతికినా దొరకలేదు. అంతలో స్వామి స్నానం పూర్తిచేసుకొని వెళ్ళిపోతున్నారు. నేను కూడా స్నానం ముగించి స్వామిని అనుసరించాను. ఇంటికి వెళ్ళిన తర్వాత ఒక కుర్రవాడిని మాల వెతకమని నదివద్దకు పంపించాను. వాడు వెళ్ళి కాసేపటికి మాలతో ఆనందంగా తిరిగి వచ్చి "ఏమాత్రం కష్టం లేకుండా వెంటనే దొరికింది" అంటూ మాలను నా చేతిలో ఉంచాడు. అది శ్రీవారి కటాక్షం కాక మరేమిటి !

తరువాత కుంభాభిషేక సమయంలో శ్రీవారు కల్యాణ మంటపానికి విచ్చేశారు. అందరూ  పూజలు చేసి శ్రీవారికి పట్టువస్త్రం కప్పి ఎదురుగా నిలబడ్డారు. ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డిగారు కూడా ఉన్నారు. ముఖ్యమంత్రిగారిచే నన్ను పిలిపించి తమకు కప్పిన పట్టువస్త్రాన్ని నాకు కప్పి నా చేతిలో ఒక పండు ఉంచారు శ్రీవారు.

"కాశీ ఆలయంలో శివుని విగ్రహం"

శ్రీవారు బూర్గుంపాడు దగ్గర ఉన్నప్పుడు, భారత్‌మోటార్సు అధిపతి రామచంద్ర అయ్యర్ అనే భక్తునకు కాశీలో పంచాయతనంగా కామ కోటీశ్వర స్వామి దేవాలయం నిర్మించడానికి అనుగ్రహం చేశారు. ఆ పని పూర్తవుతోంది. ఇంతలో శ్రీవారు శివాస్థానంలో ఉన్నప్పుడు దర్శనానికి వెళ్ళాను. "సురుటిపల్లి (చిత్తూరుజిల్లా) వెళ్ళావా ?" అని శ్రీవారు అడిగారు. నేను వెళ్ళి చూసి వచ్చాను. అక్కడ విలక్షణమైన శివుని మూర్తిని - హాలాహల భక్ష ణానంతరం శయనించి ఉన్న మూర్తిని - చూసివచ్చినట్టు శ్రీవారికి నివేదించాను. అటువంటి మూర్తిని కాశీలోని కామకోటీశ్వరాలయంలో వెనుకవైపు కోష్ఠంలో నిర్మించమని వారు ఆదేశిం చారు. కాశీలోని ఆలయాన్ని చూడకుండానే స్థలనిర్దేశం చేయడం వారి సర్వజ్ఞతకు తార్కాణ. అట్లే ఆ శిల్పం నిబంధించాను. తదుపరి ఆ దేవాలయ కుంభాభిషేక సమయంలో "శిల్పకళా నిధి" అనే బిరుదుతో నన్ను సన్మానించి, నవరత్నమాలిక బహూకరణం చేశారు.

ఆ తర్వాత నేనూ దేవాదాయశాఖలోని ఇంజనీర్ శ్రీ ఆర్. రఘురామాచారి గారు కలసి వెళ్ళి శ్రీవారి దర్శనం చేసుకొన్నాం. కుంభాభిషేక విషయం తెలియబరిచాం. చాలా సంతోషిం చారు. కంచికి వెళ్ళి ఒక వసతిగృహంలో విశ్రాంతి తీసుకొంటున్నాం. అర్ధరాత్రివేళ స్వామివారు పిలిపించారు. నమస్కరించి కూర్చున్నాం. హరిద్వారంలో "హరకీపేడీ" లో ఒక స్తంభం కట్టి దానిపై ఆదిశంకరుల విగ్రహం నిలపమని శ్రీవారు ఆజ్ఞ ఇచ్చారు. స్తంభంమీద 'గంగాష్టకం' లోని ఈ శ్లోకం చెక్కించమన్నారు.

తరళతర తరంగే దేవి గంగేప్రసీద శంభోర్జటా విభూషణ మణిః
జహ్నూర్మహర్షేరియం కన్యా కల్మష నాశినీ భగవతీ భాగీరథీ పాతుమాం

అలాగే చేశాము. శ్రీవారికి దివారాత్రులు అనే భేదం లేదు. వారు సంకల్పించిన మాత్రన్నే పనులు నెరవేరిపోతాయి.

బాధా నివారణ

హైదరాబాద్‌లో ఒకసారి నేను స్కూటర్ మీద వెడుతూ ప్రమాదవశాత్తు క్రిందపడి

పోయాను. తలకు గాయమైంది. మెదడుకు దెబ్బతగిలింది. చికిత్స చేయించు కొంటున్నాను. మిత్రులు శ్రీ తల్పశాయి గారు వచ్చి, పెద్దవారిని దర్శిస్తే బాధా నివారణ అవుతుందని చెప్పి శ్రీవారి చరణప్రసాదం ఇచ్చారు. అది తీసుకొన్న తక్షణం తలనుంచి ఎంతో భారం తొలగి పోయినట్లు అనిపించింది. ఇంట్లోనివారు ఎంత వారిస్తున్నా వినకుండా ఆ స్థితిలోనే శ్రీవారి దర్శనానికి కంచికి ప్రయాణమై వెళ్ళాను.

"పడ్డావా?" అని వారే నన్ను అడిగారు. అప్పుడు వివరాలన్నీ చెప్పాను. రెండురోజులు అక్కడే ఉంటానని అన్నాను. నా బాధ పూర్తిగా మాయమైపోయింది.

శ్రీవారి అనుజ్ఞతో సంపూర్ణ ఆరోగ్యంతో ఇంటికి తిరిగి వచ్చాను.

## స్వగృహ నిర్మాణ సంకల్పం

హైదరాబాద్‌లో సొంతయిల్లు కట్టుకోవాలని ఎంతో ప్రయత్నం చేశాను. లాభం లేక పోయింది. విసిగిపోయి ఆ ప్రయత్నం మానుకొన్నాను. ఒక రోజు స్వామి కలలో దర్శనం ఇచ్చారు. సుబ్రహ్మణ్యస్వామి కోవెల వద్దకు వెళ్లమన్నారు. తెల్లవారింది. ఉదయం మామూలుగా ఆఫీసుకు వెళ్ళాను. మధ్యాహ్నం యాక్టింగ్ కమిషనర్ శ్రీ ఆనందరావుగారు అకస్మాత్తుగా నన్ను పిలిపించారు. "బూర్గువారి ప్లాట్లు ఉన్నాయట. మీరు కూడా తీసుకోకూడదా" అన్నారు. వారే నన్ను తీసుకొని వెళ్లి స్థలం ఇప్పించారు. శ్రీ కామకోటి గురుకృపావిశేషంగానే దీనిని భావించి ఆ స్థలంలో ఇల్లు కట్టుకొన్నాను.

ఒకపర్యాయం నేను మద్రాసు నుంచి హైదరాబాదు వస్తున్నాను. శ్రీవారు శివాస్థానంలో ఉన్నారు. మా స్వగ్రామం లో సుమారు పాతికేండ్ల క్రితం అమ్మవారి ఉత్సవం జరిగింది. మళ్ళీ జరగలేదు. ఆ ఉత్సవాన్ని నాలుగైదు గ్రామాల వారు కలసి చేస్తారు. అందులో విభూతి వితరణలో మొదటి స్థానాలు ఎవరు పొందాలి అనే స్పర్ధ ఉంది. మేము బండి దిగగానే అక్కడ ఉత్సవం జరగదని వార్తవచ్చింది. అందుకు నేనే కారణమనే వదంతికూడా వినిపించింది. శ్రీవారిని దర్శించి అనుగ్రహం పొందుదామని సంకల్పించుకొని కాంచీపురం వెళ్ళాను. రాత్రి 9 గంటలయింది. అంతా నిద్రిస్తున్నారు. నేను ఒంటరిగా కూర్చొని ధ్యానం చేసుకొంటున్నాను.

అర్ధరాత్రి ఒంటిగంటకు శ్రీవారు బావిదగ్గరకు వచ్చారు. కౌపీనంతో ఉన్నారు... నేను వారిని

సమీపించాను. "ఎప్పుడు వచ్చావు ?" అని ప్రశ్నించారు స్వామి. ఆ తర్వాత మళ్ళీవారే, "ఊళ్ళో ఏదో వడకై (ఉత్తరంలో ఉన్న,) దేవికా ఉత్సవం?.... ఫరవాలేదు. వెళ్ళిపో, అన్ని సవ్యంగానే జరుగుతాయి, పో" అన్నారు.

అనంతరం, "అలహాబాద్‌లో ప్రతిష్ఠకు నీవు సహస్రలింగం చేయాలని నిర్ణయం చేశాము" అన్నారు. "మావాళ్ళు ఎవరూ ఇంతకుముందు అలాంటిది చేయలేదు. కనుక అది పెద్దవారి సన్నిధిలోనే చేయాలి. వేదఘోష వినిపిస్తున్నప్పుడే పని జరుగుతుంది. పని పూర్తయ్యేవరకు శ్రీవారు అక్కడే ఉండాలి" అని మూడు కోర్కెలు కోరుకొన్నాను.

"నీ ఊళ్ళో పని పూర్తయిన తర్వాత తిరుచునాపల్లిలో 'తాయుమానవర్' (మాతృభూతే శ్వర స్వామి) స్వామిని చూసి ఆ కొలతలు తీసుకొని వచ్చి నాకు చెప్పిపోవాలి" అన్నారు స్వామి. ఆ తర్వాత ప్రసాదం అనుగ్రహించి పంపివేశారు.

అక్కడి నుంచి మా స్వగ్రామం 'ఎళువంకోట్టియ్' వెళ్ళాను. ఊరంతా అల్లకల్లోలంగా ఉంది. నేను అమ్మవారి దేవాలయం దగ్గర కూర్చొన్నాను. ప్రతిపక్షం వారు కోర్టుకు వెళ్ళారు. స్వామి కృప వల్ల కోర్టు తీర్పు మాకు అనుకూలంగా వచ్చింది. ఉత్సవం చాలా బాగా జరిగింది.

తర్వాత నేను తిరుచునాపల్లి వెళ్ళి మాతృభూతేశ్వరస్వామి కొలతలు అడిగాను. మొదట పూజారులు నిరాకరించారు. శ్రీవారి ఆదేశమని చెప్పాను. అప్పుడు వారు అంగీకరించారు. అనూరాధ శ్రీవారి జన్మనక్షత్రం. అప్పుడే రాయితీయాలని మూహూర్త నిర్ణయం జరిగింది. అంతా వెళ్ళాము. రాత్రి జోరున వర్షం కురుస్తోంది. అంతా తడుస్తూ నిలబడ్డాం. సురక్షితంగా లారీ నుంచి రాయి దింపారు. రాత్రి పదిగంటలైంది. గణపతికి కొబ్బరికాయ కొట్టాను. వర్షం వెంటనే ఆగిపోయింది. రాయి దింపినప్పుడు అది సరిగ్గా ఆమ్రవృక్షం దగ్గరే పడింది. రాత్రి 12 గంటలకు అందరం వెళ్ళిపోయాము. శ్రీవారు తెల్లవారు జామున 4 గంటలకే వచ్చి రాత్రికి ప్రదక్షిణం చేసి లోనికి వెళ్ళి కూర్చున్నారు. నేను కూడా వెళ్ళాను. మూహూర్తం సమీపించింది. ఎవరూ రాలేదేమని అనుకొంటుండగానే కారులో వేదపండితులు వచ్చారు. సరిగ్గా సమయా నికి కార్యక్రమం ప్రారంభమైంది. ప్రతిరోజూ అలాగే జరిగింది. శివలింగం పూర్తయింది.

శ్రీ కామాక్షి అమ్మవారి ఆలయ కుంభాభిషేకానికి రెండున్నర మాసాలు అక్కడే ఉన్నాను. దేవి దగ్గరకు గర్భాలయంలోకి వెళ్ళాలంటే భయం. శ్రీవారికి నివేదించు కొన్నాను. బంగారు కామాక్షి చరణాల దగ్గర కొంచెం బంగారం సమర్పించి పని ప్రారంభించమన్నారు.

ఆస్ట్రేలియాఖండంలో శ్రీ వెంకటేశ్వరస్వామి దేవాలయం కట్టడానికి నాలు పిలుపు వచ్చింది. అప్పుడు శ్రీవారు పండర్‌పూర్‌లో ఉన్నారు. వెళ్ళి ఈ సంగతి చెప్పి అనుజ్ఞ కోరాను. అది లభించలేదు. తిరిగివచ్చాను. అది నేటివరకూ నెరవేరలేదు. వారి సంకల్పం లేనిదే ఏదీ జరగదని నాకు అర్థమైంది.

ఇది జరిగిన నెలరోజులకే చికాగోలో శ్రీరామచంద్ర స్వామి ఆలయ నిర్మాణానికి నాకు ఆహ్వానం వచ్చింది. శ్రీవారు పండర్‌పూర్‌లోనే ఉన్నారు. వెళ్ళి విన్నవించాను. వెంటనే వెళ్ళి రమ్మని అనుగ్రహించారు. చికాగోలో దేవాలయనిర్మాణం విజయవంతంగా పూర్తిచేసి తిరిగి వచ్చాను.

శిల్పకళారంగంలో నా అభివృద్ధి వెనుక అడుగడుగునా శ్రీవారి అనుగ్రహం ఉంది. వారి సన్నిధిలో నేను పొందిన ఆనందానుభూతిని మాటలలో వర్ణించేశక్తి నాకులేదు.

# కరుణావరుణాలయులు

డా॥ వారణాసి రామమూర్తి 'రేణు'

శ్రీ కంచికామకోటి గురుచరణులు శ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతీస్వామి పాదులు జంగమ తీర్థ చక్రవర్తి. శ్రీవారి చరణస్పర్శ భూమిలోని అణువణువును పవిత్ర తీర్థం కావిస్తుంది. వారు సర్వజ్ఞులు, సర్వసములు, సర్వసులభులు. ఈ మాటలు అతిశయోక్తులు గావు. స్వామివారి చరణాలవద్ద నేను పొందిన ఎన్నో మధురానుభూతుల ఆధారంతో ఈ మాట లంటున్నాను. వానిలో ఒకటిరెండు అనుభవాలు నివేదిస్తాను.

శ్రీచరణులు మఠంతో హైదరాబాదు దయచేసిన సందర్భంలో దాదాపు నాలుగైదు నెలలు వారి దర్శన సేవాభాగ్యాలు అనుభవించిన వారిలో నే నొకడను. ఆ సమయాన శ్రీవారు అందరినివలె నన్నుకూడా అనుగ్రహించారు. పర్యటనానంతరం కంచి తిరిగివెళ్ళిన తర్వాత నే నప్పుడప్పుడు వారి దర్శనానికి కంచి వెళ్తుండేవాడిని. వెళ్లినప్పుడల్లా ఏదో ఒక వ్యాసం, ఎవరో ఒక భక్తుని గురించిగాని క్షేత్రాన్ని గురించిగానీ వ్రాసి తీసుకెళ్ళేవాడిని. దానిని శ్రీవారికి వినిపించి, వారి ఆమోదముద్ర వేయించుకుని పత్రికలకు పంపేవాడిని. అలాగే ఓ పర్యాయం శ్రీ సదాశివబ్రహ్మేంద్ర సరస్వతీస్వాముల జీవితవిశేషాలతో ఒక వ్యాసం వ్రాసి వారికి నివేదించడానికి బయలుదేరాను. మద్రాసు నుండి బస్సులో కాంచీపురానికి వెళ్తున్నాను. దారిలో నా మనస్సులో ఒక అతృప్తి, ఆలోచన ప్రారంభమయ్యాయి.

ఆ రోజుల్లో శ్రీవారు శివస్థానమనే చోట కంచిలో ఉండేవారు. ఆలయం ప్రక్కనే ఒక కుటీరంలో ఏకాంతంగా మౌనవ్రతం పాటిస్తున్నారు. కుటీరానికి చుట్టూ తడకలు ఉన్నాయి. దర్శనార్థులకు కిటికీచువ్వల గుండా కాని, కుటీరానికి వెనుక భాగానగల బావి వద్ద లోతట్టుగా నిలబడి కాని స్వామి దర్శనం ఇచ్చేవారు. అందుచేత శ్రీవారి ఊర్ధ్వకాయదర్శనమే తప్ప పాద దర్శనం లభించేది కాదు. బస్సులో పోతూ నాలో నేనిలా అనుకుంటూ ప్రయాణం చేశాను. 'శ్రీచరణుల పాద దర్శనం చేసి చాలా రోజులైంది. ఇంతకుముందు వచ్చినప్పుడు కూడా బావి వెనుక నిలబడినందున శ్రీవారి చరణదర్శనం కాలేదు. ఈ పర్యాయం కూడా అక్కడ నిలబడే

దర్శన మిస్తారో లేక బయటికి వచ్చి నఖశిఖ పర్యంతం దర్శించే భాగ్యం కలగజేస్తారో ! ఏమో నా అదృష్టం ఎలా ఉందో ! వారి చరణసౌభాగ్యం దర్శించే అనుగ్రహం చేయకూడదా ? ఏమో వారి దయ! నా భాగ్యం!'

ఇలా మనసులో బాధపడుతూ కంచి చేరుకున్నాను. శ్రీ వరదరాజస్వామి కోవెలవద్ద బస్సుదిగి శివస్థానానికి వెళ్ళాను. సాయంత్రం అయిదున్నర గంటలయింది. శ్రీవారు తమ కుటీరం చుట్టూ ఉన్న ప్రహరీగోడ పై నుంచి బయటచేరిన భక్తులకు దర్శనం ఇస్తున్నారు. వారి ముఖారవిందం మాత్రమే కనబడుతోంది. నేను ఊరు, పేరు చెప్పుకుని నేలమీద సాష్టాంగ పడ్డాను. 'రేణు' 'హైదరాబాదు' అని విన్నంతనే ఆ దయామయుని ముఖం వికసించి మంద హాసంతో అభయహస్తం అనుగ్రహించారు. శ్రీసదాశివబ్రహ్మేంద్రులపై ఇక వ్యాసం వ్రాసి తెచ్చానని, ఆ సందర్భంగా విషయ సేకరణకై పుదుక్కోట తంజావూరు ప్రాంతాల్లో పర్యటించాననీ, దానిని చిత్తగించి శ్రీవారు ఆశీర్వదించాలనీ అర్థించాను. నా కోర్కెకు ఆమోదం తెలిపి ఒక అర గంట కాలంలో వచ్చిన భక్తు లందరను ఆశీర్వదించి పంపి, 6 గంటలకు బావివద్ద లోతట్టున బల్లపై కూర్చొని నాకు కబురు పంపారు. నేను బావికి ఇవతల సాష్టాంగప్రణామం చేసి నిలిచాను. బావిపైన ఒక ఇనుప వల వేసి ఉంది. అప్పటికి సందె చీకటి ప్రారంభమైంది. శ్రీచరణుల నన్ను చదవమని మౌనంతోనే సంజ్ఞ చేస్తూ ప్రక్కనే ఉన్న బ్రహ్మచారిని టార్చిలైటు వేయమని సంకేతం చేశారు. నేను చదవడం ప్రారంభించాను. ఎత్తుగడలో భారతదేశం మహిమాన్వితులయిన సాధుపుంగవులకూ, భక్త గాయకులకూ ఎందరకో పుట్టినిల్లని చెబుతూ, అలాంటి సాధు మహాత్ములు కొందరి పేర్లు చదివాను. ఆ వాక్యం పూర్తికాగానే శ్రీవారు హస్త సంజ్ఞతో నన్ను ఆగమని 'ఎవరో ఫలానా భక్తుని వదిలేశావే!' అన్నట్టుగా నా వంకచూచారు. మందబుద్ధినైన నేను వారి సంకేతం గ్రహించలేక, ఆ భక్తు డెవరో సెలవివ్వమని అర్థించాను. మౌనవ్రతానికి భంగం లేకుండా సంజ్ఞలతోనే నాకు భక్తుని పేరు తెలియబరచడానికి శ్రీవారెంతో ప్రయత్నించారు. అయితే వారి సంకేతాలేవీ నా బుర్రలోని కెక్కలేదు. అంతటితో విసుగు కలిగినట్టుగా నటిస్తూ, తమ రెండు చేతుల బొటన వ్రేళ్లూ మడిచి ఎనిమిదివ్రేళ్ళూ చూపారు. ''చిత్తం

స్వామీ! ఎనిమిది!'' అన్నాను. వెంటనే కూర్చున్న పళంగా తమ ఎడమ పాదము పైకెత్తి నాకు చూపారు. అప్పటికి నాకు వారి ఆంతర్యం బోధపడి - ''ఆ ! స్వామి! ఎనిమిది, పాదం, ఎనిమిది పాదాలు, అష్టపాదాలు, అష్టపదులు! ఆ జయదేవులా ?'' అని పెద్దగా అన్నాను. శ్రీవారు మందహాసంతో అవునన్నారు. నిజమే! నేనిచ్చిన పేర్లలో గీతగోవిందకర్త జయదేవుని పేరులేదు. అంతేకాదు ఇంకెందరి పేర్లో కూడా లేవు. ఇత్యాదులు అంటూ అందరినీ కలిపాను. అయితే ఇందులో శ్రీవారు ఒక్క జయదేవులను నాకు గుర్తుచేయడంలోనే వారి అపారమైన కరుణ వాత్సల్యాలు పెనవేసికొన్నాయి. మద్రాసు నుంచి బస్సులో వస్తూ శ్రీవారి చరణసందర్శనం ప్రాప్తించదేమో నని నేను పడిన మానసిక సంతాపాన్ని ఆ సర్వజ్ఞమూర్తి గుర్తించి, జయదేవకవి వ్యాజాన, అష్టపదుల నెపంతో తమ సంపూర్ణమైన, సర్వశుభలక్షణ లక్షితమైన శ్రీ చరణతల దర్శనం అనుగ్రహించి న న్నానందపరిచారు! శ్రీచరణుల సర్వజ్ఞతకూ, సర్వాంతర్యామిత్వానికీ, భక్తవాత్సల్యానికీ ఈ ఘట్టం చక్కని తార్కాణం.

# 'సాక్షాత్తు భగవంతుడే!'

-శ్రీ పల్లెంపాటి వెంకటేశ్వర్లు

(కంచిస్వామివారిచే ప్రభావితులైన శ్రీ వెంకటేశ్వర్లుగారు హైదరాబాద్ నగరంలో రెండు దేవాలయాలను నిర్మించి, వాటిని సక్రమంగా పరిపాలించడమే గాక, ఎన్నో పుణ్యకార్యాలకు సహాయం చేస్తున్నారు. ఎందరో పండితులను సత్కరిస్తున్నారు.

అన్నిటినీ మించి, స్వామివారి ఆదేశానుసారం 18 పురాణాలకు తెలుగు అనువాదాలు చేయడమనే మహత్కార్యాన్ని సాధిస్తున్నారు. ఇంతవరకు ఏ దాతగాని, ఏ సంస్థగాని తలపెట్ట ని బృహత్ప్రణాళిక ఇది. ఇది ఒక్కటి చాలు శ్రీ వెంకటేశ్వర్లు గారి పేరు చిరస్థాయిగా చేయ డానికి).

పూజ్యశ్రీ కంచికామకోటిపీఠాధిపతులు జగద్గురు శ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతి మహాస్వా మిని మొట్టమొదటిసారి సందర్శించే భాగ్యం నాకు 1962 సంవత్సరంలో తమిళనాడులోని ఎలయత్తాంగుడిలో లభించింది.

"భవిష్యత్తులో నీవు ఉన్నతస్థితికి రాగలవు" అని శ్రీవారు నన్నప్పుడు ఆశీర్వదించారు. అది మొదలుకుని నేటి వరకు స్వామి వారే నన్ను కంటికి రెప్పవలె కాపాడుతున్నారు. అంతే కాదు, నా ఆధ్యాత్మికజీవితానికి గట్టిపునాది భక్తులను అనుగ్రహించుటలో శ్రీవారి ప్రభావ మెట్టిదో సూచించే నా అనుభవాలను కొన్నిటిని ఈ సందర్భంలో పేర్కొంటాను.

1968లో స్వామివారు హైదరాబాద్ మకాంలో ఉన్నప్పుడు స్కందగిరి, పద్మరావునగ రులో, కంచికామకోటిపీఠం పక్షాన శంకరమఠ మొకదానిని నిర్మించడానికి సంకల్పించారు. హైదరాబాద్ సికింద్రాబాద్ నగరాల్లో మహాభవనాలు నిర్మించే పేరుగల కంట్రాక్టరులు ఎందరో ఉన్నారు. అయినా, స్వామివారు నన్ను పిలిపించి, ఒక నెలరోజులలో మఠం నిర్మాణం పూర్తికా వాలనీ, వెంటనే ప్రతిష్ఠ జరగాలనీ ఆదేశించారు.

ఆ మరుదినమే శ్రీవారి కరకమలములతో మందిరానికి శంకుస్థాపన జరిగింది. నెలరో జులు కాదు సరికదా, 21 రోజులలోనే ఆ స్థలంలో సుందరమైన మందిరం రూపు దాల్చింది.

అంత స్వల్పవ్యవధిలో అంత నేత్ర పర్వంగా ఆ మందిరం పూర్తి కావడం ఆశ్చర్యకరం. స్వామి వారే అందరి హృదయాలలో ప్రవేశించి, నన్ను కేవలం నిమిత్తమాత్రంగా ఉంచి, అందరిచేతా అన్ని పనులూ తామే చేయంచారనడంలో అతిశయోక్తి ఏ మాత్రం లేదు.

అనంతరం కొద్దిరోజులకే శ్రీ వెంకటేశ్వరస్వామి ఆలయ ధర్మకర్తలు తాము సంకల్పించిన దేవాలయం నేలమట్టానికి కట్టుబడిచేసి, తరువాత దానిని పూర్తి చేయలేక ఆపివేశారు. గత్యంతరం లేక, ధర్మకర్తలు శ్రీ కంచికామకోటిస్వామికి తమ పరిస్థితులు నివేదించుకుని తమ పని సానుకూలమయ్యే ఉపాయం అర్థించారు. వెంటనే శ్రీవారు నన్ను పిలిపించి, 15 రోజులలో తాము హైదరాబాదు నుండి బయలుదేరుతున్నామని, అంతకు లోపల ఆలయనిర్మాణం పూర్తికావాలనీ ఆజ్ఞాపించారు. స్వామి ఆదేశం అనుసరించి పదునాల్గవ రోజున గర్భగుడితో సహా ఆలయం పూర్తి కావడం, విగ్రహప్రతిష్ఠ జరగడం తటస్థించింది.

1981 సంవత్సరంలో స్వామివారి మహదాశీర్వాదంతో నల్లగొండజిల్లాలో కాకతీయ సిమెంటుఫ్యాక్టరీ నిర్మాణం ప్రారంభించారు. 1983 ఫిబ్రవరిలో ఆ పని పూర్తి అయింది.

యన్.జె.యఫ్. కంపెనీ (ప్రభుత్వ సంస్థ, బెంగుళూరు) వారి వద్ద 600 హార్సు పవర్ మోటార్లు అమ్మకానికి సిద్ధంగా ఉన్నవి. పన్నెండు లక్షల రూపాయలు చెల్లించి డెలివరీ తీసుకొనవలసిందిగా ఆ కంపెనీ వారు నాకు తెలియజేశారు. కాని, నా వద్ద అంత మొత్తం లేదు. "ఫ్యాక్టరీ మొదలుపెట్టిన తరువాత నెలరోజులలో మొత్తమంతా చెల్లించగలను, మోటార్లు సరఫరా చేయవలసిందని" కోరుతూ వారికి లేఖ వ్రాశాను. అందుకు వారు సమ్మతించలేదు.

ఏమి చేయడానికి నాకు పాలు పోలేదు. మార్చి 1వ తేదీన ఫ్యాక్టరీ ప్రారంభోత్సవానికి కూడా ముహూర్తం నిర్ణయించాము.

ఇలాంటి క్లిష్టపరిస్థితిలో "శ్రీవారే నన్ను కాపాడాలి" అంటూ స్వామి వారిని గట్టిగా ప్రార్థించాను. రెండురోజులు గడిచినవో, లేదో, బెంగుళూరు ప్రభుత్వ సంస్థవారు తమ మనస్సు మార్చుకుని, బాడుగకు లారీలు మాట్లాడి, బాడుగ తామే చెల్లించి, మేము ముందుగా 12

లక్షల పైకం చెల్లించవలసిన షరతు రద్దుచేసి, మోటార్లు రెండూ మా ఫ్యాక్టరీలో డెలివరు చేశారు. అటు తరువాత మూడు నెలలకు తమ బాకీమొత్తం మా వద్ద వసూలు చేసుకున్నారు.

అత్యద్భుతమైన ఈ ఒక్క సంఘటన చాలు, తమ్ము ఆశ్రయించిన భక్తులను శ్రీవారు తోడునీడయై ఎట్లా రక్షిస్తారో తెలుసుకోడానికి!

స్వామివారు భూతభవిష్యత్‌వర్తమానాలు తెలిసికోజాలిన సర్వజ్ఞులనీ, సర్వశక్తిమంతులనీ నా దృఢ విశ్వాసం, స్వామిదయ అపారం.

మరొక తార్కాణం :

1968లో, హైదరాబాద్ అశోకనగరులో శ్రీ సత్యనారాయణస్వామి దేవాలయ నిర్మాణానికి నేను పూనుకున్నాను. శ్రీవారి చేతనే ఆలయశంకుస్థాపన జరిగింది.

కాని, అశోకనగరు కాలనీ వాస్తవ్యులు కొందరు ఆ మరునాడు స్వామి వారిని సందర్శించి, ఆ స్థలంలో దేవాలయ నిర్మాణం జరిగితే గుడిగంటల మోతవల్ల చుట్టుపక్కల ప్రజలకు నిద్రాభంగం కలుగుతుందనీ, ఆలయం చుట్టూ భిక్షకులు చేరుతారనీ, కాబట్టి ఆలయ నిర్మాణం ఆపి వేయవలసినదిగా సలహా చెప్పవలసిందనీ, అట్లా జరగని పక్షాన తాము కోర్టుకు వెళ్లగలమనీ కడు నిష్టూరంగా స్వామివారిని బెదిరించారు.

స్వామివారీ ధోరణి చూచి నవ్వి, మౌనంగా ఊరుకున్నారు. వారి కేమీ బదులు చెప్పలేదు.

ఆ తరువాత, అనుకున్న ప్రకారం అదే స్థలంలో సర్వాంగసంపన్నంగా ఆలయం పూర్తి అయింది. అది మొదలుకొని, నిత్యప్రవచనమూ, సత్యనారాయణస్వామి వ్రతమూ నిరంతరాయంగా జరుగుతున్నవి. తెంపు లేకుండా అనుదినం ఆలయం భక్తులను ఆకర్షిస్తుంది.

(విశేషమేమంటే, ఆలయనిర్మాణానికి అడ్డుపడి శ్రీవారిపట్ల నిష్ఠురంగా మాట్లాడిన అశోకనగర వాస్తవ్యులు ముగ్గురూ తమ కర్మఫలం అనుభవించక తప్పలేదు!)

శ్రీ కామకోటిమహాస్వామి సాక్షాత్తు భగవంతుడేనని త్రికరణశుద్ధిగా నేను విశ్వసిస్తున్నాను.

ఇంతకుమించి నేను చెప్పవలసిన దేమున్నది ?

# 'నా యోగక్షేమాలు శ్రీవారే తీర్చి దిద్దుతున్నారు'

- శ్రీ మాగంటి మధుసూదనరావు

కీర్తి శేషులైన మా తండ్రి శ్రీ మాగంటి శ్రీరాములుగారు పూర్వం విజయవాడ, రాజమండ్రి పట్టణాలలో కలప వ్యాపారంచేసి లాభాలు గడించారు. విజయవాడలో దక్కన్ టింబర్ డిపో మా వ్యాపారకేంద్రం.

నేను విజయవాడ, మద్రాసు, బొంబాయి పట్టణాలలో చదివి పట్టభద్రుణ్ణి అయాను. ఎల్. ఎల్. బి పట్టా కూడా సంపాదించాను కాని న్యాయవాద వృత్తిలో ప్రవేశించాలనే అభిలాష ఎన్నడూ నాకు లేదు.

చిన్ననాటి మిత్రులు గోపి, మురళి ద్వారా కంచిస్వామి వారి సంగతి విని, వారిని దర్శించాలని అనుకున్నాను.

1962లో ఒకసారి మద్రాసు వెళ్ళినప్పుడు నా సహాధ్యాయి, శ్రీవెంకటేశ్వర్లును తోడుతీసుకుని, తంజావూరు దగ్గర కావేరినది తీరంలో కల్యాణపురంలో మకాం చేస్తున్న స్వామివారిని దర్శించడానికి వెళ్ళాను.

నేను మాగంటి వంశీకుడనని, మేము కమ్మవారమనిచెప్పగా, "కమ్మ వారిని చౌదరులని కూడా అంటారు, తెలుసా ?" అని అడిగారు శ్రీవారు.

నేను వారి వద్ద సెలవు తీసుకుంటున్న తరుణంలో, శ్రీవారు హిందీలో "దిల్ కొలాహై" (నీ హృదయం తెరుచుకుంది) అన్న మాటలు మరపురానివి.

ఆ పిమ్మట దాదాపు పదిసంవత్సరాలు నేను కాంట్రాక్ట్ వ్యాపారం చేశాను. పెద్దగా లాభించలేదు.

విజయవాడలో మా తండ్రిగారి కలపవ్యాపారం కూడా నష్టపోయింది. ఈ పరిస్థితుల్లో బీహార్ రాష్ట్రంలో గనుల త్రవ్వకంలో నిమగ్నమైన ఒక మిత్రుడు తనతో నన్ను భాగస్వామి కమ్మని ఆహ్వానించాడు.

బీహార్‌కు వెళ్ళడానికి అన్ని ఏర్పాట్లు చేసుకుని, కంచి వెళ్ళాను.

శ్రీవారితో ఏకాంతంగా అర్థగంట సంభాషించే అవకాశం లభించింది.

నేను బీహార్‌లో మైకా గనుల వ్యాపారం చేయబోతున్నానని చెప్పగా స్వామివారు ఖండి తంగా ''బీహార్ వెళ్ళవద్దు, సొంతంగా ఏదన్నా చేసుకో'' అని అన్నారు.

కొంతకాలం గడిచిన తరువాత శ్రీవారిని చిత్తూరు జిల్లా కార్వేటినగరంలో దర్శించాను. ఎల్.ఎల్.బి పట్టా ఉంది కాబట్టి న్యాయవాద వృత్తిలో ప్రవేశిద్దామని అనుకుంటున్నానని శ్రీవా రితో చెప్పాను. ''ఎల్.ఎల్.బి ఎప్పుడో పాస్ అయావుకదా ?'' అని అంటూ ''పిల్లలు ఎంత మంది నీకు ?'' అని అడిగారు శ్రీవారు.

నాకు ముగ్గురు కుమారులు అని చెప్పగానే శ్రీవారు, ''ముగ్గురూ ప్రయోజకులవుతారు. అందరూ క్షేమంగా ఉంటారు'' అని సెలవిచ్చారు.

గత మూడు దశాబ్దాల నా జీవితంలో, నేను ఎదుర్కొన్న ఒడిదుడుకులను జ్ఞాపకం తెచ్చుకున్నప్పుడు, స్వామివారు నా పట్ల కనబరిచిన వాత్సల్యాన్ని, వారి అనుగ్రహాన్ని స్మరించి ముగ్ధుణ్ణి అవుతుంటాను.

నా యోగక్షేమాలు శ్రీవారే తీర్చిదిద్దుతున్నారన్న విశ్వాసం నాకు కుదిరింది. ఇదొక జన్మంతర విశేష ఫలానుభవప్రాప్తి అని తలుస్తాను.

# "ప్రతిష్ఠ ఎప్పుడు ?"

- శ్రీరామ శరణ్ కుందుర్తి వెంకట నరసయ్య

నాగాయలంక లాంచీలరేవు గట్టున సంతరోజున చేపల తట్టలు, గడ్డి మూటలు పెట్టు కుని అమ్ముకునే వారు. అక్కడి నుండి లాంచీలమీద సుమారు వేయి మంది పెనుమూడి మీదిగా గుంటూరుజిల్లాకు పోతారు. దాదాపు వేయిమంది అక్కడికి వస్తారు.

అలాంటి తావులో భగవంతుడు జ్ఞాపకం వస్తే బాగుంటుందని తోచి, స్వహస్త పరహస్తా లతో శ్రీ కోదండరామాలయం, రమాసహిత సత్యనారాయణ ఆలయం రెండూ నిర్మించడం జరిగింది. జయపూర్ నుంచి చలవరాతి విగ్రహాలు తెప్పించాము. 1964 మే నెల 31 తేదీ నా టికి ప్రతిష్ఠకు ముహూర్తం నిశ్చయించాము. అందుకు సమస్తమైన ఏర్పాట్లు జరిగాయి.

ఇంతలో, కంచి పెద్దస్వాములు శ్రీచంద్రశేఖరేంద్రసరస్వతి షష్ఠి పూర్తి మే నెల 25 తేదీన కంచికి మూడుమైళ్ల దూరంలో అంబి గ్రామంలో జరుగుతుందని తెలిసింది. నేనూ, మా శిష్యుడు తుంగల నాగభూషణం, ఇద్దరం బయలురేరిపోతూ, 31 తేదీ ప్రతిష్ఠ నాటికి తప్ప కుండా వస్తామని, ప్రతిష్ఠకు పూర్వం జరగవలసిన అధివాసాదులు చేసి సిద్ధంగా ఉండండని చెప్పి, మేము అంబికి బయలుదేరాము. అప్పుడు అక్కడికి శ్రీమండలీక వెంకటశాస్త్రి, శ్రీ కుప్పాలక్ష్మావధానులూ, శ్రీజంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి గార్లు కూడా వచ్చారు.
షష్టిపూర్తి రోజున మా కెవరికీ స్వామి వారి తీర్థం దొరకలేదు. ఆ మర్నాడు 26 తేదీ తీర్థం పుచ్చు కుందా మనుకున్నాము. ఆనాడే నేను స్వామి దర్శనం చేసింది. అంతకు పూర్వం స్వామిని నే నెన్నడూ చూడలేదు. నేను తీర్థానికి చెయ్యి చాచాను. స్వామి నాకు తీర్థమిచ్చి, చేతిలో ఉన్న పెద్ద ఉద్ధరిణె కింద పెట్టి, "ప్రతిష్ఠ ఎప్పుడు?" అని అడిగారు. నేను నిర్ఘాంతపోయాను. "మా ఇంట్లో మందిరంలో ఎప్పుడో అయింది" అన్నాను. "అది కాదు. నది ఒడ్డున ఏర్పాటు చేశావే, 'రామ పాదక్షేత్రం', అక్కడి ప్రతిష్ఠ" అన్నారు.

నేను : దానిని మే 31 తేదీ చేదామని అనుకున్నాము.

స్వామి : 31వ తేదీన చేస్తారా ?

స్వామి ప్రశ్నార్థకంగా అన్న మాటలో ఆ రోజున ప్రతిష్ఠ జరగదనే ధ్వని వినిపించింది.

స్వామి మాకు అక్షింతలు, కుంకుమ, కిస్మిస్ పండు ప్రసాదం ఇచ్చి, యంత్రానికి ప్రత్యామ్నాయంగా వాటిని విగ్రహాల కింద ఉంచండని సెలవిచ్చారు.

ఇంతలో 28-5-64 న జవహర్‌లాల్ నెహ్రూ పరమపదించారు. అందుచేత ఆనాడు రైళ్లు, బస్సులు నడవ లేదు. 29 తేదీ బయలుదేరి 30వ తేదీ సాయంత్రానికి మేము ఊరు చేరాము.

మేము ఊరిలో లేనందున 'గురువుగారు లేని ప్రతిష్ఠా' అంటూ గ్రామస్థులు ఏ పనీ మొదలుపెట్టలేదు. అందుచేత, మళ్లా జూన్ 11వ తేదీన ప్రతిష్ఠకు మూహూర్తం పెట్టి ఆపని నిర్వహించాము. స్వామివా రన్నది నిజమైంది.!

మరొక విచిత్రమేమంటే , స్వామివారాస్థలాన్ని 'రామపాద క్షేత్ర' మని ఎందుకన్నారు? తరవాత రెండునెలలకు నాగార్జునడాము విరిగి కృష్ణానదికి అంతులేని వరద వచ్చింది.అప్పుడు ఆ వరదనీరు గుడిలో శ్రీరామపాదాల నంటి తగ్గిపోయింది. ఆ వరద ఇంకో అంగుళం పెరిగిన ట్లయితే దివి తాలూకా లో 70 గ్రామాలు వరదకు కొట్టుకుపోయేవి.

ఇప్పుడు అక్కడ చక్కగా పూజలు, కార్తీక స్నానాలు, 108 సత్యనారాయణ వ్రతాలు సక్ర మంగా జరుగుతున్నవి. వినాయక, కేదారేశ్వర, ఆంజనేయ విగ్రహాల ప్రతిష్ఠ కూడా జరిగింది. యోగులు, సిద్ధులు ఉన్నారు.

నేటికికూడా దేశంలో కొందరైనా సిద్ధులూ, యోగులూ లేకపోలేదు. అత్యుష్ణాన్ని, అతిశీ తలాన్నీ వారి శరీరాలు సహిస్తాయి. తలుచుకుంటే వారు వర్షం కురిపిస్తారు. కురుస్తూవున్న వర్షాన్ని అపనూగలరు.

మనకు స్థిరమైన నమ్మకంలేదు. అన్నిటిమీదా అపనమ్మకమే. నేటికంటే పూర్వకాలంలో దివ్యశక్తులు కలవారు ఎక్కువగా ఉండేవారు. కాబట్టి, మన పురాణాలలో ఈ మహిమలను విశేషంగా ఉదహరించారు. గాథలలో మహిమలున్నంతమాత్రాన మన పురాణాలను కట్టుకథల

నడం సబబుకాదు. నేటి భౌతికశాస్త్రం రుజువు చేయలేని దానినంతా కల్పనగా భావించడం ఆంగ్లవిద్యకు మెప్పుకాదు.

# ఇదంతా స్వామి కటాక్షం

- శ్రీ జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి

జగతీ మవితుం కవితాకృతయో

విచరన్తి మహా మహసశ్చలతః.

'గురుదేవులు జగద్రక్షణకై ఒక ఆకారం ధరించి ఏదోఒక నెపంతో ప్రపంచం అంతటా తిరుగుతుంటారట.'

అదేవిధంగా శ్రీ కామకోటి పెద్దలు శ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతి శ్రీ చరణులు దేశసంచారం చేస్తూ లక్షలాది భక్తులను అనుగ్రహించారు.

1952 లో ఒకనాడు స్వప్నంలో స్వామివారు నాకు దర్శనమిచ్చారు. స్వయంగా మా యింటికి దయచేశారు. గురుపాదుకలను అందజేసి నన్ను బ్రహ్మానందభరితుణ్ణి చేశారు. నాడు మొదలు నేటి వరకూ నన్ను కంటికి రెప్ప వలె కాపాడుతున్నారు.

పూర్వాచారాన్ని అనుసరించి నా కుమార్తెకు కన్యావివాహం చెయ్యాలని నేను కృతనిశ్చయంతో ఉన్నాను. కాని, అట్టి సంకల్పం కలవారు ఈ కాలంలో అరుదుగా ఉండడంచేత వెంటనే కార్యసిద్ధిగాక, ఆలస్యం జరుగుతూ వచ్చింది. అప్పుడు నేను శ్రీవారి అనుగ్రహం వల్లనే ఈ కార్యం నెరవేరాలని తలచి వారినిగట్టిగా స్మరించాను.

స్వామివారు మా వియ్యాలవారికి స్వప్నంలో కనిపించారు. నా కుమార్తెను వారికి చూపించి, ఈ సంబంధం చేసుకోవలసిందిగా సూచించారు. అంతేగాక తమ సమక్షంలో కన్యాదానం జరిగినట్టుగా కూడా స్వప్నంలోనే ఉభయులనూ అనుగ్రహించారు.

ఇది జరిగి వారం రోజులు గడవకుండానే, మా వియ్యాలవారూ మేమూ వివాహం శుభప్రదంగా జరుపుకున్నాము.

ఇది స్వామి వారి అవ్యాజకరుణ తప్ప వేరొకటి కాదు.

ఇదే విధంగా నా రెండవకుమార్తె వివాహ సందర్భంలో కూడా, తమ పిల్లవానికి మా పిల్లను చేసుకుంటామని వాగ్దానాలు చేసినవారు కాలవిలంబం చేయసాగారు. నేను శ్రీవారి అనుగ్రహం పైనే ఆధారపడ్డాను.

మా వియ్యంకుని వేరొక వ్యాజంపైన మా యింటికి వచ్చేటట్టు చేసి, వారంరోజుల లోపల మా రెండవఅమ్మాయి పెళ్లి జరిగేటట్టు స్వామివారు అనుగ్రహించారు.

ఇదంతా స్వామి కటాక్షమే !

అనంతానికి చిహ్నమేది ?

అంతంలేని వాడు అనంతుడు. ఒకటి, రెండు, మూడు అంటూ సంఖ్య పెరుగుతూ పోతూ ఉంటుంది. మరి, అనంతానికి చిహ్నమేది ? పారార్ధ్యాన్ని ఏ సంఖ్యతో చూపడం ?

# ఆదిలో ఉన్నది వేదమతం

(1931 లో కంచిస్వామి చేసిన మహోపన్యాసం )

ప్రపంచంలో అనేక మతా లున్నవి. మతా లన్నిటికీ ప్రత్యేకమైన పేర్లున్నవి. ఆయా మత సంస్థాపకుల పేర్లతో అవి వ్యవహరించబడుతున్నవి.

బుద్ధభగవానుడు కనుగొన్న మతం బౌద్ధం. జినుడి నామంతో జైనం. మహమ్మద్ ప్రవక్త పేరుతో మహమ్మదీయ మతం. జీసస్ క్రీస్తు స్థాపించింది క్రైస్తవం. జోరాస్టర్ నెలకొల్పింది 'జోరా స్ట్రియనిజం' (పార్శీల మతం) చైనాలో కన్ ఫ్యూషియన్ ద్వారా ఆవిర్భవించింది 'కన్ ఫ్యూషియనిజం'

ఈవిధంగా కొత్త మతాలను సృష్టించి అసంఖ్యాకప్రజలను తమవైపు ఆకర్షించిన వారంతా మహామహులు. ఒక్క మన మతానికి మాత్రమే ప్రత్యేకమైన పేరు లేదు. కాస్త ఇంగ్లీషు చదివిన కుర్రవాణ్ణి ''అబ్బాయీ, నీ మతం ఏది?'' అని అడిగితే, 'నాది హిందూమతం' అంటాడు. అలా కాకుండా, పల్లెటూళ్లల్లో పొలం పనులు చేసుకునే సామాన్య ప్రజలను అదే ప్రశ్న అడిగితే, వాళ్లు అందుకు తగిన సమాధానం చెప్పలేరు.

దక్షిణదేశంలో దస్తావేజులు వగైరా వ్రాసేవారిని ప్రశ్నించామనుకోండి. వారు 'మేము శైవుల మనో, వైష్ణవుల మనో, జవాబిస్తారు. శైవం గానీ వైష్ణవం గానీ మన మతంలో శాఖలే తప్ప, అవి అసలు మన మతం పేర్లు కావు. అవి మనం ఆరాధించే దేవతల పేర్లు. మతాన్ని కనుగొన్న వారి పేర్లు కావు.

## మన మతానికీ పేరే లేదు !

మన మతం పేరు హిందూమత మనేదే నిజమైతే మన పూర్వీకులందరికీ ఆ పేరు తెలిసి ఉండవలసిందే. అతి ప్రాచీనకాలంలో కూడా ఆ పేరు వాడుకలో ఉండి ఉండేదే. మరీ పూర్వకాలపు వారికే కాదు, కొన్ని తరాల క్రిందటి వారికైనా 'హిందూ మతం' అనే మాట ఏదో

ఒక వింత పదంగా, అర్థం లేని మాటగా అనిపించేది. ఈ పరిస్థితికి కారణమేమిటి ? వాస్త వంలో మన మతానికీ ఒక పేరంటూ లేదు.

మన మతంలోని శాఖలకు మాత్రం ప్రత్యేకమైన పేర్లున్నవి. ఆ పేర్లయినా, మానవులవ కావు. ఉపాసన కోసం ఆయా మతానుయాయులు ఏర్పాటుచేసుకున్న ఒకే పరమాత్మ యొక్క వేరువేరు రూపాలు. మన మొత్తం మతానికీ ఒకే పేరు చెప్పడం కష్టసాధ్యం. ఇటీవలి కాలంలో 'సనాతన ధర్మం' అనే పేరు విశేషణంగా వినిపిస్తోంది. అయినా, అది కూడా అనాదిగా వస్తున్న పేరని చెప్పలేము. అదే అయినట్లయితే, మన గ్రామాల్లో నివసించే సామాన్య రైతులకూ, అనా థలకూ కూడా ఆ పేరు సుపరిచితమై ఉండేది.

'హిందూయిజం' మన పేరు కాదు.

'హిందూయిజం' అన్నది పరాయివారు మన మతానికి కట్టబెట్టిన పేరు. ఆ పేరు ప్రచా రంలోకి ఎలా వచ్చిందో చరిత్రద్వారా మనకు తెలుస్తూనే ఉంది. మన పూర్వీకులు ఒకప్పుడు సింధునదీతీరంలో నివసిస్తూ ఉండే వారు. ఆ కాలంలో మన దేశానికి వచ్చిన విదేశీయులు "సింధు" నదిని "ఇండస్" అన్నారు. 'ఇండస్' ప్రవహించే దేశాన్ని 'ఇందు' దేశమనీ 'ఇండస్ భూభాగమ'నీ వ్యవరిస్తూ వచ్చారు. క్రమేణా, ఇండస్ ప్రాంతాన్నేగాక, యావద్భారత దేశాన్ని అదే పేరుతో వ్యవహరించారు. "హైడ్ పార్కుకు ఆవల అంతా ఎడారి" అన్న సామెత మనం వినడం లేదా ? అట్లా!

మన మతానికి చిహ్నం లేదు

ప్రతి మతానికీ ఒక ప్రత్యేక చిహ్నం ఉంటుంది. దాన్ని బట్టి ఇది ఫలానా మతం అని మనం తెలుసుకోవచ్చు. క్రైస్తవ మతానికి సిలువ గుర్తు. ఆ విధంగా హిందువులందరికీ ఒక ప్రత్యేక చిహ్నం లేదు. మన మతానికి పేరూ లేదు, చిహ్నమూ లేదు. పేరులేని, గుర్తులేని మతం మనది ! మన మతస్థులు కొందరు ముఖాన విభూతి ధరిస్తారు. మరికొందరు విష్ణు పాదాన్ని చిత్రించుకుంటారు. మనలో కొందరు వీర వైష్ణవులైతే, మరికొందరు 'లింగాయతులు'

లేక వీరశైవులు. అయినా, మొత్తం మీద తామంతా ఒకే మతానికి చెందిన వారమనే భావం కలిగి ఉంటారు.

ఏ పేరూ లేకుండా ఉండడంలోనే మన మతానికి ఒక మహత్త్వ మున్నది. ఒకే విధమైన వస్తువులు అనేకం ఉన్నప్పుడు, ఒక్కొక్క వస్తువును వేరువేరుగా గుర్తించడానికి వాటికి పేర్లు పెట్టవలసి వస్తుంది. ఒకే విధమైన వస్తువు ఒక్కటే ఉన్నదనుకోండి. అప్పుడు దానికి పేరెందుకు? ఉదాహరణకు, ఒకే ఊళ్ళో 'రామస్వామి' అనే పేరుగల వ్యక్తులు నలుగురున్నట్టయితే, ఆ నలుగురినీ వేరువేరు ఇంటి పేర్లతో పిలవాలి.లేదా 'నల్ల రామస్వామి' అనో, 'ఎఱ్ఱ రామస్వామి' అనో ఏదో గుర్తించదగిన పేరుపెట్టి పిలవాలి. రామస్వామి ఒక్కడే అయినప్పుడు, అతనిని గుర్తించడానికి వేరే పేరు అక్కరలేదు. మన మతానికి కూడా ఈ సూత్రమే వర్తిస్తుంది.

## మతమంటే ఏమిటి ?

మత మంటే ఏమిటి ? చావు పుట్టుకలనే విషచక్రం నుంచీ, లేదా పాపాలనుంచీ, కష్ట పరంపరలనుంచి మనలను రక్షించేది మతం. ఒక్క హిందూమతం తప్ప, ప్రపంచంలోని తక్కిన మతాలన్నీ ఆయా మత స్థాపకుల పేర్లతో పిలవబడుతున్నవని మొదట మనం చెప్పుకున్నాము. ఏతావతా, తేలిన విషయ మేమంటే, ఈ మతకర్త లందరూ పుట్టక ముందు ఈ మతాలు లేనేలేవు. అంతేకాదు, ఈ మతా లన్నీ ఎప్పుడెప్పుడు ఏర్పడ్డవో వాటి కాలాలు కూడా నిర్ణయించబడినవి. ఈ మతాలన్నీ రాక పూర్వం నుంచీ మన మతం ఉండేదని ఇందువల్ల నిరూపితమవుతున్నది. అత్యంత ప్రాచీనకాలం నుండి మానవజాతి కంతటికీ ఆధ్యాత్మిక చింతనను ప్రసాదిస్తూ, విశ్వవ్యాప్తమై ఉండేది మన మత మొక్కటే. ఈ కారణంచేతనే, ఈ మతానికి ప్రత్యేకమైన పేరంటూ లేదు. మతమన్నది కేవలం ధర్మం.ధర్మ మన్నది మతానికి మారు పేరు.

మన మతానికి ప్రత్యేకమైన పేరు లేకపోయినా, 'వేద ప్రామాణ్య'మనే సామాన్య సూత్ర మున్నది. ఆధ్యాత్మికవిషయాల్లో వేదమే కట్టకడపటి ప్రమాణం అనే విశ్వాసం. 'అదేమంత వేదాక్షరమా?' అన్న సామెత ఆ విశ్వాసం నుంచి పుట్టినదే.

## ఒకే మతమనడానికి ఆధారాలు :

ఒకానొకప్పుడు  యావత్ప్రపంచానికి మనది ఒక్కటే మతమైన పక్షంలో 'ప్రపంచంలోని మానవులంతా మన మతసిద్ధాంతాలను అవలంబించారా' అన్న ప్రశ్న ఉదయించడం సహజం. ఈ ప్రశ్నకు 'అవును' అని సమాధానం చెప్పడానికి అనేక ఆధారాలున్నవి. యూదుజాతివారు ఏసుక్రీస్తుకు మరణశిక్ష విధించారు. అందుకు వారు ఆయనపై కొన్ని ఆరోపణలు మోపారు. 'హీనజాతి ప్రజల బావి నీటిని జీసస్ క్రీస్తు పుచ్చుకున్నాడ'న్నది యూదులు ఆయనపై మోపిన నేరారోపణలలో ఒకటి. దీనినిబట్టి క్రీస్తుకు పూర్వం ఆ దేశంలో వర్ణవ్యవస్థ ఉన్నట్టు స్పష్టం అవుతున్నది కదా!

ఇంతేకాదు, క్రీస్తకు పూర్వం 1280 సంవత్సరం నాటి శాసనం ఒక దానిని ఈజిప్టులో కనుగొన్నారు. 'రెండవ రామేశస్'కూ , హిట్టైటెసకూ మధ్య జరిగిన సంధి షరతులు ఆ శాసనం లోపేర్కొనబడ్డాయి. ఈ సంధిలో 'మైత్రావరుణ' అనే వేదంలోని దేవత సాక్షిగా ఉదహరించబడినాడు.ఇదిగాక, ఈజిప్టు రాజవంశావళిలో 1వ రామేశస్,2వ రామేశస్, 3వ రామేశస్ అంటూ 'రామ' శబ్దానికి సంబంధించిన రాజుల పేర్లు ఎన్నో ఉన్నాయి.

దక్షిణాఫ్రికా తూర్పుతీరాన మెడగాస్కర్ ద్వీపంలోని స్థలాల పేర్లు నూటికి 75 వంతుల సంస్కృతభాషకు చెందినవే. వాటిలో చాలా భాగం రామాయణ కథానాయకుడైన శ్రీరాముని పేరుతో సంబంధం కలవి.

‘సాగర’ - ‘సహారా’

ఉత్తర ఆఫ్రికాలో ‘సహారా డిజర్ట్’ అనే పేరుతో గొప్ప ఎడారి ఉన్నదని మనకు అందరికీ తెలుసు. ఎడారులన్నీ ఒకప్పుడు సముద్రాలనే సిద్ధాంతం ఉన్నది. ‘సాగర’ అన్నది సంస్కృత శబ్దం. ‘సాగర’ అన్న పదం భ్రష్టమై ‘సహారా’ కావడం అసంభవం కాదు. సహారా ప్రదేశం జలమయమై ఉన్న కాలంలో దాని చుట్టూ ఉన్న భూమి జనావాసంగా ఉండేదనీ, అచ్చట నివసించే ప్రజల పేర్లు సంస్కృతభాషకు సంబంధించినవేగాక, రామ శబ్దంతో కూడా జతపడి ఉండేవనీ చెప్పబడుతున్నది. (ఎన్ సైక్లోపీడియా బ్రిటానికా, 13 వ సంపుటం, శీర్షిక - సహారా).

మన భూగోళం అవతలి దిక్కున ఇట్టి సాక్ష్యాధారాలు కోకొల్లలు. మనకెంతో దూరంగా ఉన్న మెక్సికోలో ఇంచుమించు మన దసరా పండుగ సమయంలోనే, ఆ దేశస్థులు కూడా ఒక పండుగ జరుపుకుంటారు. ఆ పండుగపేరు ‘రామసీత’ (టి.డబ్ల్యు. యఫ్ గాన్ రచించిన "Maya Indians of Southern Yucation, North and British Honduras" - 24 పుట.)

ఇదొక్కటే కాదు. ఆ దేశంలో జరిగిన త్రవ్వకాలలో ఎన్నో ‘గణేశ’ విగ్రహాలు బయటపడ్డాయి. (బేరన్ హోమ్‌బోల్టు వ్రాసిన ఈ విషయాన్ని హరవిలాస్ శారదా ‘హిందూ సుపీరియారిటీ’ అనే గ్రంథంలో ఉదహరించారు). ప్రాచీనకాలంలో ఆ దేశంలో నివసించిన ప్రజల పేరు Astikas (ఆస్తికులు) అనగా వేద పారాయణంలో నమ్మకం కలవారు. లేక వేద ప్రామాణ్యాన్ని అంగీకరించేవారు. ఆ తెగకు చెందిన వారి పేరు ఈనాడు కూడా “అజ్‌టెక్సు”

.

దక్షిణ అమెరికా పశ్చిమభాగంలో ‘పెరూ’ లోని ప్రజలు సూర్యుని ఆరాధించేవారు. ‘ఇన్‌కాన్’ అని పిలవబడేవారు. ‘ఇన’ అనేది సంస్కృతంలో సూర్యునికి పర్యాయపదం. వారి ముఖ్యమైన పండుగలు అయనాంతంలో జరుగుతాయి. ( ఏషియాటిక్ రిసెర్చెస్, 1వ సంపుటం, 426 పుట.)

## కాలిఫోర్నియా కపిలారణ్యమా ?

ఈ విధంగా పరిశోధిస్తూ, పోతే, కాలిఫోర్నియాలోని అనేక ప్రదేశాల పేర్లకూ మన పురాణాలలో కనిపించే పేర్లకూ పోలికలు కొట్టవచ్చినట్టు కనిపిస్తాయి. కపిలముని శాపం వల్ల 60వేల మంది సగరచక్రవర్తి కుమారులు దగ్ధమై, బూడిద అయినారన్న కథ సుప్రసిద్ధం. వారి ఆత్మలను కాపాడేందుకు వారి వంశీయుడైన భగీరథుడు గంగను ఆకాశం నుంచి భూమికి కొనివచ్చాడని పురాణగాథ.

సగరుని కుమారులు వెతుక్కుంటూ వెళ్లిన గుర్రము పాతాళలోకంలో (Netherlands) కనిపించిందని మన పురాణం చెబుతున్నది. అమెరికా, భారత దేశాలు భూగోళం మీద ఒకదానికొకటి ఎదురెదురుగా ఉన్నవి. కాలిఫోర్నియా అన్నది 'కపిలారణ్యం' అనే పదానికి భ్రష్టరూపం అనుకోడం అంత పరిహాసాస్పదం కాదు. దానికి కొద్ది దూరంలోనే ఉన్నవి. "The Horse Island" , "The Ash Island" (హయద్వీపము, భస్మద్వీపము) అనేవి. మొదటిది సగర చక్రవర్తి గుర్రము పట్టుపడిన ప్రదేశమూ, రెండవది సగరుని అరవై వేలమంది కుమారులు శాపవశాన భస్మంగా మారిన స్థలమూ అనుకోవడం కూడా ఊహకు మించిన విషయం కాదు.

## ఆస్ట్రేలియాలో 'శివనాట్యం!'

స్పెన్సర్, గిలెన్ అను వారిరువురూ Native Tribes of Central Asia అనే పుస్తకం రచించారు. ఆ పుస్తకం 621 వ పుటలో ఆటవికజాతుల నాట్యాలు చిత్రించబడ్డాయి. ఆ నాట్యాలలో ఒకటి (శివనాట్యం). 1899 లో ఈ పుస్తకాన్ని మాక్మిలన్ కంపెనీ వారు ప్రచురించారు. జాగ్రత్తగా పరిశీలించి చూస్తే నాట్యం చేస్తున్న ఆ ఆటవికుల ముఖాలపై మూడవ నేత్రం చిత్రించబడ్డట్టు కనిపిస్తుంది. ఆస్ట్రేలియావంటి దూరదేశంలో సైతం ఆనాటి ప్రజలకు వైదికసంస్కృతిలో సంబంధం ఉండేదని దీనినిబట్టి తెలుస్తున్నది.

జావా, బోర్నియా వంటి దేశాల సంగతి ఇక అడగవలసిన పనే లేదు. ఆ దేశాల్లో హిందూసంస్కృతికి సంబంధించిన నిదర్శనాలు లెక్కలేనన్ని ఉన్నాయి. హిందూ సంస్కారాలకు, హిందువుల పూజా పునస్కారాలకు తార్కాణాలుగా చెప్పదగినవి జావాలో కావలసినన్ని. బోర్నియాలో మానవుడు ఎన్నడూ అడుగుపెట్టని ఒక అరణ్యం ఉన్నట్టు చాలాకాలంగా పాశ్చాత్య రచయితలు వ్రాస్తూ వచ్చారు. (వాలన్ వ్రాసిన "The Malay Archipelago). ఆ తర్వాత ఒక పరిశోధక బృందం ఆ అడవిలో ప్రవేశించి కొన్ని వందల మైళ్ళు ప్రయాణించగా, వారి కొక శిలాశాసనం దొరికింది. దానిపైన ఒక రాజు కొన్ని యజ్ఞయాగాదులు చేసినట్టు వ్రాయబడింది. (Yupa Inscriptions of Mulavarman of Koeti, Borneo.) ఒకానొకప్పుడు మన మత మొక్కటే సర్వప్రపంచ వ్యాప్తంగా ఉండేది అనడానికి పైన చెప్పిన వన్నీ తార్కాణాలు.

## సప్త ద్వీపాలు

పోతే, విశ్వాన్ని గురించి హిందువుల నమ్మకాలు ఎలాటివో తెలుసుకోనడం కూడా అవసరం. యావత్తు భూఖండం ఏడు ద్వీపాలుగా ఉన్నదని హిందువులు విశ్వసిస్తారు. శ్రీ ఆదిశంకర భగవత్పాదాచార్యులు తమ రచనలలో ఒక చోట “సప్త ద్వీపాచ మేదినీ” అని పేర్కొన్నారు.

ఈ సప్తద్వీపాలు ఒక్కొక్కటే కొన్ని వర్షాలుగా విభజింపబడ్డాయి. ఆ వర్షాలు మళ్ళా ‘ఖండాలుగా’ ఏర్పడ్డాయి. మనం నివసించే ఈ ఇండియా దేశం ‘భరత ఖండ’ మని మన పురాతన గ్రంథాలు చెబుతున్నాయి. భరతఖండం భరతవర్షంలో ఒక భాగం. ఆ భరతవర్షం జంబూద్వీపంలోది. మేరుపర్వతమన్నది సప్తద్వీపాలకు ఉత్తర దిక్కున ఉన్నదని మన గ్రంథాలు పేర్కొంటున్నాయి. అంతేకాదు, ప్రతి రెండు ద్వీపాలకు మధ్య సముద్రం ఉన్నదనీ, సూర్య చంద్రులు మేరువుచుట్టూ పరిభ్రమిస్తారని కూడా మన గ్రంథాలలో వ్రాయబడి ఉంది.

పై అభిప్రాయాలలో ఇమిడి ఉన్న వాస్తవం ఏమిటో మనం తెలుసుకుందాము. భూగోళశాస్త్రానికి సంబంధించిన పుస్తకాల ద్వారా భూమి గుండ్రంగా ఉన్నదని పాశ్చాత్యులు మనకు బోధిస్తారు. ఈ సత్యాన్ని ప్రప్రథమంగా పాశ్చాత్యులే మనకు తెలియజేశారని మనం భావిస్తాము. 'జాగ్రఫీ' అనే ఇంగ్లీషు మాటకు సంస్కృత పదం "భూగోళం." గోళమనే పదమే సూచిస్తుంది. భూమి గుండ్రంగా ఉన్నదని. భూమి వలయాకారంగా ఉన్నట్టు మన పూర్వీకులు విశ్వసించారని ఆ పదం వల్లనే మనకు తెలియడం లేదా ? మన ప్రాచీన గణితశాస్త్రాల్లో అంతటా, 'ఖగోళం', 'భూగోళం' అనే పదాలు ఉండడం కూడా దీనిని బలపరుస్తుంది. మన సంకల్ప మంత్రాలలో భూమిని 'బ్రహ్మాండం' అని చెబుతాము. 'అండం' అంటే గుడ్డు అని అర్థం. కొంచెం ఏటవాలుగా ఉన్నా గుడ్డు గుండ్రనిదే కదా !

భూమి యావత్తూ నిమ్మపండు ఆకారంలో ఉన్నదనీ, మేరువు (హిమాలయం) ఉత్తరం దిక్కును సూచించే శిఖరమనీ భావించే పక్షంలో మేరువు భూమికి ఉత్తర ధృవం అవుతుంది. అప్పుడు "సర్వేషామపి వర్షాణాం మేరు రుత్తరతః స్థితః" అన్న వాక్యం సార్థకమవుతుంది. తక్కిన భాగమంతా దానికి దక్షిణం అవుతుంది. శిఖరం మీద నిలుచున్న వ్యక్తి కంటికి, దాని చుట్టూ సూర్య చంద్రులు పరిభ్రమిస్తున్నట్టే కనిపిస్తారు. అనగా, సంవత్సరంలో ఎప్పుడు గానీ సూర్యుడు శిఖరానికీ ఒక పక్కగా ఉంటాడే తప్ప, పూర్తిగా నెత్తిమీదకి రాడు. మేరువు చుట్టూ సూర్యుడు తిరుగుతాడని మన శాస్త్రాలు చెప్పే మాటకు సరి అయిన అర్థం అది. కాబట్టి, ఆధునిక భూగోళ శాస్త్రజ్ఞులు కొత్తగా కనిపెట్టిన సిద్ధాంతాలు ఏవీ మన శాస్త్రాలకు విరుద్ధాలు కావు.

వర్తమాన భూగోళశాస్త్రకారులు భూమిని గురించి చెప్పే సూత్రాలు మన ప్రాచీన ఋష్యాదులకు తెలియనివి కావు. ఆర్యభట్టు, వరాహ మిహిర, అప్పయ్య దీక్షితుల రచనలలో కూడా వీటికి నిదర్శనా లున్నాయి.

ఈ ప్రపంచంలో మొట్టమొదటి వ్యాప్తి చెందిన మతం మనదేనని వీటి అన్నిటిమూలంగా మనకు రుజువు అవుతోంది. ఇతర మతాలన్నీ తరువాత పుట్టినవే.

సమగ్రమైన మన మతంలోని కొంత కొంత విజ్ఞానాన్ని గ్రహించి, అవి క్రమంగా వృద్ధి చెందాయి.

గర్వమూ, అహంకారమూ లేకుండా, కేవల సత్యాన్వేషణ బుద్ధితో, ప్రేమతో మన మీ విషయాలను ప్రచారం చేసే పక్షంలో ఇతర దేశాల వారందరూ ఈ సత్యాన్ని విశ్వసించవచ్చు.

## మనవు - ధర్మపన్నాలు

మనువు తానుగా ధర్మపన్నాలు చెప్పలేదు. తన కాలంలో ఉన్న ధర్మాలను ఆయన క్రోడీకరించాడు.

'ఆమనోర్వర్త్మా' మనుకాలం నుంచి వస్తూవున్న మార్గం. ఇది మనువు వేసిన బాటకాదు. సనాతన ధర్మానికి మనువు ఒక వక్త అంతే.

మన శాస్త్రాలను అర్థం చేసుకునే ప్రయత్నంలో గ్రంధకర్త ఎవరు, అతని కాలమేది అన్న ప్రశ్నలు అనవసరం.

# శ్రీ మద్దులపల్లి మాణిక్యశాస్త్రి అనుభవాలు

-శ్రీకుకునూరు శేషగిరిరావు

తర్క వేదాంతాచార్య శ్రీ మద్దులపల్లి మాణిక్యశాస్త్రిగారు విజయవాడలో 'సర్వతంత్ర స్వతంత్ర కళాశాల' లో తర్క వేదాంత శాస్త్ర పండితులుగా నియమింపబడినారు. ఆ సందర్భంలో , వేదాంత న్యాయరక్షామణి, భాట్టదీపిక (మీమాంస) అనే రెండు సంస్కృతగ్రంథాలు వారికి కావలసివచ్చాయి.

ఆ గ్రంథాలు రెంటినీ తమకు పంపవలసినదిగా విన్నవిస్తూ శాస్త్రిగారు కామకోటి పీఠాధిపతి శ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతిస్వామివారికి ఉత్తరం వ్రాశారు. స్వామివారు ఆ రెండు గ్రంధాలను పోస్టు ద్వారా ఉచితంగా శ్రీ శాస్త్రిగారికి అందజేశారు. అప్పటికి శ్రీస్వామివారికి శాస్త్రిగారితో స్వయంగా ఏ విధమైన పరిచయమూ లేదు.

కొంత కాలం గడిచింది. జగద్గురువులు కాళహస్తి మకాంలో ఉండగా, శ్రీ మాణిక్యశాస్త్రి స్వామి దర్శనానికై కాళహస్తి వెళ్ళి, సభలో దూరంగా కూర్చున్నారు. పూర్వ పరిచయం లేనప్పటికీ స్వామి "మాణిక్యశాస్త్రీ, మాణిక్యశాస్త్రీ" అని సంబోధిస్తూ శాస్త్రిగారిని దగ్గరకు పిలిచి, వారితో సంస్కృతంలో మాట్లాడి, సన్మానించి పంపారు.

మరొకప్పుడు దక్షిణాదిని గురువాయూరులో శ్రీ జయేంద్రసరస్వతిస్వామి ఛాతుర్మాస్య దీక్షలో ఉండగా, అక్కడ జరిగే శాస్త్రసభలకు శ్రీ మాణిక్య శాస్త్రిగారు పరీక్షాధికారిగా ఆహ్వానించబడ్డారు. శ్రీ శాస్త్రిగారు భార్యతో, శిష్యులతో ప్రయాణమై వెళ్లారు. ఆ సమయంలో అక్కడ, సమ్మె కారణంగా బస్సుల రాకపోకలు నిలిచిపోయినవి. శాస్త్రి దంపతులకు, వారి శిష్యులకూ గమ్యస్థానం చేరే మార్గం కనిపించలేదు. స్నానానుష్ఠానాదులకు కూడా వసతి లేకపోయింది. అంతట శ్రీ శాస్త్రిగారు మనస్సులో శ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతిస్వామిని నిండుభక్తితో ప్రార్థించారు. ఇంతలో ఎక్కడినుంచో ఒక బస్సు వచ్చి శ్రీ శాస్త్రి బృందం ఉన్నచోట ఆగింది. ఆ బస్సులో కొందరు పోలీసువారు మాత్రం ఉన్నారు. బస్సు కాలడీ

వెళుతున్నదనీ, రాదలచినవారు బస్సులో రావచ్చునని చెప్పి, శాస్త్రి ప్రభృతులను పోలీసులు బస్సులో ఎక్కించుకుని, వారిని గురువాయూరులో దింపి వెళ్లారు !

మరొకమారు శ్రీ మాణిక్యశాస్త్రిగారు అనారోగ్యంతో బాధపడుతూ స్వామివారిని తరచు స్మరించారు. శాస్త్రిగారికి స్వామి స్వప్నంలో దర్శన మిచ్చారు. స్వప్నంలో స్వామి ఆదేశించిన విధంగా శాస్త్రిగారు స్వామివారి పాదపంకజాలను తన హృదయపుండరీకమున అనుసంధానం చేయగా శ్రీ శాస్త్రిగారికి సంపూర్ణారోగ్యం చేకూరింది.

## “నిన్ననే కదా నీ సందేహాలు తీర్చను”

ఒకసారి గుంటూరు వాస్తవ్యులు, వేదాంతశాస్త్రపండితులు శ్రీ ఉప్పలూరి పున్నయ్యశాస్త్రిగారు శ్రీ స్వామివారిని సందర్శించి తమకు గల కొన్న సందేహాలను వారిచే నివారణ చేయించుకొన నుద్దేశించి, రైలులో ప్రయాణం చేశారు. మార్గమధ్యంలో నిద్రలో వారికొక స్వప్నం వచ్చింది. ఆ స్వప్నంలో శ్రీ శాస్త్రికి స్వామి దర్శనమిచ్చి, వారి సందేహాలను స్వప్నంలోనే నివారణ చేశారు. అయినా, శ్రీ శాస్త్రిగారు తన ప్రయాణం సాగించి, మరునాడు స్వామిని సందర్శించి, తన సందేహాలను స్వామికి వినిపించారు.

“నేను నిన్ననే కదా నీ సందేహాలకు సమాధానం చెప్పాను” అని స్వామి వారన్నారు!

## తీర్థ మివ్వని కారణం !

శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి స్వామివారు నెల్లూరు మకాంలో ఉండగా, ఒకనాడొక బ్రాహ్మణ స్త్రీ తీర్థం పుచ్చుకోడానికి వచ్చింది. స్వామి ఆమె ముఖం చూచి, “అమ్మా, నీవు మడిగాలేవు . మైలపడినావు. ఇంటికి వెళ్లమ్మా!” అన్నారు.

“స్వామి, నేను ఉతికి ఆరవేసిన మడి చీర కట్టుకుని వచ్చాను. చేత్తో మన్నీళ్లు కూడా పట్టుకు వచ్చాను” అన్నది ఆ భక్తురాలు.

అయినా, స్వామి ఆమెకు తీర్థం ఇవ్వలేదు. మరి, చేసే దేమీ లేక, విచారిస్తూ ఆమె ఇంటికి చేరింది.

ఆమె ఇంటికి వెళ్లేసరికి, గ్రామాంతరంలో ఉన్న ఆమె పెనిమిటి హఠాత్తుగా కాలం చేసినట్లు టెలిగ్రాం వచ్చింది !

## తర్కసహం కాదు

ఏసుక్రీస్తును లేదా మహమ్మదు ప్రవక్తను విశ్వసించేవారు మాత్రమే స్వర్గానికి పోతారనే సిద్ధాంతం యొక్క తార్కి కపరిణామం ‘వారి పుట్టుకకు పూర్వం జీవించిన వారెవ్వరూ మోక్షం పొందలేదు’ అనికాదా ? ఇది అంగీకారయోగ్యం కాగలదా ?

# స్వామి ఆశ్రిత కల్పవృక్షం

- శ్రీ పురాణం రామకృష్ణ శాస్త్రి

నాకు పుత్రసంతానం కలుగునట్లు అనుగ్రహించవలసినదిగా శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి శ్రీ చరణులను ఆశ్రయించాను. శ్రీవారు ఆశీర్వదిస్తూ సేతుస్నానం, నాగప్రతిష్ఠ మొదలైన కార్యక్రమాలను చేయవలసిందని ఆదేశించారు. 1963 ఫిబ్రవరి నెలలో కుటుంబసమేతంగా రామేశ్వరం బయలుదేరుతూ దారిలో పుదుక్కోట సమీపాన ఒక చిన్నగ్రామంలో మకాం చేస్తున్న స్వామివారి దర్శనం చేసుకుని, రామేశ్వరం నుంచి తిరిగి వచ్చేటప్పుడు మరల తమ దర్శనం అనుగ్రహించవలసిందని ప్రార్థించాను. శ్రీవారు 'తథైవ' అన్నారు.

15 రోజుల పాటు రామేశ్వరం వగైరా దక్షిణ దేశంలోని క్షేత్రాలను సందర్శించి, ఆపాటికి శ్రీస్వామివారు తంజావూరు సమీపంలో ఉండవచ్చు నని భావించి, తంజావూరువైపు ప్రయాణం సాగించాము. తంజావూరుకు 7 మైళ్ల దూరంలో రోడ్డు రెండుగా చీలింది. ఏదారిని వెడితే శ్రీవారున్న తావుకు వెళ్లగలమో రూఢిగా తెలియలేదు. ప్రదేశమంతా నిర్మానుష్యంగా వుండడంచేత, ఎవ్వరినీ అడగడానికైనా వీలుకాలేదు. కారు నిలుపుకుని, ఏమిచేయడానికి తోచక, శ్రీవారిని స్మరించసాగాను.

ఇంతలో ప్రక్కరోడ్డునుంచి పుదుక్కోటవైపు ఒక చిన్నకారు అతివేగంగా వెళ్లింది. ఆ కారు ఆపి, అందులో ఉన్నవారిని అడిగిన బాగుండేది కదా, అలాచేయకపోతినే అని చింతిస్తూ, స్వామిని స్మరిస్తూఉండగా, ఆశ్చర్యంగా ఆ చిన్నకారు వెనక్కు తిరిగి మా వద్దకు వచ్చింది. కారులో వున్న వ్యక్తి తన పేరు పి.కె.యన్. మణి అయ్యర్ అంటూ మాతో పరిచయం చేసుకొని "మీరు కంచిస్వామి వారు ఎక్కడ ఉన్నారో తెలుసుకోడానికై ఇక్కడ ఆగారా ?" అని మమ్ము అడిగారు. అవునని మేము చెప్పగానే ఆరాత్రి స్వామివారు పుదుక్కోటలో తమ

ఇంటికి దయచేస్తున్నారనిచెప్పి, తమ యింటికి మమ్మలనందరినీ ఆహ్వానించారు. వారితో కలిసి వెళ్లి శ్రీవారిదర్శనం చేసి ధన్యులమైనాము.

ఇది అద్భుతమైన సన్నివేశం! ఇది నా జన్మలో ఏనాటికీ మరవలేని దివ్యానుభూతి.

1965 లో నాకు స్వామివారి అనుగ్రహంవల్ల పుత్రసంతానం కలిగింది. స్వామివారు ఆశ్రిత కల్పవృక్షం !

## సత్యప్రకటనమే పాత్రికేయుల కర్తవ్యం

'హిందూ' పత్రిక భూతపూర్వసంపాదకులు, సుప్రసిద్ధ రాజ్యాంగవేత్తలు అయిన శ్రీ ఏ. రంగస్వామి అయ్యంగారితో శ్రీ చంద్ర శేఖరేంద్ర సరస్వతి స్వామి మాట్లాడుతూ పత్రికారచయితల కర్తవ్యాన్ని గురించి ఇలా అన్నారు.

"పత్రికారచయితలు, సంపాదకులు తమతమ వ్యాపార, వృత్తులను కాపాడుకుంటూ, భగవద్భక్తి కలవారై, తమ మనస్సాక్షి ప్రబోధాన్ని అనుసరించి ధర్మమార్గాన తమ కర్తవ్యాన్ని నిర్వర్తించాలి. సత్యాన్ని ప్రకటించడానికి వెనుకముందులు చూడకూడదు. ఎట్టిపరిస్థితులలోనూ సత్యాన్ని ప్రజలనుండి దాచకూడదు.

# ‘నన్ను నిజంగా గుర్తించావా ?’

- శ్రీ నుదురుమాటి వెంకటరమణశర్మ

శ్రీ చల్లాశేషాచల శర్మగారు కృష్ణాజిల్లా గురజాడ గ్రామవాసులు. వీరి ధర్మపత్ని సావిత్రమ్మగారు. శ్రీ శర్మగారి పూర్వులు శ్రీ విద్యోపాసకులు.

శర్మగారు ఉయ్యూరులో కె.సి.పి. షుగర్ ఫ్యాక్టరీలో కో ఆపరేటివ్ స్టోర్సులో బిజినెస్ మేనేజర్‌గా పనిచేస్తున్నారు. 1960లో శ్రీ శర్మగారు సకుటంబంగా కంచికి వెళ్లి, సమీపగ్రామమైన ‘అంబి’లో కామకోటిపీఠాధీశ్వరులు శ్రీ చంద్రశేఖరేంద్ర స్వామివారిని సందర్శించారు.

అంతకుపూర్వం శ్రీమతి సావిత్రమ్మ గారు చాలాకాలం నుండి అకారణంగానే మానసికంగా భయభ్రాంతి నొందుతుండేవారు. ఒకనాటి స్వప్నంలో ఆమెకొక యతీశ్వరులు దర్శనమిచ్చి, అభయముద్రను చూపి, అంతర్థానమైనారు. ఆ స్వామి ఎవ్వరో అంతకుపూర్వ ఆమెకు తెలియదు. నాటి నుండి ఆమెకు ఆ మానసిక భయం పోయింది. ‘అంబి’ గ్రామంలో తాను దర్శించిన కామకోటిపీఠాధిపతులే, లోగడ తాను స్వప్నంలో చూచిన యతీశ్వరుడుగా ఆమె గుర్తించి, ఆ విషయమంతా శ్రీవారికి నివేదించుకున్నది.

‘నన్ను నిజంగా గుర్తించావా?’ అంటూ శ్రీస్వామివారు చిరునవ్వుతో రెండు మూడు మారులు ఆమెను ప్రశ్నించారు. నాటి నుండి వీరి కుటుంబం శ్రీవారి చరణారవిందాల శరణు పొందింది. 1967-1968 ఆంధ్రదేశ పర్యటన సందర్భంగా శ్రీ స్వామివారు సపరివారంగా గురజాడ వచ్చి శ్రీ శర్మగారి ఇంటిలోనే నివసించారు.

1970 ప్రాంతంలో శ్రీ శేషాచలశర్మగారికి మశూచికం వచ్చి, జ్వరంతో చాలా బాధపడ్డారు. ఒకరోజు తీవ్రమైన బాధకు లోనై, శ్రీ స్వామి వారి చిత్రపటం ముందుంచుకొని శ్రీ లలితాసహస్రనామపారాయణ చేయవలసిందని భార్యతో చెపుతూ, అపస్మారక స్థితిని పొందారు. శర్మగారి శరీరం చలవలు కమ్మింది. బంధుమిత్రులంగా వచ్చి ఆందోళన

చెందారు. ఇంతలో చిత్తరువులో ఉన్న స్వామివారు నిజస్వరూపంతో బయటికి వచ్చి ఆ దంపతుల ననుగ్రహించారు. వెంటనే శ్రీ శర్మగారికి స్పృహ వచ్చింది. కొలది కాలంలోనే వారు సంపూర్ణ ఆరోగ్యవంతు లైనారు.

శ్రీ శర్మదంపతులు ఇలాంటి దివ్య విభూతుల నెన్నింటినో దర్శించారు.

## *క్రైస్తవమతంలో జన్మ ఒక్కటే*

క్రైస్తవమతం పాపానికి, దుఃఖానికీ కార్యకారణ సంబంధాన్ని ప్రతిపాదించదు. అందరూ పాపులే అని, క్రీస్తును నమ్మడం ద్వారా వారు తమ పాపాలను క్షాళనం చేసుకొనవచ్చుననీ ఆ మతం చెబుతున్నది.

క్రైస్తవ మతం ప్రకారం జన్మ ఒక్కటే మానవులకు లభించింది. ఈ జన్మలో ముక్తివస్తే వచ్చినట్టు, లేకపోతే అధోగతే. పూర్వ జన్మగాని, పునర్జన్మగాని లేవు.

# ప్రస్తుతులు

*"అపర శంకరులు"*

కంచికామకోటిపీఠాధిపతులు శ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతీస్వాములవారు దివ్యజ్ఞాన సంపన్నులు. భూతభవిష్యద్వర్తమానజ్ఞులు. విజ్ఞులు. అపరశంకర స్వాములు. ఒకప్పుడు నా అకాలమృత్యువును పోగొట్టినవారు. వారికి నేను ప్రత్యహము వ్యాసునకు వలె మానసికారాధనను చేస్తూ ఉంటాను. వారి పాదయుగ్మం సర్వదా నా శీర్షాన ధరిస్తాను.

*కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి*

## "నిరంతర సిద్ధులు"

శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతీస్వామివారు నిరంతర సిద్ధులు. జగత్ప్రసిద్ధులు. జగత్కుటుంబులు. కంచికామకోటిపీఠాధ్యక్షులు. వారి ప్రవర్తన మనం అర్థం చేసికోడం కష్టం.

శ్రీ స్వామివారు రామకృష్ణాద్యవతారములవలె, ఆదిశంకరుల వలె అపూర్వమైన తెజోవిశేషమని నేను నమ్ముతున్నాను.

ఇది నా సంగృహీతమైన అభిప్రాయము.

*శ్రీ తాడేపల్లి రాఘవనారాయణ శాస్త్రి*

## "స్వామి జీవిస్తున్న కాలంలోవున్న మనం ధన్యులం"

మనలను కటాక్షించడానికి స్వామి మన దగ్గరే రానక్కరలేదు. కోటానుకోట్ల మైళ్ల దూరంలో ఉన్న సూర్యుడు కమలాన్ని వికసింపచెయ్యడా? అలాగే స్వామికూడా.

రాముడూ, కృష్ణుడూ జన్మించిన కాలంలో జీవించినవారు పుణ్యాత్ములంటారు. అలాగే, స్వామి జీవిస్తూ ఉన్న ఈ కాలంలో ఉన్న మనమంతా ధన్యులం!

*- శ్రీ కృపానంద వారియర్*

"బహుముఖులు"

శ్రీ చరణులు చమత్కృతి ప్రధాన సంభాషణచతురులుగా, చారిత్రక పరిశోధకులుగా, వివిధభాషాతత్వవిదులుగా, న్యాయవేత్తగా, రాజకీయ విశారదులుగా, విమర్శకులుగా, సాహితీవేత్తగా, మహోపాసకులుగా, మంత్రశాస్త్ర మర్మజ్ఞులుగా, యోగీశ్వరులుగా, ధర్మదేవతగా, ఆధ్యాత్మవిదులుగా, దేశికులుగా, ఆప్తబంధువులుగా, వాచంయమిగా, - వివిధ రూపాలతో గోచరిస్తూ ఉంటారు.

*- శ్రీ హరి సాంబశివ శాస్త్రి*

"స్వామి అనుగ్రహమహత్త్వం అపారం"

స్వామి కరుణా విశేషం వలన అనిర్వాచ్యానుభవం పొందాము.

వారి చూపుతో జీవుని అహంకార బంధాలు తొలగినవి. వారి కన్నుల యందలి ఆత్మచైతన్యమే మాలో భాసించింది. ఈ చర్మచక్షువులతో అనిర్వచనీయమైన ఆ సౌందర్యం దర్శించడానికి సాధ్యమవుతుందా? ...వారి అనుగ్రహ మహత్త్వ మపారం.

*- గ్రీసురాణిమాత రాణీ ఫ్రెడరికా*

"అందరి సమిష్టి రూపమే స్వామి"

వయోధికుడైన ఈ వ్యక్తి ఎవరు? ఈయన కొక పేరూ, ఊరూ, ఉండవచ్చు. ఈయన వయస్సు ఇంత అని మనం లెక్కకట్టవచ్చు. కాని, ఆయన అందరి సమిష్టి రూపంగా కనిపిస్తున్నారు. ఇక, ఆయన వయస్సా? మనిషి ఏనాటి నుండి భావనాకాశంలో విహరించడం ఆరంభించాడో, అప్పటినుంచి గణించాలి ఆయన వయస్సును. తన విశ్వాసం కొరకై సర్వమూ త్యజించిన త్యాగధనుడాయన!"

*- డాక్టర్ ఆల్బర్టు బి. ఫ్రాంక్లిన్ (అమెరికా కాన్సల్ జనరల్)*

### "ఏమా వశీకరణశక్తి!"

స్వామి ప్రశాంతత, ఆయన నవ్వూ నన్ను ఆకర్షించాయి. అట్టి అమాయకమైన నవ్వును నా జీవితంలో నే నెన్నడూ చూచి ఎరుగను. ఆ నవ్వులో ఏదో సమ్మోహనం, ఏదో ప్రేమశక్తి ఓతప్రోతంగా ఉన్నాయి.

ఆయన ముఖమండలంలో ఒక దైవత్వం స్ఫురిస్తుంది. అఖండమైన జాలీ, అనురాగమూ ఉట్టిపడే ఏసుక్రీస్తు ముఖాన్ని చిత్రాల్లో చూచి ఆశ్చర్యపడ్డాను. కాని, ఈ వశీకరణశక్తి వాటిలో ఉన్నదా.

స్వామి పెదవులపై ఒక చిరునవ్వు మొలిచింది. దానితో ఆయన ముఖం శిశువదనంగా మారింది. ఆ మందస్మితం ఇంతవరకు నే నెక్కడా చూడలేదు. అసాధారణమైన మాధుర్యం, ఆ సమ్మోహనం ఏమని చెప్పగలను?

వర్తమానకాలంలో ఆధ్యాత్మికమార్గంలో కామకోటిపీఠాధీశ్వరుని ప్రభావం అనుపమానం.

*- ఆర్థర్ కోయిస్లర్.* *Lotus and the Robot* *'గ్రంథకర్త'*

### "మానవులలో మహోన్నతులు"

మనదేశంలో జన్మించిన ఎందరో మహాపురుషులను గురించీ, జ్ఞానులూ, భక్తులూ, సిద్ధులను గురించీ మనం విన్నాము. చదివాము. కాని, అట్టి మహనీయులు ఒకప్పుడు జీవించి ఉన్నారని నేటి ఆధునికులలో అనేకులు నమ్మరు. మనం విన్నవీ, మనం చదివినవీ అతిశయోక్తులనీ, కల్పనాకథలనీ వారు భావిస్తారు.

అయితే, అట్టి మహానుభావులు మనదేశంలో జన్మించారని రుజువు కావాలంటే,

ఆదిశంకరులు స్థాపించిన కంచికామకోటిపీఠంలోని 68వ ఆచార్య పురుషులు, అదృష్టవశంచే మన కళ్ల ఎదట నేడు ప్రత్యక్షంగా కానవస్తున్న శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీస్వామివారిని చూడవచ్చు.

ఈ కాలంలో మన మతానికి వాటిల్లుతున్న ప్రమాదం పరమతాల వల్లకాదు. హిందూమతంలో ఉన్న వివిధ శాఖల వల్లనూ కాదు. పాశ్చాత్యనాగరికతా వ్యామోహితులై, భారతీయసంస్కృతిని కోలుపోయి, అవిశ్వాసంతో సతమతమవుతున్న ఈనాటి యువతరం కారణంగానే ఈ ప్రమాదం సంభవిస్తున్నది.

ఇంకా సర్వవ్యాప్తం కాకుండా ఈ ఆపదను అరికట్టి, ఆధునికసంఘాన్ని సక్రమపథంలో సంస్కరించి, వేదమతాన్ని పునరుద్ధరించడానికై పరమేశ్వరుడు ఆదిశంకరులను మరొక రూపంలో - శ్రీ కామకోటిపీఠం అరవైఎనిమిదవ ఆచార్యుని రూపంలో - అవతరింపచేశారనడానికి అనుమానం లేదు.

ఈ మహనీయుడు నేటి మానవులలో మహోన్నతుడు.

*- టి.యం.నారాయణ స్వామి పిళ్లై*

*(అన్నామలై విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు)*

# మాయ - బ్రహ్మ

*ఆంగ్లమూలం: జగద్గురు శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి*

*అనువాదకర్త - డాక్టర్ రాణీరామకృష్ణ*

“బ్రహ్మ సత్యం జగన్మిథ్యా జీవోబ్రహ్మైవ నాపరః” అని శ్రీ మచ్ఛంకరభగవత్పాదులు గిరిరూపములగు వేదములయొక్క ఉపనిషచ్ఛిఖరముల నుంచి మానవాళి

నుద్దేశించి ఉద్ఘోషించిరి. సామాన్యజనానీకములో, కొంతవరకు విద్యావంతులలో కూడా, ఒక అపప్రథ గలదు. అది యేమనగా "జగత్తు మిథ్య", "జగత్తు అసత్తు" అనునవి అనర్థాంతరములని. ఇది సత్యము కాదు. అటులనే "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అనువాక్యంలోని "ఏక" పదమునకు ప్రత్యేకమైన అర్థము గలదు. "అసత్తు" అను పదము శూన్యాపరపర్యాయము. కాగా "మిథ్య" అను పదము ఆరోప్యము తత్త్వము కాదనియు, అధిష్ఠానము మాత్రమే వస్తుతత్త్వమనియు తెలుపును. ఈ శాస్త్రీయమైన పదములను వివేకపూర్వకముగా తెలుసుకొనుటకు గణితశాస్త్రము సహకరించును. అయితే, ఈనాడొక చిత్రమగు పరిస్థితి గోచరించును. ప్రాచీనపండితులకు గణితము బహుదూరము. ఆధునిక విద్యావంతులకు వేదాన్తమన్న తలకెక్కదు. శ్రీ కామకోటి పరమాచార్యులు రచించిన "మాయ-బ్రహ్మ" అను వ్యాసము వీరిద్దరికి కూడా కనువిప్పు.

హిందూ దేశములోని గణితశాస్త్ర మహాపండితులలో ఒకడైన భాస్కరాచార్యుడు "బీజగణితము" అను తన గ్రంథంలో ఇట్లా వ్రాశాడు.

వధాదౌ వియత్ఖస్య ఖం ఖేన ఘాతే
ఖహారో భవేత్ఖేన భక్తస్య రాశిః ।
అస్మిన్వికారః ఖహారే న రాశా
వపి ప్రవిష్టేష్వపి నిః సృతేషు ॥
బహుష్వపి స్యాల్లయ సృష్టికాలే -
ఽనన్తేఽ చ్యుతే భూతగణేషు యద్వత్ ॥

ఈ శ్లోకమునకు అర్థమేమన-

" ఏ సంఖ్యనైనను శూన్యముతో గుణించిన శూన్యము అగును. శూన్యమును ఏ సంఖ్యతో భాగించినను శూన్యము వచ్చును. కాని ఏ సంఖ్యనైనను శూన్యముతో భాగించినచో వచ్చునది 'ఖహారము' (లేక అనంతము) అనబడును. ఈ ఖహారము

నుండి ఏదేని పరిమితసంఖ్యను తీసివేసినను, కలిపినను, దాని విలువ మారదు. ఈ ఖహారము అనంతము, అద్వితీయము అగు పరబ్రహ్మము వంటిది. బ్రహ్మము కూడ భూతసృష్టివలన గాని, లయమువలన గాని మార్పు చెందదు."

ఈ పై శ్లోకములో భాస్కారాచార్యుడు గణితశాస్త్రానుసారము అద్వైతమును నిరూపించెను. ఏ సంఖ్యనైనను శూన్యముతో భాగించగా వచ్చునది ఖహారమనియు, దీనికి ఏ పరిమిత సంఖ్యను కలిపినను దాని విలువ పెరగదనియు, తీసివేసినచో దాని విలువ తగ్గదనియు భాస్కరుడు చెప్పెను. అనంతమునకు అనంతము కలిపినను అనంతమే వచ్చును.

అ: 1 + 2 + 3 + 4 +..... అనంతము వరకు కూడిన, విలువ అనంతమగును.

ఆ: 1 + 1 + 1 + 1 + 1..... అనంతము వరకు కూడిన, విలువ అనంతమగును.

అ + ఆ: 1 + 2 + 3 + 4 + 5 ..... అనంతము వరకు కూడిన, విలువ అనంతమగును.

ఈ విధంగా ప్రలయములో పరిమితమైన లేక అపరిమితమైన వస్తువులు వచ్చిచేరినను, పరబ్రహ్మము ఎట్టి మార్పులేకయే ఉండును. కనుక బ్రహ్మమునందు ప్రవేశించు త్వంపదవాచ్యమగు ప్రపంచము బ్రహ్మమే యగును. ఏలయన - ప్రపంచము వలన బ్రహ్మము యొక్క మూలస్వరూపము నందు తరుగుదలగాని, పెరుగుదల గాని లేదు. దేనివలన మూలవస్తువు యొక్క విలువ లేక పరిమాణములో పెరుగుదల లేక తరుగుదల ఉండదో, అది శూన్యముగాని, మాయ (అతిస్వల్పమైన విలువ) గాని అయి ఉండవలెను. భాస్కరుడు చెప్పిన శూన్యం బౌద్ధులచే అంగీకరింపబడిన శూన్యం కాదు. భాస్కరుని శూన్యమే అద్వైతుల మాయ.

బౌద్ధుల శూన్యము శశవిషాణము లేక వంధ్యాపుత్రుని వంటిది. అట్టి శూన్యమునకు గణితములో ప్రవేశములేదని గణితశాస్త్రజ్ఞుల అభిప్రాయము.

భాస్కరుని శూన్యమనగా $\frac{1}{n}$ $(n \to \infty)$ ఇచ్చట $\frac{1}{n}$ కు ముందు Lt (అవధిని

సూచించే గుర్తు) అను గుర్తు ఉండదు. ఏలయన - $\text{Lt}\ (n \to \infty)\ \frac{1}{n}$ అనగా శూన్యము ( 4 - 4 = 0 వంటిది) అగును. కాని $\frac{1}{n}\ (n \to \infty)$ అభావరూపము కాదు. అభావరూపము. దాని విలువ మాత్రము అతిస్వల్పము. ఇట్టిదియే మాయ కూడా. కనుక భాస్కరుని 'ఖహారము' $\frac{1}{n}\ (n \to \infty)$ కాని, $1 \times n\ (n \to \infty)$ కాని అగును. కనుక బ్రహ్మము ఒక అవధి మాత్రమే.

కేనోపనిషత్తు పరబ్రహ్మమును గూర్చి ఇట్లు చెప్పును.

"నాహం మన్యే సువేదేది నో నవేదేతి వేద చ।

యోన స్తద్వేద తద్వేద నో నవేదేతి వేద చ।। "

"నాకు తెలియునని నేను భావించుట లేదు. నాకు తెలియదని కూడా నాకు తెలియదు. మనలో ఎవనికి తెలియునో, అతనికి తెలియును. ఎవనికి తెలియదో, అతనికి తెలియదు."

"యస్యా మతం తస్య మతం, మతం యస్య నవేదనః

అవిజ్ఞాతం విజానతాం విజ్ఞాత మనిజానతామ్।।"

"పరబ్రహ్మ తెలియుటకు శక్యముకానిది అని అర్థము చేసుకున్నవాడు దానిని తెలుసుకున్నవాడే యగును. నేను బ్రహ్మను తెలుసుకొంటిని అని భావించువానికి అది తెలియదు. బ్రహ్మ, జ్ఞానవిషయం కాదని బ్రహ్మజ్ఞానుల అభిప్రాయము. బ్రహ్మ, జ్ఞానవిషయమే అని అజ్ఞానులు తలంతురు."

గణిత శాస్త్రమునకు చెందిన ఒక దృష్టాంతము ద్వారా పైన చెప్పిన శ్రుతి వాక్యముల భావము సులభముగా తెలియనగును. ఒక వ్యక్తి అనంతము నాకు తెలియునని చెప్ప ననుకొనుడు. అతనికి అది తెలియలే దన్నమాట. అనంతము తెలియుటకు సాధ్యముకానిది అని అతడు చెప్పినచో, అతనికి అది తెలిసినట్లే. ఓంకారము పరబ్రహ్మకు ఒక చక్కని శబ్దప్రతీక. అటులనే అనంతము గణితశాస్త్రమునకు చెందిన పరబ్రహ్మ ప్రతీక.

భాస్కరుడు ఇట్లు చెప్పెను.

ఏదేని సంఖ్య x శూన్యము = శూన్యము.

ఏదేని సంఖ్య ÷ శూన్యము = ఖహారము (అనంతము)

ఈ రెండు వాక్యములు వేర్వేరుగా కనబడినను, ఒకే అద్వైతసిద్ధాంతసత్యమును ప్రతిపాదించుచున్నవి. ఈ రెండు గణిత సూత్రములను అద్వైతపరముగా ఇట్లు వ్యాఖ్యానించవచ్చును.

$a / _{\Delta} a = {}_{\infty}$ లేక $a = {}_{\infty}\ x\ _{\Delta} a$

అనగా అనంతము (పరబ్రహ్మ) శూన్యము x( ఖ లేక మాయ) = పరిచ్ఛిన్న ప్రపంచము.

'a' అను పరిచ్ఛిన్నసంఖ్య వినూత్నమైనది ఏమియు కాదు. అది 'ఖహారము' యొక్క అనంతమైన విలువలో అతర్భాగము మాత్రవే. అటులనే బ్రహ్మము నుండి మాయాసంబంధము వలన ఆవిర్భవించిన పరిచ్ఛిన్న ప్రపంచము యధార్థముగా సత్యరూపమగు పరబ్రహ్మము కంటె భిన్నముకాదు. కనుకనే భాస్కరుడు తన ఖహారమును అనంతము అచ్యుతమునగు పరబ్రహ్మముతో పోల్చెను. ఏలయన - పరబ్రహ్మ భూతసృష్టి వలనగాని, అనంతభూతగుణములు తనయందు లీనమగుట వలనగాని, మార్పుచెందదు.

బ్రహ్మము (సత్), 'ఏకము', అని శ్రుతులయందు పదేపదే చెప్పబడును. ఈ 'ఏకము' సంఖ్యలలో 2లో సగము, 4లో నాల్గవ వంతు అయిన '1' కాదు. ఏ అనంతమునందు పరిచ్ఛిన్నసంఖ్య లన్నియు లయమగునో ఆ అనంతము ఈ ఏకపదమున కర్థము. భాస్కరుడు 'లీలావతి'లోని అంతిమశ్లోకమునందు పరబ్రహ్మనిట్లు వర్ణించెను.

'అష్టావ్యాకరణాని షట్ భిషజాం వ్యాచష్ట తాస్సంహితాః
షట్ తర్కాన్ గణితాని పంచ చతుర్వేదాన ధీ తే స్మయః।
రత్నానాం త్రితయం ద్వయం చ బుబుధే మీమాంస యోరంతరం
సద్బ్రహ్మైక మగాధ బోధ మహిమా సో ऽస్యాః కవి ర్భాస్కరః॥'

బీజగణితంలోని 11వ శ్లోకంలో పరబ్రహ్మనే 'అనంత' 'అచ్యుత' అనే పేర్లతో పేర్కొనెను. అందుచేత బ్రహ్మకు చెప్పిన ఈ 'ఏకత్వం' '1' అనే సంఖ్యలోని ఏకత్వం కాదు. ఇది గణితశాస్త్రంలోని అనంతము లేక అద్వైతము.

గమనిక అనంతము (ఖహారము)

అనంతము x 0 = 2 లేక ఏదేని సంఖ్య.

బ్రహ్మ x మాయ = పరిచ్ఛిన్న ప్రపంచము.

## రాజ్యాంగమా, ధర్మశాస్త్రమా?

అస్పృశ్యతానివారణ విషయమై 1927లో మహాత్మాగాంధి, కామకోటి శంకరాచార్యులకు జరిగిన రహస్య సంభాషణలలో స్వామివారు వెల్లడించిన అభిప్రాయాల దృష్ట్యా, అమెరికా దేశస్థుడు డాక్టర్ ఎల్డర్ అడిగిన ప్రశ్నలకు ప్రస్తుత దేశపరిస్థితులలో భారతపౌరుల కర్తవ్యాన్ని గురించి స్వామి చెప్పిన సమాధానం గమనించవలసి ఉన్నది.

అమెరికాలోని విస్కాన్సిస్ విశ్వవిద్యాలయంలో సాంఘికశాస్త్ర పండితుడు డాక్టరు జె.డబ్లియు. ఎల్డర్ అడిగిన ప్రశ్నలకు సమాధానం చెపుతూ శ్రీ కామకోటి పరమాచార్యులు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి స్వామివారు భారతదేశం లౌకిక (సెక్యులర్) రాజ్యంగ విధానాన్ని అవలంబించినన కారణాన, హిందూధర్మశాస్త్రానికీ రాజ్యంగ చట్టానికీ వైరుధ్యం సంభవించినప్పుడు రాజ్యంగచట్టమే అనుసరణీయం కాగలదని అంగీకరించారు.

డాక్టర్ ఎల్డర్ : హిందూ ధర్మశాస్త్రాలలో నిర్వచించబడిన విధినిషేధాలను నేటి ప్రభుత్వ ప్రతినిధులు కూడా అనుసరించవలెనని మీ అభిప్రాయమా?

కంచిస్వామి : ప్రస్తుతం భారతదేశం మతప్రమేయం లేని లౌకిక (సెక్యులర్) విధానాన్ని అవలంబిస్తున్నది. పూర్వపు ధర్మశాస్త్రాలను నేటి ప్రభుత్వాలు అమలు జరపడం సాధ్యం కాదు. అందుచేత, ధర్మశాస్త్రాలలోని విధినిషేధాలను గురించి ప్రజలలో ప్రచారం

చెయ్యవలసిన బాధ్యతను మతసంస్థలు వహించవలసి ఉన్నది. తద్వారా, శాసన సభలలో ప్రవేశించి ప్రభుత్వాలను ఏర్పాటు చేసే ప్రజా ప్రతినిధులు హిందూధర్మశాస్త్రాలలోని నియమ నిబంధనలను గుర్తించగలుగుతారు. నేడు ప్రభుత్వంలో ఉండే నాయకులు ఈ నియమాలను పట్టించుకొనడం లేదు. కాబట్టి, ప్రజల నైతిక, పారమార్థిక అభివృద్ధిని పెంపొందించే బాధ్యత మతసంస్థల మీదా, మతప్రమేయం గల పెద్దల మీదా ఆధారపడి ఉన్నది.

డా. ఎల్డర్ : అలా అయితే, భారతదేశంలోని రాజకీయనాయకులు శాస్త్ర విధులకు అనుగుణంగా నడుచుకోవాలి. శాస్త్రాలలో పరస్పర వైరుధ్యాలు కన్పించినప్పుఉ ధర్మశాస్త్రాన్ని అనుసరించాలి. ధర్మ శాస్త్రానికీ, రాజ్యాంగానికి వైరుధ్యం ఉన్నప్పుడు రాజ్యాంగాన్ని అనుసరించాలి. దీనిని బట్టి, చివరకు భారతరాజ్యాంగమే పాలకులకు అనుసరణీయం కాలేదా?

కంచిస్వామి : ఔను, నేటి పరిస్థితులలో రాజ్యాంగమే దేశనాయకులకు అనుసరణీయం.

## *వేదాలు - పురాణాలు*

ఇతిహాస పురాణాలను పరిశీలించే వేదార్థం తెలుసుకోవాలి. ఇతిహాస పురాణాల పరిజ్ఞానం లేకుండా ఎవరైనా వేదానికి అర్థం చెప్పడానికి పూనుకుంటే అతడిని చూచి వేదాలు వణికిపోతాయుట. ఎందుకంటే, అతడు అల్పజ్ఞుడు గనుక వేదార్థాలను తన అల్పమైన ఎరికలోనికి తెచ్చి ముడిపెడతాడని వేదాల భయమట!

# గాంధి - స్వామి గోష్ఠి

ఆరు దశాబ్దాల కిందటిమాట. 1927లో దక్షిణ భారతంలోని నెల్లిచెరి అనే గ్రామంలో మహాత్మగాంధి, కామకోటి పీఠాధిపతి శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి స్వామిని దర్శించారు. అస్పృస్యత, అహింస, ఆర్ష సంస్కృతులను గురించి మహనీయులిరువురూ ఏకాంతంగా ముచ్చటించుకున్నారు. అయితే, ఇంతవరకు ఆ గోష్ఠి వివరాలు లోకానికి వెల్లడి కాలేదు.

సత్యం లోకానికి తెలియడం అవసరమన్న దృష్ట్యా గోష్ఠి వివరాలను బహిరంగ పరచవలసిందని కంచిస్వామి వారిని పలుమారులు నేను ప్రార్థించాను.

తలవని తలంపుగా సంభవించిన కొన్ని సంఘటనల ఫలితంగా, చివరకు స్వామి నా ప్రార్ధనను మన్నించి తమ సంభాషణలను వెల్లడించారు.

ముందు పేజీలలో పూర్తి వివరణ చూడగలరు.

- నీలంరాజు వెంకట శేషయ్య

# గాంధి - స్వామి రహస్య గోష్ఠి

నా విద్యార్థి దశలో నేను చదువుకు స్వస్తి చెప్పడానికి మహాత్మగాంధి బోధలు కారణం. గాంధీజీ ప్రబోధించిన విద్యాలయ, న్యాయస్థాన, శాసనసభా బహిష్కరణోద్యమ ప్రభావం చేత చదువు మానివేసి, స్వాతంత్ర్య సంరంభంలో పాల్గొన్నాను. అమూలంగా, రాజకీయాల్లో మహాత్ముడు నాకు నాయకుడేగాక, గురువైనాడు.

యావద్భారతం మహాత్మగాంధిని ఏకైక నాయకునిగా, స్వాతంత్ర్యప్రదాతగా, ఎట్టకేలకు జాతిపితగా పరిగణించింది. గాంధీజీ కేవలం రాజ్యంగవేత్త మాత్రమే కాడు. ఆధ్యాత్మిక దృక్పథం గల దేశనాయకుడు. రాజకీయరంగంలో నైతిక సూత్రాలనూ, ఆధ్యాత్మిక సిద్ధాంతాలనూ ప్రవేశపెట్టిన నవీనప్రవక్త. ఆయన రామభక్తీ, రామరాజ్య ప్రసక్తీ, సత్యాహింసలూ, సాత్వికనిరోధాలూ నన్నెంతో ఆకర్షించాయి.

అందుచేత చాలాకాలం వరకు మహాత్మగాంధీనే నేను నా జీవితానికి మార్గదర్శకునిగా భావించాను. సాధ్యమైనంత వరకు ఆయన సిద్ధాంతాలకు అనుగుణంగా జీవితం మలచుకోడానికి యత్నించాను.

కాని, యాభై సంవత్సరాలు పైబడిన తరువాత నా జీవితలో మరొక మహనీయుడు చోటు చేసుకున్నాడు. ఆయన కంచికామకోటిపీఠాధిపతి, శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి. ఆదిశంకరుల పరంపరలో ఆ పీఠానికి అరవై ఎనిమిదవ ఆచార్య పురుషుడు. నేటి పరమాచార్యులు.

దాదాపు మూడు దశాబ్దాల కిందట మొదటిసారి నేనీ స్వామిని దర్శించినప్పుడు "గాంధీ అనుయాయుణ్ణి" అంటూ నన్ను స్వామికి పరిచయం చేసుకున్నాను. గత ముప్ఫయి సంవత్సరాల్లో స్వామితో నాకేర్పడిన గురుశిష్యసంబంధం మరింత ప్రగాఢమైంది.

******

సుమారు 60 సంవత్సరాలకు పూర్వం 1927లో దక్షిణ భారతదేశంలో, పాలఘాట్ జిల్లాకు చెందిన నెల్లిచెరి అనే గ్రామంలో ఈ మహాపురుషులు ఇరువురి మధ్య ఒక రహస్య సమావేశం జరిగింది. పత్రికాప్రతినిధులెవ్వరూ దానికి హాజరుకాలేదు. గాంధిగారి ననుసరించి వెళ్ళిన శ్రీ చక్రవర్తుల రాజగోపాలాచారి (రాజాజీ) గానీ, స్వామివారి శిష్యులు గానీ, ఆ మహనీయుల సంభాషణను ఆలకించే అవకాశం కలగలేదు.*

** స్వామి, గాంధీజీల సంభాషణ ఏకాంతంగా జరిగిందని పత్రికలన్నీ ప్రకటించాయి. అది రహస్య సమావేశమని గాంధిగారన్నారు. అన్నిటిని మించి, ఆ సంభాషణ జరిగినప్పుడు 'గాంధిగారూ, నేను ఇద్దరమే తప్ప*

*వేరెవ్వరూలేరని' శ్రీ స్వామి వారు నాతో విస్పష్టంగా, అసందిగ్ధంగా చెప్పారు. 'కంచిఋషి' అనే పేరుతో కంచిస్వామివారి జీవిత చరిత్రను వ్రాసిన శ్రీ డా. టి.యం.పి. మహాదేవన్‌గారు కూడా కంచిస్వామి - గాంధీజీల రహస్య గోష్ఠిలో ఇతరులెవ్వరూ ఉన్నట్లు వ్రాయలేదు.*

*"శ్రీ రాజగోపాలాచారి గారితోపాటు కొద్దిమంది మాత్రమే ఆ సమవేశానికి హాజరైనారు" అన్న విషయం వాస్తవ మనడానికి తగిన ఆధారాలు లేవు.*

అస్తమానం వరకు గోష్ఠి సాగింది. సూర్యాస్తమయం లోపల సాయంకాలపు భోజనం ముగించడం గాంధీగారికి అలవాటు. అందుచేత, అంతవరకు వెలుపల ఒంటరిగా కూర్చున్న శ్రీ రాజాజీ లోపలికి వచ్చి "మీ సాయంత్రం భోజనం వేళ సమీపించింది" అంటూ గాంధీగారికి జ్ఞాపకం చేశారు.

"ఇప్పుడు స్వామివారితో జరిగిన ఈ సంభాషణే నా సాయంకాలపు భోజనం" అని సమాధానం చెప్పారు గాంధీజీ.

మహాత్మాగాంధి, కామకోటి శంకరాచార్యస్వామి, ఉభయులలో మొదటి వారు దేశస్వాతంత్ర్య సముపార్జనకు మూలపురుషులు. రెండవవ్యక్తి సనాతన హిందూ సంప్రదాయానికి చెందిన జగద్గురువు. ఈ యిరువురి మధ్య జరిగిన సమావేశం యావద్భారతజాతికి సంబంధించిన విషయమే గాని, వ్యక్తిగతం కాదు. ఆ హేతువు చేత, అంతవరకు లోకానికి వెల్లడిగాని ఆ యిరువురు మహామహుల సంబాషణను సవివరంగా తెలుసుకుందామన్న కోరిక, పత్రికారచయితనైన నాకు కలగడంలో ఆశ్చర్యం లేదు.

అయితే, దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన స్వల్పకాలంలోనే దురదృష్టవశాత్తు, గాంధీజీ పరమపదించారు. ఇక ఈ విషయమై మాట్లాడగలవారూ, వివరాలను బహిర్గతం చేయజాలినవారూ, స్వామి ఒక్కరే.

1967లో కంచిస్వాములు ఆంధ్రదేశపర్యటన సందర్భంగా విజయవాడ విచ్చేశారు. అప్పుడు 'ఆంధ్ర ప్రభ'కు ఎడిటరుగా ఉన్న నేను స్వామికి ఇలా విన్నవించాను. "స్వామీ, 1927లో మహాత్మగాంధీకీ, తమకూ నెల్లిచెరి గ్రామంలో జరిగిన సంభాషణ వివరాలు

ఇంతవరకు ఏ పత్రికలో, ఏ పుస్తకంలో ఎక్కడా వెల్లడికాలేదు. ఏ నాయకుడూ వాటిని బయట పెట్టలేదు. ఇంతకాలం అతి గోప్యంగా ఉంచిన ఆ సంభాషణ వివరాలు తెలుసుకోవాలని నేనే కాదు, దేశమంతా ఎదురుచూస్తున్నది."

స్వామి: ఆ గోష్ఠి మా ఇద్దరి మధ్య ఏకాంతంగా జరిగింది. గాంధిగారు దానిని బహిరంగపరచలేదు. ఆ సంభాషణ గురించి పత్రికలలో గాని, పుస్తకాలలో గానీ ఇంతవరకు ఏమి వ్రాయబడిందో, అంతవరకు మాత్రమే లోకానికి తెలుసు.

అంతకు మించి మరేమీ చెప్పకుండా స్వామి మౌనం వహించారు. ఇక దానిని గురించి ప్రస్తావించడం వల్ల ప్రయోజనం లేదని నేనూ విరమించుకున్నాను.

******

## రెండవ ప్రయత్నం

కర్ణాటక, మహారాష్ట్ర పర్యటన ముగించుకుని, 1983లో కామకోటి పీఠాధిపతులు కర్నూలులో చాతుర్మాస్యం జరుపుకున్నారు. డిసెంబరు నెలలో కర్నూలు నుంచి కంచికి బయలుదేరారు. మార్గమధ్యంలో కడపజిల్లా లక్కిరెడ్డిపల్లెలో మకాం చేశారు.

ఆ సంవత్సరం నా జన్మదినం సందర్భంగా డిసెంబరు 30 తేది నేనూ, నా ధర్మపత్నీ ఇద్దరం కడప మీదుగా లక్కిరెడ్డిపల్లె చేరుకున్నాము.

శ్రీ జయేంద్ర, శ్రీ విజయేంద్ర సరస్వతి స్వాములు ఇద్దరూ అక్కడే ఉన్నారు. పెద్దలు మాత్రం అక్కడికి నాలుగుమైళ్ళ దూరంలో కొండుపేట అనే గ్రామంలో ఉన్నారు.

లక్కిరెడ్డిపల్లె పల్లేకాదు, కొండుపేట పేటాకాదు. ఆ పేటలో పట్టుమని పదికొంపలు లేవు. మరి, అంత కుగ్రామంలో పెద్దస్వామి ఎందుకు విడిది దిగారు? అది ఆ వూరి భాగ్యం! అక్కడి వారిని విచారింపగా, అక్కడ స్నానానికి సౌకర్యం ఉన్నందున ఆ మధ్యాహ్నం వరకు అక్కడే బస చెయ్యడానికి స్వామి నిర్ణయించారట.

స్వామికి నదీజలాలంటే ఎక్కువ ఇష్టం. చెరువూ, బావినీళ్ళు మధ్యమం. కొళాయి నీరు నిషేధం.

స్వామి ఆ వూళ్లో మకాం చెయ్యడం ఆనాడు నా కెంతో అనుకూలించింది. సాధారణంగా స్వామి చుట్టూ సందులేకుండా మూగిఉండే వందలాది జనం నాడు అక్కడ కనిపించలేదు. దంపతులం ఇద్దరం స్వామిని దర్శించి సాష్టాంగం చేశాము. పుష్పం, ఫలం, వస్త్రం వగైరా సమర్పించుకున్నాము. ఎప్పటివలె ప్రసన్నవదనంతో, నిండుహృదయంతో స్వామి మమ్మ ఆశీర్వదించారు.

ఆ క్షణాన నాకొక ఆలోచన తట్టింది. ఒకరిద్దరు శిష్యులు తప్ప, స్వామి ఒంటరిగా వున్నారు కదా, గతంలో జరిగిన గాంధి-స్వామి గోష్ఠిని గురించి మరోమాటు అడిగి చూద్దాం, ఇప్పటికైనా స్వామి మనస్సుమారి ఉంటుందేమో అనే ఆశతో ఇలా అన్నాను:

"గాంధీగారికీ తమకూ లోగడ జరిగిన సంభాషణ వివరాలు తెలపవలసిందని తమను మళ్ళీ ప్రార్థిస్తున్నాను. ఇంతవరకూ నా కోరిక నెరవేరలేదు."

స్వామి: అవును, నీవు అడుగుతూ ఉన్నావు. నిజమే. కాని, విను, ఒక్క విషయం. నాడు నాకూ, గాంధీగారికీ జరిగిన సంభాషణను గురించి తెలిసిన వాళ్లం నేనూ, గాంధీగారూ, మేమిద్దరమే. మూడో వారెవ్వరికీ తెలియదు. గాంధిగారి వెంటవచ్చిన రాజగోపాలాచారిగారు సైతం బయటనే కూచున్నారు.

"మరి, గాంధిగారిప్పుడు లేరుకదా! ఉన్నవాణ్ణి నేనొక్కణ్ణే. ఆనాటి సంభాషణ వివరాలను నేను వెల్లడిస్తే, "ఇది నిజమై ఉంటుందా?" అని గాంధీ అనుయాయులు అనుమానించవచ్చు.

స్వామి గొప్ప ధర్మసూక్ష్మం వెలిబుచ్చారు. అలాంటి మహోదారులకే అట్టి సందేహాలు తట్టుతాయి. సామాన్యులు వాటిని ఊహించలేరు. ఊహించినా, వాటినంతగా పాటించరు.... కాని, ఈ విషయం ఇంతటితో రెండో ప్రాణికి తెలియకుండా కాలగర్భంలో కలిసిపోవలసిందేనా?.... అనుకుంటూ, మళ్ళా ఇలా అన్నాను:

"స్వామీ, క్షమించండి. గాంధిగారి అభిమానులూ, అనుయాయులూ ఏమి అనుమానిస్తారూ, ఏమి ఆరోపిస్తారూ అన్నది అంత ముఖ్యం కాదని నా మనవి. ఎందుచేత నంటే, ఒకవైపున జాతిపితగా పరిగణించబడే గాంధిగారికీ, మరొక వైపున మూర్తీభవించిన

సనాతనధర్మంగా భావించబడే జగద్గురువులకూ జరిగిన సంభాషణ - ఎంత రహస్యంగా జరిగినా, అది వైయక్తికం కాజాలదు. లోకమంతకూ తెలియవలసినదే. ఈ విషయంలో ఎవరేమనుకున్నా, సత్యం బహిర్గతం కావడం లోకోపకారకమని సవినయంగా మనవి చేస్తున్నాను.

"అదీగాక, మరొక విషయం. గాంధీ అనుయాయులు తమ మాటలు నమ్మవచ్చు, నమ్మకపోవచ్చు. కాని, తమ మాట మీద పరమవిశ్వాసం గల మాబోంట్లు దేశంలో కొల్లలున్నారు. అట్టివారి కొరకైనా, తాము ఈ తెర తొలగించి, సత్యాన్ని ప్రకటించడం అవసరం."

ఇంతగా నేను ప్రార్థించినా, తర్కించినా, స్వామి చలించలేదు. ఆయన మనస్సు మారలేదు. మందహాసం చేస్తూనే, అలా మౌనంగా ఉండిపోయారు.

ఎలాగైనా విషయం తెలుసుకుందామనే ఉత్కంఠతో నేను అట్లా మాట్లాడానే గాని, ఏ సందర్భంలో ఏది ఉచితమో, ఏది కాదో నిర్ణయించవలసింది ధర్మదేవతను బోలిన స్వామే గాని, నేనా?

ఇక, నేను నోరు విప్పలేదు. మరొక అవకాశం రాదా, స్వామి మనస్సు మెత్తబడదా, అన్న ఆశమాత్రం నన్ను వదలలేదు.

ఇది పూర్వ రంగం.

******

## స్వామి ఆదేశంపై కంచికి ప్రయాణం

1985 జూన్ నెలలో నేను బొంబాయిలో మా కుమార్తె ఇంటివద్ద ఉండగా, హైదరాబాద్ నుంచి నాకో టెలిగ్రాం వచ్చింది: 'వెంటనే బయలుదేరి మిమ్ముకంచికి రమ్మంటున్నారు పరమాచార్యులు' అని. ఎందునిమిత్తమో కారణం మాత్రం తెలియదు.

వస్తున్నానని మఠానికి తెలియజేసి, వెంటనే రైలెక్కాను. హైదరాబాదు చేరగానే

మఠం నుంచి మరొక టెలిఫోన్: "స్వామి మౌనంలోకి వెళతారు కాబట్టి, ఆలస్యం కాకుండా విమానంలో బయలుదేరవలసింది" అని.

చావలి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి కుమారులు శ్రీకృష్ణ ప్లేనుకు టిక్కెట్లు సంపాదించారు. ఇద్దరం కలసి మద్రాసు వెళ్ళాము. అడయారులో చావలి శాస్త్రిగారిని కలుసుకుని, వారి కారులోనే కంచికి బయలుదేరాను. శ్రీ చావలి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు స్వామి ముఖ్య శిష్యులలో ఒకరు.

నేరుగా మఠానికి వెళ్ళి స్వామి దర్శనం చేశాను. ఢిల్లీ 'స్టేట్స్‌మన్' పత్రికలో శ్రీ కె.స్వామినాథన్ పేరుతో ప్రచురించబడిన ఒక లేఖ ప్రతిని నాకిచ్చి దాన్ని చదవమన్నారు స్వామి.

ప్రొఫెసర్ స్వామినాథన్ చాలా అనుభవం గల విద్యావేత్త. ప్రసిద్ధ రచయిత. తత్వజ్ఞుడు. ప్రస్తుతం ఢిల్లీలో గాంధీమహాత్ముని సమగ్రరచనల సంపుటికి (Collected Works of Mahathma Gandhi) ప్రధాన సంపాదకులు. ఆయన వ్రాసిన లేఖను 1985 జూన్ 8 తేదీ 'స్టేట్స్‌మన్' పత్రిక ప్రకటించింది.

1927 అక్టోబరు 15 తేదీన దక్షిణ దేశంలో నెల్లిచెరి గ్రామంలో మహాత్మగాంధీ, కామకోటి శంకరాచార్యస్వాముల మధ్య ఏకాంతంగా జరిగిన గోష్ఠి అనంతరం మహాత్ముడు తన ఆశ్రమవాసులైన శ్రీ కిశోరిలాల్ మశ్రువాలా, శ్రీమతి గంగాబెన్ వైద్యగార్లకు ఆ గోష్ఠిని గురించీ, శంకరాచార్యస్వామిని గురించీ లేఖలు రాశారు. ఆ లేఖల్లోని కొన్ని భాగాలను శ్రీ స్వామినాథన్ 'స్టేట్స్‌మన్' పత్రికకు తాను వ్రాసిన లేఖలో ఉదహరించారు.

"స్వామినాథన్ లేఖ చదివావుకదా, అందులో ఏమున్నది?" అని స్వామి నన్ను అడిగారు. నే నిలా సమాధానం చెప్పాను. గాంధీజీ తన ఆశ్రమవాసి మశ్రువాలాకు వ్రాసిన ఉత్తరంలో "మా సంభాషణల అనంతరం పూర్తిగా భిన్నమైన అనుభవంతో నేను బయటకి వచ్చాను. ప్రతి సమస్యకూ రెండు వాదాలున్నాయి. ఆ రెండవది కూడా రమ్యమైనదే. దానిని ఉపేక్షించడానికి వీలులేదు."

స్వామి: సరి, లోగడ గాంధీగారికీ నాకూ జరిగిన సంభాషణలను గురించి పదేపదే నీవు నన్ను అడుగుతూ వచ్చావు. నేను చెప్పనన్నాను. ఆ గోష్ఠిని గురించి ఇప్పుడు గాంధిగారి అభిప్రాయాలు కొంతవరకు వెల్లడి అయినవి కాబట్టి, ఆ సంభాషణల సారాంశాన్ని నీకు వినిపిస్తాను.

"తెలుగు మాట్లాడే అభ్యాసం తప్పిపోవడం చేత భాషమరిచి పోతున్నాను" అంటూ స్వామి నెమ్మది, నెమ్మదిగా తెలుగులోనే మాట్లాడారు. రమారమి మూడు దశాబ్దాల కిందట మొట్టమొదటిసారి నేను స్వామి దర్శనం చేసి మాట్లాడినప్పుడు, నాలుగున్నర గంటలు వివిధ విషయాలను గురించి ఏకధాటిగా స్వామి తెలుగులో ప్రసంగించారు. ఆనాడు ఆ ప్రసంగం అనర్గళంగా, అతి మధురంగా, స్వామి మాతృభాష తెలుగే అన్న భ్రాంతిని కలిగించేట్టుగా కొనసాగింది. అలాంటిది 'అభ్యాసం లేక నేను తెలుగు మరిచి పోతున్నాను' అని స్వామి ముఖతా వెలువడిన మాట ఎందుకో నాకు ఇంచుక బాధ కలిగించింది.

******

## గోష్ఠి వివరాలు

చరిత్రాత్మకమైన శ్రీచంద్రశేఖర సరస్వతీ - మహాత్మాగాంధి సమావేశం ప్రాచీనకాలంలో ఋషుల ఆశ్రమవాటికలలో వలె ఒక గోశాలలో జరిగింది.

నిరాడంబరతకూ, నియమబద్ధమైన జీవితానికీ ఉభయులూ పేరుబడిన వారు.

గాంధీజీ ఇంగ్లండులో బారిష్టరై, పాశ్చాత్యుల వేషభాషల నలవరచుకున్న వాడైనా,

వాటి నన్నింటిని విడనాడి, భారతదేశంలోని సామాన్య ప్రజననుసరించి, 'దరిద్ర నారాయణ' సేవలో నిమగ్నుడైనాడు.

ఇక కంచిసంయమి సంగతి చెప్పవలసిన పనేలేదు. పూర్వ సంప్రదాయం ప్రకారం మతాధిపతి అయిన స్వామికి ఏనుగులు, గుఱ్ఱాలు, పండితులు, పరిచారకులు, మందీ మార్బలం ఎంతో ఉన్నా, దండం, కమండలం, కౌపీనం, కాషాయం ఇవే సర్వసంగపరిత్యాగి అయిన స్వామి ఆస్తిపాస్తులు. విభూతి, రుద్రాక్షలే ఆయన అలంకరణాలు.

సాధారణంగా పీఠాధిపతికి ఉండవలసిన ఏ పటాటోపమూ లేకుండా ఖద్దరుధారి ఐన స్వామిని చూసి గాంధీగారు ముగ్ధులైనారు.

యావద్భారతజాతికి ఏకైక నాయకుడై, బ్రిటిష ప్రభుత్వానికి సింహస్వప్నంగా పరిగణించబడుతున్న గాంధిమహాత్ముడు సహచరులు లేకుండా ఒంటరిగా తన కుటీరానికి రావడం చూచి స్వామి కూడా పరమానంద భరితుడైనాడు.

కంచిస్వామి మహాత్మగాంధీకి స్వాగతం పలుకుతూ, ఆధ్యాత్మిక సిద్ధాంతాలకు అనుగుణమైన రాజకీయ విధానాలను రూపొందించి ప్రజలను ప్రబోధిస్తున్నందుకు గాంధిగారిని ప్రశంసించారు.

సౌష్ఠవమైన జాతి మనుగడకు ఆధ్యాత్మిక శక్తి అవసరమనీ, మతరహితమైన, కేవల భౌతిక సూత్రాలపై ఆధారపడిన జాతులకు వినాశనం తప్పదనీ స్వామి ఉద్ఘాటించారు.

స్వామి సంస్కృతంలోనూ, గాంధీజీ హిందీలోనూ సాదరంగా, హృదయాలు విప్పుకొని సంభాషించుకున్నారు. వాద ప్రతివాదాలు, సిద్ధాంత పూర్వపక్షాలు లేకుండా నిష్కల్మషంగా ఒకరినొకరు అర్థం చేసుకోడానికి ప్రయత్నించారు.

స్వామి ఇంకా ఇలా అన్నారు :

"ప్రపంచంలోని అత్యంత ప్రాచీన దేశాలలో భారతదేశం ఒకటి. అనాది నుండీ భారతజాతి విశిష్టమైన సభ్యతా సంస్కృతులను

కలిగి ఉన్నది. ఏనాడో అది వర్ణాశ్రమ ధర్మమనే విలక్షణమైన సామాజిక వ్యవస్థను రూపొందించుకున్నది. దాని ననుసరించి భారతప్రజలలో ఒక్కొక్క వర్గం ఒక్కొక్క ధర్మాన్ని,

ఒక్కొక్క వృత్తినీ అవలంబించింది. వారి వారి స్వధర్మాన్ని పాలిస్తూ ప్రజలందరూ ఐహికాముష్మికసుఖాలను అనుభవించారు.

ఒక్కొక్కరు ఒక్కొక విధమైన విధులను నిర్వర్తించడం వల్ల మొత్తం జాతికి అభ్యుదయం సిద్ధిస్తుంది. ప్రజలందరికీ సామాన్యధర్మాలున్నా, వారిలో కొందరికి విశేషధర్మాలున్నవి. ఎవరి ధర్మాన్ని వారు అనుసరించడమే సహజమైన, సుకరమైన మార్గం. ఇందువల్ల ప్రతివ్యక్తి తాను చేసే పనిలో కౌశలం సాధిస్తాడు. సంఘం సర్వతోముఖంగా వృద్ధి చెందుతుంది. ఇది హిందూసంఘం ప్రత్యేక లక్షణం.

చన్నీళ్లకుండే గుణం వేరు. వేడినీళ్లకుండే గుణం వేరు. రెంటినీ కలగలపు చెయ్యడం వల్ల అవి వాటి సహజగుణాలను కోలుపోయి, నిరుపయోగమవుతాయి.

సమాజం అంతా ఒక్కవిధంగానే ఉండదు. ఉదాహరణకు, మామిడి చెట్టుకు అనేక శాఖ లుంటవి. ఈ శాఖలలో ఒక్కొక్కటి ఒక్కొక్క సమయంలో పూత పూస్తుంది. ఒక్కొక్క తరుణంలో కాయ కాస్తుంది. అయినా, చెట్టు ఒక్కటే. సంఘం కూడా ఈ చెట్టువంటిదే. అన్ని శాఖలు కలసి వృక్షం అయినట్టు, అన్ని వర్గాలూ చేరి సంఘం అవుతుంది.

సహజమైన ఈ పరిస్థితిని తారుమారు చెయ్యడంవల్ల సమాజంలో అవ్యవస్థ ఏర్పడుతుంది. ఇటీవలి కాలంలో రాజకీయనాయకులు మత, సాంఘిక వ్యవహారాలలో జోక్యం కలిగించుకొని, వాటిని మార్చడానికి ప్రయత్నించడం చేతనే హిందూసంఘం బలహీన మయింది." అన్నారు స్వామి.

సాంఘిక విషయాలలో రాజకీయవాదులు జోక్యం కలగజేసికొనడం కారణంగా, దేశ పరిస్థితి తారుమారు అయింది అన్న అభిప్రాయం పట్ల గాంధిగారు తమతో ఏకీభవించినట్లు స్వామి వక్కాణించారు.

స్వామి ఇంకా ఇలా అన్నారు. "అతి ప్రాచీన కాలం నుంచి మన దేశంలో ప్రవర్తిల్లుతూ వచ్చిన సాంఘికవ్యవస్థలో శుచి, శౌచములకు సంబంధించిన కట్టుబాట్లు, నియమ నిబంధన లున్నవి. అవి మన సంస్కృతికి దోహదం చేసినవి. పూర్వ మెన్నడూ అవి దోషంగా

పరిగణించబడలేదు. వాటిని పాటించినంత మాత్రాన ఒక వర్గం ప్రజలు మరొక వర్గం వారిని తక్కువ చేసి నట్లుకాదు. కులక్రమానుగతమైన ఈ నియమ నిబంధనలను అంతరింపజేస్తే సంస్కృతిపరంగా జాతి ఒక మహత్త్వయోజనాన్ని కోలుపోతుంది."

దేవాలయ ప్రవేశ విషయంపై శ్రీస్వామి ఇలా అన్నారు. "శాస్త్రప్రమాణాలపైన, సనాతన సంప్రదాయం పైనా నమ్మకం గల అశేష ప్రజల విశ్వాసాలకు విరుద్ధంగా వారికి బాధ కలిగించడం, అది కూడా ఒక విధమైన హింసగానే పరిగణించబడుతుంది.

దేవాలయాలు పవిత్రమైన వనీ, ఆలయాంతర్భాగంలో దేవుడున్నాడనీ నమ్మేవారికి దేవాలయాలు ఉద్దేశించబడినవి. ఆలయ పవిత్రతను ఆగమ శాస్త్రాలు వేనోళ్ల చాటుతున్నవి. ఆ శాస్త్రాలలో ఎవరికి విశ్వాసం లేదో, శుచికీ శౌచానికీ సంబంధించిన ఆ నియమ నిబంధనలను ఎవ్వరు పాటించరో వారిందరూ ఆలయ ప్రవేశానికి అర్హత లేనివారే."

భారతదేశ ప్రజలలో హిందువులే గాక, ముస్లిములు, క్రైస్తవులు మొదలైన అన్యమతస్థులు కూడా ఉన్నందువల్ల అస్పృశ్యతా నివారణకు అవసరం ఏర్పడిందని గాంధీజీ అభిప్రాయం వెలిబుచ్చినట్లు కంచి స్వామి వారన్నారు.

రాజకీయ సమస్య :

ఇకపోతే, అస్పృశ్యతా నివారణ అన్నది గాంధిగారి దృష్టిలో కేవలం సాంఘిక సమస్యగానే గాక, రాజకీయ సమస్యగా కూడా పరిగణింపబడిందనడానికి తార్కాణగా కంచిస్వామి నాతో ఇలా అన్నారు.

"భారత స్వాతంత్ర్యసిద్ధికి గాంధిగారు మొదట నాలుగు షరతులు ప్రకటించారు. వాటిలో మొదటిది అహింస. రెండు : హిందూ ముస్లిం సఖ్యత. మూడు : ఖద్దరు ధారణ. నాలుగు : అస్పృశ్యతానివారణ. ఈ నాలుగూ, ఇంటికి నాలుగు స్తంభాలవంటి వని గాంధిగారు వర్ణించారు. కాని, కొంతకాలం గడచిన పిమ్మట, పై నాలుగు షరతులలో మూడింటిని ఉపసంహరించి, ఒక్క అహింసను మాత్రమే దేశ స్వాతంత్ర్య సంపాదనకు ఒకే ఒక షరతుగా గాంధిగారు పేర్కొన్నారు.

ఇందువల్ల తేలిన దేమిటి ? అస్పృశ్యతానివారణ స్వాతంత్ర్య సిద్ధికై ఉద్దేశించబడిన రాజకీయ ప్రయోజనమేననీ, మౌలిక సిద్ధాంతంకాదనీ ఋజువు కావడం లేదు ?"

తమకూ, గాంధిగారికీ జరిగిన సంభాషణను గురించి స్వామి చెప్పిన తరువాత, ప్రొఫెసర్ స్వామినాధన్ లేఖను పురస్కరించుకుని నే నీవిధంగా స్వామిని అడిగాను.

నేను : ప్రతి సమస్యకూ రెండు వాదాలున్నవనీ, ఆ రెండవది కూడా రమ్యమైనదేననీ గాంధిగారు తమ ఆశ్రమవాసి మశ్రువాలాకు వ్రాశారు. అంతే కాదు ; స్వామితో జరిగిన గోష్ఠి అనంతరం తాను పూర్తిగా భిన్నమైన అనుభవంతో బయిటికి వచ్చినామనికూడా ఆ లేఖలో పేర్కొన్నారు. దీనిని బట్టి గాంధీజీ స్వామి వారి వాదాన్ని అంగీకరించినట్టు భావింపవచ్చునా?

స్వామి : అందుకు సందేహ మేమున్నది ?

నేను : అలా అంగీకరించినట్లయితే ఆ మాట గాంధిగారు బహిరంగంగా ఎందుకు చెప్పలేదు ?

స్వామి : అది ఎలా సాధ్యం ? నా వాదాన్ని వారు అంగీకరించినట్టు ఒప్పకుంటే, అస్పృశ్యతానివారణనుగురించి అంతకు పూర్వం గాంధిగారు దేశవ్యాప్తంగా చేసిన ప్రచారమూ, కృషీ అంతా వృధాకదా ?

## గాంధిగారి అహింసా సిద్ధాంతం :

నెల్లిచెరి గ్రామంలో జరిగిన గోష్ఠి వివరాలను వెల్లడించిన పిమ్మట, మహాత్మగాంధిగారి అహింసాసూత్రాన్ని గురించి కంచిస్వామి ఇలా వ్యాఖ్యానించారు.

"అహింసాసిద్ధాంతాన్ని గాంధిగారు మూల సూత్రంగా పాటించినా, ఆచరణలో మాత్రం అది వా రూహించిన విధంగా కొనసాగలేదు. అందుకు ఉదాహరణగా ఈ కింది విషయాన్ని గమనించవచ్చు.

1927 లో గాంధిగారికీ నాకూ జరిగిన గోష్ఠిఅనంతరం, సుమారు ఇరవై సంవత్సరాల తరువాత దేశంలో తీవ్రమైన ఆహారధాన్యాల కాటకం సంభవించింది. బెంగాలు, ఒరిస్సా, ఆంధ్ర, మహారాష్ట్ర, కేరళ, తమిళనాడు రాష్ట్రాలవారు ఆహారధాన్యాలు సరఫరా చేయవలసిందని కేంద్రాన్ని అర్థించారు. ప్రజల ఒత్తిడి ఎక్కువకాగా, కేంద్రం సందిగ్ధంలో పడ్డది. ఆ రోజుల్లో గాంధీ గారు స్వతంత్ర భారతంలో మకుటంలేని మహీపతి. సమస్య పరిష్కారానికి గాంధికారొక మార్గం సూచించారు. సముద్రతీరవాసులు కానట్టి రాష్ట్రాల ప్రజలకు మాత్రమే కేంద్రం ఆహారాన్ని సరఫరా చేయవలసిందని సలహా ఇచ్చారు".

నేను : అనగా , సముద్ర ప్రాంతాలలో నివసించే ప్రజలు మత్స్యాహారంపై ఆధారపడవలెననే కదా గాంధిగారి సూచన ?

స్వామి : అంతే కాదా మరి ?

అహింస : ఆహార సమస్య

అటు తరువాత స్వామి అహింసనుగురించీ, ఆహార సమస్యను గురించీ తమ అభిప్రాయాన్ని ఈ విధంగా వివరించారు.

భారత దేశంలో శాకాహారం ప్రజలలో కొన్ని వర్గాలకు మాత్రమే విధిగా నియమించబడింది. ప్రజలంతా శాకాహారులైతే కాయపుష్టితో పనిచేసే వారికి దేహబలం లోపిస్తుంది. అట్టివారు మాంసాహారులైనా దోషం లేదు. ఎవరివిషయంలో మాంసాహారం నిషేధించబడిందో, వారు మాత్రం ఆ నిషేధాన్ని పాటించి తీరాలి. ఇది కర్మ విభాగమనే (division of labour) సూత్రంపై ఆధారపడి ఉన్నది.

## ఇరువురు మహనీయులు

గాంధిమహాత్ముని రచనల సమగ్రచరిత్రకు ప్రధానసంపాదకులైన ప్రొఫెసర్. కె. స్వామినాథన్ 'స్టేట్స్‌మన్' పత్రికకు ఒక లేఖ వ్రాశారు. ఆ లేఖలో వెల్లడించిన విషయాలు

కామకోటి పీఠాధిపతి శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతిస్వామిపట్ల గాంధి గారికి గల పూజ్యభావాన్ని వ్యక్తపరుస్తున్నవి.

మహాత్మాగాంధికి, తదితర దేశనాయకులకూ తత్వతః ఎంతో అంతర మున్నది. గాంధిగారికి దేశ స్వాతంత్ర్య మొక్కటే ధ్యేయం కాదు. గాంధీజీ ఆస్తికులలో పరమ ఆస్తికుడు. రామభక్తుడు. అంతిమ క్షణాల్లో రామనామస్మరణ చేస్తూ అసువులు బాసిన భక్తశిఖామణి.

రాజకీయరంగంలో వీరవిహారం చేస్తూ, సత్యాహింసలు తన ఉచ్ఛ్వాస నిశ్వాసాలని ప్రకటించుకున్న సాధుపుంగవుడు. మతంలేని రాజకీయం క్షుద్రమని బాహాటంగా చాటిన మతాభిమాని. ఆయనవలె రాజకీయరంగంలో ఆత్మబలంపై, ఆధ్యాత్మికశక్తిపై ఆధారపడిన నాయకుడు లేడు. ఆయన ఉద్యమించిన సహాయనిరాకరణమూ, సత్యాగ్రహమూ, శాసనోల్లంఘనాది కార్యక్రమాలు ఆదిలో అనేకమంది దేశనాయకుల అధిక్షేపణలకు గురి అయినవి. కొందరు ఆయన రాజకీయపరిజ్ఞానాన్నే శంకించారు.

నిర్మాణకార్యక్రమంపై గాంధిగారికి ఎంతో ప్రీతి. ఖద్దరు, అస్పృశ్యతా నివారణ, హిందూ ముస్లిం సఖ్యత, అహింసావలంబనలను స్వరాజ్యసిద్ధికి ఆయన ప్రధాన సాధనాలుగా పేర్కొన్నారు. ఆ నాలుగింటినీ ఇంటికి నాలుగు స్తంభాలతో పోల్చారు.

1927 లో గాంధీజీ తన శక్తినంతా అస్ప ృశ్యతానివారణపై కేంద్రీక రించారు. అంటరానితనాన్ని రూపుమాపడం ద్వారా హిందూసంఘంలో ఐకమత్యాన్ని పెంపొందించి, హరిజనుల మతాంతరీకరణను నివారించగలమని భావించారు.

అంటరానితనాన్ని నివారించాలంటే కేవలం రాజకీయనాయకులపైనా, సంఘసంస్కర్తలపై మాత్రమే ఆధారపడకుండా , సనాతనధర్మంలో విశ్వాసం గల వారిని కూడా కూడకట్టుకొనడం అవసరమని ఆయన తలపోశారు.

అలాంటి వ్యక్తులు దేశంలో ఎవరున్నారు, ఎవరి సహకారం పొందితే తాను చేపట్టిన ఉద్యమానికి బలం చేకూరుతుంది అని యోచించారు. సనాతన ధర్మవారులు దేశంలో ఎందరో ఉన్నారు. పండితులూ, శాస్త్రవిదులూ, మఠాధిపతులు మొదలైనవారు. అయినా,

కామకోటిపీఠం శంకరాచార్యులతో సంప్రతించాలని గాంధీజీ ఉద్దేశించారు.

కంచి పీఠాధిపతిని గురించి అంతకు పూర్వమే కాంగ్రెసు నాయకులైన శ్రీ రాజగోపాలాచారి, శ్రీ యస్. సత్యమూర్తి, హిందూ పత్రికా సంపాదకులు శ్రీ ఏ. రంగస్వామి అయ్యంగార్ మొదలైన ప్రముఖుల ద్వారా విన్నారు. కేవలం మతవిషయాల్లోనే గాక, కంచి పీఠాదిపతుల వివిధవిషయపరిజ్ఞానాన్ని, వారి నిర్మలాంతఃకరణాన్ని, విశేషించి దక్షిణభారతంలో పండితపామరప్రజానీకానికి వారిపై గల భక్తిప్రపత్తులను గురించి తెలుసుకున్నారు.

అట్టి మహావ్యక్తిని తా నుపక్రమించిన అస్పృశ్యతానివారణోద్యమానికి సుముఖులుగా చేసికొని, వారి సహకారాన్ని పొందినట్లయితే, దేశంలో ఆ ఉద్యమానికి ఎంతో బలం సమకూరగలదని ఆశించారు. కంచిస్వామితో సమావేశం జరపడానికి ముందు రోజు ఒక హరిజనసభలో ప్రసంగిస్తూ ఇదే అభిప్రాయాన్ని బహిరంగంగా వెల్లడించారు.

కంచిస్వామివారితో మాట్లాడడానికి తమ ప్రతినిధిగా ఏ రాజగోపాలాచారిగారినో, లేక తన కార్యదర్శినో పంపలేదు గాంధిగారు. తానే స్వయంగా వెళ్ళి స్వామిని సందర్శించారు. దాదాపు గంటసేపు స్వామివారి సంభాషణను శ్రద్ధగా ఆలకించారు. ఆ సంభాషణలో గాంధిగారు ఎంతగా నిమగ్నులైనారంటే ఇరువురి గోష్ఠి ముగిసేవరకూ వెలుపలనే కూర్చున్న శ్రీ రాజగోపాలాచారిగారు చివరకు లోపలికి ప్రవేశించి “మీ సాయంత్రం భోజనానికి వేళ అయింది” అని గాంధిగారికి జ్ఞాపకం చేశారు. అంతవరకూ స్వామి చెప్పే మాటలను గాంధిగారు వింటూనే ఉన్నారు. కదలలేదు.

అప్పడైనా, శ్రీ రాజగోపాలాచారిగారితో గాంధీజీ ఏమన్నారు ? “ఇవాళ స్వామికీ నాకు జరిగిన ఈ సంభాషణే నా సాయంత్రపు భోజనం !” అన్నారు.

దీనిని బట్టి, గాంధిగారికి కంచిస్వామి ఎడల ఎంత పూజ్యభావం ఏర్పడిందో, సమావేశానంతరం గాంధిజీ ఎంతగా ప్రభావితులైనారో విస్పష్ట మవుతున్నది.

అంతేకాదు, కంచిస్వామివారితో వాదప్రతివాదాలు, సిద్ధాంతపూర్వపక్షాలు చెయ్యడానికో, న్యాయవాదుల వలె యుక్తిప్రయుక్తులతో తమ వాదం నెగ్గింది

అనిపించుకోడానికో అయినట్లయితే, గాంధిజీ స్వామివారితో ఏకాంతంగా మాట్లాడేవారు కారు. సనాతనధర్మాన్ని స్వామివారివల్ల తెలుసుకోవా లన్న నిజమైన జిజ్ఞాసతోనే తమ ఇరువురికి మాత్రం పరిమితమైన రహస్యసంభాషణలు కొనసాగించారు.

ప్రొఫెసర్ స్వామినాథన్ తన 'స్టేట్స్‌మన్' పత్రికాలేఖలో పేర్కొన్న విషయాలు ఈ భావాలనే విశదపరుస్తున్నవి.

## ఆశ్రమ వాసులకు గాంధిగారి లేఖలు :

1927 అక్టోబరు 15 తేదీన గాంధి-స్వామి రహస్యసంభాషణలు ముగిసినవి. 17 తేది గాంధిగారు తమ ఆశ్రమ వాసి శ్రీ కిశోరిలాల్ మశ్రువాలాకు ఒక ఉత్తరం వ్రాస్తూ "సమావేశం తరవాత పూర్తిగా భిన్నమైన అనుభవంతో నేను బయటికి వచ్చాను." అన్నారు. (I came out with a totally different experience) అనగా, అస్పృశ్యతానివారణ విషయమై (పూర్వమున్నదానికి) పూర్తిగా భిన్నమైన అభిప్రాయంతో బయటపడ్డా మన్నారు. ఇక్కడ అనుభవం అనే పదాన్ని కూడా మనం గమనించక తప్పదు. ఔచిత్యం గుర్తించి పదప్రయోగం చెయ్యడంలో గాంధిగారిని మించినవారు లేరు.

అదే లేఖలో గాంధీజీ ఇంకా ఇలా అన్నారు. "ప్రతి సమస్యకూ రెండు వాదాలున్నవి. ఆ రెండవది కూడా రమ్యమైనది. దానిని మనం గమనించక తప్పదు." ఈ మాటలనుబట్టి కూడా, స్వామి చేసిన ప్రసంగం గాంధిగారి నెంత ఆకర్షించిందో, ఎంత హృద్యంగా ఆయనకు తోచిందో తెలుస్తున్నది.

అయితే మరి, స్వామి వెల్లడించిన అభిప్రాయాలు తనకు అంత రమణీయంగా, అంత ఆకర్షణీయంగా తోచినప్పుడు ఆ విషయాన్ని గాంధిగారు బహిరంగంగా ఎందుకు వెల్లడించలేదు? ఎవరికైనా ఈ అనుమానం కలగవచ్చు.

ఇక్కడ మనం ఒక ధర్మసూక్ష్మాన్ని గమనించవలసి ఉంటుంది. గాంధిజీ ఎంతటి ఆదర్శవాది అయినా, ఆయన రాజకీయవేత్త అన్నమాటా, ఆయన లక్ష్యం స్వాతంత్ర్యం

సంపాదన అన్నమాటా మనం మరవరాదు.

అస్పృశ్యతానివారణ, ఖద్దరు ధారణ, హిందూ ముస్లిం సమైక్యత, అహింసావలంబనలు, స్వాతంత్ర్యసిద్ధికి సాధనాలు మాత్రమే. మూలసూత్రాలు కావు. అయినా, వాటి నిమిత్తం గాంధిగారు దేశవ్యాప్తంగా తీవ్రమైన ప్రచారం చేశారు. అంత ప్రచారం కొనసాగించిన తరువాత కంచిస్వామి చేసిన వాదం ఎంత ఆదరణీయంగా తనకు తోచినా, అస్ప ృశ్యతానివారణఅవసరం కాదనగలరా ? ఆ విధంగా అంగీకరించిన పక్షంలో, స్వవచనవ్యాఘాతం మాట అలావుంచి, అంతవరకూ తాను కొనసాగించిన ప్రబలమైన ప్రచారం యావత్తూ వృథా కాదా ? అది రాజనీతికి విరుద్ధం.

## "స్వామి మూర్తీభవించిన శాంతం"

కాగా, అదే రోజున (అక్టోబరు 17) గాంధిగారు శ్రీమతి గంగాబెన్ వైద్య అనే మరొక ఆశ్రమవాసురాలికి లేఖ వ్రాస్తూ, కంచిస్వామిని ఉద్దేశించి, "ఆయన సాక్షాత్తూ మూర్తీభవించిన శాంతము" (Incarnation of Peace) అన్నారు. శాంతి అనే పదాన్ని నిర్వచిస్తూ హిందీ కవితాపితామహుడు తులసీదాసు రచించిన రామచరితమానస గ్రంథం నుంచి ఈ క్రింది మాటలు ఉదహరించారు.

"నిజమైన శాంతిని మనం నిర్వచించలేము. అది అనుభవైక వేద్యం. జ్ఞానం ద్వారా అభ్యమయ్యే శాంతి సాధారణమానవుని అనుభవానికి అతీత మైనది. కామక్రోధ లోబ మోహాది వికాదాలు లేనివారు మాత్రమే అట్టి పరమశాంతిని అనుభవించగలరు".

పై వర్ణన శ్రీ కంచి యతీంద్రులు చంద్రశేఖరేంద్రసరస్వతులకు అక్షరాలా అనువర్తిస్తుంది. ఆయన మహాజ్ఞాని అనీ, సాక్షాత్తు ఆదిశంకరభగవత్పాదుల అవతారమేననీ, పండిత మదన మోహన మాలవ్యా మొదలుకొని లోకమంతా నేడు అంగీకరించిన విషయాన్ని మహాత్మాగాంధి ఆరుదశాబ్దులకు పూర్వమే భావించడం అత్యద్భుతం.

భవిష్యద్వాణి :

శ్రీ స్వామినాధన్ 'స్టేట్స్‌మన్' పత్రికకు వ్రాసిన లేఖలో మరొక విషయం కూడా ప్రస్తావించారు. అది గాంధిగారి హత్యను గురించినది.

మహాత్మునికి, కంచి స్వామికి జరిగిన సంభాషణలో గాంధిజీ హిందూ ముస్లిం సమైక్యతను గురించి ముచ్చటిస్తూ, స్వామి శ్రద్ధానందుడు ముస్లిం దుండగునిచే హత్య చేయబడిన విషయాన్ని ఉదహరించారు. ఇలాంటి ఘాతుక చర్యల దృష్ట్యా భారత దేశంలో హిందూ ముస్లిం సఖ్యత ఎలా సంభవమని గాంధిగా రన్నారు. ఆమాటకు కంచి తపస్వి అనుద్వేగులై, ఇలా అన్నారట. "భవిష్యత్తులో ఒక వేళ ఏ హిందువో మిమ్ముగాని, నన్ను గాని హత్య చేసినట్లయితే , ఆ కారణాన యావత్తు హిందూ సంఘాన్ని మనం ద్వేషిస్తామా ?'

పై సంభాషణ జరిగింది 1927 లో , కాగా, 1948 లో జనవరి 30 తేదీ గాంధీజీ ఒక హిందువుచేత హత్య చేయబడిన సంఘటనను పురస్కరించుకుని, ఆనాడు శ్రీ సి. రాజగోపాలచారి గారు ఈ విషయాన్ని కొందరు మిత్రులకు వెల్లడించినట్టు శ్రీ స్వామినాధన్ తన లేఖలో పేర్కొన్నారు.

భవిష్యత్సంఘటనను సూచిస్తూ కంచి స్వామి ముఖతా వెలువడిన ఈ మాటలు సామాన్యులకు ఆశ్చర్యజనకంగా తోచవచ్చు. కాని, ఆ మహనీయుని దివ్యచరిత్రనూ, త్రికాలజ్ఞతనూ తెలిసిన వారికి ఇది అసాధారణంగా తోచదు.

స్వామివారి ఆగతానాగత పరిజ్ఞానాన్ని గురించీ, అతీంద్రియశక్తులగురించీ పలువురు ప్రాజ్ఞులూ, పండితులూ ఈ పుస్తకంలో వ్రాసిన వారి వారి అనుభూతుల ద్వారా మనం తెలుసుకోవచ్చు.

లౌకికానాంహి సాధూనాం
అర్థం వాగనువర్తతే !క్ష
ఋషీ నాం పునరాద్యానాం
వాచమర్థోనుధావతి ॥!

(లౌకికులైన సాధువుల వాక్కు ఉద్దిష్టమైన అర్థాన్ని అనుసరిస్తుంది. ఆద్యులైన ఋషుల

వాక్యాలను అర్థమే అనుగమిస్తుంది. ఏనాటికీ అవి అసత్యములు కావు).

## "రామభక్తులలో అగ్రగణ్యులు గాంధిగారు"

రాజ్యాంగవేత్తగా, భారత స్వాతంత్ర్య ప్రదాతగా, అహింసాసిద్ధాంత ప్రవర్తకుడుగా గాంధిమహాత్ముడు అద్వితీయుడు.

అదేవిధంగా, వర్తమానకాలంలో ఆధ్యాత్మికరంగంలో మహోన్నతశిఖరాల నధిష్ఠించి, తన నిత్యజీవితమే లోకానికి దివ్యసందేశంగా నిరూపించి, అశేష విజ్ఞప్రపంచాన్ని ఆకర్షిస్తున్న కంచికామకోటిపీఠ పరమాచార్యులు శ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతి సనాతన ధర్మపరాయణులకు పరమప్రామాణికులు.

ఇరువురిలో ఒకరు కర్మయోగి. ఒకరు జ్ఞానయోగి. ఈ మహనీయులు ఉభయులూ వేరు వేరు రంగాలలో కృషి చేసినా, కంచిస్వామి దేశాభిమానాన్ని గాని, మహాత్మగాంధి మతాభినివేశాన్ని గానీ శంకించడానికి వీలులేదు. భారతజాతి బహుముఖాభ్యుదయం ఉభయులకూ సమానలక్ష్యం.

ప్రజలకు సంబంధించిన ఒక్కొక్క సమస్యకు పరిష్కారమార్గాన్ని అన్వేషించడంలో వీరికి భిన్నాభిప్రాయాలు ఉన్నంతమాత్రన ఒండొరుల యెడల వీరికి గల గౌరవభావానికి అవి ఏమాత్రం అడ్డురాలేదు. అందుకు నిదర్శనాలున్నవి.

1927లో దక్షిణ భారతంలో నెల్లిచెరి అనే గ్రామంలో కంచిస్వామికీ, గాంధిగారికీ జరిగిన ప్రత్యే సంభాషణానంతరం, గాంధిగారు తమ ఆశ్రమవాసి శ్రీ కిశోరిలాల్ మశ్రువాలాకు ఒక లేఖ వ్రాస్తూ, కంచిస్వామివారిని గురించి "ఆయన సాక్షాత్తూ మూర్తీభవించిన శాంతమే" అన్నారు.

అదే విధంగ, గాంధి నిర్యాణానంతరం కంచిస్వామి గాంధిగారిని "భారతమాత

పుత్రులలో ఆయన అగ్రగణ్యుడూ, మహోదారుడూ” అని వర్ణించారు.

1948 జనవరి 30 వ తేదీ యావద్భారతజాతికి మహాదుర్దినం. ఆనాడే గాంధీమహాత్ముడు మతోన్మాది అయిన, ఒక సోదరదేశీయుని ఘాతుకకృత్యానికి బలి అయినాడు. ఈ దుర్వార్త విన్న కంచిస్వామి దక్షిణాదిని మహోదయ పుణ్యకాలాన పాలార్ నది సంగమం వద్ద ఒక ప్రకటన చేస్తూ, భారత జాతికి గాంధీగారి అమూల్యసేవలను ఈ విధంగా ప్రస్తుతించారు. “భారతమాత పుత్రులలో అగ్రగణ్యుడూ, మహోదారుడూ అయిన గాంధీ నిర్యాణం వల్ల మనదేశ మొక్కటేగాక, యావత్ప్రపంచం ఎంతో నష్టపోయింది. విశేషించి, దారుణమైన ఈ హత్యకు ఒక భారతీయుడే కారకుడు కావడం మన మందరం మరింత సిగ్గుపడవలసిన విషయం. ఈ కళంకాన్ని తుడిచివేయాలంటే భారత ప్రజలందరూ సత్యం, అహింస, బ్రహ్మచర్యం అనే లక్ష్యాలకు ఇతోధికంగా అంకితం కావాలి.”

అదే ప్రకటనలో మహాత్ముని అహింసా విధానాన్ని గురించి కామకోటి స్వామి ఇలా అన్నారు. “గాంధిగారి అహింసావ్రతం మహోత్కృష్టమైనది. సర్వ ప్రపంచం దానిని హర్షించింది. గాంధిగారి సిద్ధాంతాలు కొన్నిటితో కొందరు ఏకీభవించకపోవచ్చు. దాని కేమి ? వారి మహనీయతనూ, వారి దైవభక్తినీ గుర్తించని వారుండరు.”

ఇదే సందర్భంలో శ్రీ శంకరాచార్యస్వామి 1927 లో తమకూ, గాంధిగారికీ ఏకాంతంగా జరిగిన ఒక సంభాషణను గుర్తు చేస్తూ ఇలా అన్నారు. పాలఘాట్ జిల్లా నెల్లిచెరిగ్రామంలో 1927 అక్టోబరులో మేమిరువురం ఒంటరిగా మాట్లాడుకున్నాము. అప్పటికి కొద్ది కాలం కిందటే ఒక మహమ్మదీయుడు ఆర్యసమాజ నాయకుడైన స్వామి శ్రద్ధానందుని హత్య చెయ్యడం సంభవించింది. ఆ ఘాతుక చర్య తన నెంతో కలవరపరిచిందని గాంధిగారు నాతో అన్నారు. “నేడా హంతకుని ఖడ్గానికి బలి అయిన వ్యక్తి స్వామి శ్రద్ధానందుడు కావచ్చు. మరొక నాడు భారతీయసంస్కృతికి ప్రమాణభూతుడైన మదన మోహన మాలవ్యా పండితుడే అట్టి అత్యాచారానికి గురి కావచ్చు. అయినప్పటికీ, ఆ హంతకుని పట్ల ఇంచుకంత ద్వేషభావం లేకుండా, కుమారుని వలెనో, స్నేహితుని వలెనో అతనిని

## ధర్మం తార్కికం కాదు

ధర్మం సనాతం అది, పరిణామబద్ధం కాదు. అందులో ఏ కొంచెం మార్పు వచ్చినా, ఈ విశ్వానికే ఆపత్తు వస్తుంది.

అన్ని ధర్మాలకూ వేదాలే మూలం. 'వేదోఖిలో ధర్మ మూలం.' వేదాలు అపౌరుషేయాలు. వాటి కర్తలను మనం ఎరగం. ఈ ధర్మశాస్త్రాలను వ్యక్తిగతంగా కాని, పరిసరమూలకంగా కాని, సామాజికవ్యవస్థల ద్వారా గాని మార్పు చెయ్యడానికి వీలు లేదు. మార్పు చేస్తే ధర్మమే అస్థిరమై పోతుంది. అందుచేతనే అది సనాతన ధర్మ మన్నారు.

శ్రీరాముడు మాటి మాటికీ "ఏషధర్మస్సనాతనః" అనడం అందుకే. ధర్మంలో తర్కానికి తావు లేదు. "తర్కో అప్రతిష్ఠః" (తర్కం స్థిరత్వం లేనిది) ధర్మం తార్కికం కాదు, కర్తవ్యం.

# స్వామివార్లతో నా అనుభూతులు

శ్రీ కంభంపాటి నాగేశ్వరరావు.

శ్రీ కంచి కామకోటి పీఠాధిపతులు జగద్గురువులు శ్రీ శ్రీ శ్రీ చంద్రశేఖర సరస్వతీ స్వామి వారిని ప్రప్రథమంగా దర్శించే భాగ్యం నంద్యాలలో మహా నందీశ్వర ఆలయంలో 1968 వ సంవత్సరంలో నాకు కలిగింది.

అపుడు నేను వ్యాపార రీత్యా నంద్యాలలో ఉండేవాణ్ణి. పీఠాలన్నా, వాటి ప్రాముఖ్యతలన్నా, పీఠాధిపతులన్నా వారి విశిష్టతలన్నా, నాకు ఆ రోజుల్లో ఏమీ తెలియదు. కాని నేను సహజమైన ఆస్తికుణ్ణి. దైవం పైన, పెద్దలపైన అతీతమైన దివ్యశక్తి పైన విశ్వాసం పరిపూర్ణంగా కలవాణ్ణి. ఈ సంస్కారం నాకు మా తల్లిదండ్రులిచ్చిన వరం. కంచి పెద్దవారి దర్శనం నాలో లేశమాత్రమైన భక్తి భావనను ఉత్తేజపరిచింది. నేను ఆలయంలోకి అడుగు పెట్టినప్పడు శ్రీవారు పల్లకీలో కూర్చొని ఉన్నారు. చిన్న ఆకారం, అదీ ఒక మూల ముడుచుకొని కూర్చున్నారు. పాదాలు బయటకు కన్పిస్తున్నాయి. వస్తూనే పాదాలను దర్శించాను. అవ్యక్తమైన అనుభూతి, ఒక్కసారి ఆపాదమస్తకం క్రింద నుంచి పైకి, పై నుంచి క్రిందకు ముకుళిత హస్తాలతో తనివి తీరా దర్శించుకొన్నాను. వారు నావంకే చూస్తున్నారు. వారి చూపుల్లో అమృత వృష్టి కురిసినట్లు చెప్పలేని శక్తి ఏదో విద్యుత్తులో నన్నావరించినట్లు అనిపించింది. సంభ్రమాశ్చర్యాలలో మునిగిపోయాను. మొత్తం దర్శనంకొద్ది నిముషాల్లో జరిగిపోయింది. కానీ వారి దయా దృష్టి నన్ను వరించింది. వారి దర్శన ప్రభావం నన్నావహించింది. వారి కటాక్ష వీక్షణం నన్నావరించింది. శ్రీ వారి సన్నిధిలో ఏదో పెన్నిధి దొరికినట్లు భావించాను.

## <u>గంగను స్వీకరించిన స్వామి :</u>

ప్రధమ దర్శనానంతరం 1972 వరకు శ్రీవారిని చూడలేక పోయాను. తిరిగి 7-4-1972 లో కాంచీ పురంలో శివా స్థానంలో పరమాచార్యుల దర్శన భాగ్యం కలిగింది. నేనూ, నా భార్య, కారివేటినగరం శ్రీ సత్యనారాయణ గారితో, మరికొందరు మిత్రులతో కాంచీ పురం వెళ్లాను. నేను అంత క్రితమే కాశీ యాత్ర చేసి గంగ కలశాలను తీసుకొచ్చాను. కాశీ నుండి తెచ్చిన గంగను రామేశ్వరంలో కలపాలని ఎవరో అనగా విన్నాను. ఐనా ఆ సంప్రదాయమేమిటో పరిపూర్ణంగా నాకు తెలియదు. అందుకే ఆ చెంబులను రామేశ్వరంలో ఏంచేయాలో శ్రీవారినే అడుగుదామని సంకల్పించుకొన్నాను. కానీ దైవ సంకల్పం వేరుగా ఉంది. నేను, నా భార్య ఆనాడు శ్రీవారికి ఆ కలశాలను చూపించినాము. రామేశ్వర

యాత్ర గురించి అడుగబోయే లోపలే పరమాచార్యులు ఆ కలశాలను రెండుచేతులతో తీసుకొని గుండెలకు హత్తుకున్నారు. నడయాడే దైవం జల జలా గల గలా పరువులెత్తే గంగమ్మను స్వీకరించింది. చేరవలసిన చోటకే గంగమ్మ చేరింది. ఆదివిష్ణువు పాదాలవద్ద పుట్టిన గంగ పరమశివుని తలపై మెట్టిన గంగ కనుపించే రామలింగేశ్వరుని చేరిందని అమితానందాన్ని పొందాము.

ఆ మరునాడు శ్రీవారు మాకు కాంచీపురంలో 9 దేవాలయాల్ని దర్శించమని చెప్పారు. అవి కామాక్షి దేవి గుడి, ఏకామ్రేశ్వరాలయం, వరదరాజ స్వామి కోవెల, కచ్ఛపేశ్వరాలయం, కైలాసనాథ దేవళం, వీరాటనం, మహాలింగేశ్వరాలయం, ఉత్కళంద పెరుమాళ్ (వామనమూర్తి) కోవెల, పాండవ దూతర్ దేవళాలు, సాయంత్రం వరకు తిరిగి అన్ని దేవాలయములను దర్శించుకొన్నాం. ఒక్క మహాలింగేశ్వర స్వామి దేవాలయం తప్ప. కంచిలో ఎన్ని చోట్ల ఎంతమందిని విచారించినా ఆ ఆలయం ఎక్కడ ఉందో ఎవరూ చెప్పలేకపోయారు. శ్రీవారు చెప్పిన వాటిల్లో ఎనిమిదింటిని చూచామనే తృప్తి. ఆ ఒక్క ఆలయాన్ని చూడలేకపోయామనే అసంతృప్తితో మఠం చేరుకొన్నాం. మమ్మల్ని చూస్తూనే శ్రీ పెద్దలు నవ్వుతూ "మహాలింగేశ్వరాలయం మీకు దొరకలేదా" అని అన్నారు. ఆశ్చర్యమేసింది. సంభ్రమం కల్గింది. ' మీకే కాదు మా శిష్యులలో చాలా మందికి, అంతే కాదు ఈ ఊళ్లోనే ఎంతోమందికి ఆ ఆలయం గురించి తెలియదు' అని అంటూ ఒక శిష్యుణ్ణి పిలిచి "ఆ స్వామి దర్శనం వీరికి చేయించు" అన్నారు. స్వామివారి అపార కరుణకు, శ్రీవారి అవ్యాజానురాగానికి తన్మయుణ్ణి అయ్యాను. ఎక్కడ అల్పమతిని. ఎక్కడ పీఠాధిపతి! శ్రీవారి కృపా సమేతంగా మహాలింగేశ్వరుణ్ణి దర్శించుకున్నాం. తిరిగి వచ్చిన మాకు పరమాచార్యులు ఆ ఆలయాల ప్రాముఖ్యాన్ని , విశేషాలనూ, సవిస్తరంగా చెప్పారు. ఆశీర్వదించారు. అమితానందంతో, నేను నాభార్య మిత్ర బృందం శలవు పుచ్చుకున్నాం.

ఆనాటి నుండి కామకోటి పీఠంతో, నా శతకోటి పూర్వ జన్మల పుణ్య సంపదా అన్నట్లు అవినాభావ సంబంధం ఏర్పడింది. 1972వ సంవత్సరంలో శ్రీశ్రీశ్రీ జయేంద్ర సరస్వతీ

స్వామి వారి దర్శనం నంద్యాల రామాలయంలో ప్రాప్తించింది. అదే కరుణ, అదే దయ, అదే అప్యాయత. కరుణాంతరంగుని అంతరంగంలో స్థానం లభించిందన్న తృప్తి.

ఆనాటి నుండి అవకాశం దొరికినప్పడల్లా కాంచీపురం వెళ్లడం, శ్రీవార్ల ఆశీస్సులందుకోవడం నా జీవన విధానంగా మారిపోయింది. కంచి కామకోటి పీఠం సేవకుల్లో ఒకనిగా, పీఠాధిపతుల శత సహస్రానేక శిష్య సమూహంలో ఒకనిగా మారిపోయినాను. తదనంతరం నేను చిలుకలూరిపేట జేరటం జరిగింది. మా అమ్మగారి ఊరైన గణపవరంలో పరమేశ్వర కాటన్ మిల్లును నిర్మించాము. 1975 లో శ్రీ జయేంద్ర సరస్వతీ స్వామి వారు పీఠంతో మా మిల్లులో విడిది చేయుటం, శ్రీ మహాత్రిపుర సుందరీ సమేత శ్రీచంద్రశేమౌళీశ్వర స్వామి పూజలు జరిగాయి. మా మిల్లు, మా ఇల్లు మా జన్మలూ మా అన్నదమ్ముల కుటుంబాలు యావత్తూ పీఠాధిపతులలో తాదాత్మ్యాన్ని భావించాయి. తర్వాత కూడా శ్రీవార్ల పాద ధూళి స్పర్శ మా మిల్లుకు ఎన్నోమార్లు కలిగింది.

<u>ఆడబోయిన తీర్థం :</u>

ఆది శంకరుల జన్మస్థానమైన కాలడీలో 12-5-1978 న శ్రీ జయేంద్ర సరస్వతీ స్వామి వారిచే శంకర భగవత్పాదుల కీర్తి స్తూపానికి కుంభాభిషేకం జరగబోతుందని ఆనాటి రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి స్తూపాన్ని ప్రారంభిస్తారని వార్తా. పత్రికల ద్వారా చదివాను. మా నాన్నగారితో, నా భార్య పిల్లలతో కాలడీకి ప్రయాణమయ్యాను. కాలడీలో కార్యక్రమాన్ని నేత్ర పర్వంగా దర్శించాము. స్తూప కుంభాభిషేకం జరుగగానే పూల జల్లుల్లా వర్షం పడింది. భక్తుల హర్షాతిరేకానికి అవధులు లేవు. ఆది శంకరుల కీర్తి స్తూపాన్ని దర్శించాం. శ్రీ శంకర జయేంద్రుల వారిని దర్శించాం. ఇంక నిత్య శివంకరుడు, సత్య శుభంకరుడైన శంకరుణ్ణి దర్శించాలి. కింకరుని సంకల్పం సాధ్యమా! ఎందుకు సాధ్యం కాదు. విచారిస్తే అప్పుడు పరమాచార్యుల వారు ఆంధ్రలో వాయల్పాడు వద్ద సంచారంలో ఉన్నారని తెలిసింది. అందరము వాయల్పాడు చేరాము. ఇక్కడు లేరు మదనపల్లిలో వున్నారన్నారు. మదనపల్లి జేరాం. అక్కడ శ్రీ వారి దర్శనం కాలేదు. శ్రీవారి సంచారం

కాలినడకనే. మొత్తం మీద పరమాచార్యులు ఆ చుట్టుపక్కలే వున్నారని రూఢి అయింది. మదనపల్లి చుట్టుపక్కల రోజంతా తిరిగాము. దర్శనం కాలేదు. రాత్రికి మదనపల్లిలో విశ్రమించాము. ఏమైనా దర్శనం చేసికొని తీరాల్సిందే, నిశ్చయించుకొన్నాం. మరునాడు ఉదయం అంటే 19-5-78న చిత్తూరు పోయే మార్గంలో ఒక గంట ప్రయాణం చేశాము. మార్గమధ్యంలోనే శిష్య సమేతంగా శ్రీవారు ఎదురొచ్చారు. శంకరుడు సాక్షాత్కరించాడు. ఆడబోయిన తీర్థమెదురయింది. మా హృదయాలలో ఆనందాల విరిజల్లు. ఆనాడు మూలా నక్షత్రం. శ్రీ వారు కాష్ఠమౌనాన్ని పాటిస్తున్నారు. రోడ్డు ప్రక్కన ఉన్న చిన్న దేవాలయ ప్రాంగణంలో ఒక గంట సాన్నిధ్యాన్ని వారు మాకనుగ్రహించారు. సంజ్ఞల ద్వారానే సంభాషణ. 'ఎక్కడ నుండి ఎక్కడకు ప్రయాణం' అని అడిగారు చెప్పాం. 'మీకు ఆహ్వానం వచ్చిందా' అన్నారు. కాదు పేపర్లో చూచి వెళ్ళామని చెప్పాం. 'మీకు ఆహ్వానం వచ్చిందా' అన్నారు. కాదు పేపర్లో చూచి వెళ్ళామని చెప్పాం. అక్కడి విశేషాలను అడిగారు. వివరంగా విశేషాలన్నింటినీ వివరించాం. మాలో ప్రతి ఒక్కరిని పరామర్శించారు. మా తండ్రిగారి సంతోషానికి అవధులు లేవు. అందరినీ ఆశీర్వదించారు. కేరళలో ఆద్యంత రహితమైన ఆదిశంకరుల కీర్తినీ, ఆంధ్రలో ఆద్యంత రహితుడైన శంకరుల స్ఫూర్తిని దర్శించుకున్నాం. అనంతమైన తృప్తితో ఇల్లు చేరాము. నా జీవితంలో ఇదో మరపురాని అనుభూతి.

<u>భారతీయ మార్గం:</u>

16-6-1983న శ్రీ శ్రీ శ్రీ జయేంద్ర సరస్వతీ స్వామి వారు " భారతీయ మార్గం " అన్న పేరుతో ఒక ఆధ్యాత్మిక మాస పత్రికను ప్రారంభించాలన్న సంకల్పాన్ని ప్రకటించారు. శ్రీ శంకర సేవా సమితి రిజిష్టరయింది. శ్రీవారు తదనంతరం ఒక సీల్డు కవరు ద్వారా నన్ను కార్యదర్శిగా కోశాధికారిగా వ్యవహరింపమని ఆజ్ఞాపించారు. నేనేమిటి ఒక ఆధ్యాత్మిక మాస పత్రికకు కార్యదర్శినేమిటి? అమితాశ్చర్యం కల్గింది. కార్యదర్శిని కదా జరిగే కార్యాన్ని దర్శించగలను. కార్యం శ్రీవారే నిర్వహిస్తారు. ఎంతో మనోబలం చేకూరింది. మాసపత్రిక

ప్రారంభించాము. అప్పుడు శ్రీవారలు ముప్పురు కర్నూలులో చాతుర్మాస్య దీక్షలో యున్నారు. తొలి పత్రికని కర్నూలులోనే శ్రీ పరమాచార్యుల పాద పద్మాల వద్ద విజయదశమినాడు అంకితం చేశాము. శ్రీ జయేంద్ర సరస్వతీ స్వామి వారు ఆవిష్కరించారు. ఆనాడే బాల పెద్దలు శ్రీ శ్రీ శ్రీ శంకర విజయేంద్ర సరస్వతీ స్వామి వారి పరిపూర్ణ అనుగ్రహం లభించింది. కామకోటి త్రివేణిలో జలకమాడాను. "భారతీయ మార్గం" ప్రచురణ నిరాటంకంగా జరిగిపోతూనే వున్నది. అంతా శ్రీవార్ల సంకల్ప బలం, అమ్మ కృపాఫలం.

## గుంటూరులో కామకోటి క్షేత్రాలు:

1990 జనవరి 26,27,28 తేదీలలో జనకళ్యాణ్ శ్రీ వారి నేతృత్వంలో శిబిర నిర్వహణ, తదనంతరం జనకళ్యాణ్ కార్యక్రమం విస్తరణ, తరువాత 5-6-90న గుంటూరు రవీంద్ర నగర్‌లోని శ్రీ రమా సత్యనారాయణ స్వామి వారి దేవస్థానాన్ని శ్రీ పీఠానికి సమర్పించటం, ఆ ఆలయం శ్రీ కంచి కామకోటి పీఠ హరి హర దత్త క్షేత్రంగా మారటం, 4-3-91న ఈ క్షేత్రంలో శ్రీ శంకర భగవత్పాదులు ఆలయానికి శ్రీ శ్రీ శ్రీ జయేంద్ర సరస్వతీ స్వామి వారిచే శంకుస్థాపన, 22-10-91న గుంటూరు మారుతీనగరులోని మారుతీ ఆలయ యాజమాన్యాన్ని శ్రీ పీఠానికి అప్పగించడం, ఆదేవళం శ్రీ కంచి కామకోటిపీఠ మారుతీ క్షేత్రంగా అవతరించడం, ఆరోజే శ్రీవారు 'నడిచే దేవుడు' పుస్తకాన్ని గుంటూరులో శ్రీ శంకర సేవాసమితి ఆధ్వర్యంలో మరో 5000 కాపీలు ముద్రించమని ఆజ్ఞాపించడం, ప్రచురణ పూర్తవడం, అన్నీ శ్రీవారి దయతో భక్తుల అండదండలతో సాగుతున్న మహత్తర కార్యక్రమాలే. వీటన్నింటి నిర్వహణలో నేను కూడా అంతర్భాగం కావటం, ఉద్దండుల సాహచర్యం, ఒకరా, ఇద్దరా, ముగ్గురా ఎందరో మిత్రుల సహకారం, కార్యక్రమాలన్నీ సవ్యంగా దివ్యంగా సాగిపోతున్నాయి. అంతా నంద్యాలలో పెద్ద శ్రీవారి నా తొలి దర్శన భాగ్యఫలంగా భావిస్తాను. ఈ మూర్తిత్రయం శ్రీ చరణాలు మా జీవన ప్రాంగణాన నిలచిన మంగళ తోరణాలు, జన కళ్యాణ పథంలో ఉత్ప్రేరకాలు.

# 'నమశ్శివాయ'

శ్రీ పరమాత్ముని శ్రీ దత్త ప్రసాద్.

ఈశ్వరుడై సురార్చిత మహేశ్వరుడై తపియించు యోగి యో
గీశ్వరుడై ధరిత్రి జనియించె సమర్చిత కామకోటి పీ
ఠేశ్వరుడై జయేంద్ర విజయేంద్ర సుయోగ గురూత్తముండు, నా
శాశ్వత భాగ్యమై పలుక సాగెను పద్యము పద్యమందునన్.

'కదిలే దేవుడు' కంచిలోన వెలుగై కన్పించె నేనాడొ, నా
మదిలో భక్తితరంగ డోలికలు నిర్మాలిన్య శాక్తేయ సం
పదలై స్పందనలై స్రవించె, గురు చిత్స్వాదమ్ము పాథేయమై
సదసన్మార్గ విభక్త మంత్రమయి సత్సౌభాగ్యమై రంజిలన్.

'నడిచే దేవుడు' నా మదిన్ విమల సన్న్యాసోన్ముఖిన్ చేసె, సం
దడిలేనట్టి సదాశివాలయము చెంతన్ బిల్వవృక్షమ్మునై
పడియుంటిన్, దళముల్ కృపా కలితమౌ పద్యమ్ములై నిల్వ, నే
వడిగా కావ్యములల్లెదన్ సహజ సంభావ్యమ్ము సద్భక్తియై.

నాలోచల్లని భావనన్ విమల విన్యాసంబుతో తూగి స
త్కాలోత్పన్న ప్రచండ వేగమున ఉత్కంపించి పద్యమ్ములై
ఆలాపమ్ముల సాగి సాగి స్థిర దివ్యానంద రాగమ్ములై
లీలన్ సద్గురు చంద్రశేఖరుని కీర్తింపంగ నుప్పొంగెలే.

కలువల్ పూయును కామకోటి యతియే కాస్తంత నవ్వంగ, స్నే
హలతాకుంజములే వరించు నటుపై అంతంత పల్కంగ, బా
రులుతీరున్ పరమాలతీలతలు సంప్రోక్షించి భావింపగా,
వెలుగుల్ జిమ్ము యతీంద్ర చంద్రుడిలపై వీక్షించి దీవింపగా.

నేత్రంబుల్ దరిసించువారలకు నిర్ణిద్రార్ద్ర విశ్వంభరా
చిత్రంబుల్, పరమార్థ చింతనల నిస్సీమాప్త సత్సాధనా
సూత్రంబుల్, దరిచేరు భక్తులను అస్తోకోజ్జ్వలాత్మీయతా
ఛత్రంబుల్, భువి చంద్రశేఖరుడు సచ్ఛాత్రాళికిన్ దైవమే.

కన్నుల్ విప్పిన గోచరించు మమతా గంగార్ద్రటీ వీచికల్
వన్నెల్ చింద, గళమ్ము విప్ప సమతా వాక్సూచికల్ స్ఫూర్తి సం
పన్నంబై స్థిర విశ్వతత్వముల నిష్పాదింప నూగించులే
నన్నున్ నిన్ను విశాల విశ్వముల జ్ఞాన క్షీర వారాశిలో.

సరిలేరెవ్వరు చంద్రశేఖరునితో సత్సాధనా మూర్తియై
కరముల్ చాపెడు భక్త కోటికిలపై కారుణ్య సందీప్తియై
స్థిరమై యొప్పెడు దేవ దేవుడనగా దిగ్జాత సంస్ఫూర్తియై
గురుడై నిల్చెను కామకోటి వనిలో గూఢార్థ మంత్రమ్మునై.

భిక్షావందన మాచరింతును జగత్శ్రేమైక సాఫల్య సం
రక్షా దక్షునకున్ ముముక్షుజన సత్ప్రారబ్ధ హృద్వేది కా
ధ్యక్షుండౌ గురు చంద్రశేఖరునకున్ హర్షంబుతో కంచి కా

మాక్షీ సాక్షిగ భిక్షయై నిలువ మన్మానంబు ప్రాణంబులున్.

## 'సిద్ధం నమః'

డాక్టర్ శ్రీ ప్రసాదరాయకులపతి

కాంచీ కాంచన ఘంటికా చయ నదత్ కారుణ్య పాథోధియౌ
కాంచీ పట్టణ నాయికామణికి శ్రీ కామాక్షికిం గూర్చు మా
కంచి స్వాముల గాంచి హైందవమతగ్లానిన్ నివారించు తత్
ప్రాంచద్భాషణ దివ్యశక్తిని సాష్టాంగంబుగా మ్రొక్కెదన్.

కంచి కామాక్షి పాద పంకజములందు
మనసు పెట్టిన మౌనికి మానమస్సు
భరత ధర్మంబు నుద్ధరింపంగ తననె
ఇచ్చుకొనుచున్న ఋషికిత్తు నీవచస్సు

శంకరుని వంటి మేధావి జగతిలోన
లేడనెడి మాట పుట్టెను నాడు - నేడో
జనములన్ చంద్రశేఖర స్వామి వంటి
నడచు దేవుడు లేడను నుడి జనించె

అరసి చూడ అద్వైత సిద్ధాంత మందు
ప్రతి నరుండు శివుండును బ్రహ్మమునగు
బ్రహ్మభావనలో చిన్ని బ్రహ్మమనుడు

పెద్ద బ్రహ్మ మ్మటంచును వేరు లేదు.

అయిన సామాన్యజన మందు ఆత్మబోధ
కలుగు వానిని జ్ఞానము వెలుగు వాని
మహిమలు వెలంగువానిని మంచి వాని
దేవు డందురు - లోకపు తీరు - అదియె

ఆపథమ్మున తద్భక్తు లైనవారు
ఇష్టపడి పల్కుమన్నార లీవిధాన
ఎంతటి పదానికైన ఆశాంతయోగి
అర్హు డనిపించు నావంటి అల్పమతికి

కవులు మేమప్పు డపుడు లోకప్రవృత్తి
తప్ప కల్పుల గూడ నుదాత్తు లనుచు
పొగడుమందు మా పాపము పోవుగాక
చంద్రశేఖర స్వామి సంస్తవముచేత

కలువ లడిగెనె? శశి - వెన్నెలలను కురియు
ఇల స్తుతించెనె? రవి - చీకటులను దోలు
పరుల కుపకృతి చేయ కొందరు జనింతు
రట్టి మన స్వామి అడుగుల కంజలింతు

ఎవ డిల పుట్టె శంకర యతీంద్రునిగా? మరి చంద్రశేఖరుం

డెవరు? జయేంద్రు డయ్యె నెవ? లీపగిదిన్ విజయేంద్రమూర్తిగా

అవతరణంబు చెందె నెవ డార్త జనావనదీక్ష తోడ నా

ర్జవమున నొప్పు - ఈగురుపరం పరకున్ సత మంజలించెదన్

శ్రుతి స్మృతి పురాణానామ్

ఆలయం కరుణాలయమ్!

నమామి భగవత్పాద

శంకరం లోకశంకరమ్!!

అపార కరుణాసింధుమ్

జ్ఞానదం శాస్త్రరూపిణమ్

శ్రీ చంద్రశేఖర గురుమ్

ప్రణమామి ముదావహమ్!!

*శ్రీ శంకర సేవా సమితి*

*గుంటూరు*